# రామాయణోపన్యాస మంజరి

ప్రచురణ



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# రామాయణోపన్యాస మంజరి

(వ్యాస సంకలనం)

సంకలనం

**ఆధ్యాత్మిక విద్యాకేంద్రము**

తిరుపతి




ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

**2007**

# RAMAYANOPANYASAMANJARI

(A Collection of Articals on Ramayana)

*By*

**Religious Education Centre**

T.T.Devasthanams, Tirupati.

T.T.D. Religious Publications Series No : 720



T.T.D. First Edition : 2007

Copies : 1,000

*Published by*

**SRI K.V. RAMANACHARI, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 507.

*D.T.P. by*
M/S SAR Infotec(P) Ltd.,
15-3-200, G.N. Mada Street,
Tirupati-517 501.

*Printed at*
**Tirumala Tirupati Devasthanams Press,**
Tirupati — 517 507

# ముందుమాట

లౌకికవాఙ్మయంలో రామాయణం ఆదికావ్యంగా ప్రసిద్ధిచెందింది. వేద వేద్యుడైన పరమపురుషుడు దశరథుని కుమారుడిగా అవతరించగా వేదమే వాల్మీకి నుండి రామాయణ రూపంలో అవతరించిందంటారు.

ఇరవై నాలుగు వేల శ్లోకాలు గల రామాయణం ఆ తరువాతి కాలంలో సంస్కృతంలోనూ, ఇతర భారతీయ భాషలలోనూ కావ్యాలుగా, నాటకాలుగా అనేక విధాల అనేక కవుల చేత విరచింపబడింది. రామాయణానికి అనువాదాలే కాక దానిపై సమీక్షాత్మకమైన రచనలు కూడా ఎన్నో వెలువడ్డాయి.

ఆధునిక యుగంలో పాశ్చాత్య ప్రభావం చేత పరిశోధనారంగం విస్తృతంగా వ్యాప్తి చెందింది. అందువల్ల రామాయణాది గ్రంథాలపై సమీక్షలు, విమర్శలు, తులనాత్మకమైన అధ్యయనాలు విరివిగా వచ్చాయి.

రామాయణోపన్యాసమంజరి అనే ఈ గ్రంథం రామాయణంపై విమర్శనాత్మకంగా వెలువడిన పలు వ్యాసాల సంపుటి. ప్రసిద్ధులైన పండితులు పలువురు ఈ వ్యాసాలను వ్రాశారు. ఇందులో రాముని గొప్పతనం, సంస్కృతాంధ్ర రామాయణాల సామ్యం, కథావిశిష్టత మొదలైన అనేక విషయాలు చర్చింపబడ్డాయి. ఈ చర్చ ఆదికావ్యంపై సమగ్రమైన అవగాహన కలగడానికి ఎంతగానో ఉపకరిస్తుంది.

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణగా వెలువడుతున్న రామాయణం విమర్శనాత్మకమైన ఈ గ్రంథాన్ని సహృదయులు, సాహితీ వేత్తలు ఆదరించి తిరుమల తిరుపతి దేవస్థానం చేస్తున్న వాఙ్మయ సేవకు తోడ్పడుదురుగాక!

కార్యనిర్వహణాధికారి
తి.తి. దేవస్థానములు
తిరుపతి.

# విషయసూచిక

# 1. "రామో విగ్రహవాన్ ధర్మః"

పోలూరి హనుమజ్జానకీ రామ శర్మ

శ్రీమతి ఇందిరాగాంధి సందేశం:- "మాస్కోలోని కేంద్రీయ బాలనాటకశాల యీ మహనీయగాథను సోవియటు యువజనులకు పరిచయం చేసింది...... మాస్కోలో రామాయణప్రదర్శన పదవ సంవత్సరోత్సవం జరుపుకొంటుందని విని చాలా ఆనందించాను. ఇది కళాకారుల, దర్శకుల కళాత్మక సామర్థ్యానికి రామయణం యొక్క మౌలిక ప్రబోధాత్మకతకూ అభినందనం."

మార్క్సిజమునకు అంకితమై పోయిన రష్యాలో రామాయణ నాటకం పది సంవత్సరాలు ప్రదర్శింపబడినదన్నచో దాని విలువ ఎంతో వేరుగా చెప్పనక్కరలేదు. అక్కడి కళాకారులు ఈ కావ్యాన్ని మానవాభ్యు దయమునకు సాధనముగా ఉపయోగించుచుండగా మన మార్క్సిస్టులు రామాయణ విషవృక్షాలు తయారు చేయుచున్నారు. మనవారికి మన మీద ఉన్నశ్రద్ధ మహర్షిపై లేకపోవుట శోచనీయం.

*శ్లో॥ రామో విగ్రహవాన్ ధర్మ స్సాధు స్సత్యపరాక్రమః*
*రాజా సర్వస్య లోకస్య దేవానా మివ వాసవః ॥*
*(అరణ్యకాండ - సర్గ.37. శ్లో. 13.)*

"రాముడు మూర్తీభవించిన ధర్మము. అతడు సజ్జనుడు ; సత్యపరాక్రముడు. దేవతలకు ఇంద్రునివలె సకలలోకమునకు అతడు రాజు - ఈమాట లన్నది రాముని భక్తుడు కాదు. ఆయనకు మిత్రుడును కాదు. ఆయనచేత క్షతగాత్రుడై చావును తప్పించుకొన్న మారీచుడు రాముని ఇట్లు వర్ణించెను. సీతను అపహరించుటకు సాహాయ్యము కావింపు మని కోరుచు రావణుడు శూర్పణఖావిరూపకరణమును, ఖరాదులవధను చెప్పి రాముని నిందింపగా మారీచుడు ఇట్లు సమాధానము చెప్పెను. రాముడు తండ్రిచేత

పరిత్యక్తుడు కాదు. తల్లికి ప్రియమును కలిగించుటకు తండ్రిని సత్యవచనుని గావించుటకు రాజ్యమును భోగములను వదలి వనములందు నివసించు టకు వచ్చినాడు. అతడు కర్కశుడు కాదు; దుశ్శీలుడు కాదు. లుబ్ధుడు కాదు. అతడు సకలభూతములకు హితమును చేయుటయందు ఆసక్తి కలవాడు. మూర్తీభవించిన ధర్మమే అతడు. ఆరోపించిన యసత్యవచన ములు విని నీవు అతనినిగూర్చి చక్కగా తెలిసికొనకుండ అసత్యమును పలుకుట తగదు".

ధర్మమే రాముడుగా మూర్తీభవించినప్పుడు ఏసందర్భమునను ఆయనవర్తనమునందు అధర్మము లేశమాత్రముగ నైన ఉండుట అసంభవము. త్ర్యంబకమఖి అనుపండితుడు రామాయణములోని ధర్మ విశేషములను వివరించుచు ధర్మాకూతము అనుగ్రంథమును రచించుచు ఆరంభమున ఈ విషయమును విచిత్రముగ ప్రస్తావించెను. సకల కళ్యాణ గుణసంపన్నుడైన మానవుడు ఇప్పు డెవ డున్నాడని వాల్మీకి ప్రశ్నింపగా నారదుడు శ్రీరాముని పేర్కొనెను. కాని అప్పుడు సృష్టికి ప్రతి సృష్టిచేయ గలిగిన వసిష్ఠవిశ్వామిత్రాది మహర్షులు ఎందరో ఉన్నారు. వారందఱు ధర్మజ్ఞులే, ధార్మికులే. వారి నందఱను ఉపేక్షించి నారదుడు క్షత్రియబాలు డైన రామచంద్రుని పేర్కొన నేల?

త్ర్యంబకమఖి యిట్లు సమాధానము చెప్పెను. వా రందఱును గొప్పవారే. సందేహము లేదు. అయినను వారు ఎప్పుడో ఒకప్పుడు ఏదో యొక ధర్మవ్యతిక్రమమునో, సాహసమునో కావించి తరువాత ప్రాయశ్చిత్త ములు చేసికొని తపస్సులు చేసి శుద్ధులైరి. అట్టివారు సాధారణమానవు లకు ఆదర్శప్రాయు లగుదురా? వారి వర్తనము ప్రమాణ మగునా? గౌతమ మహర్షి ధర్మశాస్త్రమును రచించుచు ఆరంభమున ఈ విషయమును ప్రస్తావించెను.మహాత్ములయందు కొందరిలో ధర్మ వ్యతిక్రమము సాహసము కూడ కన్పించుచున్నది. కాని మహాత్ము లగుటచే తపస్సులచేత వారు దోషములను పోగొట్టుకొనగలిగిరి. సామాన్యులు తప్పులు చేయగలిగినంత సులభముగా తపస్సులు చేయలేరు. కాబట్టి సామాన్యులకు శాస్త్రము

ననుసరించి పెద్ద లుపదేశించుధర్మములే ప్రమాణము కాని వారిచరిత్రలోని ధర్మవ్యతిక్రమములు సాహసములు కాదు. ఈ దృష్టితో చూచినప్పుడు సామాన్యులకు ధర్మశాస్త్రమువలె ప్రమాణమైనదిగా చెప్పదగినది శ్రీరాముని చరిత్రమే. ఆయనచరిత్రమున ధర్మవ్యతిక్రమము లేశము కూడ లేదు. కావుననే నారదమహర్షి శ్రీరాముని సకలకళ్యాణగుణసంపన్నునిగా నిరూపింపగా వాల్మీకిమహర్షి ఆయన చరిత్రమును ధర్మశాస్త్రమునకు ఉదాహరణప్రాయమైన మహాకావ్యమునుగా రచించెను.

వాల్మీకినారదుల దృష్టియందే కాక మారీచుని దృష్టియందు కూడ ధర్మములనగా వేదవిహితములైన ధర్మములే. అవి సంగ్రహముగ తైత్తిరీయోపనిషత్తునందు ధర్మానుశాసనమునందు పేర్కొనబడియున్నవి. "సత్యమును చెప్పుము. ధర్మమును ఆచరింపుము. తల్లిని దేవతనుగా ఆరాధింపుము. తండ్రిని దేవునిగా పూజింపుము. ఆచార్యుని దేవునిగా అర్చింపుము". ఇవి ఆ ధర్మాను శాసనములో ముఖ్యమైనవి. వీనిని ఇతరములైన అనేకధర్మములను రాముడు చక్కగా పాటించె ననుటలో రాక్షసుడు శత్రువును అయిన మారీచునకు కూడ ఎట్టిసందేహము కలుగకున్నను ఈ కాలమున పాశ్చాత్యవిద్యలలో ప్రవీణులైన పెక్కుమందికి ఎన్నో సందేహములు కలుగుచున్నవి. కావున మహాక్లిష్టపరిస్థితుల యందు సైతము రాముడు ధర్మమునే ఎట్లు అవలంబించెనో గ్రహించుట ఆవశ్యకము.

పరిస్థితులు అనుకూలించినపుడు తల్లియందు తండ్రియందును భక్తి కలిగియుండుట సులభమే. రాముడు ఎట్టి ప్రతికూలపరిస్థితియందును పితృభక్తిని వీడలేదు. తండ్రి నిండుసభలో యౌవరాజ్య పట్టాభి షేకము కావింతు నని చెప్పినప్పుడు రాముడు సీతతో కూడ పట్టాభిషేకము నకు ఆవశ్యకమైన వ్రతము నవలంబించెను.ఆ రాత్రి కైక దశరథునివలన వరములను పొంది మఱునా డుదయమే పట్టాభిషేకము జరుగవలసిన సమయమునకు రాముని దశరథుని యొద్దకు పిలిపించెను. దశరథుడు శోక మూర్తియై మాటాడుటకు కూడ శక్యముగాక మంచముపై పడియుండెను.

తండ్రికి తనపై కోపము వచ్చినదేమో యని శంకించి రాముడిట్లనెను "మహారాజును సంతోషపెట్టకుండ తండ్రిమాటను నెరవేర్చకుండ ఆయన కుపితుడై యుండగా నేను ఒక ముహూర్తమాత్ర మైనను జీవించుటకు ఇష్టపడను. ఈ లోకమునందు ఎవని వలన తనకు జన్మ కలుగుచున్నదో అట్టి ప్రత్యక్షదైవతమునకు విధేయుడై ఎవడు వర్తింపకుండును?"

*శ్లో॥ అతోషయన్ మహారాజ మకుర్వన్ వా పితుర్వచః।*
*ముహూర్త మపి నేచ్ఛేయం జీవితుం కుపితే నృపే॥*
*శ్లో॥ యతోమూలం నరః పశ్యేత్ ప్రాదుర్భావ మిహాత్మనః।*
*కథం తస్మి న్న వర్తేత ప్రత్యక్షే సతి దైవతే॥*

*(అయోధ్యా - సర్గ. 18 శ్లో. 15,16)*

ఈ రెండుశ్లోకములు 'పితృదేవో భవ' అను వేదానుశాసనము నకు వ్యాఖ్యాప్రాయములుగా నున్న వనుట స్పష్టము. అప్పుడు తండ్రియాజ్ఞ శుభమైనను అశుభమైనను తప్పక నిర్వహింతు నని నీవు ప్రతిజ్ఞ యొనర్చినచో మీతండ్రి నాకు ఇచ్చిన వరములను తెలుపుదును అని కైక రామునితో అనెను. అప్పుడు రాముడిట్లనెను. అమ్మా! నీవు నన్నిట్లు అనదగదు. తండ్రి యొక్క మాటకొఱకు నేను అగ్నిలో దూకెదను; సముద్రములో పడుదును; తీక్ష్ణమైన విషమునైనను భక్షింప గలను. కావున ఇంక ఆయనకు ఏది అభికాంక్షితమో చెప్పుము. దానిని తప్పక చేయుదును. ప్రతిజ్ఞచేయు చున్నాను. అమ్మా రాముడు రెండు పర్యాయములు చెప్పడు.

*శ్లో॥ అహో ధిక్ నార్హసే దేవి వక్తుం మా మీదృశం వచః।*
*అహం హి వచనా ద్రాజ్ఞః పతేయ మపి పావకే॥*
*భక్షయేయం విషం తీక్ష్ణం మజ్జేయ మపి చార్ణవే।*
*నియుక్తో గురుణా పిత్రా నృపేణ చ హితేన చ॥*
*తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభి కాంక్షితమ్।*
*కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే ॥*

*(అయోధ్యా - సర్గ. 18, శ్లో 28,29,30)*

తండ్రియిచ్చినమాట ఏదో తెలియకుండగనే రాముడిట్లు ప్రతిజ్ఞ చేయుచున్నాడు. తండ్రిమాట విషమువలె భయంకరమ్మైన ద్దైనను కుమారుడు తప్పక స్వీకరింపవలయు ననియే రాముని యభిప్రాయము. ఇది పితృభక్తికి పరకాష్ఠ. ఇంతే కాదు. "రాముడు రెండు పర్యాయములు చెప్పడు" అనుటవలన రాముడు ఒక్క పర్యాయము ఏకార్యము నైనను చేయుదును అని చెప్పినచో అది జరిగినట్లే. దానిని ఆయన జరుపునా లేదా అని ఎవరును సందేహింప నక్కఱలేదు. లోకములో పెద్ద పెద్ద వాగ్దానములు చేయుచుండు నాయకులు ఒక విషయమునే అనేకపర్యాయములు ఇదిగో చేయుచున్నాము. త్వరలో తప్పక చేయగలము. పదిరోజులలో పని జరుగును అని యీవిధముగా ఎదుటివారికి నమ్మకము కలుగుట కొఱకు చెప్పుచుందురు. రాముడట్లు చెప్పడు ఆయన ఒకపర్యాయమే చెప్పును. ఎట్టైనను దానిని ఆయన నిర్వహించును.అది ఆయన సత్యపరత్వమునకు లక్షణము.

ఆమె కోరిన కోరికలు సాధారణరాజపుత్రునకు మృత్యువు వలె భయంకరములైనవి. ఆ కోరికలు వినియు రాముడు వ్యథనొందక ఇట్లనెను. "అట్లే కానిమ్ము, జడలు నారచీరలు ధరించి అడవులకు పోవుదును. భరతుని యభిషేకమును గూర్చి స్వయముగా నాకు ఏల చెప్పలేదనియే నాకు దుఃఖముగా నున్నది. సరే దూతలను పంపి భరతుని పిలిపింపుము. నేను పదునాలుగేండ్లు వనములో నుందును." అప్పుడామె ఇట్లనెను. "భరతుని కొఱకు దూతలు వెంటనే పోవుదురు. వానికొఱకు నీవు ఇంక ఇచ్చట నుండుట యుక్తము కాదు. నీవు ఇక్కడనుండి ఎంతవఱకు బయలుదేరవో అంతవఱకు మీతండ్రి స్నానము చేయడు భోజనము చేయడు" ఈమాట లను విని దశరథుడు బోరున విలపించుచు మంచము పైనుండి లేచి మూర్ఛిల్లి క్రిందపడెను. రాము డాయనను పైకిలేవదీసి కూర్చుండ బెట్టెను.

కొరడాతో కొట్టినచో గుఱ్ఱము ఎట్లు త్వరపడునో రాముడు కైకమాటలకు అట్లు త్వరపడుచు ఇట్లనెను. "నేను అర్థపరుడను కానమ్మా!

లోక మంతయు ఆక్రమించుకొని యుండవలెనను నుత్సాహము నాకు లేదు. నన్ను ఋషులతో సమానునిగా ధర్మమును మాత్రమే ఆశ్రయించిన వానినిగా ఎఱుంగుము. తండ్రిగారు చెప్పకున్నను నీమాటచేత నైనను నేను వనములో పదునాలుగేండ్లు ఉందును. నీవు నన్ను ఆజ్ఞాపింపదగినదాన వయ్యును ఈ విషయమును నాకు చెప్పక ఆయన నేల యడిగితివి. అమ్మా! నీవు నాయందు గుణమునే గుర్తింపవైతివి.

*శ్లో॥ నాహ మర్థపరో దేవి లోక మావస్తు ముత్సహే।*
*విద్ధి మా మృషిభిస్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్॥*
*అనుక్తోఽ ప్యత్ర భవతా భవత్యా వచనా దహమ్।*
*వనే వత్స్యామి విజనే వర్షాణీహ చతుర్దశ॥*
*న నూనం మయి కైకేయీ కించి దాశంససే గుణాన్।*
*యద్రాజాన మవోచస్త్వం మమేశ్వరతరా సతీ॥*

*(అయోధ్యా- సర్గ. 19; శ్లో. 20,23,24)*

"కేవలం ధర్మ మాస్థితిమ్" అని మూడు మాటలలో రాముడు తన శీలమును చరిత్రను వ్యక్త మొనర్చినాడు. ధర్మమున వర్తించువారు లోకములో పెక్కుమంది కలరు. వా రందఱును ధర్మముకొఱకే ధర్మమును అవలంబింపరు. వారికి ఫలాపేక్ష కూడ ఉండును. తండ్రి, ఆచార్యుడు మొదలగువారిని భక్తితో సేవించుచున్నచో వారి యనుగ్రహమున సంపదలు విద్యావిజ్ఞానములు లభించునని సేవించువారును గురుభక్తి కలవారే అగుదురు. కాని తత్త్వజ్ఞులైన మహర్షులు ధర్మమును ఆచరించునప్పుడు వారికి ఫలాపేక్షయుండదు. గురువులను సేవించుట నాకు ధర్మము. కావున సేవించుచున్నాను అని వారు కేవలము ధర్మనిర్వహణము కొఱకే ధర్మమును ఆచరింతురు. దాని వలన దుఃఖము కలిగినను వారు దానిని వదలరు. రాముని యొక్క ధర్మాచరణము కూడ ఇట్టిదే. కావుననే ఎన్నికష్టములు కలిగినను అవి యన్నియు పురాకృత కర్మఫలముల నియే తలంచుచు, ఆయన ఎప్పుడును ధర్మమును వదలలేదు.

ధర్మాచరణమున ఆయనకు కలిగిన సంకటములు సామాన్యములు కావు. రాముని వనవాసమునుగూర్చి విన్నంతనే కౌసల్య మహాదుఃఖముతో పెద్దగా రోదన మొనర్చెను. ఆమె శోకమును విని సహింపలేక లక్ష్మణుడు ఉద్రేకము నొంది ఇట్లనెను. "కైకచే ప్రోత్సాహితుడైన యీ రాజు మనకు శత్రువు. ఈయనను వధింపవలె లేదా బంధింపవలె. మీరు అంగీకరించినచో క్షణములో అయోధ్యను నిష్కంటకము కావించి రాజ్యమును రామునకు అప్పగింతును". అప్పుడు కౌసల్య రామునితో ఇట్లనెను "కుమారా! లక్ష్మణుని మాటలను విన్నావు కదా! అది నీకు ఇష్టమైనచో ఇంక చేయదగిన కార్యమును చేయుము. నా సవతి చెప్పిన యధర్మ్యమైన మాటను విని నీవు శోకసంతప్త రాలనైన నన్ను విడిచిపెట్టి వనమునకు పోవుట తగదు. నీవు ధర్మజ్ఞుడవు" ధర్మిష్ఠుడవు, ధర్మమును ఆచరింపగోరుచున్నావు. కావున నీవు ఇచ్చటనే యుండి నాకు శుశ్రూషచేయుచు శ్రేష్ఠమైన ధర్మమును ఆచరింపుము.

*శ్లో॥ భ్రాతుస్తే వదతః పుత్ర లక్ష్మణస్య శ్రుతం త్వయా।*
*యదత్రానన్తరం కార్యం కురుష్వ యది రోచతే॥*
*న చాధర్మ్యం వచ శ్శ్రుత్వా సపత్న్యా మమ భాషితమ్।*
*విహాయశోకసం తప్తాం గన్తుమర్హసి మామితః॥*
*ధర్మజ్ఞ ఇతి ధర్మిష్ఠ ధర్మం చరితు మిచ్ఛసి।*
*శుశ్రూష మా మిహస్థ స్త్వం చర ధర్మ మనుత్తమమ్॥*
*(21 - 21,22, 23)*

రాముడు ఇప్పుడేమి చేయవలె? తండ్రిమాటను పాటించి అడవులకు పోవలయునా? లేక తల్లియాజ్ఞ ననుసరించి అయోధ్యలోనే యుండవల యునా? ఇట్టివే ధర్మసంకటములు. నీవు అజ్ఞ ఇచ్చినను నేను రాజ్యమును వదలి అడవికి పోయెదను. ఇందులకు నీవు తండ్రిగారి నేల కోరితివి? అని పినతల్లి యాజ్ఞకే ప్రాముఖ్యము నొసంగిన రాముడు కన్నతల్లియాజ్ఞను కాదని ఆమెను వదలి అడవులకు పోవుట ధర్మమగునా? దశరథుడు కైకకు వరము లిచ్చి ఋణపడి యున్నాడు. ఆయన ఋణమును తీర్చుట, ఆయన ఇచ్చిన

మాటను చెల్లించుట పుత్రునకు కర్తవ్యమైనట్లే ధర్మపత్నికిని కర్తవ్యమే అగును. భర్త యిచ్చిన మాటకు విరుద్ధముగా ఆజ్ఞాపించు నధికారము భార్యకు లేదు. కావున దశరథుని వచనమునకు విరుద్ధమైన కౌసల్య యాజ్ఞ చెల్లదు. అందువలన రాముడు కౌసల్యను ఓదార్చి అడవులకే పోయెను.

రాముడు అడవికి పోవునప్పుడు దశరథుడు విలపించుచు రథము వెంట పరువెత్తుచు సుమంత్రు నుద్దేశించి ఆగుము ! ఆగుము! అని అఱచుచుండెను. రాముడు పొమ్ము పొమ్ము అని తొందఱపెట్ట జొచ్చెను. అప్పుడు సుమంత్రునియొక్క మనస్సు రెండు చక్రములమధ్య పడిన మనుష్యునివలె వ్యథ నొందెను. తనమాట పాటింప లేదని నిన్ను రాజు కోపించినచో, నేను వినలేదు అని చెప్పవచ్చును. రథమును పోనిమ్ము. దుఃఖమును పొడిగించుట పాపిష్ఠము అని రాముడు సుమంత్రునకు చెప్పెను.

*శ్లో॥ తిష్ఠేతి రాజా చుక్రోశ యాహి యాహీతి రాఘవః ।*
*సుమంత్రస్య బభూవాత్మా చక్రయోరివ చాంతరా ॥* 46

*శ్లో॥ నాశ్రౌష మితి రాజాన ముపాలబ్ధోఽపి వక్ష్యసి ।*
*చిరం దుఃఖస్య పాపిష్ఠ మితి రామస్తమబ్రవీత్ ॥* 47

ఇట్లు అసత్యమాడవచ్చునని రాముడు చెప్పవచ్చునా? ఇట్టి సందర్భములలో అసత్యమును చెప్పుట తప్పు కాదు. దుఃఖమును పొడిగించుట తప్పు. రథమును ఎంతసేపు ఆపినను వారికి దుఃఖము తీఱదు. అది వారిదుఃఖము నకు పరిష్కారము కాదు. శస్త్రచికిత్స చేయవలసినప్పుడు రోగి భయపడు చున్నాడని వైద్యుడు ఎంత సేపు ఆగును. నీకేమియు భయము లేదు. కొంచెము కూడ బాధ యుండదు అని వైద్యుడు ఇతరులకు గట్టిగ చెప్పవలసి యే యుండును. ఆ మాటలు అసత్యములే. అయినను ఆ రోగికి మేలు కలిగించుటకే ఆ మాటలను చెప్పుదురు. వానివలన ఏ దోషమును కలుగదు. సుమంత్రు డాడవలసిన యసత్యమును ఇట్టిదే.

అడవిలో ప్రవేశించిన మొదటిరాత్రి సీతారామలక్ష్మణులు ఒక పెద్దమఱ్ఱి చెట్టు నొద్ద విశ్రమించిరి. అప్పుడు రాముడు విలపించుచు లక్ష్మణునితో ఇట్లనెను. నావలె విధేయుడైన కుమారుని వదలిపెట్టు నట్టి తండ్రి యెవడైన నుండునా? అర్థధర్మములను వదలి ఎవడు కామమునే అవలంబించునో వాడు దశరథునివలెనే విపత్తు నొందును. ఇంక అధికార మదముతో కైక కౌసల్యను సుమిత్రను ఎంతయేని బాధింపగలదు. ఆ కైక క్షుద్రురాలు. మా యమ్మకు మీ యమ్మకును ఆమె విషమును పెట్టగలదు కావున లక్ష్మణా నీవు రేపు ఉదయమే అయోధ్యకు పొమ్ము.

*క్షుద్రకర్మా హి కైకేయీ ద్వేషా దన్యాయ మాచరేత్*
*పరిదద్యాద్ధి ధర్మజ్ఞ గరం తే మమ మాతరమ్॥*

*(అయోధ్యా- సర్గ. 53- శ్లో. 18)*

రాముడిట్లు తండ్రిని తల్లిని నిందింపవచ్చునా ? ఇట్లు సందేహింప నక్కఱ లేదు. లక్ష్మణుని అయోధ్యకు మరలిపొమ్ము అని చెప్పుటయే రామునితాత్పర్యము. రాముడు లక్ష్మణుని యొక్క అభిప్రాయములనే అతనిని అయోధ్యకు పంపుటకై సాధనముగా ఉపయోగించినాడు. అవి రాముని భావములు కావని లక్ష్మణునకు కూడ తెలియును. అందువలననే లక్ష్మణుడు నీ వెన్ని చెప్పినను నేను అయోధ్యకు మరలిపోను అని రాముని తాత్పర్యము నుద్దేశించియే సమాధానము చెప్పినాడు. కావున తల్లిని తండ్రిని నిందించుట రాముని తాత్పర్యము కాదు.

ఇందులో మఱియొక ధర్మసూక్ష్మము కూడ కలదు. తల్లి తండ్రి, గురువు మొదలుగా పెద్దలు తప్పుగా వర్తించుచున్నప్పుడు చిన్న వారు అది తప్పని తెలిసికొన నక్కఱ లేదా? అట్లు గుర్తింపకున్నచో ఆ తప్పులనే మరల చిన్నవారు కూడ చేయుట సంభవింపదా? కావున విధేయత అనగా పెద్దలయందలి తప్పులను తెలిసికొన కుండుట లేదు. ఆ తప్పులను నిమిత్తముగా చేసి వారిని ధిక్కరింపకుండుటయే విధేయత. మాయందు ఏ సుచరితము లున్న వో అవియే నీచేత ఉపాసింపదగినవి. తక్కినవి కాదు

అని గురువు శిష్యునకు బోధించును. ఇది వేదానుశాసనము. కావున పెద్దలయందలి సుచరితములను దుశ్చరితములను చిన్నవారు శాస్త్రమునననుసరించి ఆలోచించి గ్రహింపవలసినదే; కాని వారిని ధిక్కరింపరాదు. వర్తనమునందు వారి సుచరితములను మాత్రమే ఆదర్శముగా గ్రహింపవలయును. భర్తకు మహాదుఃఖమును కలిగించు వరములను భార్య కోరరాదు. అది పతివ్రతకు లక్షణము కాదు. ఈ విషయము నుద్దేశించి పెద్దవారందఱును కైకను నిందించుచునే యున్నారు. ఇది రామునకు తెలియును. అయినను కుమారుడుగా ఆయన ఆమెను ధిక్కరింపలేదు. అదియే రాముని విధేయత. అందువలననే 'మాతృదేవో భవ' అను వేదానుశాసనము ఆయన చరిత్రమున చక్కగా సమన్వయించినది.

తమ్మునితో పోరాడుచున్న వాలిని రాముడు సంహరించుట ఎట్లు ధర్మమగునని అనేకులు ప్రశ్నింతురు. వాలియే ఇట్లు అడిగెను. రాముడు సమాధానము చెప్పెను. వాలి యంగీకరించెను. అయినను అంగీకరింపని వారు నేటికిని ఉండుట ఆశ్చర్యకరము. వాలి తమ్ముని తఱిమివైచి వాని భార్యను తనయొద్ద నుంచుకొనెను. అంతే కాదు, తమ్ముని సంహరించి ఆమెను శాశ్వతముగా దక్కించుకొనవలెనని ప్రయత్నించెను. ఇది నీచమైన కాముకత్వము. కావుననే వీనికి రావణునితో సఖ్యము కుదిరినది. తమ్ముని చంపి మఱదలిని దక్కించుకొనవలె నను తలంచువాడు మహాపాపి. అట్టి వానికి మరణమే దండనము. వధార్హుడైన నేరస్థుడు బలవంతుడై తప్పించుకొని తిరుగుచున్నప్పుడు వాడు కన్పించినప్పుడు వెంటనే సంహరింపవలె, లేకున్నచో వాడే ధర్మాధికారులను సంహరించును. కావున ఇందు రామునకు యుద్ధ ప్రసక్తియే లేదు. వధార్హుడైన నేరస్థుని రాముడు తనకు వీలయిన పద్ధతిలో దండించినాడు. రాజదండనమున నీ పాపమునకు శిక్ష జరిగినది. ఇంక నీవు శుద్ధుడవై పుణ్యలోకములకు పోగలవు అని రాముడు చెప్పినప్పుడు వాలి కూడ అంగీకరించి అంతకు ముందు తాను

రాముని నిందించినందులకు క్షమింపుమనియు ప్రార్థించెను. కావున రాముడు శిక్షారూపమున వాలికి ఉపకారమే కావించెను. అది కేవలము రాజధర్మము.

రాముని వాక్యము

*అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః ।*
*రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాపకర్మ కృత్ ॥ 19*

*న చ తే మర్షయే పాపం క్షత్రియోఽహం కులోద్గతః ।*
*ఔరసీం భగినీం వాపి భార్యాం వాప్యనుజస్య యః ॥ 22*

*ప్రచరేత నరః కామాత్తస్య దండో వధ స్స్మృతః ।*
*భరతస్తు మహీపాలో వయం త్వాదేశవర్తి నః ॥ 23*

*త్వద్విధాన్ భిన్నమర్యాదా న్నిగ్రహీతుం వ్యవస్థితాః । 25*

*రాజభి ర్ధృతదండా శ్చ కృత్వా పాపాని మానవాః ।*
*నిర్మలా స్స్వర్గ మాయాన్తి సన్తః సుకృతినో యథా ॥ 31*

వాలియొక్క ప్రతివచనము

*ప్రత్యువాచ తతో రామం ప్రాంజలి ర్వానరేశ్వరః ।*
*యత్త్వ మాత్థ నరశ్రేష్ఠ తత్తథైవ న సంశయః ॥ 45*

*త్వం హి దృష్టార్థతత్త్వజ్ఞః ప్రజానాం చ హితే రతః । 47*

రాముడు వనములం దున్నను వానప్రస్థుడు కాదు. వనవాస నియమములను అవలంబించుచున్నను క్షత్రియ సహజమైన దుష్టశిక్షణము శిష్టరక్షణము అనుధర్మములు రామునకు తప్పవు. ఆయన వనములకు వచ్చుట యనగా వృద్ధులైన రాజులు రాజ్యపాలనభారమును కుమారులకు

అప్పగించి అస్త్రశస్త్రములను వదలి వానప్రస్థమును అవలంబించుట కాదు. శ్రీ రాముడు వనముల లోనికి వచ్చినప్పుడు ఋషులు ఆయనకు ఈ విషయమును స్పష్టముగా చెప్పిరి. దండధరుడైన రాజు ఎల్లవారికి గురువు, మాన్యుడు, పూజనీయుడు ......... నీ యొక్క రాజ్యమునందు నివసించుచున్న మమ్ము నీవు రక్షింపవలయును. నగరమునందున్నను వనమునందున్నను ప్రజలకు పాలకుడవైన నీవే మాకు రాజువు. రాజా! మేము దండమును అనగా పాపకర్ములను దండించునధికారమును వదలిపెట్టి ఇంద్రియములను క్రోధమును జయించి యుంటిమి. మేము తపోధనులము. తల్లియెట్లు గర్భమును రక్షింపవలయునో అట్లు నీవే మమ్ము రక్షింపవలె.

*శ్లో॥ పూజనీయశ్చ మాన్యశ్చ రాజా దండధరో గురుః ।*
*తే వయం భవతా రక్ష్యా భవ ద్విషయవాసినః*
*నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః ॥*

*న్యస్తదండా వయం రాజన్ జితక్రోధా జితేంద్రియాః।*
*రక్షణీయా స్త్వయా శశ్వద్గర్భభూతా తపోధనాః ॥*
*(అరణ్య - సర్గ 1- 19,20,21)*

శరభంగుడు అగ్నిహోత్రమునందు ప్రవేశించి పుణ్యలోకములకు పోవుసందర్భమున ఆ యాశ్రమమునందు ఋషులు అనేక ప్రాంతముల నుండి వచ్చి సమావేశమైరి. వా రందఱును రాముని ఈ విధముగానే ప్రార్థించిరి. కావున దుష్టులచే బాధింపబడుచు సాధువులు శరణము కోరినప్పుడు క్షత్రియుడు వారికి శరణము నొసంగి దుష్టులను శిక్షింపవలె. మేము నీరాజ్యములోనివారము (భవద్విషయవాసినః) అని వారు చెప్పుట గమనింపదగియున్నది. అయోధ్యారాజుల యొక్క అధికారము ఎంతవఱకున్నది? దండకారణ్యమున కూడ వారి ప్రభుత్వమేనా? అయోధ్యాధిపతుల యధికారముయొక్క వ్యాప్తి కుశలవుల గానములో

ఆరంభ శ్లోకములోనే స్పష్టముగా వివరింపబడినది. ప్రజాపతి మొదలుకొని జయశాలులైన యే రాజులకు ఈ వసుంధర సమస్తము ఇతరులకు ఎవరికిని అధికారము లేకుండ సొంతమై యుండెనో ఏ రాజులలో సగరు డనువాడు 60 వేలమంది పుత్రులచేత పరివృతుడై సాగరమును త్రవ్వించెనో, అట్టి మహాత్ములైన యిక్ష్వాకుల యొక్క వంశమునందు రామాయణము అను నీ గొప్ప చరిత్ర ఉత్పన్నమైనది.

*శ్లో॥ సర్వాపూర్వ మియం యేషా మాసీత్ కృత్స్నా వసుంధరా ।*
*ప్రజాపతి ముపాదాయ నృపాణాం జయశాలినామ్॥*

*యేషాం స సగరో నామ సాగరో యేన ఖానితః।*
*షష్టిపుత్ర సహస్రాణి యం యాన్తం పర్యవారయన్ ॥*

*ఇక్ష్వాకుణా మిదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనామ్ ।*
*మహ దుత్పన్న మాఖ్యానం రామాయణ మితి శ్రుతమ్ ॥*
*(బాల- సర్గ. 5- శ్లో- 1,2,3)*

సగరుడు సాగరమును త్రవ్వించె ననుటవలన భగీరథుడు గంగను భూమికి తెచ్చి సాగరమును నింపుటయు వ్యక్తమగుచున్నది. కావున అయోధ్యారాజులు గంగను తెచ్చి సాగరమును నింపి సకలభూమండల మును పాలించిరి. అందువలన సకల భూమండలమున ధర్మమును నిలుప వలసిన బాధ్యత వారి యందున్నది. తక్కినరాజులందఱును వారియాదేశ మున వారిప్రతినిధులుగా ఆయా ప్రాంతములలో ధర్మపాలనము చేయుచుండిరి. లంకపై దండయాత్రకు పోవుటకు భరతుడు సన్నాహ మొనర్పగా 300 మంది రాజులు వచ్చి యుండిరి. రాముడు వారి నందఱను సత్కరించి పంపెనని ఉత్తరకాండము నందున్నది. అందువలన అయోధ్యా రాజులు సార్వభౌములనుట స్పష్టము. దండకుడు అను నిక్ష్వాకువంశపు రాజు పాలించుటవలననే దక్షిణాపథమునకు దండకారణ్య మనుపేరు

వచ్చినది. అందువలన దండకలో గాని, లంకలో గాని ఎచ్చట అధర్మము జరుగుచున్నను పాపకర్ములను శిక్షింప వలసిన బాధ్యత అయోధ్యారాజుల యందున్నది. అందువలననే భరతుని నియోగమున మేము అతని ప్రతినిధులముగా ఈ ప్రాంతమున దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుచున్నాము అని రాముడు స్పష్టముగా చెప్పెను.

సుగ్రీవుని మాటలనుబట్టి రాముడు వాలిని దండింపవచ్చునా, వాలిని కూడ విచారింపనక్కఱ లేదా అని కొందఱందురు. సుగ్రీవుడు భార్యారహితుడై యుండుట, రుమ కిష్కింధయందు ఉండుట సన్నివేశము చేతనే స్పష్టము. కబంధుడు దివ్యత్వమును పొందిన తరువాత సుగ్రీవుడు సజ్జనుడని వాలిచేత అక్రమముగా తఱిమివేయబడెనని రామలక్ష్మణులకు చెప్పెను. అసత్యమును చెప్పవలసిన యావశ్యకత కబంధునకు లేదు. అందువలన అతనిసాక్ష్యము ప్రమాణమే యగును. రుమవిషయమున వాలి కూడ ఎట్టి సమాధానము చెప్పుటకు ప్రయత్నింప లేదు. కావున రాముడు వాలిని దండించి పాపరహితుని గావించి ఉత్తమలోకములకు అర్హుని గావించి యుపకారమే యొనర్చెను. కావున వాలివధయందు రాముడు కావించిన ధర్మవ్యతిక్రమము రవ్వంతయును లేదు.

రావణవధానంతరము రాముడు సీతతో పరుషముగా మాటాడి ఆమెను నిండుసభలో పరిభవించుట యుక్తము కాదని అనేకు లందురు. కేవలము జారిణియైన భార్యను పల్లెత్తుమాట అనకుండ వదలిపెట్టిపోయిన ఆంగ్లదేశపురాణ ప్రసిద్ధుడైన ఆర్థరు అనురాజు శ్రీరామునకన్నను చాల ఉదారముగ వర్తించె నని శ్రీ శ్రీనివాస శాస్త్రిగారు (**Rh. Honorable V.S. Srinivas sastri-Lectures on Ramayana**) కూడ అభిప్రాయపడినారు. మహాపురుషులధర్మ శీలమును గుర్తించుట ఎంతవారికిని ఎంత దుర్ఘటమో దీనివలన వ్యక్త మగుచున్నది.

సీత శీలమును కొల్పో లేదని ఆంజనేయుడు లంకనుండి ఆమె చూడామణిని కొనివచ్చిన తరువాత రామునకే కాదు ఎల్లరకును విదితమే.

అసలామె శీలమును కోల్పోయినచో జీవించి యుండు నని రాముడు ఊహింపలేడు. అందువలన రాముడు ఆమెను క్షమించుట అనుప్రశ్నయే లేదు. ఆ విషయమును ఆయన ముందే వ్యక్తమొనరించెను. నేత్రరోగము కలవానికి దీపము వలె నీవు నాకు ప్రతికూలముగా నున్నావు (దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే స్థితా) అని ఆయన అన్నాడు. ఆమె దీపశిఖవలె పాతివ్రత్యముతో ప్రజ్జ్వలించుచున్నది. నేత్రరోగివలె తానే ఆమెను చూడలేకున్నాడు. అట్లయినచో ఆయన ఆమెతో అంతమందిలో పరుషముగ ఏల మాటాడవలె ఆమెశీలము పవిత్రమే య్యైనను రావణు డామెను రెండుచేతులతో పట్టుకొనిపోయె ననుట ఆమె లంకలో సంవత్సరకాలము భర్తకు దూరముగా నుండె ననుట యథార్థము. ఇట్టి పరిస్థితిలో అంజనేయునిమాట వలన ఆమె పవిత్రతను తాను నమ్మినను తనతో పాటు సుగ్రీవాదులు నమ్మినను అయోధ్యాపౌరులు నమ్ముదురా? తాను ఆమెను స్వీకరించి రాజుగా పట్టాభిషిక్తుడైనచో ప్రజలు తన్ను ధర్మప్రభువునుగా భావింతురా? ఇది ఆయనకు పెద్దసమస్య అయ్యెను. అందువలన ఆయన ఆమెతో పరుషముగా మాటాడి అగ్ని ప్రవేశముచేత ఆమె పరిశుద్ధురాలగు నట్లుగా చేసి పిదప ఆమెను స్వీకరించెను.

ఆయనకు ఈ సమస్య ఇంతటితో కూడ తీరలేదు. అయోధ్యలోని ప్రజలు అగ్నిప్రవేశమును కూడ నమ్మలేదు. లంక అయోధ్యకు సుమారు రెండువేలమైళ్లదూరములో నున్నది. లంక అనగా సింహళము కాదు. ఇప్పటి సేతువు దగ్గరనుండి 800 మైళ్లదూరములో మూడు పెద్దకొండల మీద ఇంచుమించుగా ఇప్పటి ఆస్ట్రేలియా ఖండమంతది లంక. అది ఎప్పుడో సముద్రములో మునిగిపోయెను. ఆ లంకలో ఒకమానవ స్త్రీ అగ్నిలో ప్రవేశించి మరల వెలికి వచ్చెనను మాటలు సామాన్యప్రజలు నమ్మలేక పోయిరి. ఆమె యందలి యనురాగముచేత రాముడు లక్ష్మణుడు వారియనుచరులైన వానరులు రాక్షసులును ఒక కథను కల్పించుకొని వచ్చి ప్రచారమొనర్చు చున్నా రని వారు తలచిరి. ఈ యపవాదు నగరములలో పల్లెలలో పిచ్చికుక్క విషమువలె వ్యాపింప జొచ్చెను. రాముడు భద్రుడను

మిత్రుని వలన ఈ వార్తను విని నిర్విణ్ణుడై ఎంతో ఆలోచించి తుదకు ఆమెను వాల్మీకి యాశ్రమముచెంత వదలిపెట్టుటకు నిశ్చయించెను. ఈ విషయమున రాముడు తనకీర్తి ప్రతిష్ఠలకొఱకై భార్యను బలి గావించె నని కొందఱు తలంతురు. ఇంతకన్నను అన్యాయ్యము ఇంకొకటి యుండదు. ఆయనను తప్పుపట్టు వారు ఆయన ఏమి చేసియుండిన న్యాయమై యుండునో చెప్పరు. ఆయన అప్పుడు అవలంబింప దగిన విధానములు నాలుగే కలవు. ఉపేక్షించుట మొదటిది. నిండుసభలో ఆంజనేయాదులను పిలిపించి సాక్ష్యము చెప్పించి ఆమె పవిత్రతను నిరూపించుట రెండవది. ఆమెనే మరల ప్రజల సమక్షమున శపథము చేయుమని కోరుట మూడవది. పరిత్యజించుట నాల్గవది.

రాముడు ధర్మపాలకుడుగా ఈ యపవాదును ఉపేక్షించుట అసంభవము. దానివలన ప్రజల యొక్క ధర్మవర్తనమున భంగము కలుగును "భార్య యొక్క శీలమున రాజునకే పట్టుదల లేనప్పుడు మన భార్యలవిషయమున కూడ ఇట్టిది సహింప వలసినదే అగును." (అస్మాకమపి దారేషు సహనీయం భవిష్యతి) అని ప్రజలు చెప్పుకొనుచున్నట్లు భద్రుడు స్పష్టమొనర్చెను. దీనిని రాము డెట్లు ఉపేక్షింప గలడు. ఉపేక్షించినచో అప్పుడు రామునకు తెలియవచ్చిన వార్త అంతఃపురమునకు చేరక యుండునా? ఈ విషయము సీతకు కూడ తెలిసినచో చెలికత్తెలు దాసదాసీజనములు గుసగుసలుగా చెప్పుకొనుచుండగా వారిముఖములు చూచుచు అంతః పురములో సుఖముగా నుండగలదా? అప్పుడు ఆమెయే రాముని ప్రార్థించి అజ్ఞాతవాసమునకు పోకతప్పునా? ఇంక ఆంజనేయాదులను పిలిపించి పెద్దసభలో సాక్ష్యము చెప్పించినను వారు నమ్ముదురా? వీరందఱును రామునిచే ఉపకారమును పొందిన మహాభక్తులు. వీరు ఇట్లు కాక ఇంకొకవిధముగా ఎట్లు చెప్పుదురు? అని ప్రజలు తిరస్కరింతురే కాని వారి మాటలను కూడ నమ్మరు. సీతాదేవి మరల అగ్ని ప్రవేశమో శపథమో చేసినచో వారు నమ్మవచ్చు. కాని ఆమె మాటిమాటికి శపథములు చేసి శీలమును నిరూపించుకొని జీవించుటకు ఇష్టపడునా? ఇష్టపడ దని రాము

నకు స్పష్టముగా తెలియును. అందులకే ఆమెను ఆయన అట్లు కోరలేదు. తుదకు రామాయణగానమున కుశలవులు సీతాపుత్రులని లోకమునకు వెల్లడి యైనప్పుడు వారి రాజ్యాధికారమును నిర్ణయింపవలసిన కర్తవ్యము మరల రామునిపై బడెను. అప్పుడాయన తప్పనిసరిగా సీతా శపథమును అవలంబింప వలసి వచ్చెను. ఆమె క్షత్రియస్త్రీగా ఆ యవమాన మును భరింప లేక భూమిలోనికే పోయినది. మొదటనే రాముడీ విధానమును అవలంబించి నచో అప్పుడే ఆమె భూమిలో ప్రవేశించి యుండును. కుశ లవులు కూడ జన్మించియుండ రు. కావున రాముడు గత్యంతరములేక సీతను పరిత్య జించుటకు నిశ్చయించెను.

ప్రజలవిషయమున బాధ్యత రామునకే ఉన్నట్లు సీతకు సంబంధము లేనట్లు కొందఱు తలంతురు. ఇది సరికాదు. పట్టాభిషేకము రాజునకే కాదు రాణికి కూడ జరుగును. అది వినోదమాత్రము కాదు. రాజ్యపాలనమున రాజుతో పాటు రాణికి కూడ అధికారము సంక్రమించును. రాజు లేనప్పుడు ఆయనకు ప్రతినిధిగా రాణియే పాలించును. ఈ విషయ మును రాముడడవికి పోవునప్పుడు వసిష్ఠుడు కైకతో స్పష్టముగా చెప్పెను. ఎల్లరకను ధర్మపత్నులు ఆత్మవంటివారు. రామునకు సీత ఆత్మ. కావున రాముడు లేనప్పుడు సీతయే రాజ్యమును పాలింపగలదు.

*శ్లో॥ ఆత్మా హి దారా స్సర్వేషాం దారసంగ్రహవర్తి నామ్ ।*
*ఆత్మీయ మితి రామస్య పాలయిష్యతి మేదినీమ్ ॥*
*(అయోధ్యా - సర్గ. 37- శ్లో. 24)*

పరిపాలనకు అధికార మున్నప్పుడు ప్రజలను రంజింపవలసిన బాధ్యత కూడ రామునకు వలె సీతకు కూడ కలదు. రాణిగానే కాదు ధర్మ పత్నిగా కూడ భర్తకు కలిగిన యపవాదును తొలగింపవలసిన బాధ్యత సీతకు కలదు. ఆమెయే ఈ విషయమును సౌమిత్రితో రామునకు సందేశమును చెప్పిపంపునపుడు స్పష్టమొనర్చినది. " ఓ వీరుడా! అపకీర్తికి భయపడు

చున్న నీచేత నేను పరిత్యజింప బడితిని. జనులయందు అపవాదమువలన నీకు ఏనింద కలిగినదో దానిని నేను కూడ తొలగింప వలసియే యున్నది. నీవే కదా నాకు పరమగతి".

*శ్లో॥ అహం త్యక్తా చ తే వీర! అయశో భీరుణా వనే।*
*యచ్చ తే వచనీయం స్యా దపవాదసముత్థితః।*
*మయా చ పరిహర్తవ్యం త్వం హి మే పరమాగతిః॥*
*(ఉత్తరకాండ -48 సర్గ 13,14)*

రాముడామెను వదలిపెట్టుట వలన ధర్మము కొఱకై రాముడు భార్యనే వదలివేసెను. మనము ధర్మము తప్పినచో తప్పు దండించును, అనుభావము ప్రజలయందునిలుచుటకు అవకాశం కలిగినది. ఈ భావమును వారియందు కలిగింపవలసినబాధ్యత రామునకు ఎంత యున్నదో సీతకును అంతే యున్నది. ఈ బాధ్యతను ఇరువురును ఎంతో బాధపడి నిర్వహించిరి. కావున రాముడు తనకీర్తికొఱకు సీతను బలిచేసె ననుట అక్రమము. రాముడామెను పరిత్యజించుట సర్వథా ధర్మసమ్మతము. ఆమెకు మహాకష్టము కలిగినచో దానికి పురాకృతకర్మఫలమే కారణము. ఆమె కూడ అట్లే తలంచినది.

శ్రీరాముడు అడుగడుగునను చిన్నవిషయములలో కూడ ధర్మము నెట్లు పాటించునో ఒకదృష్టాంతము చేత మనము గ్రహింపవచ్చును. రావణుడు మరణించిన తరువాత విభీషణుడు ముందు చాల దుఃఖించెను. కాని వెంటనే అతడు కావించిన దుష్కృత్యములను స్మరించి "ఇట్టి దుర్మార్గునకు ప్రేతకర్మలు కూడ చేయరాదు"అని పలికెను. అప్పుడు రాముడు కాక మరి యొకడైనచో నిజమే "వీని కింకను ప్రేతకర్మ లేమి? వీనిని ముక్కలు ముక్కలు చేసికాకులకు గ్రద్దలకు వేయుడు" అని చెప్పి యుండును.

ఆస్తుల విషయమున పోరాట మారంభమైనచో అన్నదమ్ములే ఎంత కసితో వర్తింతురో అందఱకును తెలియును. కౌరవుల ఘోరకృ

త్యములు ప్రసిద్ధములు భీముడు ఆ కసి తీఱుటకు దుశ్శాసనుని గుండెలు చీల్చి రక్తమును దోసిట పట్టెను. అంతే కాదు. వైరము తీఱిన తరువాత కూడ అంధుడు

*కం ॥ బిడ్డలకు బుద్ధి సెప్పని*
*గ్రుడ్డికి, బిందంబు వండికొని పొండిదె పైఁ*
*బడ్డాడని భీవలండొఱ*
*షాడ్డము లాడంగఁ గూడుఁ గుడిచెద వధిపా!*

*(ఆంధ్రభాగవతము, స్కంధ 1.)*

మఱి భార్యను అపహరంచి తమజీవితమునకు శాశ్వతముగా చిచ్చుపెట్టిన రావణుని పై రామునకు ఎంత కోపము ఉండవచ్చును. కాని ఆయన విభీషణునితో చెప్పినమాట వినుడు. "వైరములు మరణముతో ముగియ వలసినవి. మనప్రయోజనము కూడ తీఱిపోయినది. ఈతనికి సంస్కార మును చేయుము. ఇతడు నీకు ఎట్లో నాకును అట్లే."

*శ్లో॥ మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనమ్ ।*
*క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ ॥*

విభీషణుడు రామునకు మిత్రుడు. మిత్రుని సోదరుడు తనకును సోదరుడే ఏకారణముచే నైనను ఎవరును రావణునకు సంస్కారము చేయకపోవుట తటస్థించినచో తానే చేయుదు నని ఆయన స్పష్టమొనర్చి నాడు.

తనకష్టములకు అన్నింటికిని కారణమైన కైకవిషయమున కూడ ఆయన చూపిన కారుణ్యము అసామాన్యము. సీతా రామలక్ష్మణుల వనగమన సందర్భమున దశరథుడు క్రోధముతో కైకను వివాహము నందు గైకొనిన నీ పాణిని నేను పరిత్యజించుచున్నాను అని పలికెను. రావణవధా నంతరము దేవతలతో కూడ దశరథుడు ప్రత్యక్షమైనపుడు రాముడు ఆ మాటను స్మరించి కైకేయిని పరిత్యజించితి నన్నమాటను ఉపసంహరించు కొనుము అని ప్రార్థించెను. భర్తయొక్క శాపమునకు గురియైన భార్యకు

గతులుండవు. కైకేయికి అట్టి దుర్గతి కలుగువలయు నని అట్లు ప్రార్థించెను. శత్రువులవిషయమున ఇంత కారుణ్యమును చూపువారు ఎందరుందురు? ఇట్టి మహనీయుని స్మరించి భావించినవారు అర్చింపకుండ సెట్లుందురు? కావుననే శ్రీరాముడు ధర్మమూర్తిగా దేవదేవుడుగా యుగయుగములుగా ఆరాధింపబడుచున్నాడు.

---

# 2 సంస్కృతాంధ్ర రామాయణములు
## ఒక తులనాత్మక పరీక్ష

అవధానం. చంద్రశేఖరశర్మ

*''వాల్మీకి గిరి సంభూతా రామసాగర గామినీ.*
*పునాతి భువనం పుణ్యా రామాయణ మహానదీ''.*

శ్రీ మద్రామాయణము పరమ పవిత్రమైనది. ''ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్''. అందలి యొక్కొక్క యక్షరమును మహాపాతకములను సైతము నశింపఁ జేయునని యాస్తికులగు భారతీయుల విశ్వాసము.

భారత రామాయణములు రెండును భారతీయ సంస్కృతి కోశములు. భారతము అయిదవ వేదమైనచో రామాయణము సాక్షాద్వేదమే. భారతము భారతీయ విజ్ఞాన సర్వస్వము.

*''ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ!*
*యదిహాస్తి త దన్యత్ర యన్నే హాస్తి న తత్ క్వచిత్॥''.*

*భారతం-18-5-50*

''చతుర్విధ పురుషార్థములను గూర్చి యేమి తెలిసికొన వలయునో అదియెల్లను నిందున్నది, ఇందు లేనిది మఱి యే గ్రంథమునను లేదు'' అని మహా భారతమే ఉద్ఘోషించినది.

ఇక నాదికావ్యమగు రామాయణ మన్ననో సాక్షాద్భగవంతుడే మానవుడుగా నవతరించి యుదాత్త మానవ జీవితము నెట్లెట్లు నడుప వలయునో, వేదోపదిష్టమగు ధర్మమును ఎట్లెట్లు సమగ్రముగా అనుష్ఠింప వలయునో స్వయముగా నడిచి యనుష్ఠించి చూపిన పరమ పవిత్ర చరిత్రమునకు అక్షరరూపము నమరించి తీర్చిదిద్దిన వాణీ విలాసము.

ఇవి రెండును భారతీయ సంస్కృతి, సర్వస్వదర్శనమునకు రెండు కన్నులు, అంతేకాదు; ఇవి యాస్తికులగు విజ్ఞాన విషయము లన్వేషించు

వారి కెట్లో రసప్రియులగు సాహితీ సేవకులకును నట్లే సాటిలేని యమృత భాండములు.

అయిననేమి? యీ రెండును సంస్కృత భాషలో నుండుటచే క్రీ.శ. పదియవ శతాబ్దాంతము వఱకును (సంస్కృతము తెలియని) స్పష్టరూపమున అందుబాటులో లేకుండును. తెలుగు వారికి వారు ఆయా యంశములను పౌరాణికుల నుండి యును, కథకుల నుండియును విని యఱిగొఱిగా తెలిసికొను చుండిరి. ఈ దశనే తెలుంగువారు "గాసట బీసటే చదివి గాథలు త్రవ్వు చుండి"రని ప్రబంధ పరమేశ్వరుడు పేర్కొని నాడు.

పదునొకండవ శతాబ్ది పూర్వ భాగమున నన్నయ భట్టారకుని ధర్మమాయని భారత భారతీ దివ్య వాహిని గీర్వాణ వియత్పథము నుండి యనువాదమార్గమున నాంధ్రభూమికి అవతరించినది. ఆ భగీరథుని తపః ఫలముగా సాగిన యారసస్రోతస్వినిని కాలపురుషుడు హరజటా జూటమ్మై జహ్నుమునియ్యై నడుమ నడుమ నవరోధింపగా ఆ గండములను దప్పించి దానిని సమగ్రరూపమున తెలుగు పొలమునకు దెచ్చి యా జాతిని దనియించిన పుణ్యము తిక్కన యెఱ్ఱనలకు దక్కినది. ఆంధ్ర భారతము సమగ్ర సాక్షాత్కారము నందుటకు దాదాపు మూడు వందల యేండ్లు పట్టినది. ఒత్తుకొని వచ్చు జైన బౌద్ధాదులగు నవైదిక మతముల దాడులకు జలింపకుండ వైదిక ధర్మమును సుప్రతిష్ఠితము చేయుటకే తొలుదొల్త భారతము తెలుగులో వెలుగు చూపినది.

పదుమూడవ శతాబ్దపు టుత్తరార్ధముననో పదునాల్గవ శతాబ్దపు టారంభముననో కాని రామాయణముపై నాంధ్ర మహాకవుల చూపు పడలేదు.

ఈ సందర్భమున నొక చిన్న విషయమును మనవిచేయుదును. నన్నయభట్టారకుడు భారతరచనమునకు బూర్వము రాఘవాభ్యుదయ మను గ్రంథమును రచించెననియు అది బహుశః పూర్వరామాయణమే యై యుండు ననియు, అందువలననే తిక్కన భారత శేషమును బూర్తిచేసినట్లే రామాయణ శేషమును గూడా బూర్తి చేయుటకై ఉత్తర రామాయణమును

రచించెననియు విమర్శక లోకమున నొకయభిప్రాయము గలదు. అందులకు సాధకముగా వారు రాఘవపాండవీయావతరణికలో కవిత్రయ మును నుతించుచు పింగళి సూరన చెప్పిన యీ క్రింది పద్యమును జూపుదురు:

*"ఏ యెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియన్ దిరం -*
*బై యనవద్యతన్ బరఁగ నంధ్ర వచస్స్ఫితి భారతంబు రా -*
*మాయణమున్ రచించిన మహాత్ముల నాత్మఁదలంచెదన్ జగ*
*ద్గేయుల నన్నపార్యునిని దిక్క సుధీమణి నెఱ్ఱసత్కవిన్".*

ఇందు నన్నయాదులు ముప్వురును భారతరామాయణములను రెండింటిని రచించిరను భావము స్పష్టమగుచున్న దని వారు చెప్పుదురు. కాని నన్నయ రచనమునకు శేషముగా తిక్కన యుత్తర రామాయణమును రచించి యున్నచో భారత శేషము నందువలె నందును నా "యాంధ్ర కవిత్వ విశారదు" ని నేల పేర్కొన లేదు? పింగళి సూరనకు ముందుగాని తరువాత గాని కవులలో నే యొక్కరును నన్నయను రామాయణ కవిగా ఏల నుతింప లేదు? అను సందేహములు సహజముగా కలుగక మానవు. సూరన గావించిన కవిత్రయ స్తుతిని ఛత్రిన్యాయమున నన్వయించుకొనుట యుచిత మేమోయని తలంతును.

ఎఱ్ఱాప్రెగ్గడ తెలుగులో రామాయణమును రచించె నని హరివంశారంభము నందలి యీ క్రింది పద్యము వలన దెలియుచున్నది.

*"నా తమ్ముండు ఘనుండు మల్ల రథినీ నాథుండు నిన్నాతత*
*శ్రీ తోడన్ సముపేతు జేసి యెలమిన్ జేపట్టి మా కిచ్చుటన్*
*జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ*
*ఖ్యాతిన్ బొందితి నింకనుం దనియనేఁగావ్యామృతాస్వాదనన్".*

ఇది కృతి భర్తయగు వేమారెడ్డి ఎఱ్ఱనతో చెప్పిన మాట. దీనివలన నెఱ్ఱన రామాయణము రచించినట్లు స్పష్టమగుచున్నది. ఇది యచ్చముగా వాల్మీకమునకు ఆంధ్ర భారతము త్రోవలో సాగిన యనువాదమే గాని కొందఱూహించినట్లు సంక్షేప రామాయణము కాదని.

*"వల్మీక భవు వచోవైఖరి రామాయణంబు నాంధ్ర ప్రబంధంబు సేసె".*

అని యెఱ్ఱనవంశీయుడగు చదలవాడ మల్లయ తన విప్రనారాయణ చరిత్రమున నెఱ్ఱనను గూర్చి చేసిన నుతి సాక్ష్య మిచ్చు చున్నది.

కాని యీ మహాప్రబంధము అటనట నుదాహృతములగు నలువది రెండు పద్యములు తప్ప తక్కినది యెల్ల కాలగర్భమున లీనమై యలభ్యమై పోవుట యాంధ్రుల దురదృష్టము.

మఱి యాకాలములోనే ఇంచుమించు ముందు వెనుకలలో రెండు రామాయణములు వెలసినవి అవి (1) రంగనాథ రామాయణము (2) భాస్కర రామాయణము.

రంగనాథ రామాయణమునకు గర్త గోన బుద్ధారెడ్డి యని గ్రంథస్థ మగు సాక్ష్యము. పేరును బట్టియు గొన్ని లక్షణ గ్రంథముల యుద్ధారమును బట్టియు రంగనాథుడని కొందఱు విమర్శకుల యభిప్రాయము. గ్రంథ కాలనిర్ణయము విషయమునగూడ విమర్శకులలో నైక మత్యము కుదుర లేదు. పదుమూడవ శతాబ్దపు మధ్యభాగమని కొందఱనగా పదునాల్గవ శతాబ్దపు మధ్యభాగమని మఱికొందఱు తలచుచున్నారు. గ్రంథస్థ విషయ పరామర్శయే ప్రధానమగు నీ వ్యాసమున కర్తృకాల నిర్ణయచర్చను సాగించుట సముచితము గాదు..

భాస్కర రామాయణ కర్తలు (1) హుళక్కి భాస్కరుడు, (2) మల్లికార్జున భట్టు, (3) కుమార రుద్రుడు, (4) అయ్యలార్యుడు, అను నలుగురు కవులు. భాస్కరుని యాధిపత్యమున రచింపబడినది గావున భాస్కరరామాయణ మను పేరు వచ్చియుండును.

భాస్కరుడు రెండవ ప్రతాపరుద్రుని కాలమున నున్న గొప్ప కవి. అతని పేరునకు మొదట నున్న 'హుళక్కి' పౌరుషనామమట. కన్నడమున 'హుళక్కి' యనగా తాంబూల మని యర్థమట. ప్రతాపరుద్రుడు నిండు సభలో నుండఁగా భాస్కరాదులగు నిన్నూర్గురు కవులు దర్శింపవచ్చి రని

సోమదేవరాజీయము తెలుపుచున్నది. నాటి కవులలో నగ్రేసరుడై రాజాస్థాన మున నగ్రతాంబూల గౌరవమును బొందుటచే నాతనికి హుళక్కివా రను పౌరుషనామము కలిగినది యని యభిజ్ఞుల వివరణము. (చూ, అకాడమీ వారి భాస్కర రామాయణము పీఠిక). తాంబూలము నందుటగూడ నొక గొప్ప గౌరవమా? అనరాదు. మహాకవి శ్రీహర్షుడు తన తండ్రినిగూర్చి "తాంబూల ద్వయ మాసనం చ లభతే యః కాన్య కుబ్జేశ్వరాత్" అని గొప్ప చెప్పుకొనుట అది యెంత యసాధారణ గౌరవమో తెలుపును. సమనంత రకవు లందఱును భాస్కరుని ముక్త కంఠముగా కీర్తించినారు. భాస్కర రామాయణములో ఆయన అరణ్య కాండము సంపూర్ణముగను యుద్ధ కాండమున వేయి, నూట నలువది పద్యములను రచించినాడు.

రెండవ వాడగు మల్లికార్జున భట్టు భాస్కరుని కుమారుడు. బాలకాండము, కిష్కింధా కాండము, సుందర కాండము నను మూడు కాండములు రచించినాడు. మూడవ వాడగు కుమారరుద్రుడు భాస్కర కవిశిష్యుడు, కృతి భర్తయగు సాహిణి మారయ్య కుమారుడు. ఇతడు అయోధ్యా కాండమును రచించెను. నాల్గవ వాడగు అయ్యలార్యుడు భాస్కర కవి మిత్రుడు. యుద్ధకాండములో భాస్కరుడు రచింపగా మిగిలి యున్న భాగమును వానరులు లంకను గాల్చు ఘట్టము నుండి తుదివఱకు నున్న భాగమును రచించినాడు.

ఇది యిట్లేల బహుకర్తృకమైనదో వీరిలో ఒక్కరు గూడ తెలుపలేదు. గ్రంథాంతమున నయ్యలార్యుఁడు.

> *"అమర హుళిక్కి భాస్కర మహాకవి చెప్పఁగనున్న యుద్ధకాం*
> *డము తరువాయి చెప్పెఒకట ప్రతి భాషణుఁడప్పలార్య స*
> *త్తమ సుతుఁ డయ్యలార్యుఁడు కృతీ స్థితి నార్యులు మెచ్చునట్లుగా*
> *హిమకరతారకారవిమహీ వలయ స్థిరలక్ష్మీ చేకుఱన్."*

అని మాత్రమే చెప్పినాడు, గాని అదియేల కొఱతగా నిలిచి పోయినదో తెలుపలేదు. మఱి యొక వింత యేమనగా నీ గ్రంథమునకు నవతారికా భాగము లేదు. ఇది యిట్లేల జరిగె నను సందేహమునకు నూహాగానమే గాని సరియగు సమాధానము లేదు. ఈ రామాయణము రచనాకాలము 1310 (క్రీ.శ) కి పూర్వమే యని చారిత్రకుల నిర్ణయము.

తరువాతి కాలమున మొల్ల రామాయణమును అచ్చతెనుగు రామాయణమును వచ్చినవి. ఒక్క కథామాత్రమున దప్ప వానికి మూల రామాయణముతో బోలిక లేదు. ఆ పిమ్మటి కాలమున గోపీనాథము వెంకటకవి మొదలుగా పెక్కురు కవులు వాల్మీకము ననువదించిరి. కాని యవియన్నియును యథాక్షరాను వాదములై చేర్పు మార్పులు లేనివి. ఇంకను ఇటీవలి కాలమున వచ్చిన విశ్వనాథ వారి సకలోహవైభవసనాథము రామకథ – రామాయణ కల్పవృక్షమును, పుట్టపర్తి వారి జనప్రియ రామాయణమును ప్రత్యేకముగా పరిశీలింపదగినవి. వానిని ఈ వ్యాసము నకు విషయములను గావింపలేదు. కాగా, కవిత్రయ ప్రదర్శితమగు ననువాదమార్గమున సాగి ప్రాచీనములై నేడు మనకు లభ్యములై ప్రసిద్ధము లైన రంగనాథ – భాస్కర రామాయణము లాధారముగా సంస్కృతాంధ్ర రామాయణముల సాదృశ్య – వైసాదృశ్యములను యథామతి వివరింప యత్నింతును.

ఈ రామాయణ ద్వయము నారంభము నాటికి ఆంధ్రదేశమున వాల్మీకి రామాయణముతో బాటు విశ్వామిత్ర కృతముగా బ్రసిద్ధమై యున్న యధ్యాత్మరామాయణము గూడ బహుళ ప్రచారము నందినట్లున్నది. భోజుని రామాయణ చంపువును, భట్ట మురారి, జయదేవాదుల రామాయణ నాటకములును పండిత లోకమున బ్రచారము నందినవి, వీని నెల్ల నాకళించుకొని పాఠకుల యభిరుచులను నెమరు వేసికొని పరంపరాగత మగు జానపదుల గేయములలోని మేలిమినిగూడ పోనీయక యొక విశిష్ట ప్రణాళికను నిర్ణయించుకొని తదను సారముగా నీ యుభయ రామాయణ

కర్తలును తమ తమ త్రోవలలో రచనము గావించినారు. ఆ కారణము వలన వాల్మీకములో లేని కొన్ని కథాంశములు అధ్యాత్మము లోనివియు జనశ్రుతుల లోనివియు నిందు చోటు చేసికొన్నవి. సంస్కృత నాటకముల లోని భావము లకు కొన్నింటికి అనుకరణములు గూడ సెలవు కొన్నవి.

ఈ పద్ధతి ననుసరించుటచే వీనికి ప్రజాదరమును, బహుళ ప్రచార మును లభించినది.

కవులకు ఈ పాటి స్వాతంత్ర్యము ఆలంకారికసమ్మతమే.

*"సంతి సిద్ధరస ప్రఖ్యా యే చ రామాయణాదయః,*

*కథాశ్రయా న తై ర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ।*

*తేషు హి కథాశ్రయేషు తావత్ స్వేచ్ఛైవ న యోజ్యా;*

*స్వేచ్ఛాపి యది యోజ్యా త ద్రస విరోధినీ న యోజ్యా॥"*

*(ధ్వన్యాలోకము.3 ఉద్యో.వృత్తి)*

రససిద్ధి నందినవిగా ప్రసిద్ధములగు రామాయణాదులలో కథా విషయమున కవులకు నేమాత్రమును స్వేచ్ఛ పనికిరాదు; ఒక వేళ ఎక్కడ నేని స్వేచ్ఛను పూనదలచినను నది మూల కథారసమునకు విరుద్ధ మగు నట్లు కూర్పరాదు. అని యానంద వర్ధనుల యాదేశము. అందువలన మూల గ్రంథ రసవిరుద్ధములు గాని కథాంశములను చేర్చుట ఆలంకారికులకు సమ్మతమే. అదిగాక యాలంకారికులు వలదన్న స్వేచ్ఛ ప్రధాన కథా విషయముననే గాని యుపకథల విషయమున గాదనియు దలంపవచ్చును.

ఇట్లు రెండు గ్రంథములకును ప్రధాన ప్రణాళిక యొక్కటే యయినను రంగనాథ రామాయణకవి దేశిపద్ధతి వైపును, భాస్కరాదులు మార్గపద్ధతి వైపును మొగ్గు చూపినారు. రంగనాథ కవి పాలకురికి సోమ నాథుని ద్విపద రచనలకు ప్రజలపై గల ప్రభావమును గమనించి తానును ఆ మార్గమున తన రచనకు ద్విపదచ్ఛందము నాశ్రయించినాడు. కాని మతావేశ పూరితములును, అలౌకిక ప్రభావ ప్రఖ్యాపకములును ,

అప్రసిద్ధములు నగు కథలను కాక సుప్రసిద్ధమై ప్రజాహృదయములలో నాటికే నాటుకొన్న రామకథను తన కావ్యమునకు ఇతివృత్తముగా గ్రహించి మార్గ సంప్రదాయములనుసైతము పాటించి తన కావ్యమును పండిత పామరోభయ రంజకము కావించినాడు. వాల్మీకిరామాయణమువలె నిది యును 'పాఠ్యే గేయే చ మధుర' మ్మని నట్లు తంత్రీలయ సమన్విత ముగా బాడను, జదువనుం గూడ మధురమ్మైన ఈరచనము బొమ్మలాటల వారికిగూడ బ్రదుకు దెరువున కాధారమ్మై యే యితరాంధ్ర గ్రంథములకును లభింప నంత ప్రజాసామాన్యము నాదరమును జూఱ గొన్నది.

ఈ కవి

*"ఆది కవిశ్వరుడైన వాల్మీకి యాదరంబునఁ బుణ్యులందఱు మెచ్చఁ*
*జెప్పిన తెలుగునఁ శ్రీ రామ చరిత మొప్పుజెప్పెద" ..........*

అని తొలుత ప్రతిజ్ఞ చేసినను నిర్ణీత ప్రణాళికానుసారముగా నవాల్మీ కాంశములను పెక్కింటిని తన రచనములో చేర్చినాడు. వర్ణనములలో మూల మును అనుసరింపక ప్రాయికముగా స్వాతంత్ర్యము నవలంబించి నాడు.

*"కవాట తోరణ వతీం సువిభక్తాంతరాపణామ్।*
*సర్వయంత్రాయుధ వతీ ముపేతాం సర్వశిల్పిభిః॥"*

*రామా–1–5–10*

ఇత్యాదిగా మూలమున నున్న యయోధ్యా వర్ణనమును వదలి

*"మణి గోపురంబుల మణితోరణముల*
*మణికుట్టి మంబుల మణిగవాక్షముల"*

అని యారంభించి

"పరిఘలఁగోటలఁబసిడిమాడువులఁగరమొప్ప లోక విఖ్యాతమై పరఁగు". అని స్వతంత్ర వర్ణనము గావించినాడు.

*"శక్యమంబర మారుహ్య మేఘసోపాన పంక్తిభిః*
*కుటజార్జున మాలాభి రలం కర్తుం దివాకరమ్".*

*(కిష్కింధా. 18స. 4 శ్లో)*

మాల్యవంతములో రామలక్ష్మణు లున్నప్పుడు మూలమున వర్షా వర్ణనము నందున్న యిట్టి మధుర తమము లగు భావములను గూడ ఇతడు గ్రహింప లేదు.

*"ధరణిజ నెడఁబాసి తల కెడు రాముఁ*
*బొరిపొరి దుఃఖముల్ పొదువు చందమున*
*నటిముతో దివి నుండి యంబుజ మిత్రు*
*మెఱయ నీ కందంద మేఘము ల్వొడమె".*

అనురీతిగా కథాంశము లుపమానములుగా గొని సుదీర్ఘమగు వర్షావర్ణనమును స్వతంత్రముగా కావించినాడు.

భాస్కరాదులు సైతము వర్ణనల విషయమున గొంత స్వాతంత్ర్యము వహించిన వారే అయినను అటనట మూల భావములను సైతము సంగ్రహించినారు. పై వర్షావర్ణన ఘట్టమున నున్న –

*"ఏష ఫుల్లార్జున శ్శైలః కేతకై రధివాసితః*
*సుగ్రీవ ఇవ శాంతారిర్ధారాభి రభిషిచ్యతే".*

*రామా 4-28-9*

అను మూలమును మల్లికార్జున భట్టు ఇట్లనువదించినాడు.

*"వికసితార్జున కాంచన విసర భరిత*
*మైన యుగ్గిరి వర్షధారాభిషిక్త*
*మగుచు నొప్పెడుఁజాల శాంతారి యగుచుఁ*
*బ్రీతి నభిషిక్తుఁడైన సుగ్రీవు భంగి".*

ఈ ఘట్టమున స్వతంత్రముగా కవి వర్ణించిన యీ పద్యము భావమునను, భాషాపటిమను, శైలిని, వైదుష్యమునను ఆంధ్ర సాహిత్యమునకే అపురూపమైనది.

*"యమున ద్గంగము కృష్ణ భూమదిల మబ్జాక్షన్మనుష్యంబు నీ –*
*ల మహీధ్రన్ని ఖిలాచలావళి తమాల ద్భూజమిందీవర –*
*త్కుముద శ్రేణి పిక ద్విహంగము తమస్స్తోమ ద్గ్రహార్కప్రభా*
*సముదాయం బగుచుండె లోకమల ఘశ్యామాభ్రముల్ పర్వినన్"*

ఇంతటితో ఈ ప్రసంగమును వదలి వాల్మీకమున లేక యీ గ్రంథ కర్తలు క్రొత్తగా కూర్చిన కథాంశములను కాండముల వారిగా పరిశీలింతము.

బాల కాండమున నహల్యా వృత్తాంతమున నింద్రుడు గౌతముని తపస్సు చెఱచుటకు –

"కుక్కుటం బయి పోయి కుటజంబు సేరి కొక్కొరో యని కూయ"...... గా ముని లేచి స్నానాద్యనుష్ఠానమున కేగె ననియు నా యవకాశము నుపయోగించుకొని యింద్రుడు గౌతమ వేషమున నహల్యను జేరె ననియు రంగనాథ రామాయణములో కల్పింపబడినది. దీనికి ఆకరము కానరాలేదు. జన శ్రుతి మూలము కావచ్చును. భాస్కర రామాయణమున దీనిని గ్రహింప లేదు. కాని తరువాత నాంధ్ర సాహిత్యము లోనికిమాత్ర మెక్కినది.

ఈ ఘట్టముననే గౌతము డహల్యను శిలగా పడియుండు మని శపించె ననియు రామపాదరజము సోకగా నామె శాప విముక్తయ్యై నిజ రూపము నందె ననియు–

*"శ్రీ రామ పాద రాజీవ పరాగ*
*దూరీ కృతాఘ సందోహయ్యై యపుడు*
*వెలఁది యంతట శిలావేషంబు మాని*
*తిలకించి తన తొంటి దేహంబు పూనె"*

అని రంగనాథ రామాయణములో నున్నది. కాని భాస్కర రామాయణ ములో

*"కన రాముని దర్శనమున*
*ముని శాప విముక్తయగుచు ముజ్జగముల కె*
*ల్ల నహల్య కాన బఁడియెను*
*ఘన విగమ స్ఫురితచంద్రకళ చందమునన్".*

అని మాత్రమే కలదు.

అహల్య పాషాణరూపము నందుటయు రామపాదరజః స్పర్శమున శాప విముక్తి నందుటయు వాల్మీకమున వాచ్యముగా లేదు.

*"వాయు భక్షా నిరాహారా తప్యంతీ భస్మ శాయినీ।*
*అదృశ్యా సర్వ భూతానా మాశ్రమే౽స్మిన్ని వత్స్యసి॥"*
*1-48-30*

అని మాత్రమే శపించినట్లున్నది. కాని శాప ముక్తిని చెప్పునప్పుడు -

*"తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహవివర్జితా॥*
*మత్సకాశే ముదాయుక్తా స్వం వపుర్ధారయిష్యసి॥"*
*1-48-32*

అను గౌతమ వాక్యమున "స్వం వపుర్ధారయిష్యసి" అను భాగమును మహేశ్వర తీర్థులు - "మచ్ఛాపపరిప్రాప్త పాషాణావస్థాం విహాయ నిజ శరీరం ప్రాప్స్యసీతి భావః" అని వివరించి యందులకు సాధకముగా

*"సా తత స్తస్య రామస్య పాద స్పర్శాన్మహాత్మనః।*
*అభూత్సురూపా వనితా సమాక్రాంతా మహాశిలా॥"*

అను పద్మపురాణ శ్లోకము నుదాహరించినారు.

అధ్యాత్మ రామాయణము నందు అహల్యను గౌతముడు -

"దుష్టేత్వం తిష్ఠ దుర్బుద్ధే శిలాయ మ్యాశ్రమే మమ।"

అను శపించి -

*"రామో దాశరథి శ్శ్రీమా నాగ మిష్యతి సానుజః।*
*యదా త్వదాశ్రయశిలాం పాదాభ్యా మాక్రమిష్యతి॥*
*తదైవ ధూతపాపా త్వం రామం సంపూజ్య భక్తితః।*
*పరిక్రమ్య నమస్కృత్య స్తుత్వా శాపాద్వి మోక్ష్యసే॥*

అని శాప మోక్షణము ననుగ్రహించినట్లు స్పష్టముగా నున్నది. రామాయణ చంపువును బెక్కు సంస్కృతనాటకములను దీనిని ఇట్లే గ్రహించినవి. రంగ నాథ కవి వీని నెల్ల నాకళించి యుండును.

అయోధ్యాకాండమున నొక చిన్న మార్పుమాత్రమే రంగనాథ రామాయణములో కలదు. "అయోధ్యా పట్టణములోని మహోత్సవ సంరంభమును జూచి శ్రీరాముని దాది నడిగి రామ పట్టాభిషేక వృత్తాంతమును తెలిసికొనిన మంథర

*"పనివడి, రాముఁడు బాల్యంబు నందుఁ*
*దన కాలు విఱిచిన తప్పు సాధింప*
*నిది నాకుఁదఱి యని యిచ్చఁజింతించి*
*యది వచ్చి కైకతో నంతయుఁజెప్ప"*

కైక మందిరము జొచ్చి కైకకు దుర్బోధ చేసినది అని మంథర కోపమునకు కారణము కల్పింపబడినది. మూలమున -

*"సా దహ్యమానా కోపేన మంథరా పాపదర్శినీ।*
*శయానా మేత్య కైకేయీ మిదం వచన మబ్రవీత్॥"*

*2-7-13*

అని మాత్రమే కలదు. అధ్యాత్మరామాయణములో గూడ "కుబ్జా౽కారణ వైరిణీ" అని మాత్రమే కలదు. ఈ కారణ కల్పనము జానపదసాహిత్యములోని దేమో? ఈ కారణ కల్పనము తమిళ మహాకవియగు కంబని రామాయణములో గూడ

*"కాంచి మంథర తగు కారణం బూహించి*
*తత్తఱ మందు చిత్తంబు తోడ*
*త్రిజగంబులకు నసదృశ పీడ యొనరించు*
*కడఁకతోఁద్రొల్లి రాఘవునివలనఁ*
*గార్ముక ముక్త మృత్కణ బాధితాంగ యౌ*
*కతముఁదలచిఁపెనుకసలుతోడ"*

(శ్రీ పూతల పట్టు శ్రీ రాములు రెడ్డి గారి కంబరామాయణానువాదము)

కైక కడ కేగి దుర్బోధ చేసినదని చోటు చేసికొనుట పై యూహను బలపఱచుచున్నది.

"తొల్లి కౌసల్యా తనయు చేతం దనకు నైన చరణ తాడన భంగంబు వైర కారణంబుగా గొని" అని భాస్కర రామాయణములో కారణ కల్పనము పూర్వ ముద్రణమున నున్నది. కాని అకాడమీ వారి ప్రతిలో నిది తొలగింపబడినది.

అరణ్య కాండమున "ఖర దూషణాది వధానంతరము జనస్థానము నుండి హతశేషుడగు నకంపనుడను రాక్షసుడు లంకకు పోయి యా వృత్తాంతమును రావణునకు దెలుపు సందర్భమున సీతాసౌందర్యమును వర్ణించి సీతను అపహరించి తెచ్చినచో నామె విరహము నోర్వలేక రాముడు నశించు నని బోధించెను. అంతట సీతాపహరణమున కుద్యుక్తుడై రావణుడు సాయము కొఱకు మారీచునికడకు బోయి తన సంకల్పమును తెలుపగా నాతడది నీతి గా దనియు మీదు మిక్కిలి యపాయకర మనియు బోధింపగా రావణుడు తన ప్రయత్నమును మాని మరలి వచ్చె" నని మూలములో నున్నది. ఆ వెనువెంటనే శూర్పణఖయు లంకకు బోయి రావణునితో జనస్థాన వృత్తాంతమును దెలిపి సీతా సౌందర్యమును వర్ణించి యతనిని సీతా పహరణమునకు బురికొల్పగా మరల నతడు మారీచుని కడ కేగును.

ఇట్లు సీతా సౌందర్య వర్ణనమును మారీచుని యుప దేశమును మూలమున పునరుక్తము లైనవి. శూర్పణఖ దుర్బోధ యొక్కటియే ప్రస్తుత కథాగతికి చాలియున్నది కావునను ఆంధ్ర రామాయణముల రెంటను అకంపనుని వృత్తాంతము విడువబడినది.

అరణ్యకాండమున అవాల్మీకీయములగు నంశములు రెండున్నవి. ఒకటి జృంభ కుమారుని కథ; రెండవది లక్ష్మణుడు ఆశ్రమములో సీతను వదలి పోవునపుడు ఆమె చుట్టును 'ఏడు గీఱలు గీచి వానిని దాటి పోవలదని ఆమెతో చెప్పిపోవుట. జృంభకుమారుని కథ శూర్పణఖ పంచవటిలోని రాముని యాశ్రమము నొద్దకు వచ్చుటకు కారణమును సమకూర్చుచున్నది. అది యెట్లో తెలిసికొందము.

ఒకనాడు లక్ష్మణుడు ఫలాదులను తెచ్చుటకు ఆశ్రమము నుండి సమీపమున నున్న యొక కొండకు పోయెను. అంతలో ఆకాశము నుండి

యొక ఖడ్గము మెఱయుచు వచ్చి యల్లంత దూరములో పడుటను జూచి యాతడు కుతూహలముతో నచటికి బోయి ఆ ఖడ్గమును చేతికి దీసికొని దాని పదను చూచుటకు ప్రక్కనే యున్న యొకవెదురు పొదను తెగవ్రేయగా పొదతో బాటు దానిలో నుండి తపము చేయుచున్న యొక తాపసి దేహమును తునుకలై కూలెను. దానిని జూచి లక్ష్మణుడు పాపభీతుడై వణకుచు పోయి యా వృత్తాంతము నన్నకు విన్నవించెను. ఇరువురును చింతించుచుండగా కొందఱు మును లచటికి వచ్చి దీవించి

*''అఖిలేశ! వినుము నీ యను జన్ముడిప్పు-*
*డఖిల లోక ద్రోహియైన రావణుని*
*చెలియలి కొడుకగు జృంభుని నేడు*
*తులువను నిర్జించె దోషంబు లేదు''.*

అని తెలిపి వా రడుగగా జృంభుడు శూర్పణఖయను రాక్షసికొడు కనియు, తన తండ్రిని రావణుడు చంపె నని తల్లి వలన తెలిసికొని పగతీర్చు కొనుటకు సూర్యుని గూర్చి తపస్సు చేయుచుండగా సూర్యు డాతని కీ ఖడ్గమును బంపె ననియు, జృంభుడు గర్వమున దానిని గ్రహింపక పోగా అది యిట్లు లక్ష్మణుని చేతికి జిక్కె ననియు తెలిపిపోయిరి.

తరువాత నెప్పటి యట్లు మధ్యాహ్న భోజనము తీసికొని కుమారునియొద్దకు వచ్చిన శూర్పణఖ కుమారుని యాదశను జూచి శోకముచే మూర్ఛిల్లి లేచి యచటి మునులే తన కుమారుని చంపి రని కోపముతో నాసమీపమున నున్న మునులను మ్రింగబోగా వారు ముని వేషమున నున్న యొక యువకుడు జృంభుని చంపి పంచవటి లోని పర్ణశాలకు బోయె నని చెప్పిరి. అంతట శోక క్రోధ పరవశయై యా యువకుని జంపుటకు పర్ణశాలకు బోయి అచట శ్రీ రాముని జూచి గతమును మఱచి కామ పరవశ యయ్యెను. ఇదీ జృంభుని కథ.

ఈ కథ రంగనాథ రామాయణములో విపులముగను భాస్కర రామాయణము పూర్వముద్రణములో సంగ్రహముగను నున్నది.

అకాడమీభాస్కరరామాయణ ముద్రణమున దొలగింప బడినది. ఇప్పుడు మనకు లభ్యమగు వాల్మీకములో నీ కథ లేదు. అధ్యాత్మ రామాయణమున లేదు.

> ''*తథాऽऽసీనస్య రామస్య కథా సంసక్త చేతసః।*
> *తం దేశం రాక్షసీ కాచి దాజగామ యదృచ్ఛయా॥''*
>
> 3-17-5

అని శూర్పణఖ యలవోకగా వచ్చి రాముని జూచె నని మాత్రమే యున్నది.

అధ్యాత్మములో -

> ''*ఏకదా గౌతమీతీరే పంచవట్యా స్సమీపతః।*
> *పద్మ వజ్రాంకుశాంకాని పదాని జగతీపతేః॥*
> *దృష్ట్వా కామ పరీతాత్మా పాదసౌందర్యమోహితా।*
> *పశ్యంతీ సా శనై రాయా ద్రాఘవస్య నివేశనమ్॥''*

జనస్థాన నివాసినియు స్వేచ్ఛాచారిణియు నగు శూర్పణఖ యొకనాడు పంచవటీసమీపమున నున్న గౌతమీతీరమున మహాపురుష లక్షణ లక్షితములగు శ్రీ రాముని పాద చిహ్నములను గాంచి వాని సౌందర్యమునకు వలచి వాని వెంటనే మెల్లగా రామాశ్రమమునకుబోయె నని శూర్పణఖ పంచవటికి వచ్చుటకు కారణము మితముగా హితముగా మూలరామాయణమున కొక వివరణముగా వర్ణింపబడినది.

ఈ జృంభునికథలో పుత్త్ర మరణమున శోక క్రోధ వివశయ్యై వచ్చిన శూర్పణఖ యెంత రాక్షసియ్యై నను శ్రీరాముని చూడగనే మనసులోని సెగపొగలను ఆర్పివైచి కామ పీడిత యయ్యె ననుట విడ్డూరముగాఁదోపక పోదు.

ఈ కథ మహా రాష్ట్ర ప్రసిద్ధమ్మైన యానంద రామాయణమున నున్నదట. ఉండుగాక. దానిని జూచి రంగనాథ రామాయణ కవి గ్రహించె ననుట కన్న జానపద గాథనే సంగ్రహించె ననుట యుచితముగా దోచును.

ఇక నేడు గీఱల కథను పరిశీలింతము. పర్ణశాలలో సీతాదేవి నొంటిగా విడిచి రాముని యొద్దకు బోవు నపుడు లక్ష్మణుడు –

*"పర్ణశాలకుఁ జుట్టు బరు లేడు వ్రాసి*
*వర్ణించి యీబరుల్ వడిఁదాఁటకమ్మ!*
*ఎవ్వరే నీ బరు లిటు దాఁటి వచ్చు*
*నవ్వీరవరు తల లవియు నాక్షణమె".*

అని చెప్పిపోయె నని రంగనాథరామాయణ కల్పనము. ఇది భాస్కర రామాయణములో లేదు. తెలుగు నాట బాలురు తమ యాటలలో నిట్లు గీతలు గీయుదు రనియు ఆ దేశీయాచారమును కవి యిట్లు నిబంధించె ననియు కొందఱు విమర్శకు లందురు. కాని యిది అంతకు ముందే సంస్కృత నాటకములకును నెక్కిన దని ఈ క్రింది మహానాటక శ్లోకము వలన దెలియును.

*"చిరా దృష్టే రామే శ్రవణ కటుభి ర్మైథిలసుతా –*
*వచోభిః కోదండాటనిజనిత రేఖాంతరగతామ్।*
*విధా యైనాం రామస్ఫురిత పద పద్మాంకితభువం*
*తదధ్వానం పశ్యన్ కథమపి చ సామిత్రి రగమత్॥".*

*(మహానాటకము 3. అంకము)*

వింటికొపుతో గీచిన రేఖలనడుమ సీత నుంచి లక్ష్మణుడు పోయెనని యీ యుద్ధారము తెలుపుచున్నది.

కిష్కింధాకాండము – సుందరకాండములలో ఈ రెండు రామాయణములలో నవాల్మీకములగు కథాంశములు లేవు.

యుద్ధకాండము తెలుపగనే రంగనాథ రామాయణములో సేతు నిర్మాణ ఘట్టమున ముచ్చట తీర్చు నుడత వృత్తాంతము కానవచ్చును పరిశీలింతము.

వానరులు సేతు నిర్మాణమున మూడవ నాటి పనికి నారంభించిరి. శ్రీరామచంద్రు డా సంరంభమును సంతోషముతోజూచు చుండెను.

ఆ సమయమున నొక యుడుత –

*"గొబ్బున సేతువు గొన సాగవలయు*
*నిబ్బలియురకుఁదోడేను గావింతు"*

అని తలఁచి –

*"అచ్చపు భక్తితో నట వార్ధి మునిఁగి*
*వచ్చి తా నిసుకలో వడిఁబొరలాడి*
*తడయక జనుదెంచి తనమేని యిసుక*
*వడి గట్టుపై రాల్చి వనధిలో మునిఁగి*
*తేలి గట్టున కేగి తిరుగంగఁబొరలి*
*వాలిన భక్తితో వచ్చి విదుల్చు"* చుండెనట.

శ్రీరామచంద్రుడు దానిని జూచి దాని భక్తికి మెచ్చి లక్ష్మణునకుజూపి ప్రశంసించి సుగ్రీవునిచే దానిని తన యొద్దకుదెప్పించుకొని కేలగొని కలిత దక్షిణకరాగ్రమున దువ్వుటయు, నల యుడుతకు వెన్క మూడు రేఖ లమరె నట; ఇప్పుడును ఉడుత వీపుపై మూడు రేఖలను ముచ్చటగా జూడ వచ్చును. జన శ్రుతి నుండి సంగ్రహించిన యీ చిన్న కథ యాంధ్రదేశమునకు 'ఉడుతకు ఉడుత భక్తి' అను సామెతలో నమృతత్వము నందుకొన్నది.

ఈ కాండములో రంగనాథ రామాయణములో దాదాపు పదునైదు వఱకు చేర్పులున్నవి. వానిలో కొన్ని భాస్కర రామాయణములో లేవు. వానిలో ముఖ్యములగు వానిని పరిశీలింతము.

శ్రీరామచంద్రుడు వానర సైన్యముతోగూడ సముద్రమును దాటి వచ్చి సువేలమున విడిసియుండగా నావార్తను తెలిసి రావణుడు మంత్రులతో కార్యాలోచనమును చేయునపుడు రావణుని మాతామహు డును వృద్ధమంత్రియు నగు మాల్యవంతు డాతనికి హితవు బోధించినట్లును దాని నాతడు తిరస్కరించి నట్లును మాత్రమే మూలమునందు కలదు. కాని అంతకు ముందే మాల్యవంతుని ప్రేరణచే రావణుని తల్లియగు కైకసి రావణునొద్దకు వచ్చి యాతనికి రాముడు విష్ణువునవతార మనియు

వానరులు దేవాంశసంభూతు లని, బ్రహ్మవరములో నున్న కొఱత కారణ ముగా వా రట్లు జన్మించి రనియు, వారిచే చేటు తప్పదు. కావున రామునకు సీత నప్పగించి శరణు చొచ్చు మనియు బోధించినట్లును, దానికి రావణుడు తా నీ విషయమును ముందే సనత్కుమారుని వలన తెలిసి కొంటి ననియు, ఏమైనను తానొక మానవునకు మ్రొక్క ననియు యుద్ధములో విజయమునో వీరమరణమునో వరింతు ననియు చెప్పి యామె హితబోధను తిరస్కరించి నట్లును రంగనాథ రామాయణములో ఎక్కువగా చేర్పబడినది.

ఎందఱో యిట్లు చెప్పగా రావణుడు తిరస్కరించుట వాల్మీకము నకు ప్రసిద్ధమే. దీనిని అధికముగా చేర్చుటవలన రావణుని కుటుంబములో గూడ పలువురకు రామునితత్త్వము తెలియుననియు, రావణుడు తెలిసిన మూర్ఖుడనియు మఱి యొక సారి స్పష్టము చేయుట తప్ప ప్రత్యేక ప్రయోజనము కనుపింపదు.

రామలక్ష్మణులు నాగపాశబద్ధులై యుండగా నారదుడచటికి వచ్చి, రాముని నుతించి, యాతని దివ్యత్వమును గుర్తుచేసి గరుడుని స్మరించి నచో నతడు వచ్చి నాగ పాశ విముక్తి గావించు నని చెప్పగా శ్రీరాముడు అట్లు చేసి పాశ విముక్తి నొందె నని యుభయ రామాయణములయందును కల్పింపబడినది.

మూలమున నీ వృత్తాంతము లేదు. గరుడుడు తనకు దానే వచ్చి నాగ పాశములను విడిపించినట్లున్నది. అధ్యాత్మరామాయణమున కుంభ కర్ణ వధానంతరము నారదుడు వచ్చి రాముని స్తుతించినట్లు కలదు. కాని దానికి ప్రత్యేక ప్రయోజనము లేదు. లాహోరుప్రతిలో ఇరవదియారవ సర్గమున నీ వృత్తాంత మున్నట్లు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు తెలిపి యున్నారు.

తరువాత ముఖ్యముగా పేర్కొన దగినది సులోచనా వృత్తాంతము. సాహసోపేతమగు నీ పరమ పతివ్రతచరిత్రమును హృదయము ద్రవించు

నట్లుగా రంగనాథ రామాయణ కవి సుదీర్ఘముగ వర్ణించియున్నాడు. ఆ కథా సంగ్రహమిది -

సులోచన యింద్రజిత్తుభార్య, ఆది శేషుని కూతురు, పరమపతివ్రత. ఆమె మగని వీరమరణమును విని –

*''నా కింక నుండుట న్యాయంబు గాదు*
*ప్రాకటంబుగఁ బోదు ప్రాణేశుకడకు''.*

అని సహగమనము చేయ నిశ్చయించి మామయగు రావణు నొద్ద కేగి తన నిశ్చయమును దెలిపి తన భర్తశరీరమును దెప్పించి యి మ్మని ప్రార్థింపగా నతడు శత్రుసేనా మధ్యమున నున్న నీ పతి కళేబరమును దెప్పించుటకు నాకు శక్యము గాదని పలికెను. అంతట నామె యాతని యనుమతి నంది స్వయముగా రణరంగమునకు పోయి రాముని ప్రార్థించి తన భర్తకళేబరము నిప్పించుకొని వచ్చి దానితో సహగమనము గావించి దివ్య విమానమున భర్తతో గూడ పుణ్యలోకమున కేగెను.

ఈ కథలో కవి తన కాలము నాటికి సార్వత్రికము గాకున్నను అచట నచట నాచరణలో నుండినదియు, పరమపతివ్రతా ధర్మముగా త్యాగోదాత్త మగు పుణ్యాచారముగా చెల్లుబడి యగు చుండినదియును నగు సహగమనా చారమును, ఆ సాధ్వి బంధుసమ్మతి నంది కృతస్నానయై యలంకరించు కొనుట యాదిగా పతి శరీరముతోబాటు భస్మమగు నంత వఱకును గల కార్యకలాపమును ముత్తైదువలకు చేటల వాయనము లిచ్చుటతోగూడ పొల్లు వోనీకుండ వర్ణించినాడు.

వాల్మీకమున లేని యీ కథ 'ఊర్మిళాదేవినిద్ర' 'లక్ష్మణ దేవర నవ్వు' వంటి జానపద గేయముగా ప్రచారమున నుండగా కవి గ్రహించినాడో లేక సమకాలికాచారమునకు అక్షర రూపమును కల్పించినాడో? భాస్కర రామాయణములో ఈ వృత్తాంతము లేదు.

కాలనేమి కథ మఱి యొక చేర్పు. ఉభయ రామాయణములలోను నున్నది. ఇది యధ్యాత్మ రామాయణము నుండి గ్రహింపబడినది. అందు

యుద్ధకాండము నాఱవ - యేడవ సర్గములలో నీ కథ కలదు. సంగ్రహముగా దానిని తెలిసికొందము.

రావణుడు ప్రయోగించిన శక్తి చే లక్ష్మణుడు మూర్ఛ నొందెను. ఆతని బ్రదికించుటకు దివ్యౌషధులను తెచ్చుటకు రామాజ్ఞచే హనుమంతుడు ప్రయాణమై పోయెను. ఆ యోషధులు సూర్యోదయములోపల నుపయోగింప వలసినది. ఈ సంగతి చారుల వలన తెలిసికొన్న రావణుడు ఆ రాత్రియే మారీచుని కొడుకగు కాలనేమి యొద్దకుబోయి హనుమంతుని కార్యమునకు విఘ్నము చేయ వలసినదిగా ఆజ్ఞాపించెను. లేనిచో చంపుదు ననెను. అంతట కాలనేమి మాయాబలమున హనుమంతుని కంటె ముందు పోయి ఆతని త్రోవలో నొక సరస్సు నొద్ద ఆశ్రమమును కల్పించుకొని ముని వేషమున తపస్సు చేయుచున్నట్లుండెను.

హనుమంతున కా త్రోవను బోవుట కిది రెండవ సారి. పూర్వము కనుపడని యాశ్రమము అప్పుడు కనుపడగా చూచి హనుమంతుడు త్రోవ తప్పితి నేమో యిచటి మునీంద్రు నడిగి తెలిసికొందు నని క్రిందికి దిగి అతనిని సమీపించి నమస్కరించి తన కార్యమును తెలిపెను. ఆ కపటముని ధ్యానము నటించి లక్ష్మణుడు మూర్ఛ తేరి సుఖముగా నున్నాడనియు తన కమండ లూదకముచే దప్పి దీర్చికొని యాతిథ్యము నంది విశ్రమించి పొమ్మనియు చెప్పెను. హనుమంతుడు కమండలువు నీటితో తన దప్పి తీఱదనియు జలాశయ మున్న జూపుడనియు గోరగా నొక శిష్యుని బంపి కొలనును జూపించెను.

హనుమంతుడా కొలనిలో దిగిన వెంటనే ఒక మొసలి యాతని బట్టి మ్రింగజొచ్చెను. అతడు దానిని జంపి వెలువడగా నది ధాన్యమాలిని యను గంధర్వకాంతయై తన శాపకారణమును మోక్షమును తెలిపి కాలనేమి కపటమును వెల్లడించిపోయెను.

హనుమంతుడు తిరిగి యాశ్రమమునకు వచ్చి కాలనేమి నొక పిడికిటి పోటుతో జంపి ప్రయాణము సాగించి దివ్యౌషధులను సకాలమున కొని వచ్చి లక్ష్మణుని బ్రదికించెను.

*"విసృజ్య మునివేషం స కాలనేమి ర్మహాసురః*

*యుయుధే వాయుపుత్రేణ నానామాయా విధానతః॥"*

అను అధ్యాత్మరామాయణ మూలము నాధారము చేసికొని రంగనాథ రామాయణములో ఈ యుద్ధము సుదీర్ఘముగ వర్ణింపబడినది. భాస్కర రామాయణము లోను ఈ కథ దాదాపు వందపద్యములలో వర్ణింప బడినది. ధాన్యమాలినిశాపవృత్తాంతమే నలువది పద్యములదాక వ్రాకినది.

దీనిచే రావణుని చారదృష్టియు నీతి చాతుర్యమును దెలియును. కాని యీ కథ నింత దీర్ఘముగా సాగించుటలో ఈ రచయితలో సంయమనము లోపించె నేమో యనిపించును.

తరువాతి కథలో నీ యిరువురు కవులును చేర్చిన ముఖ్యాంశము రావణుడు విజయార్థియై శుక్రు డుపదేశించిన మార్గమున పాతాళహోమము చేయుటయు విభీషణోద్బోధితుడగు రాముని యాజ్ఞచే వానరులు దానిని ధ్వంసము చేయుటయు ననునది. దీనికిని అధ్యాత్మరామాయణమే మూలము. అందు పదవ సర్గమున (యుద్ధకాండము) ఈ కథ కలదు. కథాసంగ్రహ మిది :-

ఇంద్రజిత్తుసైతము రణరంగమునగూలిన తరువాత దిక్కుదోపక దుఃఖార్తుడై రావణుడు గురువగు శుక్రాచార్యునికడ కేగి తన దుర్దశను తెలిపి విజయోపాయమును ప్రసాదింపు మని ప్రార్థింపగా శుక్రుడు –

*"హోమం కురు ప్రయత్నేన రహసి త్వం దశానన।*

*యది విఘ్నో న చేద్ధోమ స్తర్హి హోమానలోత్థితాః॥*

*మహాన్ రథశ్చ వాహాశ్చ చాపతూణీర సాయకాః।*

*సంభవిష్యతి తై ర్యుక్త స్త్వజేయో భవితా... పరైః।*

*గృహాణ మంత్రాన్ మద్దత్తాన్ గచ్ఛ హోమం కురు ద్రాతమ్॥"*

అని యాదేశించును.

అంతట రావణుడు పురమునకు కాపు పెట్టి వలసిన సంభారము లను జేర్చికొని రహస్యముగా అంతఃపురములో నిర్మించి కొన్న గుహలో హోమము చేయ నారంభించును. గుహ నుండి పైకి లేచిన హోమ ధూమ మును గమనించి దానిని రామునకు జూపి "విభీషణుడు రావణుడు అభిచార హోమము చేయుచున్నా డనియు, అది సంపూర్ణమైనచో అతనిని జయించుట సాధ్యము కాదనియు, కావున వెంటనే హోమ విఘ్నమును చేయుటకు వానరులను పంపు "మనియు" జెప్పెను.

అంతట హనుమంతుడును అంగదుడు నాదిగా వానర యోధులు పలువురు లంకలో ప్రవేశించి యంతఃపురము సొచ్చి గుహలో దూరి యజ్ఞోపకరణములను ధ్వంసము చేయసాగిరి; కాని రావణుడు చలింప లేదు. దానిని జూచి యంగదుడు అంతఃపురము ప్రవేశించి మండోదరిని రావణు నెదుటికి నీడ్చికొని తెచ్చి యవమానింపగా నామె యేడ్చుచు -

*"నిర్లజ్జోఽసి పరై రేవం కేశపాశే వికృష్యతే।*
*భార్యా తవైవ, కిం జుహోషి? న లజ్జసే?*
*హన్యతే పశ్యతో యస్య భార్యా దృప్తైశ్చ శత్రుభిః।*
*మర్తవ్యం తేన తత్రైవ జీవితాన్మరణం వరమ్॥"*

సిగ్గులేని వాడి వైతివి నీ భార్య యితరుల చేత నిట్లు కేశపాశము పట్టి యీడ్వబడు చున్నది. హోమము చేయుచున్నా వేల? సిగ్గు లేదా? ఎవ్వని భార్య గర్వితులైన శత్రువుల చేత అతడు చూచుచుండగనే బాధింప బడుచున్నదో, అతడు అచటనే ప్రాణమును విడువవలెను. జీవించుట కంటె మరణమే మేలు. అని యాక్రోశించెను. దానిని విని రావణుడు క్రోధమూర్తియై చేతనున్న యాహుతిని పాఱవైచి ఖడ్గము గొని అంగదునిపై తలపడెను. ఇట్లు వచ్చిన పని దీఱగా వానరు లందఱును వెను దిరిగి రాముని కడ కేగిరి రావణుడును -

*"దైవాధీన మిదం భద్రే! జీవితం కిం న దృశ్యతే?।*

*త్యజ శోకం విశాలాక్షి జ్ఞాన మాలంబ్య నిశ్చితమ్॥"*

కల్యాణీ, ఈ జీవిత మంతయు దైవాధీనము, అది కన్పించుట లేదా? ఓ విశాలాక్షీ, నిశ్చితమ్మైన జ్ఞానమును ఊతగా గొని, దుఃఖమును విడువుము. అని దేవేరిని ఓదార్చి -

*"ఇదానీ మేవ గచ్ఛామి హత్వా రామం సలక్ష్మణమ్।*

*ఆగమిష్యామి నో చే న్మాం దారయిష్యతి సాయకైః।*

*శ్రీ రామో వజ్రకల్పైశ్చ తతో గచ్ఛామి తత్పదమ్॥*

ఇప్పుడే పోవుదును, లక్ష్మణునితో బాటు రావణుని వధించి వత్తును. అట్లు చేయనేని, ఆ శ్రీరాముడు వజ్రముతో సమాన సారములను బాణములతో నన్ను చీల్చివేయగలడు కావున వెంటనే యటకు పోవు చున్నాను. అని తన నిశ్చయమును దెలిపి మరల యుద్ధమునకు సన్నద్ధుడై పోయెను.

ఈ కథ యించుమించు యథాతథముగా రెండు రామాయణము లలోను గ్రహింపబడినది.

*"వనభూమిన్ మనువంశ రాజ తిలకున్ వంచించి యజ్ఞానకిన్*

*గొని యే తెంచుట యెంత శౌర్య మని నీకుం దెల్పు చందంబునన్*

*నను నీ దైత్యులు సూచుచుండఁగ ననూనస్ఫూర్తితోఁ బట్టి తె -*

*చ్చెను నీ యొద్దకు నీ వనాటుఁడు భుజస్థేమావ లేపంబునన్"*

భాస్కర రామాయణమున మండోదరి విలాపములోని యీ పద్యములో కర్మ సిద్ధాంతము తొంగి చూచుచున్నది.

ఇంకొక్క విషయము తుదిగా పేర్కొన వలసిన మార్పును చేర్పును నుభయ రామాయణములలో రావణవధఘట్టమున కానవచ్చును. రామబాణచ్ఛిన్నము లగు రావణుని శిరములు మరల మరల మొలుచు

చుండగా చింతాకులు డైయున్న రాముని జూచి సారథి గానున్న మాతలి రావణుని జంపుటకై బ్రహాస్త్రమును ప్రయోగింపు మని గుర్తు చేయగా రాముడట్లు చేసి రావణుని వధించె నని వాల్మీకమున గలదు.

> *"అథ సంస్మారయామాస రాఘవం మాతలి స్తదా। -*
> *అజానన్నివ కిం వీర త్వ మేన మనువర్తసే॥ -*
> *విసృజాస్మై వధాయ త్వ మస్త్రం పైతా మహం ప్రభో!*
> *వినాశకాలః కథితో యస్సురై స్సో౽ద్య వర్తతే॥"*
> *(అ.యు.111స. శ్లో.1,2)*

అటు పిమ్మట, మాతలి యప్పుడు రామునకు జ్ఞాపక పఱచెను. బ్రహ్మాస్త్రము నెఱుగని వాని వలె, ఓ వీరుడా! నీ వేల యనువర్తింతువు (అస్త్రమునకు ప్రత్యస్త్రము మాత్రమే వేయుచు కాలము పుచ్చెదువు). ప్రభో! అతనిని సంహరించుటకై బ్రహ్మాస్త్రము ప్రయోగించుము. మునుపు దేవతలు చెప్పిన ఆ వినాశకాలము ఇప్పుడు దాపురమైనది.) కాని యీ రామాయణ ములలో "చింతాకులుడగు రాముని జూచి విభీషణుడు" బ్రహ్మావరముచే నీతని నాభిస్థానమున నమృత మున్నది. అది పోవు దాక నీతడు చావడు. తలలును చేతులును ఎన్నిమాఱులు తెగవ్రేసినను మరల మొలుచుచునే యుండును. కావున ఆగ్నేయాస్త్రమును ప్రయోగించి ఆ యమృతము నింకింపుము. తరువాత నూట తొమ్మిది మాఱులు నఱకు నంత వఱకు శిరోబాహువులు మొలుచుచునే యుండును. నూటపదవసారి తెగినచో మఱి మొలవవు". అని మర్మమును తెలుపగా రాము డట్లుచేసె "ననియు తరువాత నొంటి తలతోను రెండు చేతుల తోను పోరునపుడు మాతలి బోధనచే రాముడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రావణుని జంపె ననియు తెలుపబడినది. ఈ విశేషాంశము అధ్యాత్మ రామాయణము నుండీ గ్రహింపబడినది.

> *"ఇతి చింతాపరే రామే సమీపస్థో విభీషణః,*
> *ఉవాచ రాఘవం వాక్యం బ్రహ్మదత్తవరో హ్యసౌ.*
> *విచ్ఛిన్నా బాహవో౽ ప్యస్య విచ్ఛిన్నాని శిరాంసి చ,*

*ఉత్పత్స్యంతి పున శ్శీఘ్ర మిత్యాహ భగవా నజః.*
*నాభిదేశే౽మృతం తస్య కుండలాకారసంస్థితమ్,*
*త చ్ఛోష యాన లాస్త్రేణ తస్య మృత్యు స్తతో భవేత్.*
*(అధ్యాత్మ - యుద్ధ - 11స.)*

ఇటుల రాముడు చింతాపరుడై యుండగ సమీపమున నున్న విభీషణుడు రామునితో ఈ మాటలు పలికెను. ఇతడు బ్రహ్మయొసగిన వరముల పొందినవాడు. ఇతని బాహువులను గాని, శిరస్సును గాని ఛేదించినను మరల వెంటనే మొలచును. అని బ్రహ్మదేవుడు చెప్పినాడు. అతని నాభిదేశమున కుండలాకారమున నున్నయమృతము కలదు. ఆగ్నేయాస్త్రముచే దానిని శోషింపజేయుము. అంతట అతనికి మృత్యువు సంభవించును. విభీషణుని హెచ్చరిక ననుసరించి రాముడట్లే చేయగా రావణుడు తుదికి ఒక తలతో రెండు భుజములతో నిలిచెను. పిమ్మట మాతలిబోధము ననుసరించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించి శ్రీ రామచంద్రుడు రావణుని సంహరించెను. ఈ యధ్యాత్మ రామాయణ కథను ఉభయ రామాయణములును యథాతథముగా గ్రహించినవి.

ఇట్లు ప్రధానములగు కథాంశములను వాల్మీకములో లేనివానిని, వాల్మీకమునకు విరుద్ధములు కాని వానిని పెక్కింటిని చేర్చుకొనియు వర్ణనములలో, సంభాషణములలో స్వాతంత్ర్యము నవలంబించియు ఈ రామాయణ కర్తలు తమగ్రంథములకు మౌళికతను సాధించి కృతార్థులైనారు.

మఱి యొక్క విషయమును మనవి చేయుదును. వాల్మీకి రామాయణములో అరణిలోని యగ్నివలె నిగూఢమైయున్న రాముని భగవత్తత్త్వము ఈ రామాయణములలో అడుగడుగునను ప్రకటీకృతమైనది. అందువలనను నివి పల్లె పల్లెను రామాయణములను నెల్పకొల్పుకొను నాంధ్రజాతి యభిమానమును జూఱగొన్నవి.

---

# 3. ఆదికావ్యావిర్భావము

పోలూరి హనుమజ్జానకీ రామశర్మ

ప్రజల జీవితము ఒకమహాసముద్రమువంటిది. అప్పుడప్పుడు ధర్మాధర్మపక్షములు ప్రబలి ఒక మహాపురుషుని జీవితమును కవ్వమునుగా చేసి ఆ సముద్రమును మథించును. అప్పుడు కాలకూటమువలె మొదట జనవినాశరూపమైన సంగ్రామము సంభవించును. పిదప అమృతము కుంభమువలె ఆ మహాపురుషుని చరిత్ర నవలంబించి మహాకావ్యము ఉదయించును. త్రేతాద్వాపర సంధిలో భార్గవరాముడు క్షత్రియవంశము లను నిర్మూలించెను. రావణుని నాయకత్వమున రాక్షసులు ప్రబలి ప్రజలజీవిత మును కల్లోలితము గావింపజొచ్చిరి. శ్రీరాముడు ధర్మరక్షణము గావింప బూని అధర్మమును ప్రతిఘటించెను. ఆ ప్రతిఘటనము రామ రావణ సంగ్రామముగా పరిణమించెను. ఆ పరిణామవశముననే విజయోత్సవములతో వియోగవిలాపములతో శ్రీరాముని యొక్క జీవితము కూడ రూపొందెను. అదియే వాల్మీకి వాక్కులలో అమృతప్రవాహమువలె మహాకావ్యముగా ఆవిర్భవించినది.

ఈ కావ్యావిర్భావమునకు సీతారాములచరిత్రతో వాల్మీకిజీవిత ముతో అవినాభావ సంబంధమున్నది. ఈ మాట అన్నంతనే నేటి విద్యావంతు లకు అనేకులకు పెక్కు సందేహములు కలుగును. రామాయణ కథ నిజ ముగా చరిత్రయేనా? వాల్మీకి ఆ కథను కల్పించి యుండవచ్చును కదా! ఇట్టి సందేహములను గూర్చి చక్కగా ఆలోచించి వివేకానందు డొసంగిన సమాధానములను మాత్రము మనము ఈ సందర్భమున గ్రహించిన చాలును. మన కట్టి చరిత్రయే లేదని నీవు చెప్పుదు వని నాకు తెలియును. నీవలె ఆలోచించు వారికది కన్పింపదు. విద్వాంసులకును అది కన్పింపదు. పాశ్చాత్య దేశములలో అత్యంతవేగము బర్యటించి వారి వేషభాషలతో తిరిగి వచ్చి, మనకేమున్నది? మనము అనాగరకులము అని నొక్కి వక్కాణించు వారును అట్లే తలంతురు. నిజమే, యితరదేశముల కున్న చరిత్రవంటిది

మనకు లేకపోవచ్చును. మనము బియ్యమును వండికొని తినుచున్నాము. ఆంగ్లేయులు అట్టి యన్నమును తినుటలేదు. కావున వారందరును వస్తులతో నశించుచున్నా రని చెప్పగలవా? తమదేశమున నేది లభించు చున్నదో యేదివారికి తగియుండునో అట్టియాహారముతో వారు చక్కగానే జీవించుచున్నారు. అట్లే మనకు ఎట్టి చరిత్ర యుండవలయునో అట్టి చరిత్రయే యున్నది. నీవు కనులు మూసికొని, అయ్యో! మనకు చరిత్ర లేదే అని అంగలార్చుచున్నంతమాత్రమున ఉన్న చరిత్ర నశించిపోదు. మనకు మహోజ్జ్వలమైన చరిత్ర యున్నదని, దాని బలముననే యీజాతి యింకను బ్రతికియున్న దనియు కనులు కలవా రందఱును గాంచుచునే యున్నారు......(17-34,పి.281,పార్ట్ 5 వర్క్స్).

ఆర్యులు ఎక్కడనుండియో వచ్చి ద్రావిడులను తఱిమి ఈ దేశమును ఆక్రమించుట రామాయణమునకు సారాంశమను వారిని గూర్చియు వివేకానందు డిట్లనెను. ఆర్యులెక్కడినుండియో ఆకస్మికముగా వచ్చి ఈ దేశముపైబడి యిచ్చటి యాదిమవాసుల భూములను ఆక్రమించి, వారిని నిర్మూలించి యిచ్చట స్థిరపడిరని య్యైరోపా పండితులు చెప్పున దంతయు బుద్ధిహీనప్రసంగము, మూర్ఖవాదము. మన భారతీయపండితు లును ఆ ప్రసంగములకు తథాస్తని పలుకుచుండుట ఆశ్చర్యకరము. మఱియు భయంకరములైన యీ యసత్యము లన్నిటిని మన బాలురకు బోధించుచున్నారు. ఇది నిజముగా అత్యంత దుస్థితి.......

పరదేశమునుండి ఆర్యులు హిందూదేశమునకు వచ్చిరని వేదమున నేసూక్తమునందు మీరు చూచితిరి? అనాగరకులైన యాదిమవాసులను వారు సంహరించిరని మీరు దేని వలన చెప్పుచున్నారు? ఇట్టి యనర్థక ప్రసంగముల వలన మీ కేమి లాభము? రామాయణమును గూర్చి పెద్దకథ నల్లుట యెందులకు? మీ రామాయణపఠనము వ్యర్థము.

చెప్పుము. రామాయణమున నేమిగలదు? అనాగరకులైన యాదిమవాసులను జయించి యార్యులు దక్షిణాపథము నాక్రమించుట

యేనా? రామచంద్రుడు నాగరకుడైన యార్యరాజనుట నిజమే. కాని యతడెవరితో పోరాడినది. లంకాధిపతి యగు రావణునితో గదా! ఒక్కసారి రామాయణము చదువుము; రామునికన్న రావణుడే నాగరుకుడని తెలిసికొందువు. అయోధ్యలో కన్న లంకయందే గొప్పనాగరికత కలదు. మఱి యీ వానరులు ఇతరదాక్షిణాత్యులు ఎప్పుడు జయింపబడిరి. వారందరు రామచంద్రుని మిత్రులు సహాయులేకదా! ఏ వాలియొక్క ఏగుహునియొక్క రాజ్యములను రామచంద్రుడు తనరాజ్యమున కలుపుకొనెనో తెలుపుడు.

(ఎల్.ఎస్.15-21,పి.436, ఎల్.ఎస్. 7-24,పి, 437, వాల్యూం. 5 వర్క్స్)

ఈనాడు మనకు అభూతకల్పనలుగా మన ప్రాచీన గ్రంథములలో కన్పించు సంఘటనలన్నియు యథార్థములే అని ఆయన ఎంత దృఢముగా ఉద్ఘాటించుచున్నాఁడో గమనింపుడు. "ప్రాచీనకాలమున యుద్ధములలోని యస్త్రముల శక్తులన్నియు మంత్రాత్మకములు, మనశాస్త్రములయందెల్లెడల నివి యంగీకరింపబడి యున్నవి. ఆ శాస్త్రములన్నియు భావనామాత్రము లనుట మూఢత్వమే".

"మీకు జీవితమున మార్గదర్శకముగా నొక విషయమును చెప్పెదను. నమ్మకుండుటకు తగినహేతువులు కన్పించువరకును భారత దేశమునుండి వచ్చు విషయములన్నియు సత్యములని, నమ్ముటకుదగిన హేతువులు లభించువరకును ఐరోపాఖండమునుండి వచ్చునట్టి వన్నియు అసత్యము లని గ్రహింపుడు".

(ఎల్.ఎస్ 1-4,18-23, పి.89, పార్ట్ 6, వర్క్స్)

కావున వాల్మీకిమహర్షి రామాయణమున చెప్పిన దంతయు చరిత్ర యనియే భావింపవలసి యున్నది. ఈ దృష్టితో పరిశీలించినపుడు కౌసల్యవలన రాముడెట్లుదయించెనో అట్లే వాల్మీకినుండి అనివార్యమైన సంఘటనమువలన రామాయణ ము దయించెనని స్పష్టమగును. పట్టాభి

షేక మైన కొంతకాలమునకు రాముడు జనాపవాదమునకు వెరచి సీతను పరిత్యజించుట సుప్రసిద్ధము. లక్ష్మణుడు సీతను వాల్మీకియాశ్రమ ప్రాంతమున వదలి పెట్టి వెళ్లెను. మునిబాలకులు వచ్చి ఎవరో ఒక స్త్రీ విలపించుచున్న దని మహర్షికి చెప్పిరి. ఆయన తపోలబ్ధమైన దృష్టితో ఆమె సీత యని గుర్తించి వెంటనే ఆమె యొద్దకు పోయి, "తపోలబ్ధియైనదృష్టితో నీవు పాపరహిత వని తెలిసికొన్నాను. నీవు ఇచ్చట ఎట్టిసంకోచము లేకుండ విశ్వాసముతో నుండుము. నీవు ఇప్పుడు నారక్షణములో నున్నావు".

*శ్లో: "అపాపాం వేద్మి సీతే త్వాం తపోలబ్ధేన చక్షుషా!*
*విస్రబ్ధా భవ వైదేహి సాంప్రతం మయివర్తసే".*

*(ఉత్తర – సర్గ.49,శ్లో.10)*

ఈవమాటలవలన సీతాదేవియొక్క యోగక్షేమముల భార మంతయు తనపై నున్నట్లు ఆయన స్పష్టమొనరించెను. వాల్మీకికి సీతారాముల జీవితవిశేషములు క్రొత్తవికావు. సీతారాములు మొదట వనవాసమునకు బయలుదేరి వచ్చినపుడు చిత్రకూటము చెంత వారికి స్వాగత మొసగిన వాడు వాల్మీకియే.

*శ్లో: అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్!*
*శ్లో: తాన్ మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్!*
*ఆస్యతా మితి చోవాచ స్వాగతం తం నివేద్య చ!*

*(అయోధ్య – స్సర్గ.56, శ్లో.16,17)*

వారు అచ్చట ఆశ్రమము నిర్మించుకొని ఆయన చెంత కొంతకాల ముండిరి. భరతుడు వచ్చుట, రాముడు రాజ్యము నిరాకరించి అతనికి పాదుకల నొసంగుట మొదలగుసన్నివేశముల నన్నిటిని ఆయన చూచుచునే యుండును. తరువాత జరిగిన రావణసంహారాది వృత్తాంతములను కూడ ఆయన వినుచునే యుండెను. కావున సీతారాములు పరమధార్మికులైన యుత్తమదంపతు లనుటలో ఆయనకు ఎట్టి సంశయమును లేదు. అదియును గాక లక్ష్మణుడు సీతతో చెప్పినట్లుగా వాల్మీకి దశరథునకు ప్రియమిత్రుడు.

*శ్లో: రాజ్ఞోదశరథస్యైవ పితుర్మే మునిపుంగవః!*
*సఖా పరమకో విప్రో వాల్మీకి స్సుమహాయశాః*
*(ఉత్తర.సర్గ-47,శ్లో.16-17)*

ప్రజారంజనము రాజునకు ముఖ్యధర్మము. ప్రజలు సీత యొక్క శీలమును శంకించుచున్నారు. ఆమెను అంతః పురమునందే ఉంచినచో వారు "రాజునకే అక్కరలేని ధర్మము మనకేల" అని విశృంఖలవృత్తి నొందుదురు. అందువలన రాముడు సీతను పరిత్యజింపవలసివచ్చెను. కాని ఆమెయందు ఎట్టిదోషము లేదని రామునకు తెలియును. అందువలన ఆయన ఆమెను వాల్మీకి యాశ్రమము చెంత వదలిపెట్టి రమ్మని లక్ష్మణునకు ఆజ్ఞాపించెను. వాల్మీకి దశరథునకు మిత్రుఁడు. తన తండ్రివలనే వాల్మీకి మహర్షియు సీతను ఆదరించి ఆమెకు ఆశ్రయమిచ్చునని రాముఁడు ఆసించెను. మిత్రునికుటుంబము ఆపదయందున్నప్పుడు ఆదుకొని రక్షించుట ఎవనికైనను కర్తవ్యమే. సీతను చూచినంతనే మహర్షియు దైవికముగా ఆమెను రక్షించవలసిన బాధ్యత తనకు ఏర్పడిన దని గ్రహించి ఆమెకు ఆశ్రయము నొసంగెను. ఇది సామాన్యమైన బాధ్యత కాదు. భర్తకు దూరమై పుట్టినింటికి, జేరిన పుత్రికను చూచునప్పుడు తండ్రికి కలుగు ఆవేదన వంటి పరితాపమే ఆయనకు ఆరంభమైనది.

ఆమెను మరల శ్రీరామునొద్దకు నెట్లు చేర్చుటకు వీలగునా అను చింత ఆయనకు ప్రబలమయ్యెను. వారి వియోగమునకు కారణమైన జనాపవాదమును ఎట్లు తొలగించుటకు వీలగునో ఆయనకు తోచుటలేదు. ఇది యిట్లుండగా కుశలవులు జన్మించిరి. సమస్య ఇంకా జటిలమయ్యెను. ఇప్పుడు సీతాదేవి విషయము మాత్రమే కాక ఆయన కుశలవుల భవిష్యత్తునుగూర్చి కూడా ఆలోచింపవలసి వచ్చెను. ఆమె శీలమునే శంకించుచున్నజనులు ఆశ్రమమునందు అజ్ఞాతముగా జన్మించిన యామెబిడ్డలను రాముని పుత్రులనుగా రాజ్యార్హులనుగా అంగీకరింతురా అన్నది పెద్ద సమస్య. ఇంతలో వారికి ఉపనయనము చేయదగిన వయస్సు వచ్చెను. గర్భవాసములోని తొమ్మిది నెలలతో కూడ లెక్కించి పదునొకండవ

యేట క్షత్రియబాలురకు ఉపనయనము కావింపవలె. అందులకు క్షత్రియు లకు గ్రీష్మఋతువు శ్రేష్ఠము, కావున కుశలవులకు జన్మాదిగా పదియవ సంవత్సరమున జ్యేష్ఠమాసమున మహర్షియే ఉపనయనము కావించెను.

అయోధ్యలో రాజభవనములో మహోత్సవములో జరుగవలసిన యుపనయనము నిరాడంబరముగ ఆశ్రమములో జరుగు చున్నప్పుడు సీతాదేవి ఎంత దుఃఖించి యుండునో ఊహింపవలసినదే. ఆమెదుఃఖమును చూచి చుట్టును ఉన్న తాపసపత్నులు మునులును ఎంతో కలతచెంది యుందురు. సహజముగా దయామయుడైన వాల్మీకి మహర్షియు ఎంతో పరితపించి యుండును. "ఇట్లు కాలము జరిగినను రాముడీవిషయమును పట్టించుకొనలేదు కదా! ఇట్లు భార్యను పుత్రులను ఉపేక్షించియూరకుండుట ధర్మరక్షకుడైన ప్రభువునకు తగునా? ఈ రాజ్యమున ధార్మికులైన పెద్దలే లేరా? వసిష్ఠాది మహర్షులలో ఒక్కరైనను సీత ఏమైనదని రాముని అడుగలేకున్నారా? ఒకరు అడుగుట యేమి? రాముని ధార్మికత్వ మేమై నది?". ఇట్టి ప్రశ్నలతో వాల్మీకి పరితపించుచుండగా ఒకనాడు నారదమహర్షి ఆయన యెద్దకు వచ్చెను. అప్పుడు సంక్షుభితమైన యంత రంగముతో వాల్మీకి నారదుని ఇట్లు ప్రశ్నించెను. "ఇప్పుడీలోకమున గుణవంతుడెవడు? వీర్యవంతుడెవడు? ధర్మజ్ఞుడు కృతజ్ఞుడు సత్యవాక్య పరిపాలకుడు దృఢవ్రతు డైన వాడెవడు? ఎవడు గొప్పచరిత్ర కలవాడు? ఎవడు సర్వభూత హితుడు?".

రామాయణకావ్యము ఈ ప్రశ్నలతో ఆరంభమగుటయే విచిత్రము. వాల్మీకి మహర్షి ఆత్మ, జగత్తు, ఈశ్వరుఁడు మొదలగువానియొక్క తత్త్వమునుగూర్చి ప్రశ్నింపక, ఇప్పుడు ఈ లోకమున గుణవంతుడెవడు? అని ప్రశ్నించుట గమనింపదగియున్నది. పతివ్రతయైన భార్యను బిడ్డలను ఉపేక్షించుచున్న రాముడు పరమధార్మికుడేనా అను ఆవేశము ఈ ప్రశ్నకు మూలముగా కన్పించుచున్నది. నారదుఁడు వాల్మీకియొక్క సంశయమును పూర్తిగా నిరాకరించుచు రామునికన్న గుణవంతుడు ధార్మికుడు మఱి

యొకడు లేడని దృఢముగా చెప్పి రాముని చరిత్రలోని ముఖ్యాంశము లను సంగ్రహముగా తెలిపి వెడలిపోయెను.

వాల్మీకికి రాముని విషయము క్రొత్తకాదు. కాని, నారదమహర్షి చెప్పిన తరువాత, భార్యాపుత్రుల విషయమున రాముడు కూడా ఏమియు చేయలేని దయనీయస్థితిలో ఉన్నాడు. అంతమాత్రమున అతని ధార్మికత్వ మును శంకింప నక్కరలేదు అని వాల్మీకికి నిశ్చయమేర్పడినది. అయినను సీతయొక్క కుశలవులయొక్క భవిష్యత్తును గూర్చిన సమస్యకు ఆయనకు ఏమియు సమాధానము లభింపలేదు. వారిని గూర్చి ఆలోచించుచునే భరద్వాజుడను శిష్యునితో మాధ్యాహ్నికస్నానమునకై ఆయన తమసా నదీతీరమునకు పోయెను. అచ్చటిజలమును చూచి ఆయన ఇట్లనెను. "భరద్వాజా, నిర్మలమైన యీ తీర్థమును చూడుము. ప్రసన్నమైన జలముతో మంచివాని మనస్సు వలె రమణీయముగ నున్నది".

*శ్లో. అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ!*
*రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా.*
*(బాల.సర్గ. 2. శ్లో.5)*

అకర్దమ మనగా బురదలేనిది. ప్రత్యక్షముగా కన్పించుచున్న జలమును ఆయన కంటికి కన్పించుటకే వీలుకాని మంచివాని మనస్సుతో పోల్చుచున్నాడు. సీతాదేవిని గూర్చి శంకించుచున్న మనుష్యులయొక్క మనస్సులు బురదనీటివలెనున్నవి. ఈ జలమువలె ప్రసన్నమైన మనస్సు కలవారు అరుదుగదా అనుభావము ఇందు స్ఫురించుచున్నది.

ఆ సమయమునకే బోయవాడొకడు జంటగానున్న క్రౌంచములలో మగపక్షిని సంహరించెను. క్రింద బడిన భర్తను చూచి ఆడుపక్షి విలపింప జొచ్చెను. ఆ దృశ్యమును చూచుచు ఆపక్షియొక్క శోకారవమును వినుచున్న వాల్మీకి యొక్క హృదయము కారుణ్యముతో ద్రవించెను. ఆ హింసకు కారకుడైన బోయవాడు కన్పించినంతనే కరుణాత్మకమైన యాచిత్తవృత్తి కోపముగా పరిణమించెను. కోపవేగమున ఆయన వానిని ఇట్లు తిట్టెను.

*శ్లో. మానిషాద ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీ స్సమాః।*
*యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్॥*

*(బాల. సర్గ.2, శ్లో.15)*

శ్లోకరూపమున ఈ వాక్యము వెలువడినంతనే "నే నేమి యిట్లు పలికితిని అని వాల్మీకికే వింతగా తోచెను. ఆయన దానిని గూర్చి ఆలోచించి శిష్యునితో ఇట్లనెను. పాదములు కలిగి ప్రతిపాదమునందును అక్షరముల సంఖ్యసమానమ్మై తంత్రీలయ సమన్వితమ్మై శోకార్తుడ నైన నానుండి వెలువడిన యిది శ్లోకమే యగును; వేఱుకాదు."

*శ్లో. పాదబద్ధో౽క్షరసమస్తంత్రీలయ సమన్వితః।*
*శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా॥*

*(బాల. సర్గ.2, శ్లో.18)*

వేదములలో ఛందస్సులు ప్రసిద్ధములే. వానికి "ఛందస్సులు". అనుపేరు కూడ కలదు. అందువలన నిత్యము వేదమును పఠించుచు శిష్యులచే పఠింపఁజేయుచున్న వాల్మీకిఛందోబద్ధమైనవాక్యము క్రొత్త విషయము కాదు. కాని వేదములకు భిన్నముగా లౌకికవిషయము నందు ఒక వ్యక్తినుండి శ్లోకము వెలువడుట కొత్త విషయమే. కావుననే భరద్వాజు నకు తరువాత ఆశ్రమవాసులకు అందరుకును ఈ శ్లోకావిర్భావము విస్మయ మునే కలిగించెను.

ఆశ్రమమునకు తిరిగివచ్చిన తరువాత కూడ వాల్మీకి ఆవృత్తాంతమును గూర్చియే ఆలోచించుచుండెను. అప్పుడు లోకపితామహుడైన బ్రహ్మదేవుడు సాక్షాత్కరించెను. వాల్మీకి ఆయనకు అర్ఘ్యపాద్యముల నొసంగి అర్చించెను. బ్రహ్మదేవుడు ప్రసన్నుడై ఎదుటకూర్చుండి యుండగా వాల్మీకి ఆయనతో ప్రసంగింపక క్రౌంచముల వృత్తాంతమునే స్మరించుచు తాను పలికిన శ్లోకమునే తలంపజొచ్చెను. అది గమనించి బ్రహ్మదేవుడు నవ్వుచు ఇట్లనెను. "నీవు రచించినది శ్లోకమే. ఇందు ఆలోచింపవలసినది ఏమియు లేదు. నాసంకల్పమువలననే నీయందు ఇట్లు సరస్వతి ఆవిర్భవించినది.

ధర్మాత్ముడు భగవంతుడు నైన రాముని చరిత్రను సమగ్రముగా కావ్యముగ రచింపుము. నీకు ఇప్పటికి తెలియని దంతయు స్పష్టముగ గోచరము కాగలదు. కావ్యమున నీవచన మేదియును అన్నృతము కాదు''.

ఇట్లు వాల్మీకి చతుర్ముఖుడు వెడలిపోయిన తరువాత వాల్మీకి నారదుడు చెప్పిన దానిని అనుసరించి శ్రీరాముని చరిత్రను స్మరించుచు తననుండి ఆవిర్భవించిన శ్లోకము వంటి శ్లోకములతో దానిని కావ్యమును రచింపవలెనని నిశ్చయించుకొనెను. పిమ్మట ఆయన శుచియై ప్రాచీనాగ్రము లైన దర్భలయందు కూర్చుండి ప్రాంజలియై బ్రహ్మప్రసాదరూపమ్మైన బుద్ధ్యతిశయము సాధనముగా సీతారాముల చరిత్రమును గూర్చి ఆలోచింప మొదలిడెను. అట్టియోగస్థితియందు ఆయనకు వారి చరిత్ర అంతయు కరతలామలక మయ్యెను. దాని నంతను ఆయన ఏడు కాండము లుగ అయిదు వందల సర్గములతో ఇరువది నాలుగువేల శ్లోకముల గ్రంథమును రచించెను.

ఈ సందర్భమున చతుర్థసర్గారంభమున నొక శ్లోకము కలదు. "రాజ్యమును పొందిన రాముని యొక్క చరిత్రను సమగ్రముగా రమణీయ ములైన పదములతో మహార్థయుక్తముగ భగవంతుడైన వాల్మీకి మహర్షి రచించెను''.

*శ్లో. ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవా నృషిః।*
*చకార చరితం కృత్స్నం విచిత్రపద మర్థవత్॥*

*(బాల-వర్గ.4, శ్లో.1)*

దీనిని బట్టి రావణసంహారానంతరము రాముడయోధ్యా రాజ్యమును పాలించుచుండగా వాల్మీకి ఈ కావ్యమును రచించె ననుట స్పష్టము. తన్ను గూర్చి వాల్మీకియే భగవంతుడు ఋషి అని చెప్పుకొనునా అని సందేహింప నక్కర లేదు. ఆయన తన్ను కూడా కావ్యములోని పాత్రలలో ఒకనినిగా భావించుచు, ఆ పాత్రను గూర్చి కవియైన వాడు ఎట్లు చెప్పవలయునో అట్లే చెప్పెను. "రాజ్యమును పొందిన రాముని యొక్క (ప్రాప్తరాజ్యస్య)

అను పదమున విశేష మొకటి ధ్వనించుచున్నది. శ్రీరాముడు వనవాస మొనర్చి రాక్షసుల సంహరించి తిరిగి రాజ్యమును పొందుట. ఒక యెత్తు.

ప్రజలలో మహారాణిని గూర్చి అపవాదము ప్రబలినపుడు ఆమెను దూరమొనర్చుకొని ప్రజారంజకుడై రాజ్యమును పాలించుచు దానిని నిలుపుకొనుట మఱియొకయెత్తు. మొదటిదానికన్న రెండవ సందర్భమే చాలగడ్డినది. వనవాసమునుండి తిరిగి వచ్చినప్పుడు శ్రీరాముని కొఱకు భరతుడు రాజ్యమును సిద్ధముగానే ఉంచెను. జనాపవాదము ప్రబలినప్పుడు రాముడు దుర్బలుడైనచో పతివ్రత ప్రాణాధిక ప్రియురాలును అయిన భార్యను వదులుకొనజాలక రాజ్యమునే వదలి యుండును. కాని అది క్షత్రియునకు ధర్మముకాదు. తనకుటుంబక్షేమమునకు ప్రజారంజనమునకు విరోధము సంభవించనచో క్షత్రియుడు కుటుంబక్షేమమును వీడి ప్రజారంజనము కొఱకే పాటుపడవలయును. ధర్మయుద్ధమున ప్రాణము లను త్యజించుట ఎట్టిదో ఇదియునట్టిదే. ఈ విషయమును శ్రీరాముడు దండకారణ్యమున ఋషులను రక్షించుటకై ప్రతిజ్ఞ చేసినప్పుడు సీతతోనే స్పష్టముగ చెప్పెను . "ప్రాణములనైన, లక్ష్మణునితోఁబాటు నిన్నైనను వీడుదును గాని, ఇచ్చిన మాటను, అందును బ్రాహ్మణ సమక్షమున గావించిన ప్రతిజ్ఞను విడువజాలను".

*శ్లో. అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే స లక్ష్మణామ్।*
*న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః॥*
*(అరణ్య-సర్గ.10, శ్లో-19)*

కావున రాముడు ప్రాణముకన్నను ప్రియురాలైన సీతను దూర మొనర్చుకొని అమితదుఃఖముతో అల్లాడుచుండియు ప్రజారంజనమును సాధించి రాజ్యపాలనరూపమైన ధర్మమును వదలకుండ పొందియే యుండెను, అట్టి పరమధార్మికుడైన రాముని యొక్క చరిత్రమును వాల్మీకి మహర్షి కావ్యమునుగా రచించినాడను విషయము ఇందు ధ్వనించుచున్నది.

కావ్యమును రచించుట ఒక యెత్తు. దానిని లోకమున ప్రకటించుట మఱియొక యెత్తు, నేను కావ్యమును వ్రాసితిని. మీరు వినుడు. అని

పదివుంది యొద్దకు పోయి తన కావ్యమును తానే వినిపించుట మహర్షియొక్క అంతస్తునకు తగినపని కాదు. కావుననే ఆయన కావ్యమును పూర్తిచేసినంతనే "దీని నెవరు లోకమున ప్రచార మొనర్పగలరు?". అని చింతింపజొచ్చెను. ఆసమయమున కుశలవులు వచ్చి ఆయనపాదములకు ప్రణమిల్లిరి. వారు అప్పటికే వేదములందు పరినిష్ఠితులై యుండిరి. వారు మధుర మైన కంఠస్వరమును కూడ కలిగియుండిరి. అందువలన వారే తనకావ్యప్రచారమునకు సమర్థులని నిశ్చయించి మహర్షి వెంటనే వారికి ఆ కావ్యమును వాచోవిధేయ మగునట్లు నేర్పెను.

ఈ సందర్భమున మహర్షి కావ్యమునకు రెండు విశేషణములను ఉపయోగించెను. అది సీతాదేవియొక్క మహనీయమైన చరిత్ర యని, పౌలస్త్యవధమనియు ఆయన పేర్కొనెను.

*శ్లో. కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్!*
*పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః!*

*(బాల.సర్గ.4,శ్లో.7)*

శ్రీగోవిందరాజస్వామి దీని నిట్లు వ్యాఖ్యానించెను. "ఇందు రామచరిత్రము అప్రధానముగా సీతాచరిత్రము ప్రధానముగా ప్రతిపాదింప బడుచున్నది అనునభిప్రాయముతో మహర్షి "కృత్స్నం సీతాయాశ్చరితమ్" అని చెప్పెను. కావున రామాయణ మంతయు సీతా చరిత్రపరమే".

(ఇదం చ రామచరితప్రతిపాదనం అప్రాధాన్యేన, ప్రాధాన్యేన తు సీతాచరిత మేవ ప్రతిపాద్యతే ఇత్యాహ కృత్స్నం సీతాయాశ్చరిత మితి. కృత్స్నం రామాయణం సీతాచరితపరమ్!)

దీనిని బట్టి వాల్మీకి మహర్షి సీతాదేవి యొక్క చరిత్రమును ప్రధానముగా ప్రతిపాదించుచు దానికి బహిరంగమైన యాకారమును రామునిచరిత్రతో రూపొందించెనని స్పష్టమగుచున్నది. రాముని చరిత్రము వాచ్యముగ సీతాదేవి చరిత్రము వ్యంగ్యముగ నున్నదన్నమాట. ప్రజలు ఈ కావ్యమును విని సీతాదేవి ఎట్టి కష్టములు పొందినదో, అట్టి కష్టముల

యందును శీలమును ఎట్లు నిలుపుకొన్నదో సకలదేవతా సమక్షమున అగ్నిపరీక్ష నొందిన తరువాతనే శ్రీరాముడు ఆమెను ఎట్లు స్వీకరించెనో చక్కగా గ్రహించి పశ్చాత్తాపము నొందవలయుననియే ఆయన యాకాంక్ష. శ్రీరాముడు ఈ కావ్యమును వినవలసినదని సభ్యులను కోరుచు చెప్పిన మాటలు కూడా గమనింపదగియున్నవి. "పార్థివలక్షణాన్వితులైన యీ ముని బాలకులు కుశీలవులు. వీరు మహాతపస్వులు. ఈ కావ్యము నాకు శ్రేయస్కరమని వీరు చెప్పుచున్నారు. మహానుభావమైన యీ చరితమును మీరును గ్రహింపుడు".

శ్లో. *ఇమౌ మునీ పార్థివలక్షణాన్వితౌ కుశీలవౌ చాపి మహాతపస్వినౌ।*
*మమాపి తద్భూతికరం ప్రచక్షతే మహానుభావం చరితం నిబోధత॥*

రాముడు ఈ కావ్యమును తన చరిత్రనుగా తలంచుట లేదు. నా చరిత్రము అని కూడ ఆయన చెప్పలేదు. తనచరిత్ర మైనచో అది మహాను భావమైన దని ఎట్లు చెప్పును? ధీరోదాత్తుడైనరాముడు ఆత్మప్రశంస కావించుకొనునా? ఆయన దృష్టియందును ఇది ప్రధానముగా సీతాదేవి చరిత్రముగనే యున్నది. ఆ మహాపతివ్రతయొక్క చరిత్ర ఎట్టిదో గ్రహింపు డనియే రాముడును కోరినాడు.

ఈ కావ్యమును రాముడు సభలో తమ్ములతో, మంత్రులతో, సభ్యులతో కూడి పెక్కుదినములు వినెను. తుదకు కథాసందర్భము ననుసరించి, సీతాదేవి కుశలవులను కనెను అనుఘట్టమును కుశలవులే గాన మొనర్చిరి. వెంటనే రామునకు మరల నొక సమస్య ఏర్పడెను. సీతాదేవి వాల్మీకియాశ్రమమున ఉన్నదని, ఆమెకు కుశలవులు జన్మించిరని ప్రజల కెల్లరకును తెలిసెను. కావ్యము ననుసరించి ఆమె పతివ్రత. కావున ఆమె పుత్రులు రాజ్యమునకు వారసులు. ఇది సంశయాస్పదముగ నుంచదగిన యంశము కాదు. రాజ్యధర్మదృష్టితో ఇది వెంటనే నిశ్చయింప వలసిన విషయము. సీతాదేవి పతివ్రతగా మహారాణిగా అంగీకరింపబడినప్పుడే యీ విషయము పరిష్కరింపఁబడును. కావ్యమును వినుచున్న ప్రజలు ఈ

విషయమున తమ యభిప్రాయమును నిర్దిష్టముగా ప్రకటించినట్లు లేదు. అనగా సీత సంవత్సరకాలము రావణుని యింట పరిశుద్ధముగా నున్నది అను విషయమున వారికి సందేహములు పూర్తిగా పోలేదన్నమాట. దీనిని గమనించుచున్న రాముడు ప్రజలకు విశ్వాసమును గలిగించుటకై సీత వారిసమక్షమున శపథమును గావింపక తప్పదని నిశ్చయించుకొని దూతలను పిలిచి, "సీత కల్మషరహిత శుద్ధ చరిత్రయు అయినచో మహర్షియొక్క అనుమతితో ఇచ్చటికి వచ్చి తన శుద్ధిని ప్రకటించును గాక! వాల్మీకి యొక్క అభిప్రాయమును సీతయొక్క భావమును మీరు గ్రహించి వెంటనే వచ్చి నాకు చెప్పుడు. సభామధ్యమున రేపు ఉదయము జనకాత్మజ శపథము చేయును గాక!" అని వాల్మీకి యొద్దకు పంపెను. ఆయన అందులకు అంగీకరించెను.

మరునాడు శపథమునకై మహాసభ ఏర్పాటు చేయబడెను. వాల్మీకి సీతతో కూడ సభకు వచ్చిన రాముని జూచి, నీవు లోకాపవాదమునకు వెఱచి పవిత్రురాలైన యీమెను, పరిత్యజించితివి. నా యాశ్రమసమీపమున వదలి పెట్టబడుటచే ఈమె నాచే ఆదరింపబడినది. ఈ కుశలవులు నీ కుమారులు. నేను సత్యమును చెప్పుచున్నాను. నేను ప్రచేతసునకు పదియవ కుమారుడను. అనృతమును ఎప్పుడును స్మరించి యెఱుగను. వేలకొలది సంవత్సరములు తపస్సు చేసితిని. ఈ సీతయందు దోషమే యున్నచో నేను ఆ తపఃఫలమును పొందకుందునుగాక! ఈమె పరిశుద్ధురాలనియే నేను ఆదరించితిని. అయినను లోకాపవాద భీతుడవైన నీకొరకు ఈమె మరల శపథము చేయగలదు! అని పలికెను. ఈ మాటలను వినుచున్న ప్రజలనుండి ఏ యభిప్రాయమును వ్యక్తము కాలేదు. "సీతాదేవి పవిత్రురాలు. ఆమె శపథము చేయనక్కరలేదు. సీతాదేవికి జయము. శ్రీరామునకు జయము". అని వారు అనలేదు. వారందరును శపథమున జరుగు నద్భుతమును చూడవలయుననియే కుతూహలముతో నుండిరి. అది గమనించి రాముడు ప్రాంజలియై వాల్మీకితో నిట్లనెను. అయ్యా! తమ

వాక్యమునందు నాకు విశ్వాసము కలదు. వెనుక దేవతల సన్నిధానమున శపథము జరిగిన తరువాతనే నేను ఈమెను స్వీకరించితిని. అయినను లోకాపవాద భీతుడనై పరిత్యజించితిని. తమరు నన్ను క్షమింపవలయును. ఈ కుశలవులు నా కుమారులనియు ఎరుగుదును. అయినను సీత లోకమునకు పరిశుద్ధురాలుగా ప్రకాశించినచో సంతోషింతును".

అక్కడ కుతూహలముతో చేరియున్న దేవతలు, మహర్షులు, ప్రజలు, యక్షరాక్షసపన్నగులు మొదలగు వారినందరను చూచి కాషాయ వస్త్రములు ధరించియున్న సీత తలవంచుకుని ప్రాంజలియై, "నేను మనోవాక్కాయ కర్మముల రామునిదప్ప మరియొకనిని భావించి యెఱుంగ నేని నాకు భూదేవి మార్గ మొసంగును గాక" అని ముమ్మారు శపథము గావించెను. వెంటనే రసాతలమునుండి దివ్యమైన సింహాసనము పైకి వచ్చెను. భూదేవి సీతను కౌగిలించుకొని అందు కుర్చుండ బెట్టుకొని రసాతలమునకు తీసికొని పోయెను. ఈ సంఘటనమునకు ఎల్లరును విస్మితులైరి. శ్రీరాముడు పరమదఃఖితుడై, భూదేవిపై కోపించి సీతను మరల తనకు నొసంగకున్నచో సర్వనాశ మొనరింతు నని పలుక జొచ్చెను. అప్పుడు బ్రహ్మ దేవుడు ఆయనను శాంతింపజేసెను.

కావ్యపఠనమువలననే సీత కుశలవులును శ్రీరాముని యొద్దకు చేరుట సంభవించెను. కాని అందరును ఆశించినట్లుగా సీతాదేవి శ్రీరాముని సహవాసమును కోరలేదు. శపథములు చేయుచు, దాంపత్యజీవితమును నిలుపుకోవలయునను తలంపు ఆమెకు లేదు. లంకలో చేసిన శపథము అయోధ్యలో పనికి రాలేదు. ఇప్పుడు చేసిన శపథము ఇంక కొంతకాలము నకు విస్మృతము కాదని ఎట్లు చెప్పవచ్చును? అందువలన ఆమె ఎప్పుడో విరక్తి చెంది కాషాయవస్త్రములను ధరించెను. తన్ను గొనిపొమ్మని సీత భూదేవిని ప్రార్థించు నని ప్రజలు ఊహింపలేదు. ఆమె అట్లు ప్రార్థించు చున్నను భూదేవి ప్రత్యక్షమై సీతారాములను గూర్చు ననియే వారు తలంచిరి. శ్రీరాముడును అట్లే ఆశించినట్లున్నది. అందువలననే ఆయనకు

సీతానిర్గమనమున మహాదుఃఖము కలిగెను. బ్రహ్మదేవుని దృష్టియందు సీతారాముల యీ వియోగము చాల అప్రధానము. కావుననే ఆయన శ్రీరాము నోదార్చుచు విష్ణుస్వరూపమును స్మరింపవలసిన దని లక్ష్మీరూపిణి యైన సీతకు ఆయనకు వైకుంఠమున మరల సమాగమము ఏర్పడు ననియు బోధించెను.

సీతారాముల చరిత్ర చిరకాలము మానవుల కెల్లరకు ధర్మప్రబోధ కముగా వెలుగొందు చుండుటయే ఆయన దృష్టిలో ఈ కావ్యమునకు ప్రయోజనము. వారి చరిత్రమును వియోగాంతముగా చూచుచున్న ప్రజల హృదయము కరుణముచే ద్రవించెను. అట్లు ద్రవించిన హృదయములందు సీతారముల చరిత్ర చెరగని ముద్రగ అంకిత మయ్యెను. కావ్యప్రయోజనము ఇట్లు సిద్ధించెను. కావ్యము సుఖాంతమే అగుచో లోకులు సీతారాములను గూర్చి ఇంత గాఢముగా భావించి యుండరేమో, కరుణమునకు గల యీ సామర్థ్యము మఱి యే రసమునకు లేదు. కావుననే లోకపితామహుడు ఈ కావ్యము కరుణముననే పుట్టి కరుణముతోనే ముగియవలె నని సంకల్పించినట్లు తోచును. ఆయన కావ్యముయొక్క ఆరంభమునందు ముగింపునందును సాక్షాత్కరించుట గమనింప దగియున్నది. ఈ కావ్యము యొక్క స్వరూపస్వభావములను ఆయన ముందుగనే నిశ్చయించి తద్రచనమున వాల్మీకిని సాధనమాత్రునిగ నియోగించెను. ఈ యభిప్రాయమును ఆయన నా సంకల్పమువలననే నీయం దిట్లు సరస్వతి ఆవిర్భవించి నది అను మాటలలో స్పష్టమొనరించెను.

ఈ కావ్యమును గూర్చి ఆయన రామునితో చెప్పిన మాటలు గమనింపదగియున్నది. "నీకు సంబంధించిన యీ కావ్యమే కావ్యములలో ఉత్తమము. ఇదియే నీకు ముందు కర్తవ్యమును కూడ వివరింపగలదు. నీవు పుట్టినప్పటినుండియు పొందిన సుఖదుఃఖములను, ఇంక ముందు జరుగనున్నదానిని కూడ వాల్మీకి ఇందు రచించెను. ఈ యాదికావ్య మంతయు నీయందే ప్రతిష్ఠితమై యున్నది. రాఘవుడ వైన నీకంటె అన్యుడు కావ్యములలో యశము నందుట కర్హుడు కాడు".

*శ్లో. ఏతదేవ హి కావ్యం తే కావ్యానా ముత్తమం శ్రుతమ్।*
*సర్వం విస్తరతో రామ వ్యాఖ్యాస్యతి న సంశయః॥*
*శ్లో. జన్మ ప్రభృతి తే వీర సుఖదుఃఖోపసేవనమ్।*
*భవిష్య దుత్తరం చేహ సర్వం వాల్మీకినా కృతమ్॥*
*శ్లో. ఆదికావ్య మిదం రామ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్।*
*న హ్యన్యోఽర్హతి కావ్యానాం యశోభాగ్రాఘవాదృతే.॥*
*(ఉత్తర. సర్గ. 98, శ్లో.16,17,18)*

"భవిష్యత్తు కూడ వాల్మీకిచే రచింపఁబడెను" అని చెప్పుట వలన సీత రసాతలమునకు పోవుట మొదలుగా శ్రీరామాదులు స్వర్గము చేరుటవఱకును గల కథ యంతయు అప్పటికే మహర్షి రచించి యుండె నన్నమాట. కాని కుశలవుల జననము వినుటతోడనే రాముడు కావ్యగాన మును నిలిపెను. సీత భూమిలోనికి పోవునని తెలిసియు వాల్మీకి నాటక ములో పాత్రధారివలె రాముని సభలో వ్యవహరించెను.

చతుర్ముఖుడు కావ్యములలో ఇది ఉత్తమము అని చెప్పి వెంటనే ఇది ఆదికావ్యము అని చెప్పుట వింతగా దోచును. అప్పటికి కొన్ని కావ్యము లుండినగదా ఇది ఉత్తమకావ్య మగును. దీనికి పూర్వమే కావ్యములున్నచో ఇది ఆదికావ్య మెట్లగును? ఇచట ఉత్తమ మనగా ఇకముందు రచింపబడు కావ్యములన్నింటిలో ఇది శ్రేష్ఠమైనది అని చెప్పుటయే బ్రహ్మదేవుని యభిప్రాయముగా మనము గ్రహింపవలసియున్నది. ఆయన సర్వజ్ఞుడు లోకపితామహుడు కావున పుట్టబోవు కావ్యములను ఉద్దేశించి కూడ ఇది ఉత్తమ మైనదని చెప్పదగిన యధికారము ఆయనకు ఉన్నది. కాని రామాయణ మందే నృత్యములు, గీతములు, వధూనాటక సంఘములు మొదలగునవి అచ్చటచ్చట ప్రస్తావింపఁబడి యున్నవి. మఱి ఆ గీతములలో నాటకములలో కవిత్వమే లేదా? వానిలో కవిత్వమున్నచో ఇది ఆదికావ్యము ఎట్లగును? వాల్మీకిని ఆదికవి యని ఏల చెప్పవలె? ఇచ్చట ఒక విషయమును గమనింపవలసి యున్నది. ఆద్యత్వము కేవలము కాలముచే ఏర్పడదు. రామాయణరచనకు పూర్వము ఏవేని కొన్ని గీతములవంటి రచనలు

ఉండవచ్చును. అవి పాదబద్ధములై అక్షరసమములై ఛందస్సు ననుసరించు శ్లోకములవలె నుండవు. పాటల కూర్పు వేరు పద్యముల రచన వేఱు. అట్లు శ్లోకములవంటి రచనలే వాల్మీకి కి ముందుగా కొన్ని ఉన్నవనుకొన్నను అవి ఆదికావ్యములు కావు; వానిని రచించినవారు ఆదికవులు కారు. ఏది స్థిరముగ నిల్చి అనంతర కవులకు మార్గదర్శకము కాగలదో అట్టి కావ్యమే ఆదికావ్యమగును; తత్కర్తయే ఆదికవి యగును. మహర్షుల ప్రశంసా వాక్యములలో కూడ రామాయణమునకు పూర్వము అట్టిరచనము ఏదియూ లేదని స్పష్టమగుచున్నది. వాల్మీకిచే రచింపబడిన యీ యాఖ్యానము ఆశ్చర్యముగ నున్నది. యథాక్రమముగా సమాప్తమైన యీ కావ్యము కవులకు పరమమైన యాధారముగ నున్నది.

*శ్లో. ఆశ్చర్య మిద మాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్।*
*పరం కవీనా మాధారం సమాప్తం చ యథాక్రమమ్॥*
*(బాల. సర్గ. 4, శ్లో. 26-27)*

వారి కిది ఆశ్చర్యముగా నున్నది. రాముని చరిత్ర వారికి తెలిసినదే కావున వారి కది ఆశ్చర్యకారణము కాదు. ఇంక రచనయే కదా వారికి ఆశ్చర్యము కలిగించియుండవలె. ఇట్టి రచనము అంతకు పూర్వము ఉన్నచో వారికి ఆశ్చర్యము కలుగవలసిన పనియే లేదు. కావున ఇది ఆదికావ్యమనుట నిస్సంశయము.

# 4 పాదుకలకు పట్టాభిషేకము

పోలూరి హనుమజ్జానకీరామశర్మ

పాదుకలకు పట్టాభిషేకము చేయుట రామాయణములో తప్ప మనదేశ చరిత్రలోనే కాదు ఇతరదేశ చరిత్రలలో కూడ ఇంతవరకు ఉన్నట్లు ఎవరును చెప్పలేదు. ఇది ఎంత వింత యైన విషయమో రామాయణకథలో అంత శక్తిమంతము. ఇది భరతునకు శ్రీరాముని యందు గల యనన్య భక్తికి ప్రతీకగా నున్నది. అంతే కాదు పెక్కు ధర్మముల బలాబలములకు పరీక్షాస్థానముగా నున్నది.

శ్రీరామాదుల వివాహసమయమున భరతుని మేనమామ యుధాజిత్తు అయోధ్యకు వచ్చెను. దశరథుడు పుత్రులతో వివాహముల కొరకై మిథిలకు పోయె నని తెలిసికొని మిథిలకు వచ్చి అచ్చటినుండి వారితోబాటు మరల అయోధ్యకు వచ్చెను. అతడు అయోధ్యలో కొన్ని నెలలుండి స్వదేశమునకు బయలుదేరుచు భరతుని తన వెంట బంపుమని దశరథు నడిగెను. ఆయన భరతశత్రుఘ్నులను యుధాజిత్తు వెంట బంపెను. తరువాత కొంతకాలమునకు ఆయన రామునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయుటకు ప్రయత్నించి, కైకేయి కోరిన వరములవలన సీతారామలక్ష్మణులు వనములకు పోవుటచే వారికొఱకు విలపించుచు మరణించెను. మృతుడైన మహారాజునకు సంస్కారము కావించుటకు కుమారు లొక్కరును అయోధ్యలో లేకుండిరి. అప్పుడు వసిష్ఠుడు మంత్రుల యభిప్రాయము ననుసరించి దూతలను బంపి భరతశత్రుఘ్నులను పిలిపించెను. వెంటనే చేయవలసిన కార్య మేర్పడినది, కావున తక్షణమే బయలుదేరు మనియే దూతలు భరతునకు చెప్పిరి కాని ఇతరవిషయము లేమియు చెప్పలేదు.

భరతుడు శత్రుఘ్నునితో వేగముగ వచ్చి శోభారహితమ్మై యున్న యయోధ్యలో ప్రవేశించుచు, ఆపదను శంకించుచు రాజభవనమునకు పోయి అచట తండ్రిని గానక తల్లియొక్క అంతఃపురమునకు పోయెను. అప్పుడు కైకేయి బంగారు సింహాసనముపై కూర్చుండి చేటికలతో

మంతనము లాడుచుండెను. కుమారుని చూడగానే ఆమె హర్షముతో సింహాసనమునుండి దుమికినంత వేగముగా లేచివచ్చెను.

*శ్లో. "అనుప్రాప్తం తు తం దృష్ట్వా కైకేయీ ప్రోషితం సుతమ్।*
*ఉత్పపాత తదా హృష్టా త్యక్త్వా సౌవర్ణ మాసనమ్॥"*
*(అయోధ్య.సర్గ.72, శ్లో-2)*

ఆమె తనతండ్రి సోదరుడు మొదలగు వారి యోగక్షేమములను గూర్చి యడుగజొచ్చినదే కాని దశరథుని మరణమును గూర్చి చెప్పనేలేదు. భరతుడు కేకయదేశములోని యోగక్షేమములను సంగ్రహముగా చెప్పి మిగుల ఆతురతతో, అమ్మా! నాయనగారు కన్పింపడేమి? ధర్మమును స్మరించి పెదతల్లిగారి యంతః పురమునకు బోయినాడా ఏమి? అని అడిగెను. అప్పుడు రాజ్యలోభము చేత మోహిత యైన కైకేయి అతనికి ఘోరమైన యప్రియమును ప్రియమైన దానినిగా ఇట్లు చెప్పెను. "అనేకయజ్ఞములు చేసినవాడు తేజస్వి సత్పురుషులకు ఆశ్రయమైన వాడు మహాత్ముడు. అయిన మీ తండ్రి సకలభూతములు తుదకు ఏగతి నొందునో ఆ గతినే పొందెను".

*శ్లో. తం ప్రత్యువాచ కైకేయీ ప్రియవత్ ఘోర మప్రియమ్।*
*అజానన్తం ప్రజానన్తీ రాజ్యలోభేన మోహితా॥.*
*యా గతి స్సర్వభూతానాం తాం గతిం తే పితాగతః।*
*రాజా మహాత్మా తేజస్వీ యాయజూక స్సతాం గతిః॥*
*(అయోధ్య - సర్గ. 72, శ్లో. 14-15)*

ఆ మాట విన్నంతనే భరతుడు మూర్ఛిల్లి కొంతసేపటికి తేఱుకొని నేలపై బడి పొరలి విలపింప జొచ్చెను. కైకేయికి ఇది నచ్చలేదు. ఆమె కంట తడిబెట్టక గద్గద స్వరమైన లేక, కీర్తిశాలి వైన రాజా, లెమ్ము లెమ్ము. ఏల ఇచ్చట క్రింద బడియున్నావు? సభలో ఎల్లరకును సమ్మతమైన వర్తనమును గలిగిన నీవంటి సజ్జనులు ఇట్లు శోకింపరు గదా! అని భరతుని మందలించెను.

''ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే రాజ న్నత్ర మహాయశః
త్వ ద్విధా నహి శోచన్తి సన్త స్సదసి సమ్మతాః''
(అయోధ్య-సర్గ.72.శ్లో.24.)

ఆమె ''రాజా'' (రాజన్) అను సంబోధనమును సాభిప్రాయముగానే వాడినది. ''నేను నీకు రాజ్యమును సంపాదించి పెట్టితిని. నీవు రాజవైతివి. ఇందులకు సంతోషింపక దుఃఖింతు వేమి? తక్షణమే రాజసభను సమావేశ మొనర్చి పట్టాభిషేక ప్రయత్నములను గావింపుము'' అని యామె ఈ మాటలవలన వ్యక్తము చేయుచున్నది.

భరతుడు ఆమె యభిప్రాయమును గాని పలుకుచున్న తీరునుగాని గమనించే స్థితిలో లేడు. తండ్రి మరణించు సమయమునకు తాను సమీపమున లేకుండె నను దుఃఖము అతనిని మహాప్రవాహము వలె ముంచివేయు చుండెను. అతడు దానిని గూర్చియే ఆలోచించుచూ అమ్మా! తండ్రిగారు మరణించునప్పుడు దగ్గర నున్న రామలక్ష్మణులు ధన్యులు గదా! ఆయన మరణించునప్పుడు నన్నుగూర్చి ఏమైన జెప్పెనా? అని యడిగెను. అప్పుడామె యిట్లనెను. మతిమంతులలో శ్రేష్ఠుడైన యా మహాత్ముడు ఓరామా! ఓసీతా! ఓ లక్ష్మణా! అని విలపించుచు పరలోకమునకు ఏగెను. ఆయన నిన్నేల స్మరించును? చచ్చుచున్నప్పుడు కూడ ఆయన సీతారామ లక్ష్మణులను స్మరించుచుండెను. ఆయనకు మనయందు ప్రేమ ఎక్కడిది? అను నభిప్రాయమునే ఈ మాటలలో వ్యక్త మొనర్చినది.

కాని భరతుడు దానిని గూడ గమనించు స్థితిలో లేడు. రామాదులు కూడ తుదకు ఆయన చెంత లేరని విన్నంతనే అతడు ఇంకను సంక్షోభము నొంది వారేల దగ్గర లేకుండ పోయిరని అడిగెను. అప్పుడు కూడ ఆమె ఏమియు వివరింపక రాముడు రాజ్యమునుండి నిర్వాసితు డయ్యెనని, వనముల కేగుచున్న యాతనిని సీతారామలక్ష్మణులు అనుగమించి రనియు మాత్రమే చెప్పి యూరకుండెను. రాముడు నిర్వాసితుడయ్యె నను మాట

చెవిని బడినంతనే భరతునకు ఆవేశము అతిశయించి ఏ కారణముచేత రాముడు నిర్వాసితు డయ్యెనని అడుగుచు నిర్వాసమునకు కారణము లనుగా నుండు విషయములను పరుల భార్యలను పొందుట మొదలగువాని నెన్నింటినో పేర్కొనెను. ''రాముడు పరుల భార్యలను కన్నెత్తియైన జూచునా? అతడు నిర్వాసమునకు కారణమైన యే యపరాధమును చేయలేదు. నేనే నీ శ్రేయస్సును కోరి నీకు రాజ్యపట్టాభిషేకమును రామునకు పదునాల్గేండ్ల వనవాసమును వరములుగా మీ తండ్రిని కోరితిని. అందువలన రాముడు అడవి కేగెను. నీకు పట్టాభిషేకము సిద్ధముగా నున్నది'' అని యామె తుదకు తన యభిప్రాయమును స్పష్టముగా వివరించెను.

అప్పటికిగాని భరతునకు తనతల్లి కావించిన దుష్కృత్యము వలననే ఈ యనర్థ మంతయు సంభవించిన దను విషయము మనస్సునకు రాలేదు. తన కొఱకే ఆమె యిట్లు కావించిన దన్న విషయము అతనికి గాయముపై కారము చల్లినట్లై పొంగుచున్న దుఃఖ మంతయు ఆమెపై కోపముగా పరిణమించి ఆమె నాతడు విశృంఖలముగా నిందించెను. పుత్రవిషయిక మైన లోభముతో ఇంత యనర్థమునకు పాల్పడిన నీకోరికను నేను తీర్పను. రాముడు నిన్ను తల్లివలె చూచుచున్నాడు. అందువలన పాపాత్మురాలవైన నిన్ను పరిత్యజింప లేకున్నాను. ఓ నృశంసురాలా! రాజ్యకాముకీ! భర్తృ ఘాతినీ! నీవు నాకు తల్లిరూపమున నున్న శత్రువవు. నీవు నన్ను పలుకరింపవద్దు. నీవు ధర్మప్రభువైన యా యశ్వపతికి పుత్రికవు కాదు. ఆ తండ్రికి కులప్రధ్వంసినివిగా రాక్షసివిగా అక్కడ జన్మించితివి. నీవు అగ్నిలో దూకు; దండ కారణ్యమునకు పొమ్ము, లేదా ఉరిపెట్టుకొని చావుము. నీకు ఇంతకన్న వేరుగతి లేదు.

పిమ్మట భరతుడు తన్ను చూడవచ్చిన మంత్రులు మొదలగు వారితో తనతల్లి గావించిన దుర్మంత్రణము తనకు ఏమియు తెలియదని చెప్పి విలపించుచు కౌసల్యను చూచుటకు బయలుదేరెను. కౌసల్య కూడ భరతుడు వచ్చెనని తెలిసికొని సుమిత్రతో బయలుదేరి వచ్చుచు భరతునకు

ఎదురయ్యెను. భరత శత్రుఘ్నులు ఆమె పాదములపై బడిరి. ఆమె భరతుని చూచి నాయనా! మీ అమ్మ నీకు రాజ్యమును సంపాదించి పెట్టినది. మంచిదే అనుభవింపుము. కాని నాకు ఒక్కడే కొడుకు. వాడు రాజు కాకున్నను అయోధ్యలో నాకన్నులయెదుట నైన ఉండదగడా? నా భర్తయొక్క శరీరమును అగ్నిహోత్రములను ఇప్పింపుము. నన్ను కూడ రామునియొద్దకే పంపుము అని పలికెను. ఆ మాటలు శూలములవలె హృదయమున తాకగా భరతుడు మహావ్యథతో విలవిల తన్నుకొని మూర్ఛిల్లెను కొంతసేపటికి తేరుకుని ఎన్నో శపథములు కావించి తాను రాముని విషయమున ఎట్టి ద్రోహము తలపెట్టలేదని రాజ్యమును రామునకే అప్పగింతు నని చెప్పి ఆమెను ఓదార్చెను.

భరతునకు సహజముగా రామునియందు చాల భక్తి యున్నది. ఇది లక్ష్మణాదుల కందరకును సమానమే. కాని వారి కెవరికిని సంభవింపని దుర్ఘటనము భరతునకు సంభవించినది. తనకు ఆరాధ్యదైవముగా నున్న రాముని విషయమున తనతల్లియే తన కొఱకే ద్రోహమును గావించె ననుట ఆతనికి దుర్భరమైన దుఃఖమును కలిగించెను. ఆ తల్లికి కొడుకుగా తనకును ఆమెగావించిన దుర్మంత్రణమున కొంచెమైన భాగముండునని ఎవరైన అనుకొందురేమో అని నిరంతరము తపింపజొచ్చెను. రాముని యెడ తనకు గల నిష్కల్మషమైన భక్తిని ఎట్లైనను నిరూపించుకొనుటయే పరమలక్ష్యముగా భరతుడు భావింపజొచ్చెను. ఈ దృష్టితో అతడు తన్ను రాజ్యమును స్వీకరింపుమని చెప్పుటకు వచ్చినవారి నందరును తనకు అహితమును కోరువారినిగా భావింపజొచ్చెను. తరువాత అతని వర్తన మంతయు ఈ భావమే పునాదిగా రూపొందినది. శత్రుఘ్నునకు ఇట్టి యభిప్రాయమే కలదు. వరములు నెపముగా రాముని అడవుల కంపిన తండ్రియే మొదటిదోషి అని యతని యభిప్రాయము. ప్రేతకృత్యము లన్నియు ముగిసి భరతుడు రాముని యొద్దకు పోవలెనని తలంచుచుండగా శత్రుఘ్నుడు అతనితో నిట్లనెను. బలవంతుడు వీర్యసంపన్నుడు అని పేరొందినవాడు లక్ష్మణుడన్నవాడొకడున్నాడు కదా! అతడు తండ్రిని

నిగ్రహించి వరములు అను పాశమునుండి రామునేల తప్పింపలేదు? రాజు స్త్రీవశుడై అపమార్గమున ముందుకు పోవుచున్నప్పుడు నయానయములను పరిశీలించి ఆయనను ముందుగానే నిగ్రహించి యుండవలసింది.

*శ్లో. బలవాన్ వీర్యసంపన్నో లక్ష్మణో నామ యో౽ప్యసౌ।*
*కిం న మోచయతే రామం కృత్వాపి పితృనిగ్రహమ్॥*
*శ్లో. పూర్వమేవతు నిగ్రాహ్య స్సమవేక్ష్య నయానయౌ।*
*ఉత్పథం యస్సమారూఢో నార్యారాజా వశంగతః॥*
*(అయోధ్య-సర్గం 78,శ్లో3-4)*

రాజకర్తలు వచ్చి భరతుని రాజువు గమ్మని అభ్యర్థించిరి. అప్పుడతడు నిష్కర్షగా నిట్లు చెప్పెను. మా తల్లి వరములతో నాకు సంబంధము లేదు. పెద్దవాడుండగా చిన్నవాడు రాజగుట అధర్మము. అందువలన రాముడే రాజగును. రాముడు తాను సంకల్పించిన వనవాసవ్రతమును కొనసాగింప వలయు నన్నచో ఆయనకు మాఱుగా నేను వనవాసమును చేయుదును. కావున రాముని యొద్దకు పోవుటకు చతురంగ బలములను సన్నద్ధము చేయుడు. అభిషేచనిక ద్రవ్యములను కూడ తీసికొని బయలుదేరుడు. అక్కడనే రామునకు పట్టాభిషేకము గావించి తీసికొని రావలయును. అయినను వసిష్ఠుడు రాజసభను సమావేశమొనర్చి భరత శత్రుఘ్నులను పిలిపించి భరతునితో నిండుసభయందు రాజ్యము నంగీకరింపు మనెను. వసిష్ఠమహర్షి కూడ అట్లు చెప్పు చున్నందులకు దుఃఖమును భరింపజాలక భరతుఁడు సభామధ్యమున విలపించుచు పురోహితుని కూడ గర్హించెను.

*శ్లో. విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితమ్।*
*(అయోధ్య,సర్గ,82 శ్లో-10)*

చతురంగబలములతో బయలుదేరి భరతుడు గంగానదిని చేరి అచ్చట విడిసెను. గుహునకు భరతుని విషయమున శంక ఏర్పడి తన బలములను సన్నద్ధము గావించి అతనిని చూచుటకు పోయెను. సుమంత్రుని వలన గుహుడు శ్రీరామునకు మిత్రుడని తెలిసికొని భరతు

డాతనిని ఆదరించెను. ఇంతసైన్యముతో ఏల బయలుదేరితివి? నీవు రామునకు ఇంకను ద్రోహము తల పెట్టుట లేదు కదా" అని గుహు డడిగెను. భరతుడు చాల వ్యథనొంది రాముని గొనితెచ్చుటకై బయలుదేరితి నని ఆతని సందేహమును నివారించెను. గుహుడు అచ్చట సీతారాములు ఒక రాత్రి ఎట్లుండిరో తెలిపి లక్ష్మణునకు తనకు నైన సుభాషణ మును వివరించి వారు పరుండి యున్న తావును చూపెను. మహారాజ కుమారుడైన శ్రీరాముడు జనకుని పుత్రికయైన సీత తనతల్లి కారణముగా గడ్డిపై పరుండవలసి వచ్చెనని దుఃఖాతిశయమున మూర్ఛిల్లెను. కొంత సేపటికి తేరుకుని అతడు రామునివలె తానును నారచీరలను జడలను ధరింపవలయునని నిశ్చయించుకొనెను. ఏపరిస్థితి యందును తాను రాజ్యమును గైకొన రాదని, రామునకు రాజ్యమును అప్పగించినతరువాత ఆయనకు మారుగా తాను ఆరణ్యకవ్రతమును అవలంబింపవలము నని నిశ్చయించుకొనె నన్నమాట.

పిదప గుహుని సాయమున భరతుఁడు గంగను దాటి భరద్వాజా శ్రమమునకు పోయెను. సైన్యమును నిలిపి భరతుడు ఆయుధములను వీడి పట్టు వస్త్రములను ధరించి వసిష్ఠమహర్షిని ముందుంచుకొని కాలినడకన భరద్వాజ మహర్షి యొద్దకు పోయి పాదాభివందనము కావించెను. రాముని యొద్దకు చతురంగబలములతో నేల బయలుదేరితివి? ఏమి నీ యభి ప్రాయము? అని పరుషముగా ప్రశ్నించెను. భరతుఁడు మిగుల వ్యథనొంది, భగవత్స్వరూపులైన తమరు కూడ నన్ను గూర్చి ఇట్లు తలంచుచున్నచో నేను హతుడ నైనట్లే అని తన యభిప్రాయమును తెలిపెను.

*శ్లో. హతోఽస్మి యది మా మేవం భగవానపి మన్యతే।*

*(అయోధ్య - సర్గ.70 - శ్లో.15)*

భరద్వాజు డా రాత్రి తపశ్శక్తితో భరతునకు సైన్యసమేతముగా అపూర్వ మైన విందు గావించెను. స్వర్గభోగము లన్నింటిని ఆయన వారికి సమకూర్చెను. ఆ విందు యొక్క పారవశ్యమున సైనికులు, "మేము

అయోధ్యకు పోము: దండ కారణ్యమునకును పోము. భరతునకు కుశల మగను గాక! రామునకు కూడా అట్లే సుఖము కలుగును గాక'' అని పలుకజొచ్చిరి.

*శ్లో. నైవాయోధ్యాం గమిష్యామో న గమిష్యామి దండకాన్।*
*కుశలం భరత స్యాస్తు రామ స్యాస్తు తథా సుఖమ్॥*

*(అయోధ్య - సర్గ.91- శ్లో.59)*

అప్పుడు భరతుడు తనకై ఏర్పడుపబడిన రాజభవనమున మంత్రులతో కూడ ప్రవేశించి, ''రాజాసనమును పూజించి రాముని స్మరించి ప్రణమిల్లి చామరమును గైకొని సచివాసనమున కూర్చుండెను.''

*శ్లో. ఆసనం పూజయామాస రామా యాభిప్రణమ్య చ।*
*వాలవ్యజన మాదాయ న్యషీదత సచివాసనే॥*

*(అయోధ్య. సర్గ.91, శ్లో-39)*

భరద్వాజుడు స్వర్గ భోగనామాన్విత మైన వైభవముతో భరతుని మనోదార్ఢ్యమును పరీక్షించె ననుట స్పష్టము. ఎంతవైభవమును చూచు చున్నను భరతుఁడు ఏమాత్రము చలింపక రాజాసనమును స్పృశింప కుండుట భరద్వాజునకు మిగుల సంతోషమును కలిగించెను. ఈ పరీక్ష భరతుని యొక్క చిత్తమును రాజ్యనిరాకరణ విషయమును ఇంకను దృఢ మొనర్చెను. భరద్వాజ మహర్షికే ఇంత సందేహ మున్నప్పుడు సాధారణ ప్రజలు తన్ను నమ్ముట ఎంత దుర్ఘటమో అతడు గ్రహింపజొచ్చెను. ఈ యపవాదమున కంతకును మూల మైన కైకేయిని గూర్చి అతని హృదయము ప్రజ్వలింపఁజొచ్చెను. కావుననే ఆమె భరద్వాజునకు ప్రణమిల్లు చున్నప్పుడు భరతుడామెను గూర్చి భరద్వాజునితో చాల పరుషముగ చెప్పెను. క్రోధను రాలు బుద్ధిహీన గర్వితురాలు సుభగమానిని ఐశ్వర్యకామ ఆర్యరూపమున నున్న యనార్య అయిన యీ కైకేయిని నన్ను కన్నతల్లినిగా ఎఱుంగుడు.

*శ్లో. క్రోధనామకృతప్రజ్ఞాం దృప్తాం సుభగమానినీమ్।*
*ఐశ్వర్యకామాం కైకేయీ మనార్యా మార్యరూపిణీమ్॥*
*(అయోధ్య.సర్గ.92.శ్లో16)*

తల్లిని గూర్చి భరతుడు అట్లు మాటాడుట మహర్షికి చాల వెక్కసముగా తోచెను. ఆయన, "నీవు కైకేయిని దోషదృష్టితో చూడవలదు. రాముడిట్లు అడవి కేగుట సుఖాంతమే కాగలదు" అని అతనిని మంద లించెను.

*శ్లో. న దోషేణావగంతవ్యా కైకేయీ భరత త్వయా।*
*రామప్రవ్రాజనం హ్యేతత్ సుఖోదర్కం భవిష్యతి.॥*
*(అయోధ్య -స్వర్గ.92-శ్లో.30)*

పిమ్మట భరతుడు భరద్వాజుడు చెప్పిన గుర్తుల ననుసరించి చిత్ర కూటమునకు పోయెను. సైన్య సంకుల మేమో చూడు మని రాముడనగా లక్ష్మణుం డొకవృక్షాగ్రమునకు చేరి పరిశీలించి భరతుడు సైన్యసమేతముగా తమపైకి దండెత్తి వచ్చుచున్నాడని తలంచి ఆతనిని సైన్యసమేతముగా సంహరింపవలె నని పలుకజొచ్చెను. లక్ష్మణుని మాటలకు రాముడంగీ కరింపక ఇట్లనెను. మాతామహుని యింటి నుండి తిరిగి వచ్చిన భరతుడు తల్లిని మందలించి తండ్రిగారి యను మతితో మనలను జూచుటకై వచ్చు చున్నాడు. రాజ్యము కొఱకై సోదరుని సంహరింప వలయునా? సోదరులైన మీకుగాని రాజ్యము నాకెందులకు? నీకు రాజ్యమే కావలసి యున్నచో వీనికి రాజ్యము నొసంగుము అని నేను చెప్పితి నేని వెంటనే రాజ్యము నీకు నొసంగును. రాముడట్లు పలికినంతనే లక్ష్మణుడు సిగ్గుపడి తన శరీరావ యవములలో తాను ప్రవేశించుచున్నట్లు కుంచించు కొనిపోయెను.

*శ్లో. ఉచ్యమానో హి భరతో మయా లక్ష్మణ తద్వచః।*
*రాజ్య మస్మై ప్రయచ్ఛేతి బాఢ మిత్యేవ మంస్యతే॥*
*శ్లో. తథోక్తో ధర్మశీలేన భ్రాత్రా తస్య హితే రతః।*
*లక్ష్మణః ప్రవివేశేవ స్వాని గాత్రాణి లజ్జయా॥*
*(అయోధ్య- సర్గ.97, శ్లో.18,19)*

భరతుని శీలము ఇట్టిదని తండ్రి గుర్తింప లేక పోయినాడు. అందువలననే ఆయన భరతుని పిలిపింపకుండ రామునకు పట్టాభిషేక ప్రయత్నము చేయుటయే కాక రాముని అంతఃపురమునకు పిలిపించి, నీ సోదరుడైన భరతుడు సత్పురుషుల వర్తనమునందే యున్నాడు. అతడు దయాళువు జ్యేష్ఠానువర్తి జితేంద్రియుడు అయిన ధర్మాత్ముండే, అయినను మనుష్యుల చిత్తవృత్తి అనిత్యము. ధర్మనిత్యులైన సత్పురుషుల చిత్తము ఏపని యైనను జరిగిన తరువాత హర్షించును (కృతశోభి) కావున భరతుడు రాకముందే నీవు పట్టాభిషేకము చేసికొనుము అని పలికెను.

*శ్లో. "విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః।*
*తావదేవాభిషేక స్తే ప్రాప్తకాలోయతో మమ॥*

*శ్లో. కామం ఖలుసతాం వృత్తే భ్రాతా తే భరతస్థితః।*
*జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః॥*

*శ్లో. కింతు చిత్తం మనుష్యాణాం అనిత్య మితి మే మతిః।*
*సతాం తు ధర్మనిత్యానాం కృతశోభి చ రాఘవ॥*

*(అయోధ్య-సర్గ.4, శ్లో.25-27).*

దీనిని బట్టి దశరథుడు కూడ భరతుని శీలదార్ఢ్యమును శంకించు చుండె ననుట స్పష్టము. కైకేయికి కుమారుని చిత్తవృత్తి కొంచె మైనను తెలియక పోవుట చేతనే వరములను కోరి శాశ్వతమైన యపయశస్సుతో బాటు పుత్రుని ద్వేషమునకు కూడ లోనయ్యెను. ఆమె జీవితము విషా దాంతమే యయ్యెను. ఇంత మంది గుర్తింప లేని భరతుని శీలమును రాముడు నిస్సందేహముగా గుర్తించి నాడన్నచో ఆయనకుగల మానవ స్వభావ పరిశీలన, దక్షత ఎట్టిదో వ్యక్త మగుచున్నది.

భరతుడు రాముని పర్ణశాలను గుర్తించి మహాదుఃఖముతో పరుగు పరుగున వచ్చి రాముని పాదములపై వ్రాలెను. నారచీరలు జడలు ధరించి

ప్రాంజలియై నేలపైబడి యుగాంతమునందు భాస్కరుని వలె ఉన్నభరతుని చూచి రాముడు పైకి లేవనెత్తి కౌఁగిలించుకొనెను.

*శ్లో. "జటిలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి।*
*దదర్శ రామోదుర్దర్శం యుగాంతే భాస్కరం యథా॥"*
*(అయోధ్య - సర్గ. 100.శ్లో.1)*

భరతుడు భరద్వాజుని దర్శించినప్పుడు పట్టువస్త్రములతో నుండెను. రామునకు నారచీరలతో నున్నాడన్నచో ఆశ్రమమునుండి బయలుదేరునప్పుడో తరువాతనో శృంగిబేరపురమున కావించుకొన్న నిశ్చయమును నిర్వహించినాడన్నమాట. అప్పుడు రాముడు తండ్రి మొదలగు వారి కుశలమును గూర్చి ప్రశ్నించెను. భరతుని యొక్క సమాధానమును అపేక్షింపకయే రాముడు కచ్చిత్ అను పదముతో ఆరంభ మగుచున్నప్రశ్నపరంపరతో భరతునకు రాజధర్మమును నీతిని ఉపదేశించి నట్లుగా ఇచ్చట నొకసర్గ యున్నది. ఈ సర్గ అంతయు ప్రక్షిప్తము, అంతకు పూర్వమే లక్ష్మణునితో రాముడు, లోకవిశ్రుతము పాండురమును అయిన నాయన గారి ఛత్రము కన్పించుట లేదు. ఇందు నాకు చాల సంశయము కలుగుచున్నది. అని తండ్రి యొక్క క్షేమమును గూర్చి ఆతురుడై మాటాడు చుండెను.

అట్టివాడు భరతుడు రాగానే తండ్రి యొక్క క్షేమమును వెంటనే తెలిసికొనకుండ ప్రశ్నలతో తమ్మునకు రాజనీతిని బోధించుచుండె ననుట అసంగతము. అప్పటికి తండ్రి గతించెనని తెలియదు. తమ్మునకు రాజనీతిని తాను బోధింపవలసిన యక్కఱ ఏమున్నది? అన్నగా చెప్పవచ్చుననుకొన్నను అతడు అయోధ్యకు మరలిపోవునప్పుడు తీరికగా బోధింపవచ్చును గదా! నారచీరలు ధరించి జడలతో నున్న భరతుడు రాజ్యమును స్వీకరించెనని రాముడెట్లు తలంచును? అతడు అట్టివాడు కాడని అప్పుడే కదా లక్ష్మణుని తో ఆయన చెప్పియున్నాడు. అతడు రాజ్యముస్వీకరించెనో లేదో తెలిసికొన కుండ, తండ్రిగారి క్షేమవార్తను పొందకుండ రాముడు రాజనీతిని బోధించు టకు ఆతురుఁడయ్యె ననుట ఆయనస్వభావమునకు విరుద్ధము. ఇంచు

మించుగా ఈ శ్లోకము లన్నియు సభాపర్వమున నారదుడు ధర్మరాజును అభినందించుచు రాజనీతిని బోధించినట్లుగా మహాభారతమునందున్నవి. దేవలోకమునుండి పాండురాజు పంపఁగా ధర్మరాజును చూచుటకు వచ్చిన నారదుడు ఆయనకు రాజనీతిని బోధించుట ఉచితమే. రామాయణ సందర్భమునందు మాత్రము అసగంతమే. కావున ఈ శ్లోకము లన్నియు ప్రమాదవశమున రామాయణమునందు ప్రక్షిప్తము లయ్యెననుట స్పష్టము.

భరతుడు తండ్రియొక్క మరణవార్తను చెప్పినంతనే సీతారామ లక్ష్మణులు అమితముగ విలపించిరి. పిమ్మట భరతుడు తనతల్లి యొక్క దుర్మంత్రణము వలన ఇది యంతయు జరిగెనని, అది యేమియు తనకు తెలియదని తన్నుమన్నించి రాజ్యమును స్వీకరింప వలసినది అని అన్నను ప్రార్థించెను. భరతుని వ్యథను గమనించి రాముడిట్లు ఓదార్చెను. ''నీయందు దోషము రవంతయు నాకు తోచుటలేదు. నీవు బాల్యమువలన తల్లిని నిందించుచున్నావు. అదియును తగదు. భార్యలయందు పుత్త్రులయందు గురువులకు యథేష్టముగ వర్తించునధికారము శాస్త్రదృష్టితో ఎప్పుడును కలదు, లోకమందు అంతటను ఎట్లో అట్లే మనముకూడ భార్యలము, పుత్రులము, శిష్యులముగా పరిగణింపబడుచున్నాము. నీవును దీనిని గ్రహింపవలసియున్నది''.

*శ్లో. న దోషం త్వయి పశ్యామి సూక్ష్మ మప్యరిసూదన।*
*న చాపి జననీం బాల్యాత్ త్వం విగర్హితు మర్హసి॥*

*శ్లో. కామకారో మహాప్రాజ్ఞ గురూణాం సర్వదానఘ।*
*ఉపపన్నేషు దారేషు పుత్త్రే చ విధీయతే॥*

*శ్లో. ''వయమస్య యథా లోకే సంఖ్యాతా స్సౌమ్య సాధుభిః।*
*భార్యాః పుత్రాశ్చ శిష్యాశ్చ త్వమపి జ్ఞాతుమర్హసి॥ ''*
*(అయోధ్య-సర్గ.101, శ్లో.17-19,)*

తరువాత సీతారామలక్ష్మణులు చిత్రకూటము క్రింద నున్న మందాకినికి పోయి దశరథునకు ఉదకదానపిండప్రదానములు గావించి వచ్చిరి. మరునాడుదయము భరతుడు రాముని యభిప్రాయమును గునించి యుండుటచే దానికి సమాధానముగా నిట్లు చెప్పుచు ప్రార్థించెను.

"మాయమ్మకు సాంత్వనము కలిగింపబడినది. రాజ్యము నా కొసంగబడినది. దానిని నేనే నీకు ఇచ్చుచున్నాను. కావున అకంటక మైన రాజ్యమును అనుభవింపుము".

*శ్లో. "సాంత్వితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ।*
*త ద్దదామి తవైవాహం భుంక్ష్వ రాజ్య మకంటకమ్"॥*
*(అయోధ్య-సర్గ.105, శ్లో.4)*

అప్పుడు రాముడు అంతవఱకును ఎల్లరును విస్మరించిన రాజ్య శుల్కవిషయమును పైకి తెచ్చి ఇట్లనెను. "పూర్వము మీ అమ్మను వివాహ మాడు నప్పుడు మీ తాతగారి సమక్షమున ఉత్తమమైన రాజ్యశుల్కమును వాగ్దాన మొనర్చెను".

*శ్లో. పురా భ్రాతః పితా నః మాతరం తే సముద్వహన్।*
*మాతామహే సమాశ్రౌషీత్ రాజ్యశుల్క మనుత్తమమ్॥.*
*(అయోధ్య-సర్గ.107, శ్లో.3)*

కైకేయిని వివాహమాడునప్పటికి దశరథునకు పుత్రసంతతి లేదు. అందువలన "నీపుత్రికకు కుమారుడు కలిగినచో రాజ్యము వానికే ఇత్తును". అని దశరథుడు కేకయరాజునకు వాగ్దానము చేసి కైకేయిని భార్యనుగా పొందెను. ఇది దశరథుని మనస్సులో మెదలుచునే యున్నది. కాని పెద్దవాడైన రాముని తప్పించి భరతునకు రాజ్యము నొసంగుట ఆయనకు ఇష్టము లేదు. అందువలననే ఆయన కేకయరాజును జనకుని పిలువ నంపకయే రామునకు యౌవరాజ్యపట్టాభిషేకము చేయుటకు నిశ్చయించెను. ఆయనకు భరతునందును శంక కలదని వెనుకనే గమనించితిమి. ఈ శంకాబీజము నుండియే అనర్థపరంపరారూపమైన మహావృక్షము పెరిగినది. ఆయన

భరతుని పిలిపించియున్నచో పట్టాభిషేకము నిర్విఘ్నముగా జరిగి యుండెడిది. రాముడీ విషయమును ప్రస్తావించు నేమో అన్న భయముతోనే ఆయన రాముని పిలిపించి భరతుడు రాకముందే పట్టాభిషేకము చేసికొనవలసినదని చెప్పెను. రాముఁడు తండ్రియభిప్రాయమును గమనించి ఆ ప్రస్తావమును చేయలేదు. ఒక కుమారునకు రావలసిన రాజ్యమును మఱియొక కుమారునకు ఇచ్చునధికారము తండ్రికి కలదు. గురుజనుల వర్తనములో ధర్మాధర్మములను విచారించునధికారము కుమారులకు లేదు. అందువలన అప్పుడాయన ఊరకుండెను. తండ్రి గతించిన తరువాత పరిస్థితి మాఱినది. రాజ్యశుల్కమువలన కైకేయి వరమువలన రెండువిధముల భరతునకు రాజ్యము సంక్రమించినది. కుటుంబమున తాను పెద్దవాడై ఆ విషయమును దాచుట అధర్మము. అందువలన కైకేయి రాజ్యమును గోరుట తప్పుకాదని భరతుడు రాజ్యమును స్వీకరింప వలసినదే అని నిశ్చయించెను.

వసిష్ఠమహర్షి ఈ వాదమును నిరాకరించెను. ఇక్ష్వాకువంశమున మొదటినుండియు జ్యేష్ఠుడే రాజగుచుండుట విధివిహితమై ఆచారముగ నున్నది. అన్న యుండగా తమ్ముడు రాజగుట అధర్మము. పుత్ర సంతతి లేనికాలమున రాజు భార్యాపరిగ్రహము కొఱకు కావించిన రాజ్యశుల్క వాగ్దానము ఇప్పుడు చెల్లదు. ప్రజలందఱు రాముని రాజునుగా కోరుచు న్నారు. అందువలన దశరథుడే రాజ్యశుల్కమును ఉపేక్షించి రామునకు పట్టాభిషేకమును నిర్ణయించెను. ఆయన గతించిన తరువాత పశ్చాత్తప్త రాలైన కైకేయి ఆ రాజ్యమును మరల రామునకే ఇచ్చుచున్నది. కౌసల్యకు శుశ్రూష చేయవలసియున్నది. కావున రాముడు రాజ్యమును స్వీకరింప వలసి నదే అని యాయన నిశ్చయించుచు అంతటితో ఆగక, "నేను నీ తండ్రికి ఆచార్యుడను. నీకును ఆచార్యుండనే. నా మాటను పాటించినచో అది అసద్వర్తనము కానేరదు.

*శ్లో. స తేఽహం పితురాచార్యస్తవ చైవ పరంతప।*
*మమ త్వం వచనం కుర్వన్ నాతివర్తే స్సతాం గతిమ్॥*

*శ్లో. వృద్ధాయా ధర్మశీలాయా మాతుర్నార్హస్యతి వర్తితుమ్*
*అస్యా హి వచనం కుర్వన్ నాతివర్తే స్సతాం గతిమ్.*
*(అయోధ్య-సర్గ.114-శ్లో.4,6,)*

అయినను రాము డంగీకరింపలేదు. గురుశాసనముకన్న తండ్రి యాజ్ఞయే బలవత్తరము. కావున తండ్రిగారి యాజ్ఞ ఉండగా దానికి విరుద్ధముగా గురువు శాసించినచో అది చెల్లదు. అట్లే భర్త కావించిన శాసనమునకు విరుద్ధముగా కైకేయి కాని కౌసల్య కాని ఆజ్ఞాపించినచో అది చెల్లదు. కావున తండ్రి కావించిన యేర్పాటు ప్రకారము భరతుడే రాజ్యమును స్వీకరింపవలె నని రాముడు పలికెను. భరతుడు ఆ మాటలకు సమాధానము చెప్పజాలక పర్ణశాలముందు ప్రత్యుపవేశనము గావించెను. "క్షత్రియునకిది తగదు. దోషపరిహారమునకై ఉదకమును స్పృశించి పిమ్మట నన్ను తాకుము" అని శాసించెను. భరతుడు లేచి వచ్చి అన్నను తాకి, నాకు బదులుగా నీవు రాజ్యము చేయుము. నీకు బదులుగా నేను అరణ్యవాసము చేయుదును అని పలికెను.

రాముడు దీనికి కూడ అంగీకరింప లేదు. రాజ్యశుల్కము సంగతి ఎట్లున్నను తండ్రి కైకేయికి ఋణపడియున్నాడు. ఆమె రెండుపర్యాయములు ఆయనకు ప్రాణరక్షణము గావించినది. అందులకు ఆయన వరము లిచ్చియున్నాడు. ఆ ఋణమును ఆయన తీర్చవలసియే యున్నది. తండ్రి తరువాత కుమారులును ఆ ఋణమును తీర్చక తప్పదు. "తండ్రిగారు జీవించి యుండగా జరిపిన విక్రయమును, కుదువను, కొనుగోలును, ఆయన పోయిన తరువాత నేను గాని భరతుడు గాని లోపింపజేయుట తగదు. వనవాసవ్రతమున సమర్థుడనై యున్న నేను ప్రతినిధిని ఏర్పరచుట జుగుప్సితము. కైకేయి వరములను కోరుట యుక్తము. తండ్రిగారు కావించినది సుకృతము" అని రాముడు నిష్కర్షగా పలికెను. భరతుడు అంగీకరింపలేదు. అప్పుడు అంతరిక్షము నుండి దిగివచ్చిన మహర్షులు తండ్రియొక్క ఋణవిముక్తికై రాముడు చెప్పినదే ధర్మ మని బోధించిరి.

భరతుడేమియు సమాధానము చెప్పలేక "నేను బాలుడను. ఈ రాజ్యమును పాలింపలేను. నీవే ఈ రాజ్యభారమును వహింపవలె" అని రాముని ప్రార్థింపజొచ్చెను. రాముడు భరతుని ఒడిలో కూర్చుండబెట్టుకొని మంత్రులసాయమున నీవు చక్కగా పాలింపగలవు, అని చెప్పుచు నిట్లనెను. "చంద్రుని నుండి కాంతి తొలగిన తొలగ వచ్చును, హిమవంతుడు హిమమును త్యజింప వచ్చును సాగరము చెలియలి కట్టను అతిక్రమింప వచ్చును. నేను తండ్రి యొద్ద కావించిన ప్రతిజ్ఞను వీడను. కామము వలన గాని లోభమువలనఁగానీ మీ యమ్మ నీకొరకు ఇట్లు చేసినది. అది నీవు మనస్సున పెట్టరాదు. తల్లియెడల ఎట్లు వర్తింప వలయునో ఆమె యెడల నీవు అట్లే వర్తింప వలయును. రాముడు తుదకు తన ప్రతిజ్ఞాపాలనముతో దీనిని పరిష్కరించెను. ప్రతిజ్ఞను వదులుకొమ్మని రామునకు చెప్పుటకు ఎవరికిని సాహసములేదు.

అప్పుడు భరతుడు తీవ్రముగ ఆలోచించి తాను రాజ్యమును స్వీకరింపకుండుటకై ఒక విధానము ఏర్పరచి రాము నిట్లు ప్రార్థించెను. అన్నా! నీ మాట ప్రకారమే నేనును పితృాజ్ఞను పరిపాలింతును. కాని నేనుగాకాను. మీ పాదముల యాన. మీ పాదుతల సాక్షిగా పరిపాలింతును. అది కూడ ఒక ఒడంబడిక మీద పదునాలుగేండ్ల వరకు మాత్రమే. ఆ మరుదినమే నీకు నాకు కనబడి నీ రాజ్యమును స్వీకరింపకున్న నా కగ్ని ప్రవేశమే గతి. దయచేసి నీ ప్రతీకగా నీ పాదుకలనిమ్ము. రాముడు ఇచ్చిన పాదుకలను తలపై మోసికొనుచు అనుచరగణముతో రాముని వీడి అయోధ్యారాజధానీ సమీపమందున్న నందిగ్రామమను పల్లెను చేరి అచ్చటనొక ఆసనముప్తి పాదుకలనుంచి తాను నారచీరలతో సేవించుచు రామానుచరుడుగ రాజ్యపాలన జరుపుచుండెను.

భరతుని నిస్వార్థ, సహోదరతా, పితృభక్తికి పతాక పాదుకాపట్టాభిషేకము.

# 5. రామాయణ కావ్య సౌందర్య సమాలోచనము

పోలూరి హనుమజ్జానకీరామశర్మ

రామాయణకావ్యము యొక్క సౌందర్యమును గూర్చి సమాలోచనము చేయుట సకలకావ్యలక్షణ సౌందర్యమును సమాలోచించుటయే అగును. అది ఆదికావ్యము. తరువాత కావ్యములు రచించిన కాళిదాసాది మహాకవుల కందరకును అదియే పరమమైన యాధారము. మొదట కావ్యమును విన్న మహర్షులే "పరం కవీనాం ఆధారమ్" అని ప్రశంసించిరి. అంతే కాదు వారు దీనిని ఆయుస్సును పుష్టిని కలిగించునది సర్వశ్రుతి మనోహరము అని కూడ ప్రశంసించిరి".

*శ్లో. ఆయుష్యం పుష్టి జననం సర్వ శ్రుతిమనోహరమ్*

*బాల-సర్గ.4. 1-28*

కావ్యము ఆయుష్యమును పుష్టిని కలిగించుటేమి? ఆహారము రుచికరముగా ఉండుట ఎంతముఖ్యమో ఆరోగ్యమును ఆయుస్సును పుష్టిని కలిగించునదిగా ఉండుటయు అంతే ముఖ్యము. బజారులో అమ్మ మిఠాయి వస్తువులు రుచికరములే. కాని అవి శుభ్రముగా నుండవు. మంచి భోజనమువలె ఆరోగ్యమును పుష్టిని కలిగింపవు. కావ్యముల విషయము కూడ ఇంతే. రసవంతములైన కావ్యములు అన్నియు మనస్సునకు ఆరోగ్యమును ప్రశాంతిని బలమును కలిగించునవిగా ఉండవు. అవి ప్రశస్తములు కావు. మహర్షులు అట్టికావ్యములను రచింపరు. వారు కేవలము తమవినోదము కొఱకో లేక ప్రజలకు వినోదము కలిగించుట కొఱకో కావ్యములను రచింపరు. మానవులయొక్క అభ్యుదయము కొఱకే మహర్షులు కావ్యములను రచింతురు. అభ్యుదయమును పొందుటకు మానవులకు ధర్మమే సాధనము. కాని శాస్త్రవిహితమైన ధర్మము చేదుమాత్ర వలె సామాన్యమానవులకు సులభముగ మ్రింగుడుపడదు. చేదుమాత్రను

తేనెతో కలిపి మ్రింగించినట్లుగా మహర్షులు చిత్రములైన కథలతో వీరము, కరుణము మొదలగురసములతో ధర్మోపదేశమును మేళవించి కావ్యములను రచింతురు.

కావున ఆర్షములైన కావ్యములకు ప్రధానలక్ష్యము ధర్మోపదేశమే కాని రసస్పష్టి కాదు. ధర్మోపదేశమునకు అది ముఖ్యసాధనము. కాబట్టి ఆర్షకావ్యములకు ఆత్మ ధర్మోపదేశము; రసము ప్రాణము, ప్రాణములేని శరీరమునందు జీవాత్మ నిలువదు. కావున వారు ధర్మోపదేశరూపమ్మైన జీవాత్మ చక్కగా నుండుటకై శరీరమును వలె కథను ప్రాణశక్తినివలె రసమును చక్కగా పోషించుచుందురు. ఆ కావ్యములలో పాత్రచిత్రణము ఇంద్రియముల పటుత్వమువలె, సంవాదములు వర్ణనములు కండరముల పుష్టివలె, రీతిలేక శైలి హాయిని కలిగించు సన్నని సిల్కు వస్త్రములవలె, అలంకారములు అలంకారములవలెనే, చక్కగా పోషింపబడును.

రామాయణకావ్యమునకు వేదధర్మమే ఆత్మ అనుట సుప్రసిద్ధము. వేదవేద్యుడైన పరమపురుషుడు దశరథాత్మజుడై జన్మింపగా వేదము సాక్షాత్తుగా ప్రాచేతసునివలన రామాయణముగ ఆవిర్భవించెను. అని పూర్వులు ఎప్పుడో చెప్పిరి.

*శ్లో. వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే॥*
*వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా॥.*

కావున వేద ధర్మప్రతిపాదనము కొఱకే రామాయణము ఆవిర్భవించినది. దేవుని ప్రతిష్ఠించుటకై ఆలయమును శిల్పశాస్త్రమునను సరించి సర్వావయవ శోభితముగా మనోహరముగా ఎట్లు నిర్మింతురో అట్లే వాల్మీకిమహర్షి కూడ పరమపురుషుడైన శ్రీరామచంద్రుని వాఙ్మయమున శాశ్వతముగా ప్రతిష్ఠించుటకు సకల సౌందర్య లక్షణశోభితముగా రామాయణమును మనోహరమ్మైన మహాకావ్యమునుగా నిర్మించెను. కావుననే ఆదికవుల కందఱకును పరమమ్మైన యాధార మయ్యెను.

దాని యందు మహోజ్జ్వలముగా ప్రకాశించుచున్న కావ్యసౌందర్య లక్షణములలో కొన్నింటిని దిక్ప్రదర్శనమాత్రముగ గ్రహింతము. రూప సౌందర్యమునకు అవయవములు ఉచితమైన విస్తృతితో పరస్పరము అతికియుండుట ఆవశ్యకము. ముక్కు పొడవుగనో కన్నులు చిన్నవిగనో యున్నచో శరీరము అందముగా నుండదు, ఏ యవయవములు ఎంత ఉండవలయునో అంతగా ఉన్నప్పడే శరీరము అందముగా ఉండును. కథాశరీరము కూడ ఇట్టిదే. ఇందు శ్రీరాముడు కాక దశరథుడు, సుగ్రీవుడు, ఆంజనేయుడు, రావణుడు మొదలుగా ముఖ్యులైన వారు చాలామంది కలరు. అయినను ప్రతికాండయందును రాముని చరిత్రయే ప్రధానముగా ఉండును. ఏ పాత్రయైనను శ్రీరాముని మించి మనదృష్టిని ఎచ్చటను ఆకర్షింపదు. ఆ పాత్రలను కథలో ప్రవేశపెట్టునప్పుడు వారిని గూర్చి చాల సంగ్రహముగా ప్రధానాంశములను మాత్రమే వాల్మీకి ప్రస్తావించును.

రావణుడు పెద్ద చరిత్ర గలవాడు. వానిని గూర్చి దేవతలు విష్ణువుతో చెప్పునప్పుడు విశ్వామిత్రుడు దశరథునితో చెప్పునప్పుడు శూర్పణఖ రామునితో ప్రసంగించునప్పుడు వాని పరాక్రమాతిశయమును లోక కంటకత్వమును మాత్రమే నాలుగైదు వాక్యములలో మహర్షి వర్ణించి వదిలివేయును. ప్రతినాయకుడుగా రావణుడు చాల ముఖ్యుడే. వాని చరిత్రను ముందే వర్ణింప మొదలిడినచో పాఠకులదృష్టి రామునిపై నుండి చెదరి రావణునిపై ప్రసరించుట సంభవించును. వాలిసుగ్రీవుల వృత్తాంతములు కూడ ఇట్టివే. రాముని ప్రధానకథ జరుగుచున్నప్పుడు వాల్మీకి వీనిని పైకి తేలేదు. శ్రీరామునకు పట్టాభిషేకము జరుగునప్పటికి సీతారాములయొక్క మహనీయత పాఠకుల హృదయములకు హత్తుకొని వారిచరిత్రయందు కుతూహలము కూడ కొంతవఱకు శమించును. అందువలన ఉత్తరకాండలో కార్యముల తొందఱలు ఏమియు లేకుండ అందరును స్తిమితముగా నున్నప్పుడు శ్రీరాముడు ప్రశ్నింపగా అగస్త్యుడు రావణాదులవృత్తాంతములను విపులముగా వర్ణించిచెప్పెను. మరల ముగింపునందు శ్రీరాముని ధర్మ నిర్వహణమునకు నికషోపలములైన సీతా

వివాస్యమును లక్ష్మణ పరిత్యాగమును అద్భుతముగా వర్ణించి మహర్షి మరల పాఠకులదృష్టిలో సీతారాములనే ఆరాధ్యదైవతములనుగా నిలిపెను. కథారచనలో ఏ వృత్తాంతమును ఎప్పుడు ఎంతవఱకు చెప్పవలయునో వాల్మీకికి తెలిసినట్లు ఆ కథనే మరల రచించిన ఇతరులకు తెలియలేదన్నచో అతిశయోక్తి కాదు.

రామకథను సంస్కృతములో ఇతర భాషలలో కావ్యములుగా నాటకములుగా వ్రాసినవారు ఎందరోకలరు. అవి పాఠకులకు కల్గించుచున్న సంస్కారములను బట్టి వానియందున్న కథాశిల్పమును మనము గమనింపవచ్చును. కొన్ని రామాయణములను చదువునప్పుడు "మేనకా విశ్వామిత్రులఘట్టము అత్యద్భుతముగా నున్నది". అనియో, "నిజముగా ఈ కథకు రావణుడే నాయకుడు" అనియో లేక "పాపము! శూర్పణఖకు ఎంత అన్యాయము జరిగినది! నిజముగా ఆమె పరిస్థితి చాలా దయనీయము" అనియో తోచినచో ఆరచన లందు కథానిర్మాణకౌశలము లోపించిన దనియే స్పష్టమగుచున్నది.

వాల్మీకియొక్క పాత్రనిర్మాణకౌశలము అనుపమానము. కొలది మాటలలోనే ఆయన ఏ వ్యక్తియొక్క శీలము నైనను చెఱగని ముద్రపడు నట్లుగా చిత్రింపగలడు. శ్రీరాముడు కేవలము ధర్మమునే ఉపాసించు నని ఆయన ఎట్లు చిత్రించెనో చూడుడు. రాజ్యమును వదలి పెట్టి పోవలసి నప్పుడు కైకతో ఆయన చెప్పినమాటలు ఆయన శీలమునకు నికషోపలము కేంద్రబిందువులు. "నేను అర్థపరుడను కానమ్మా! ఈ లోకము నంతను ఆక్రమించుకొని యుండవలయు నను తలంపు నాకు లేదు. కేవలము ధర్మమునే అవలంబించియున్న నన్ను ఋషులతో సమానునిగా ఎఱుంగుము".

*శ్లో. నాహ మర్థపరో దేవి లోక మావస్తు ముత్సహే।*
*విద్ధి మాం ఋషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్॥ 20*
*(అయోధ్య .సర్గ.19)*

రాక్షసులతో వైరము వలదని సీత వారించినప్పుడు కూడ ఆయన తన శీలమును విస్పష్టముగా ప్రకటించినాడు "జానకీ! నేను జీవితమును గాని, లక్ష్మణునితో కూడ నిన్నైనను వదలిపెట్టుదును గాని చేసిన ప్రతిజ్ఞను, అందును బ్రాహ్మణులకు ఇచ్చిన మాటను, వదలను",

*శ్లో. అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్।*

*శ్లో. న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః॥*

*అరణ్య–సర్గ.10 18, 19*

ఆయన ఏ ముహూర్తమున ఈ మాట అన్నాడో కాని, సీతను లక్ష్మణుని కూడ తరువాత పరిత్యజింపవలసివచ్చెను.

లక్ష్మణుని శీలపవిత్రత ఎట్టిదో ఒక్క శ్లోకములోనే మహర్షి ఎంత చక్కగా చిత్రించెనో చూడుడు. సీతాదేవి యొక్క నగలను చూచుచు రాముండు కన్నులు బాష్పపూర్ణము లగుటచే చూడలేక వానిని లక్ష్మణున కిచ్చి అవి సీతవే అగునేమో గుర్తింపు మనెను. అప్పుడు లక్ష్మణుడిట్లనెను. "ఆమె యొక్క కేయూరములను కుండలములను నే నెఱుంగను. నిత్యము ఆమెకు పాదాభివందనము చేయుచుండుటవలన నూపురములను మాత్రము గుర్తింపగలను"

*శ్లో. నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే*

*శ్లో. నూపురేత్వభిజానామి నిత్యం పాదాభివంద నాత్॥*

*కిష్కింధా – సర్గ.6. 22, 23*

పదుమూడేండ్లు విజనములైన వనములలో ముప్పురే కలిసియున్నప్పుడు లక్ష్మణుడు శీలమును ఎంత అసిధారావ్రతముతో కాపాడు కొనెనో, ఒక్క శ్లోకముననే మహర్షి ఎంత అద్భుతముగా చిత్రించెనో చూడుడు.

రావణుడు దేవతలను జయించిన పరాక్రమశాలి యయ్యును ఎంత నీచుడో మహర్షి ఒక్క శ్లోకముననే వ్యక్త మొనర్చెను. "నీవు

పరాక్రమశాలివైనచో రాముని ఎందులకు ఎదుర్కొన లేదు? దొంగవలె నన్నేల తెచ్చితివి''? అని సీత అనేక పర్యాయములు అధిక్షేపింపఁగా రావణుడు చెప్పిన సమాధానము వినుడు ''ఓసి! భయశీలా! అపహరించి గాని బలాత్కరించి గాని ఎట్లైనను పరస్త్రీలను పొందుట రాక్షసులకు స్వధర్మము''.

*శ్లో. స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః।*

*గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమధ్యవా ॥*

*సుందర - సర్గ. 20. 5*

పులస్త్యుని మనుమడు విశ్రవసుని పుత్రుడు కుబేరుని తమ్ముడు ఒక జాతి కంతకును ప్రభువైన వాడు ఇట్లు మాటాడవచ్చునా? లంకలో ప్రభుత్వము ఇట్లే జరుగుచున్నదా? ఈ యొక్క శ్లోకముచేత రావణుని యొక్క నీచత్వ మెట్టిదో మహర్షి స్పష్టమొనర్చుచున్నాడు.

నాటకీయతను గొప్ప కావ్యగుణముగా పరిగణించు చున్నారు. నాటకమును చూచునప్పుడు దృశ్యములు ఎట్లు కన్పించుచుండునో అట్లే కావ్యమును వినుచున్నప్పుడు చదువు చున్నప్పుడు ఆయా సన్నివేశములు మనస్సునందు స్పష్టముగా గోచరించుచున్నచో ఆ సన్నివేశములు కనులకు కట్టినట్లుగ నున్నవని చెప్పుదుము. పాత్రల పరస్పర సంఘర్షణమును, మానవప్రయత్నమునకు దైవముయొక్క ప్రాతికూల్యమునఁగలుగు విపత్తులను, ఆ పరిస్థితులలో పాత్రల చిత్తవృత్తులందు గలుగు సంఘర్షణ మును నాటక కర్తలు ప్రత్యేక శ్రద్ధతో వర్ణించు చుందురు. ఈ గుణముల సముదాయమును నాటకీయత అనుచున్నాము.

సాహిత్య కళయందు నాటకరచనా శిల్పము పరాకాష్ఠ. కావుననే "నాటకాంతం హి సాహిత్యమ్" అను ప్రసిద్ధి ఏర్పడినది. కావున కావ్యములలో కూడ ఈ నాటకీయత పుష్కలముగా నున్నచో అవి గొప్ప కావ్యములని ఆ కావ్యకర్తలు సాహిత్యకళా కోవిదులని మనము ప్రశంసించుచున్నాము. తెలుగున తిక్కనకు గల యీ ప్రశస్తి సుప్రసిద్ధము. సంస్కృతమున ఈ నాటకీయ శిల్పమున వాల్మీకిని సరిపోలదగినవాడు

మఱియొకడు లేడన్నచో అతిశయోక్తి కాదు . ఇది మామూలు మాట కాదు. పరిశోధనవలన తేలినసిద్ధాంతము. మా అక్కగారు క్రీ.శే. చోరగుడి హనుమత్ శేషమ్మగారు, భాషాప్రవీణ, ఎమ్.ఓ.ఎల్. 1954-55 సంవత్సరములో "రామాయణము - నాటకకర్తలు" అను విషయమును గూర్చిపరిశోధించి ఆంగ్లమునసిద్ధాంతవ్యాసమును (thesis) వ్రాసి ఆంధ్రవిశ్వ విద్యాలయము వారి వలన ఎమ్.ఓ.ఎల్. పట్టమును పొందినది. అప్పటికి ముద్రింపబడి లభ్యమై యుండిన రామకథానాటకము లను అన్నింటిని పరిశీలించి ఆమె వాల్మీకి రచనముతో సరిపోల్చినది. మూలకథను మార్చి నాటకీయముగా చేయవలయు నను తలంపుతో భాసుడు మొదలగువారు చేసిన కల్పన లన్నియు మొదట చూచినంతనే ఎంతో అద్భుతముగా నున్నట్లు తోచినను, మూలముతో సరిపోల్చినప్పుడు సమంజసములుగా తోచవు. కల్పనలకన్న వాల్మీకి మూలమే ఆద్యంతము నాటకీయముగా నుండును. కావున నాటకకర్త లలో కూడ వాల్మీకియే శ్రేష్ఠుడు.

ఒక్కదృష్టాంతమును గమనింపుడు భరతుడు మేనమామ యింటినుండి తిరిగివచ్చినప్పుడు అయోధ్యకు సమీపమున ప్రతిమా గృహమును చూచి అందులో ప్రవేశించి పూర్వులవిగ్రహములతో పాటు దశరథుని ప్రతిమను చూచి తండ్రి మరణమును గ్రహించె నని భాసుడు ప్రతిమానాటకమున కల్పించెను. తరువాత కైకేయి యితర రాణులతో అచ్చటికి వచ్చును. అప్పుడు "ఇట్లేల జరిగిన" దని భరతుడు కైకేయి నడుగును. "మీ నాయనగారికి పుత్రవియోగము కలుగవలసినట్లుగా శాపమున్నది. ఆ శాపనిర్వాహమునకై నేను పూనుకొని పదునాల్గు దినములన బోయిపదునాలుగేండ్లు అని పలికితిని. అందువలన ఇట్లు సంభవించినది". అని ఆమె సమాధానము చెప్పెను.

భరతుడు ఓహో! దీని కంతకును దైవము కారణమన్నమాట అని సమాధానపడును. ఈ దృశ్యము రంగస్థలమున ప్రదర్శించునప్పుడు చాల చిత్రముగ తోచుననుట యథార్థమే కాని ఇది మూలముకన్న రసవంతమా లేక సమంజసమా? రాజకులము లలో మహారాణులకు అవకాశము

కలిగినచో తమకుమారులు రాజులు గావలయునని తాము రాజమాతలుగా అధికారము వలయునని కోరిక యుండుటసహజము. అందును కైక దశరథుని రెండుపర్యాయములు రక్షించి రెండు వరములను కూడ సంపాదించి యున్నది.

దీనికి మంథర దుర్బోధ తోడ్పై ఆమెయందు అధికారదాహము ప్రబలెను. కౌసల్య రాజమాత య్యై తనపై అధికారము చలాయించు నను భావమును ఆమె సహింపలేక పోయినది. అందువలన దశరథుడు మొదలైన వారందఱు ఎంతగా విలపించు చున్నను ఆమె తనపట్టును వీడక వరములను సాధించు కొన్నది. దశరథునకు ఆమెకు జరిగిన సంవాదము, రాముడు తల్లిదండ్రుల యొద్ద నుండి వీడ్కోలును పొందుట. పరమ కరుణా వేశపూర్ణములై అత్యంతము నాటకీయముగా నుండును.

భరతుడు తిరిగివచ్చిన తరువాత తల్లి వలననే తండ్రిమరణమును తెలిసికొని ఆమెను ధిక్కరించుచు మహోదుఃఖముతో పలికినమాటలు అవేశపూర్ణములైన నాటకప్రదర్శనమునకు ఎంతో తగియుండును. రంగస్థలమున దృశ్యము రక్తికట్టుటకు తీవ్రమైన సంఘర్షణము అవేశపూర్ణములైన ప్రసంగములు ఆవశ్యక మనుట అందఱకును అనుభవసిద్ధమే. మరి యీ దృష్టితో చూచినప్పుడు భాసుని కల్పనము ఎంత చప్పగా నున్నదో చెప్పనక్కరలేదు.

మహర్షి ఏ సన్నివేశమును చిత్రించినను అది కనులకు కట్టినట్లుగా నుండునని మొదట ఈ కావ్యమును విన్న మహర్షులే ప్రశంసించిరి. "చాలాకాలము క్రిందట జరిగిపోయిన వృత్తాంతము ఇప్పుడు ప్రత్యక్షముగు చున్నట్లుగా చూపబడినది".

*శ్లో. చిరనిర్వృత్త మప్యేతత్ ప్రత్యక్షమివ దర్శితమ్।*

*బాల-సర్గ 4 18*

ఇట్లు సన్నివేశములను ప్రత్యక్షము లగునట్లు చేయుటకు వర్ణనమే ముఖ్యసాధనము. దానికి అలంకారగణములు సహకరించును. కొంది

దృష్టాంతములను చూడుడు. దరశథునకు అపరకర్మలు పూర్తి యైన తరువాత నగరమును అంతఃపురములను అలంకరించుచుండిరి. అప్పుడు మంథర కూడ అలంకరించుకొనెను. శ్రేష్ఠమైన గంధమును పూసికొని రాజవస్త్రములను ధరించి చాల నగలు పెట్టుకొని వడ్డాణము బంగారు హారములు పుష్పమాలికలు ధరించి తన ప్రాభవమును ప్రకాశింపజేయుచు ఇటునటు తిరుగుచుండెను. రాజమాత కానున్న కైకేయికి అది అంతరంగికు రాలు గదా! ఇంతవరకు బాగుగనే యున్నది. అది చూచుటకు ఇతరులకు ఎట్లున్నదో వాల్మీకి ఒక్కమాటలో "త్రాళ్లతో కట్టబడిన క్రోతివలె నున్నది" అని చెప్పినాడు. ఈ యొక్క మాట చేత అది గూనిది అనువిషయమును ఆయన కనులకు కట్టునట్లు చేసినాడు.

*శ్లో. లిప్తా చందనసారేణ రాజవస్త్రాణి బిభ్రతీ।*
*వివిధం వివిధై స్తైర్భూషణై శ్చ విభూషితా॥*
*శ్లో. మేఖలాదామిభి శ్చిత్రై రన్యైశ్చ వరభూషణైః।*
*బభాసే బహుభిర్బద్ధా రజ్జుబద్ధేవ వానరీ॥*

*అయోధ్య – సర్గ – 7 6, 7, 8*

మఱియొక దృష్టాంతమును చూడుడు. భరతుని వెంట నున్న సైన్యమునుచూచి గుహుడు "నీవు రాముని యొద్దకు దుష్టబుద్ధితో పోవుట లేదుకదా! నీయీసైన్యము సందేహమును కలిగించుదానివలె నున్నది". కౌసల్యవలన మంత్రులవలన ఇట్టి సందేహములను ఎదుర్కొనుచు ముందే భరతుడెంతో బాధపడుచున్నాడు. అందఱివలెనే గుహుడు కూడ సందేహించి నాడు. అప్పుడు భరతుని గూర్చి ఒక్కటే యుపమానముతో మహర్షి "ఆకాశమువలె నిర్మలుడైన భరతుడు గుహునకు మెత్తని మాటలతో సమాధానము చెప్పెను" అని వర్ణించెను.

*శ్లో. కచ్చిన్న దుష్టో వ్రజాసి రామస్యాక్లిష్ట కర్మణః।*
*ఇయం తే మహతీ సేనా శంకాం జనయతీవ మే॥*
*శ్లో. త మేవ మభిభాషన్త మాకాశ ఇవ నిర్మలః।*
*భరతశ్శ్లక్ష్ణ యా వాచా గుహం వచన మబ్రవీత్॥*

*అయోధ్య – సర్గ – 85 – 7, 8*

ఆకాశముపై ఎవరైనను దుమ్ము చల్లినచో అది వారినెత్తి పైననే పడును కాని ఆకాశమున నిలువదు. భరతుడు ఆకాశమువలె నిర్మలుడు. అందువలన ఎవరైనను అతనియందు దోషమును శంకించినచో అది అతనికి చేరక పోగా వెనుకకు తిరిగివచ్చి శంకించిన వారికే పశ్చాత్తాపరూపమైన బాధను కలిగించును. అంతే కాదు. అతడు నిర్మలుడై గుహునకు సమాధానము చెప్పెననుటవలన, గుహుని విషయమున అతడు కోపమును పొందలేదనియు వ్యక్తమగుచున్నది.

చెట్లను తీగలను మనుష్యులతో చిత్రముగ పోల్చి వర్ణించుటలో కూడ వాల్మీకి కవుల కందఱకు మార్గదర్శకుడు. పంపాసరోవరమువద్ద "పుష్పములతో కప్పబడిన శిఖరములతో తుమ్మెదలగుంపులతో ఏర్పడిన జుట్టుముడులతో గాలికి ఇటునటు ఊగుచున్న పాదపములు గొప్ప గాయకుల వలె నున్న"వట.

*శ్లో. పుష్ప సంఛన్న శిఖరాః మారుతోత్క్షేపచంచలాః।*
*అమీ మధుకరోత్తంసాః ప్రగీతా ఇవ పాదపాః॥*

*కిష్కింధా - సర్గ- 1, 20*

సిగ్గుపడునపుడు ఎవరైనను తలవంచుకొందురు. తనవలన తప్పుజరిగిన దని తనకు ఇతరులకును తెలియుచున్నప్పుడు అట్టివాడు చాల సిగ్గుపడుచున్నచో ఎట్లుండును? మహర్షి వర్ణించుచున్నాడు చూడుడు. భరతుడు సైన్యముతో వచ్చుచుండుటను చూచి అతడు తమపై దండెత్తి వచ్చుచున్నాడని వానిని వెంటనే సంహరింపవలెనని లక్ష్మణుడు రామునితో అనెను. అప్పుడు రాముడు ఇట్లనెను. "ఏల ఇట్లు మాటాడెదవు? అతడు మన కెప్పుడైన ఇంతకు పూర్వము ఒక్కయపరాధమైన చేసియున్నాడేమో చెప్పుము. వానికి రాజ్యకాంక్షలేదు. ఈ లక్ష్మణునకు రాజ్యమిమ్ము అని నేను చెప్పుదునేని, వెంటనే వాడు అంగీకరించును". "ఇంతకన్నను లక్ష్మణునకు భంగపాటు ఏమున్నది?" "ధర్మశీలుడైన యన్న అట్లు చెప్పగా ఆయనయొక్క హితమునే కోరుచుండిన లక్ష్మణుడు లజ్జచేత తన యవయవములలోనికి తాను కుంచించుకొని పోయి నట్లయ్యెను".

*శ్లో. ఉచ్యమానో హి భరతో మయా లక్ష్మణ తద్వచః।*
*రాజ్యమస్మై ప్రయచ్ఛేతి బాఢ మిత్యే వ మంస్యతే.॥ 18*

*శ్లో. తథోక్తో ధర్మ శీలేన భ్రాత్రా తస్య హితేరతః*
*లక్ష్మణః ప్రవివేశేవ స్వాని గాత్రాణిలజ్జయా॥*

*అయోధ్యా - సర్గ . 97. 18, 19*

వర్ణనములో రెండు విధములు కలవు. రూపమును కనులకు గట్టునట్లు చిత్రించుట మొదటిది. పాత్రయొక్క సుస్థితినో దుస్స్థితినో మనస్సునకు నచ్చునట్లు చేయుట రెండవది. మొదటి దానిని చాలామంది చేయగలరు. రెండవది దుష్కరము. రూప చిత్రణము నందు కూడ వాల్మీకికి సమాను లుండరు. లంకలో నున్న సీతను ఆయన ఎట్లు వర్ణించుచున్నాడో చూడుడు. "ఉపవాసములచేత కృశించి దీనురాలై మాటిమాటికి నిట్టూర్పు శుక్లపక్షముల యొక్క ఆరంభమున కన్పించు చంద్రరేఖవలె, చీకటిచేత రూపము చక్కగా కన్పించక పోవుటచే పొగలమధ్యలో నున్న యగ్నిజ్వాల వలె, అలంకారరహితమై ధూళితోకప్పబడి మాసిపోయిన పచ్చని పట్టు వస్త్రముతో బురద కన్పించుచుండిన పద్మములు లేని సరస్సువలె, ఉన్న సీతను ఆంజనేయుడు చూచెను".

*శ్లో. ఉపవాసకృశాం దీనాం నిశ్శ్వసంతీః పునఃపునః।*
*దదర్శ శుక్లపక్షాదౌ చంద్రరేఖా మివామలామ్॥*

*శ్లో. మందం ప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభామ్।*
*పినద్ధాం ధూమజాలేన శిఖా మివ విభావసోః॥*

*శ్లో. పీతే నైకేన సంవీతాం క్లిష్టేనోత్తమ వాససా।*
*సపంకా మనలంకారాం విపద్మా మివ పద్మినీమ్॥*

*సుందర - సర్గ - 15 - 19, 20, 21*

ఇంక రెండవ విధమైన వర్ణనమును పరిశీలింపుడు. సందేహ గ్రస్తమైన స్మృతివలె, పతనము నొందిన ఐశ్వర్యమువలె సడలిపోయిన శ్రద్ధవలె, భంగపడినయాశవలె, ఆపదలతో కూడిన కార్యసిద్ధివలె కలుషితమైన బుద్ధివలె, అసత్యమైన యపవాదముచేత పడిపోయిన కీర్తివలె, శాస్త్రాభ్యాసము లేక పోవుటచే మిగుల శిథిలమైన విద్యవలె, సంస్కారహీనమై అర్థాంతరమును పొందిన వాక్కువలె ఉన్న సీతను హనుమంతుడు చూచెను.

*శ్లో. తాం స్మృతిమివ సందిగ్ధామృద్ధిం నిపతితా మివ ।*
*విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతామివ ॥* 33

ఈయుపమాన విషయము లన్నియు మనుష్యునకు ఎప్పుడో ఒకప్పుడు తటస్థించి ఎంతో వ్యథను కలిగించునట్టివి. ఆ వ్యథ అనుభవైక వేద్యము. ఇన్ని విధములైన వ్యథలు కూడినచో ఎంత బాధకలుగునో అంత దుఃఖస్థితిలో ఆమె యున్న దని మహర్షి సూచించు చున్నాడు.

*శ్లో. సోపసర్గాం యథాసిద్ధిం బుద్ధిం సకలుషా మివ।*
*అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ ॥* 34

*ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ ।*
*సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్ ॥*
*సుందరకాండ – సర్గ 15, 38, 39*

"మధుమయములైన ఫణితులకు మహర్షి మార్గదర్శి" – (మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః) అని వాల్మీకిని శ్రుతిమనోహర మైన రచనకు మార్గదర్శినిగా భోజుడు (పూర్వులు), ప్రశంసించియున్నాడు. అందులకు నిదర్శనముగా సుందరకాండలో పంచమసర్గలోని చంద్రవర్ణన మును, సప్తమసర్గలోని రావణగృహవర్ణనమును, అష్టమ సర్గలోని పుష్పక వర్ణనమును కొందఱు ఉదాహరించు చుందురు. ఆ శ్లోకము లన్నియు ఇంచుమించుగా అంత్యాను ప్రాసచేత మనోహరముగా నున్నవి. కొన్ని సర్గలకు తుదియందు కూడ శబ్దాలంకార శోభితములైన శ్లోకములున్నవి. కొన్నింటిని పరికింపుడు.

శ్లో. *తత స్స మధ్యం గత మంశమంతం జోత్స్నా వితానం మహ*
*దుద్వమంతమ్।*
*దదర్శ ధీమాన్ దివి భానుమంతం గోష్ఠే వృషం మత్త మివ*
*భ్రమంతమ్॥*

శ్లో. *యా భాతి లక్ష్మీర్భువి మందరస్థా తథా ప్రదోషేషు చ సాగరస్థా।*
*తథైవ తోయేషు చ పుష్కరస్థా రరాజ సా చారు నిశాకరస్థా॥*

శ్లో. *శిలాతలం ప్రాప్య యథామృగేంద్రో మహారణం ప్రాప్య యథా*
*గజేంద్రః।*
*రాజ్యం సమాసాద్య యథా నరేంద్ర స్తథాప్రకాశో విరరాజ చంద్రః॥*
*సుందర – సర్గ – 5, 3, 7*

ఇట్లు అంత్యానుప్రాసలతో విశేషవృత్తములను మహర్షి వ్రాసెనాయను విషయమున నాకు సందేహము కలదు. ఈ విశేషవృత్తము లన్నియు సాధారణముగా కావ్యరచనా ప్రవాహమునకు ఎడముగానే యున్నవి. సర్గ తుదియందున్న విశేష వృత్తములలో ఆసర్గలో చెప్పబడిన విషయమే పునరుక్తిగా చెప్పబడియున్నది. అట్లే పైన పేర్కొన్న సర్గలలో విషయము కూడ పునరుక్తముగానే యున్నది. వీనిని తొలగించినను అనుష్టుప్పులలో నున్న ప్రధానకథా విధానమునకు ఏమియు భంగము కలుగదు. అందువలన వీనిని మహర్షి రచించియుండునా యని సందేహింప వలసి వచ్చుచున్నవి. చిరకాలవశమున మూలములోని కొన్ని శ్లోకములు సర్గలుకూడ లుప్త మగుట సంభవము. అట్టియెడల కాళిదాసుతో సమాను డుగా చెప్పదగిన ప్రజ్ఞాశాలియైన కవి ఎవడో ఇట్లు మనోహరములైన శ్లోకములను రచించి 24000 శ్లోక సంఖ్యను పూరించియుండును. కావున ఈ విశేషవృత్తములపై ఆధారపడి మహర్షియొక్క శైలిని గ్రహించరాదు.

శైలి లేక రీతి యన్నది కావ్యరచనమునకు మొత్తమునకు సంబంధించి యుండును గాని ఏవో కొన్నిఘట్టములలో కొన్ని శోకములకు

సంబంధించి యుండదు. ధ్వన్యాలోకకర్త ఆనంద వర్ధనుఁడు చెప్పినట్లుగా మహాకవులు విషయమును రసవంతముగా రచించుటయందే దృష్టి నుంతురుకాని ప్రత్యేకముగా అలంకారములను కూర్చుటకు ప్రయత్నింపరు. రసానుగుణ ముగ వారు రచించునప్పుడు సందర్భము ననుసరించి అర్థాలంకారములు, శబ్దాలంకారములు, రీతులు, వృత్తులు మొదలుగా ప్రత్యేక ప్రయత్నము లేకుండఁగనే సహజముగ రూపొందు చుండును. అట్టివే కావ్యములో సహజములై రసమునకు దోహద మొనర్చుచు శోభించు చుండును. కావున మహర్షియును అంత్యాను ప్రాసలతో విశేషవృత్తములను రచించి యుండు ననుట అసంభావ్యము. వేలకొలదిగా నున్న యనుష్టుప్ శ్లోకము లలో కన్పించుచున్న రచనావిధానమే ఆయన రీతి యని మనము గ్రహింప వలసియున్నది. అనుష్టుప్ శ్లోకములలో అర్థాలంకారము లెంత సహజముగ నున్నవో అక్షరరమ్యతయు అంతే సహజముగా నున్నది. ఈ శ్లోకమును చూడుడు.

*శ్లో. కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే।*
*ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥*

ఈశ్లోకమునందు పూర్వార్థమున సకారములు, మొత్తము శ్లోకమున రేఫలు తఱచుగా వచ్చినవి. ఒక యక్షరము రెండు మూడు పర్యాయములు వచ్చినపుడు ఆ శ్లోకము వినుటకు ఇంపుగా నుండును. మఱియును ఆయన రచనలో ఎచ్చటను దీర్ఘసమాసము లుండవు. చిన్న చిన్న పదములతో ఆయన అమితసరళముగా వాక్యమును రచించును. అట్టి చిన్న వాక్యములలోనే ఆయన సకలరసములను పోషించెను. సీత రావణుని ఎట్లు తర్జించుచున్నదో చూడుడు. "రాముని నుండి సందేశము లేక పోవుటవలన తపస్సును కాపాడుకొను చుండటవలన నా తేజస్సుచేత నిన్ను భస్మమొనరించుట లేదు..... కుబేరుని తమ్ముఁడవు, సైన్యసమేతుడవు శూరుడవై రాముని వంచించి భార్యాచౌర్యమును ఎట్లు చేసితివి"?

*శ్లో. అసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్।*
*న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా ॥*

*శ్లో. శూరేణ ధనదభ్రాత్రా బలైః స్సముదితేన చ*

*అపోహ్య రామం కస్మాద్ధి దారచౌర్యం త్వయా కృతమ్? ||*

*సుందర - సర్గ- 22, 20, 21, -1*

ఇందు దీర్ఘసమాసము ల్లేవు. అయినను సీత యొక్క క్రోధము ఉజ్వలముగా ఇందు ప్రకాశించుచునే యున్నది.

ఇంక ఈ కావ్య గుణముల కన్నింటికిని ప్రాణభూతమైన రసమును గూర్చి కొన్ని యుదాహరణములను పరిశీలింతము. రామాయణము కరుణరసప్రవాహమనుట సుప్రసిద్ధము. మహర్షి యొక్క రసపోషణము అనన్యసాధ్యము. రాముడు అరణ్యములకు పోయిన తరువాత దశరథుడు కైకేయిని వదలి కౌసల్య యింటియందే యుండెను. ఆమె పుత్రవియోగ దుఃఖమును భరింపలేక ఇట్లు ఆక్రోశింపజొచ్చినది. "దయగలవాడు, వదాన్యుడు, ప్రియవాది అని మూడులోకములలో నీ కీర్తి వ్యాపించినను, ఎంతో గారాబముతో పెరిగిన నాకుమారులు అడవులలో ఎట్లుండగలరు? చిన్నపిల్ల సుకుమారియు నైన సీత, ఇచ్చట మంచిభోజనమునకు అలవాటు పడినట్టిది, అడవులలోని ఆకులు దుంపలు ఎట్లు తినును? ........ నీవు దయలేక నా వారిని తరిమివైచితివి. వారు దిక్కులేక వనములలో తిరుగు చున్నారు....... పదునాలు గేండ్ల తరువాత రాముడు తిరిగివచ్చినను తమ్ముడు అనుభవించిన రాజ్యమును స్వీకరింపడు......నా కొడుకు మహావీర్యుఁడు, మహా భుజుడు. వాడు సముద్రముల నైనను నిగ్రహింపగలడు. చేప తన బిడ్డలనే భక్షించునట్లు నీవు అట్టికొడుకునే హతమొనర్చితివి...... స్త్రీకి భర్త మొదటిగతి; పుత్రుడు రెండవగతి, మూడవ గతి జ్ఞాతి జనులు ; నాల్గవగతి లేదు నాకు నీవు లేవు. కొడుకు అడవులపాలైనాడు. ఇంక నేను అడవుల కెట్లు పోవుదును? నీవు నన్ను సర్వ విధముల నాశ మొనర్చితివి".

*శ్లో. యద్యపి త్రిషు లోకేషు ప్రథితం తే మహద్యశః |*

*సానుక్రోశో వదాన్యశ్చ ప్రియవాదీ చ రాఘవః || 2*

శ్లో. కథం నరవర శ్రేష్ఠ పుత్రౌ తౌ సహ సీతయా ।
దుఃఖితౌ సుఖసంవృద్ధౌ కథం దుఃఖం సహిష్యతః ॥ 3

శ్లో. సా మానం తరుణీ శ్యామా సుకుమారీ సుఖోచితా ।
కథ ముష్ణం చ శీతం చ మైథిలీ విసహిష్యతే ॥ 4

శ్లో. భుక్త్వాశనం విశాలాక్షీ సూపదంశాన్వితం శుభమ్।
వన్యం నైవార మాహారం కథం సీతోపభోక్ష్యతే॥ 5

శ్లో. యత్త్వయా కరుణం కర్మ వ్యపోహ్య మమ బాంధవాః ।
నిరస్తాః పరిధావన్తి సుఖార్హాః కృపణా వనే ॥ 10

శ్లో. ఏవం కనీయసా భ్రాత్రా భుక్తం రాజ్యం విశాంపతే ।
భ్రాతా జ్యేష్ఠో వరిష్ఠశ్చ కిమర్థం నావమంస్యతే ॥ 15

శ్లో. నన్వసౌ కాంచనై ర్బాణై ర్మహావీర్యో మహాభుజః ।
యుగాన్త ఇవ భూతాని సాగరా నపి నిర్దహేత్ ॥ 21

శ్లో. స తాదృశ స్సింహబలో వృషభాక్షో నరర్షభః।
స్వయ మేవ హతః పిత్రా జలజే నాత్మజో యథా॥ 22

శ్లో. గతి రేకా పతి ర్నార్యా ద్వితీయా గతి రాత్మజః ।
తృతీయా జ్ఞాతయో రాజం శ్చతుర్థీ నైవ విద్యతే ॥ 24

శ్లో. తత్ర త్వం మమ నైవాసీ రామశ్చ వన మాశ్రితః।
నవనం గన్తు మిచ్ఛామి సర్వథా నిహతా త్వయా ॥ 25

అయోధ్య - సర్గ - 61,

ఆ మాటలను వినుచు భరింపలేక దశరథుడు మూర్ఛిల్లెను. కొంత సేపటికి తెప్పటిల్లి ఆయన నా కిట్టిగతి యేల కలిగినది? అని ఆలోచించుచు ముని బాలకుని చందన వృత్తాంతమును స్మరించెను. ఆ శోకముచేత రాముని శోకము చేతను ఆయన దహింపబడుచు నిలువెల

వణికి పోవుచు రెండు చేతులుజోడించి కౌసల్యను ఇట్లుప్రార్థించెను. కౌసల్యా! కనికరింపుము. ఇదిగో నీకు అంజలిచేయుచున్నాను. నీవు ఎల్లప్పుడు శత్రువులయందు కూడ దయను వాత్సల్యమును చూపు చుందువు. భర్త గుణవంతుడైనను గుణహీనుడైనను ధర్మమును గ్రహించు స్త్రీలకు ప్రత్యక్షదైవతము. నీవు మంచిని చెడును ఎఱిగిన దానవు; ధర్మ పరాయణవు. నీవు ఎంత దుఃఖములో నున్నను అంతకు మించిన దుఃఖములో ఉన్న నన్ను నిందింపదగదు.

*శ్లో. ప్రసాదయే త్వాం కౌసల్యే రచితోఽ యం మమాంజలిః।*
*వత్సలా చాన్నృశంసా చ త్వం హి నిత్యం పరేష్వపి॥*

*శ్లో. భర్తా తు ఖలు నారీణాం గుణవాన్నిర్గుణోఽ పి వా।*
*ధర్మం విమృశమానానాం ప్రత్యక్షం దేవి దైవతమ్॥*

*శ్లో. సా త్వం ధర్మపరానిత్యం దృష్టలోక పరామరా।*
*నార్హసే విప్రియం వక్తుం దుఃఖితాపి సుదుఃఖితమ్॥*

*అయోధ్యా - సర్గ - 62 - 7, 8, 9*

అప్పుడు కౌసల్య అమిత పశ్చాత్తాపము నొంది క్షమింపుమని భర్తను ప్రార్థించినది. కరుణరసప్రవాహములైన యిట్టి ఘట్టములు రామాయణము నందు కొల్లలుగా గలవు.

వాల్మీకి కరుణమునే కాక వీరరౌద్రాది రసముల నన్నింటిని ఇట్లే పోషించెను. తీవ్రములైన రసములను పోషించు కవి తేలికగా నుండు హాస్యమును గూడ పోషింపగలడా అను కుతూహలము ఉండుట సహజము. ఆయన చిన్న విషయములలో కూడ ఎట్లు చమత్కారమును పుట్టించునో చూడుడు. దశరథుడు రామునకు యౌవరాజ్యపట్టాభిషేకము చేయుదునని సభలో ప్రకటించి మీ యభిప్రాయమును చెప్పుడని సభ్యులను

కోరెను. వారందఱును తక్షణమే హర్షధ్వానములు గావించిరి. అప్పుడు దశరథుడు నవ్వుచు "మీరందఱును రాముని పట్టాభిషేక మనగానే ఇంత హర్షధ్వానములు చేయుచున్నారే! మఱి నా పరిపాలనము బాగుండలేదా ఏమి? అని ప్రశ్నించెను. అంతట వారు సర్దుకొని, నీ పరిపాలనము చక్కగానే యున్నది. అందులో లోపములేదు. కాని రాముడు ఇక్ష్వాకువంశములోని వారందఱికన్నను శ్రేష్ఠుడు" అని రాముని కళ్యాణ గుణములను వర్ణించిరి.

సముద్రమును మథించినప్పుడు మొదట విషము పుట్టెను. దేవతలందఱు "రక్షింపుము, రక్షింపుము" అని మొఱపెట్టుచు శంకరుని యొద్దకు పరువెత్తిరి. అప్పుడు విష్ణువు చతుర్ముఖుడై వారియెదుట సాక్షాత్కరించి శివునితో, "నీవు మహాదేవుఁడవు. అగ్రపూజార్హుడవు. ముందు పుట్టిన దానిని స్వీకరింప వలసిన వాడవు నీవే" అని పలికి అంతర్ధానము నొందెను. అప్పుడు శివుడేమి చేయవలె? విషము కాబట్టి వద్దని చెప్పగలడా? విష్ణువు చెప్పినట్లు విషమును స్వీకరించి మహాదేవత్వమును నిలుపు కొన్నాడు.

ఇంతకన్నను చతురమైన సన్నివేశము సుందరకాండమునఁగలదు. సీతయొక్క దుఃఖమును చూచి భరింపలేక. "అమ్మా! నావీపుపై గూర్చుండుము. నిన్ను ఇప్పుడే రాముని యొద్దకు చేర్చగలను అని పలికెను. ఆ మాట వినఁగానే ఆమె చాల ఆశ్చర్యపడెను. హనుమంతుడు లంకలో తిరుగుచున్నప్పుడు రాక్షసులకు సంశయము కలుగకుండుటకై పిల్లియంత యాకారముతో నుండెను. అట్లే చిన్న కోతివలె సీతతో కూడ ఆడుచుండెను అందువలన ఆమె, హనుమా! ఇది కదా నీ కపిత్వము ఇంత చిన్న శరీరముపై నన్ను గైకొని అంతదూరమెట్లు పోగలవు? అని ప్రశ్నించెను. ఇంతమాటను ఆయన ఎవరివలనను పడలేదు. అందువలన మొదటిసారిగా తనకు పరిభవము జరిగినట్లు ఆయన చింతించినాఁడట!

*చింతయామాస లక్ష్మీ వాన్నవం పరిభవం కృతమ్*

*సర్గ. 37 - 31*

అందులకు సమాధానముగా ఆయన తన శరీరమును పెంచి చూపించి సీతాదేవికి విస్మయానందములను గలిగించెను.

కావున కథారచనమునందు, నాటకీయత యందు, వర్ణనా కౌశలము నందు, సకలరసపోషణ సామర్థ్యమునందును వాల్మీకి మహర్షి అద్వితీయు డనుట సునిశ్చితము.

# 6. రామాయణములో హనుమంతుని పాత్ర

పోలూరి హనుమజ్జానకీరామశర్మ

*శ్లో. గోష్పదీకృత వారాశిం మశకీకృతరాక్షసమ్।*
*రామాయణ మహామాలారత్నం వందే౽నిలాత్మజమ్॥*

(ఎవనికి సముద్రము గోష్పదమువలె నయ్యెనో, ఎవడు రాక్షసులను దోమలను వలె నలిపివైచెనో, ఎవడు రామాయణమను మహనీయమైన కాంచన మాలయందు రత్నమువలె వెలుగొందు చున్నాడో అట్టి యనిలాత్మజుడైన యాంజనేయునకు నమస్కరించుచున్నాను)

ఈ చిన్న శ్లోకమునందు ఏ మహాభక్తుడో రామాయణమునందు ఆంజనేయునకుగల ప్రాముఖ్యమును చక్కగా నిరూపించినాడు. అంగదాదులవలె ఆంజనేయుడు కూడ సముద్రమును లంఘింపలేకుండినచో, లంఘించినను సీతను సందర్శించిన తరువాత జరిగిన యుద్ధములో అక్షుడు మొదలుగా నెవరి చేనైనను నిహతుడైనచో రామకథ ముందుకు జరిగి యుండదు. ఆంజనేయుడు లేకున్నచో శ్రీరామవిజయము అసంభవ మగు ననుట అతిశయోక్తి కాదు. అయినను రామాయణ కథామాలయందు రత్నముగ శ్రీరాముని కాక ఆంజనేయుని వర్ణించుట ఆశ్చర్యకరముగా నున్నది. మఱియును దక్షిణదేశమునందు శ్రీరామునియాల యములు అధికముగా నుండగా, ఉత్తరదేశమునందు ఆంజనేయుని యాలయములు హెచ్చుగా నుండు నందురు. శ్రీరాముని యభ్యుదయ మున కంతకు హనుమంతుని విక్రమమే ఆధారమై యుండుట ఇందులకు హేతువని చెప్పవచ్చును.

అంత మాత్రమే కాదు. రత్నమునందువలె ఆయనయందు విక్రమమే కాక యింకను ఎన్నో మహనీయ గుణములు వెలుగులను విరజిమ్ముచున్నవి.

మొట్టమొదటి సారిగా ఆయన శ్రీరాముని సందర్శించుటకు బయలుదేరు సందర్భముననే రామాయణపఠితలకు కూడ మొదటిసారి కన్పించును. ఆ సన్నివేశములోనే ఆయన విశిష్టత, మహత్త్వము విస్పష్టముగా గోచరించును. ధనుర్ధరులైన రామలక్ష్మణులను చూచినంతనే సుగ్రీవుఁడు మహాభీతితో అన్ని దిక్కులకు పఱువెత్తెను. అనుచరులును ఆతని వెంట పరువెత్తిరి. అప్పుడు వారందఱిలో అంజనేయుడొక్కడే నిలిచి ఆలోచించి భయపడ నక్కఱలేదని సుగ్రీవునకు నచ్చజెప్పగలిగెను. మొదటిసారిగా ఆయన మాటలను మనము అప్పుడే విందుము. ఆయన రాజా నొద్దకూడ ఎంత నిశ్చితముగా స్వతంత్రముగా మాటాడగలడో చూడుడు. "ఆహా! ప్లవంగమ! నీ శాఖామృగత్వము చక్కగా వ్యక్త మగుచున్నది కదా! నీవు బుద్ధి విజ్ఞాన సంపన్నుడ వయ్యును లఘుచిత్తతతో నిన్ను నీవు నిలువరించు కొన లేకున్నావు. ఎదుటివారి యింగితములను గ్రహించి చేయవలసిన దంతయు చేయుము. బుద్ధినిలకడ లేని రాజు సర్వభూతములను శాసింప జాలడు".

*శ్లో. అహో శాఖామృగ త్వం తే వ్యక్త మేవ ప్లవంగమ।*
*లఘుచిత్తత యాత్మానం న స్థాపయసి యో మతే॥*

*శ్లో. బుద్ధివిజ్ఞాన సంపన్న ఇంగితై స్సర్వ మాచర।*
*నహ్యబుద్ధిం గతో రాజా సర్వభూతాని శాస్తి హి॥*
*(కిష్కింధాకాండ – సర్గ 2 – శ్లో. 17,18)*

ఇందు పరిహాసము కూడ కలదు. అయినను సుగ్రీవుడు కోపపడ లేదు. ఆ కపిరాజు హనుమంతుని వాక్యమునందలి హితమును గ్రహించి అభినందన పూర్వకముగా ఆ రాజపుత్రుల వృత్తాంతమును కనుగొనుటకు ఆయననే పంపెను. దీని వలన ఆయన సుగ్రీవుని కన్న ఎంత బుద్ధిశాలియో స్పష్టమగుచున్నది.

సుగ్రీవుడు ప్రాకృతుని వలె రాజపుత్రుల యొద్దకు పొమ్మనగా ఆంజనేయుడు శఠబుద్ధితో భిక్షురూపమున పోయెను. (భిక్షురూపం తతో

భేజే శఠబుద్ధితయా కపిః) శఠబుద్ధి కపులకు సహజగుణము. గొప్పవిద్యా సంస్కారము కలిగినవారికి కూడ జాతి సహజమైన గుణము అప్పుడప్పుడు పైకి వచ్చుచునే యుండును. కాని యీ బుద్ధి ఆయనకు మహనీయులైన రామలక్ష్మణులను చూచినంతనే ఎగిరిపోయినది. విద్వాంసుడు విద్వాంసుల సన్నిధికి పోయినప్పుడు పొందునట్టి వినయము, ఆర్జవము, సరసోదాత్త భాషణము మొదలగు నుత్తమ పురుషుని గుణము లన్నియు ఆయన యందు పైకి వచ్చెను. వారిని చూడగానే సుగ్రీవుడు శంకించినట్లుగా వారు వాలిచేత ప్రయోగింపబడిన పరతంత్రులు కారని స్వతంత్రులు తేజస్వులు నైన రాజపుత్రులని ఆయన నిశ్చయించెను.

పెద్దల సన్నిధియందు పిన్నలకు సహజముగా కలుగు తొందఱ పాటు కూడ ఆయనను ఆవేశించెను. ఆ తొందఱవలననే ఆయన తాను ధరించిన భిక్షురూపమును కూడ మఱచి వారికి నమస్కరించి వారిని చక్కగా ప్రశంసించెను. అంతయు వినుచు వారు సంతోషించుచు నూరక చూచు చుండిరి. అప్పుడాయన "నేను ఇంతగా మాటాడుచుండగా మీ రేమియు చెప్ప రేమి"? అని యడిగి తన్ను గూర్చి యేమియు చెప్పక పోవుటచే వారు మాటాడుట లేదని గ్రహించి తానే మరల తన్ను గూర్చి సుగ్రీవుని గూర్చి తాను వచ్చిన పనిని చెప్పెను.

అప్పుడు రాముడు ప్రహర్షమును పొంది లక్ష్మణునితో హనుమంతుని గూర్చి ఇట్లు ప్రశంసించెను. "ఋగ్వేదమును అధ్యయనము చేయనివానికి, యజుర్వేదనిష్ణాతుడు కానివానికి, సామవేదవిజ్ఞానములేని వానికి ఇట్లు మాటాడుట శక్యము కాదు. ఇతడు వ్యాకరణ మంతయు అనేకులయొద్ద గ్రహించెననుట నిశ్చితము. ఇంతసేపు ఇతడు మాటాడినను ఒక్క యపశబ్దము కూడ దొరుల లేదు. ఇతని వాక్కు సంస్కార క్రమసంపన్న మై తొందఱపాటు లేనిదియై జాగులేనిదియై శుభప్రదమై హృదయహారిణియై యున్నది. కత్తిని దూసిపైకి వచ్చుచున్న శత్రువునకు సైతము ఇట్టి మనోహర మైన వాక్కుచేత సంతోషము కలుగకుండునా? ఇట్టి గుణగణ ములుగల కార్యసాధకులు ఎవనికి దూతలుగా నుందురో ఆ రాజునకు అఖిలకార్య ములు తప్పక సిద్ధించును".

శ్లో. నా నృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః।
నా సామవేదవిదుష శ్శక్య మేవం ప్రభాషితుమ్॥ 28

శ్లో. నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్।
బహువ్యాహరతానేన న కించి దపశబ్దితమ్॥ 29

శ్లో. సంస్కార క్రమసంపన్నా మద్రుతా మవిలంబితామ్।
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్॥ 32

శ్లో. అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా।
కస్య నారాధ్యతే చిత్త ముద్యతాసే రరే రపి॥ 33

శ్లో. ఏవం గుణగణై ర్యుక్తా యస్య స్యుః కార్యసాధకాః।
తస్య సిద్ధ్యంతి సర్వేఽర్థా దూత వాక్య ప్రచోదితాః॥ 35
(కిష్కింధాకాండ - సర్గ 3. శ్లో. 28 - 35)

ఈ ప్రశంసలో హనుమంతుని యొక్కవిశిష్టత చక్కగా ఇమిడి యున్నది. శత్రునిర్మథనపరాయణులగు వీరులకు శూరులకు పాండిత్యము తో అంతగా పని యుండదు. పండితులైన వారిలో కూడ చాలమంది సమ యోచితముగా సరసముగా మాటాడగలిగియుండరు. హనుమంతుడు మహావీరుడనుట సుప్రసిద్ధము. ఆ మహావీరత్వముతో పాటు ఆయన యందు పాండిత్యము సమయస్ఫూర్తి చతురవచన రచనము ఎంత యుజ్జ్వలముగా నున్నవో దీనివలన స్పష్టమగుచున్నది.

ఈ ప్రశంసాభావమువలననే రామునకు హనుమంతుని యందు అసాధారణమైన యభిమానము కలిగినది "ఇట్టి దూతలు కదా నాకు కూడ నుండవలయును" అను తలంపు కూడ ఆయనకు కలిగినది. కావుననే ఆయన సీతాన్వేషణమునకై వానరులను అన్నిదిక్కులకు పంపునప్పుడు ఆంజనేయునకు మాత్రమే అంగుళీయకము నొసంగెను.

దూతగా ఆంజనేయుడు నిర్వహించిన పాత్ర అద్భుతమైనది. రామలక్ష్మణులయొద్దకు ఆయనను సుగ్రీవుడు పంపినప్పుడు వారిని గూఢముగ పరీక్షింపుమని ఏవేవో జాగురూకత వహింపవలసిన విషయములను బోధించెను. వారిని జూచిన తరువాత హనుమంతుడు అప్పటికి యుక్తమని తోచిన విధమున స్వతంత్రముగ మాటాడెనే కాని సుగ్రీవుడు చెప్పినట్లు చేయలేదు. (ఉవాచ కామతో వాక్యమ్) ఆజ్ఞను అక్షరశః పాటించుట కన్న ప్రయోజనము చాల ముఖ్యము. అందువలన సుగ్రీవుని ప్రయోజనమును దృష్టిలో నుంచుకొని హనుమంతుడు రామలక్ష్మణుల పరిస్థితిని గ్రహించుటయే కాక వారిని గొని వచ్చి సుగ్రీవునితో సఖ్యమును కలిగించెను. సామాన్యుడైన దూత యైనచో ఇంతపని చేయలేడు.

ఇట్లే అంగులీయకము నొసంగునప్పుడు రాముడు కూడ "దీనిని నీవు గుర్తుగా చూపించినచో సీత ఉద్వేగము నొందక నీతో మాటాడగలదు" అని మాత్రమే చెప్పెను. కాని సీత కన్పించినచో ఏమి చెప్పవలయునో చెప్పలేదు. రావణునితో ఆంజనేయుడు మాటాడవలసి వచ్చునను నూహ కూడ అప్పు డెవరికిని లేదు. సీత యునికియే తెలియనప్పుడు ఈయూహ లకు అవకాశమే లేదు. అందువలన లంకలో జరిపిన సంభాషణ ములు వ్యవహారములు సర్వము హనుమంతుడు కేవలము తన బుద్ధికౌశ లము చేత నిర్వహించినవే. సాధారణముగ ప్రసిద్ధులైన వ్యక్తుల యొద్దకు రాజాలు కొన్ని విషయములను చెప్పి దూతలను పంపుచుందురు. వారు ఆ విషయములను వారికి చెప్పి వారు చెప్పుసమాధానములను తమరాజు లకు చేర్చుచుందురు. మఱి హనుమంతుని విషయమున ఏవిధమైన నిశ్చితత్వము లేదు. కావున లంకలో నిర్వహింపబడిన కార్యము లన్నియు ఆయనయొక్క ప్రజ్ఞావైభవమునకు సాహసమునకు ప్రబలసాక్ష్యములు.

ఆంజనేయుడు తనయందు ఏయేశక్తులున్నవో వాని నన్నింటిని రామకార్యమున వినియోగించెను. శరీరమును పెంచి, ఆయన మహావేగము తో సముద్రమును దాటెను. అంతపని చేసినను ఆయనకు రవ్వంత కూడ

ఆయాసము కలుగలేదు. తరువాత ఆయన పిల్లియంతగా చిన్నది యగు నట్లు శరీరమును కుంచించుకొని లంక యంతయు ఎంతో జాగరూకతతో సీతను వెదకుచు సంచరించెను. సీతను పలకరించుటకు కూడ ఆయన ఎంతో ఆలోచించి ముందుగా రామకథను శ్రావ్యముగా వినిపించి నెమ్మదిగా నమ్మకమును కలిగించుచు మాటాడెను. ఆమెకు అంగుళీయకము నిచ్చి ఆమె యొద్దనుండి రామునకు సందేశమును చూడామణిని సైతము గ్రహించెను.

అంతటితో శ్రీరామసుగ్రీవులు ఉద్దేశించిన ప్రయోజనము సిద్ధించి నది. మఱియొకడైనచో వెంటనే తిరిగి వచ్చియుండెడి వాడు. కాని ఆంజనేయునకు శత్రువులయొద్దనుండి అట్లు దొంగవలె తిరిగివచ్చుట. అట్లు చేసిన చో రావణుడు ఎట్టి పిటికివాడో తానును అట్టివాడే యగును. సీతాదేవిని అప్పుడే శ్రీరామునియొద్దకు చేర్తు నన్నప్పుడు, ఆ విధముగా రాముడు తన్ను స్వీకరింపడని అట్టి దొంగలపద్ధతి రాముని యంతస్తునకు తగదని ఆమె నిరాకరించెను. ఆ పద్ధతి తన ప్రభువునకు తగియుండనిచో ఆయనకు దూతగా వచ్చిన తనకు కూడ తగదని ఆయన నిశ్చయించుకొని బాహాటముగా యుద్ధమునే ప్రకటించెను. ''అతి బలశాలి య్యైన శ్రీరాముడు జయించును. మహాబలవంతుడైన లక్ష్మణుడు కూడ జయశాలియగును. రాఘవుని చేత రక్షితుడైన రాజు సుగ్రీవుఁడు కూడ విజయము నొందును''.

*శ్లో. జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।*
*రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ॥*

పిమ్మట తన పేరును చెప్పి రావణులు వెయ్యిమంది కూడ నాతో యుద్ధమున సరిపోలరు అని లంక యంతయు దద్దరిల్లునట్లు ఉద్ఘోషించెను. ఎట్లైనను రావణుని వెలికి లాగి వానితో పోరాడి వాని సారమును తెలిసి కోవలయునని ఆయనకు తీవ్రమైన కోరిక కలిగెను. కాని ఇది చాల సాహసము. ఆ యుద్ధములో ఏ కారణముచేత నైనను తనకు అపాయమే సంభవించినచో ప్రభుకార్యమేమి కావలె? కాని ఆయనకు అట్టి సందేహము

అణుమాత్రముగనైన కలుగలేదు. తన్ను ఎవరును ఏమియు చేయజాలరని ఆవశ్యకమగుచో సకలరాక్షస సహితముగా రావణుని సంహరించి సీతను గొనిపోగలనని ఆయనకు దృఢమైన ఆత్మవిశ్వాసము కలదు. ఇది విశ్వాసం మాత్రమే కాదు. ఆయనకుగల బలపరాక్రమములు కూడ అట్టివే. అందు వలననే ఆయన పెక్కుమంది, రాక్షసులను సంహరించి తుదకు ఇంద్రజిత్తు యొక్క బ్రహ్మాస్త్రముచేత బంధనమును కొంచెము సేపు పొంది అస్త్రబంధ నిర్ముక్తుడయ్యును బంధితుని వలెనే రావణుని సభయందు ప్రవేశించి సుగ్రీవుని యొక్క రాముని యొక్క సందేశముగా ఎంతో హితమును బోధించెను.

రావణుడు హితమును వినక బంధితుడైన దూతయొక్క తోకకు నిప్పు ముట్టించి శిక్షింపుడని భటులకు ఆజ్ఞాపించి నపుడు ఆ భటులవలన వ్యథను సహించుచు వారి వెంట నగర మంతయు పగటివేళ తిరిగి దుర్గ రక్షణ విధానములను చక్కగా గుర్తించెను. ఆ పనియైన తరువాత తన పరిభవమునకు ప్రతీకారముగా ఆయన లంకను దహించి రాక్షసులయందు భయోత్పాతమును గలిగించి జానకికి మరల నమస్కరించి సెలవు గైకొని సర్వథా కృతార్థుడై తిరిగి వచ్చెను.

హనుమంతుని యీ లంకావిజయమే సర్వరాక్షససంహార రూపమైన శ్రీరాముని విజయమునకు మూల మయ్యెను. యుద్ధము నందు కూడ ఆయన నిర్వహించిన పాత్ర సామాన్యమైనది కాదు. ఆయన పెక్కు మంది రాక్షసులను సంహరించె ననుట ముఖ్యవిషయము కాదు. ఆయన రెండు పర్యాయములు హిమవంతమునకు అవతల ఎంతో దూరమందున్న సంజీవని కొఱకు ద్రోణపర్వతమునే పెకలించి కొన్ని గంటలలోదెచ్చి దానితో పనితీఱినంతనే వెంటనే ఆ పర్వతమును యథాస్థాన మున ఉంచివచ్చెను. ఆ యోషధులు రాత్రియందే ప్రకాశించుచు శక్తిమంతములై యుండును. అందువలన ఆయన రెండు పర్యాయ ములును రాత్రి బయలుదేరి తెల్లవారు లోపల ఇంతకార్యమును నిర్వహింపఁ గలిగెను.

ఈ పనిని ఇతరులు చేయలేరా? ఇతరులు ఎవ్వరును ఇంత పనిని చేయజాలరని జాంబవంతుడు ఒక సన్నివేశమున స్పష్టముగ జెప్పెను. కుంభకర్ణుని తరువాత రావణుని పుత్రుడగు నతికాయుడు కూడ సంహరింపబడినప్పుడు రావణుడు దుఃఖాక్రాంతు డయ్యెను. ఇంద్రజిత్తు తండ్రిని ఓదార్చి యుద్ధమునకు బయలుదేరి వచ్చి రణాంగణమున హోమమును జరిపి బ్రహ్మాస్త్రమును ప్రదీప్తమొనర్చి తాను అదృశ్యుడై వానరవీరుల నెల్ల నురుమాడెను. ఇది బ్రహ్మాస్త్ర ప్రభావమని రామలక్ష్మణులు అనుకొనుచుండగానే ఇంద్రజిత్తు వారిని కూడ తీవ్రముగ ప్రహరించెను. వారిరువురును క్షణములో గాఢమూర్ఛలో మునిగి నేలగూలిరి. వానరవీరుల నందఱను నిశ్శేషముగా కూల్చి ఇంద్రజిత్తు విజయఘోషణముతో లంకలోనికి పోయి రావణునకు సంతోషమును కలిగించెను.

బ్రహ్మాస్త్ర మంత్రమును జపించుచు విభీషణుడు హనుమంతుడు మాత్రమే తిరుగ గలిగియుండిరి. సంధ్యాకాలమున ఇది యంతయు జరిగెను. చీకటి పడినకొలది రణాంగణము శవతండమయమై మహాభయంకర మయ్యెను. ఎవరు ఎక్కడ పడియుండిరో కూడ తెలియుట లేదు. అప్పుడు విభీషణుడు ధైర్యమును కోల్పోక ఆంజనేయుని చేరి, "జాంబవంతుడెక్కడ పడియున్నాడో తెలియదు. ఆయన బ్రతికి యున్నచో ఈ యాపదనుండి బయల్పడుటకు ఏదైన ఉపాయమును చెప్పగలడు" అని పలికెను. పిమ్మట వారిరువురు రెండు కొఱవులను గైకొని వెదకుచు ఒక చోట జాంబవంతుని జూచి ఆయన యొద్దకు పోయిరి. ఆయన సహజమైన వృద్ధత్వముచేత బాణములదెబ్బలచేత సోలియుండెను.

విభీషణుడు ఆయన యొద్దకు పోయి "అయ్యా! ఈ బాణముల చేత నీ ప్రాణములు విధ్వంసితములు కాలేదుగదా!" అని పలుకరించెను. జాంబవంతుడు ఎంతో ప్రయత్నముతో కంఠస్వరమును పైకి తెచ్చుకొని, "అయ్యా! స్వరముచేత నీవు విభీషణుడ వని గుర్తించుచున్నాను. కనులు తెఱచి చూచుటకు శక్తిలేదు. అంజనా పుత్రుడు వాయుదేవుని కుమారుడు

నైన యాంజనేయుడు జీవించి యున్నాడా''? అని యడిగెను. ఆ మాటకు విభీషణుడు చాల ఆశ్చర్యపడి ''ఇదేవయ్యా! రామలక్ష్మణులను గూర్చి యడుగక రాజైన సుగ్రీవుని గూర్చి ఆతురపడక ఆంజనేయునియందు ఇంత శ్రద్ధ చూపింతువేమి''? అని యడిగెను. అప్పుడు జాంబవంతుడు ఇట్లనెను. ''రాక్షసేశ్వరా! నేను ఎందుకు మారుతిని గూర్చి అడుగుచున్నానో వినుము. ఆ వీరుడు జీవించి యున్నచో ఈ సైన్యమంతయు ఇప్పుడు హతమ్మై యున్నను బ్రతికినట్లే యగును. హనుమంతుడు విగతప్రాణుడైనచో ఇప్పటి కింకను బ్రతికియున్న మన మందఱము కూడ చచ్చినవారమే యగుదుము. వాయుదేవసమానుడు అగ్ని తేజుడును అయిన హనుమంతుడు బ్రతికి యున్నచో మన కందఱకును జీవితాశ యేర్పడును''.

*శ్లో. శ్రుణు నైర్పత శార్దూల యస్మాత్పృచ్ఛామి మారుతిమ్।*

*శ్లో. తస్మిన్ జీవతి వీరే తు హత మప్యహతం బలమ్।*
*హనుమ త్యుజ్ఝితే ప్రాణే జీవన్తోఽపి మృతా వయమ్॥*

*శ్లో. ధరతే మారుతి స్తాత మారుతప్రతిమో యది।*
*వైశ్వానరసమో వీర్యే జీవితాశా తతో భవేత్॥*

*(యుద్ధకాండ – సర్గ – 74, శ్లో. 21-23)*

కావున హనుమంతుడే లేకున్నచో శ్రీరామ విజయమే లేదనుట స్పష్టము. ఈ కారణముచేతనే ఆయనకు శ్రీరామునితో సమానముగా దేవాలయములు అర్చనయు జరుగుచున్నవి.

# 7. రామాయణములో సుందరకాండ విశిష్టత

పోలూరి హనుమజ్జానకీరామశర్మ

సుందరకాండనుగూర్చి ఎవరో మహాభక్తుడు సంతోషపారవశ్యముతో ఇట్లు ప్రశంసించెను. సుందరకాండ యందు రాముడు సుందరుడు; సీత సుందరి; కపి సుందరుడు ; కథ సుందరము; అశోకవనము సుందరము; కావ్యరచన సుందరము; మంత్రము సుందరము. సుందరకాండ యందు ఏది సుందరము కాదు''?

*శ్లో. సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా।*
*సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్॥*

*శ్లో. సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః।*
*సుందరే సుందరం మన్త్రం సుందరే కిం న సుందరమ్॥*

రామాయణములోని తక్కిన కాండలకన్న సుందరకాండ ఎట్లు విశిష్టమైనదో పై శ్లోకమునందు చక్కగా నిరూపింపబడినది.

సుందరకాండ అనుపేరే మొదటి విశేషము. రామాయణమును గూర్చి త్ర్యంబకమఖి అనుమహాపండితుడు ధర్మాకూత మనుపేరుతో సంస్కృతమున ఒక్కొక్క కాండను గూర్చి ఉపన్యాస పద్ధతిలో రమణీయమైన వచనరచనముతో అనేకధర్మ విషయములను వివరించు ప్రత్యేక గ్రంథములను రచించెను. ఆయన సుందరకాండ అనుపేరు ఎట్లు వచ్చియుండవచ్చునను విషయమును విమర్శించుచు సాహిత్య సౌందర్యము ఇందు సమగ్రముగా నున్నది కావున ఇది సుందరకాండముగా నిర్దేశింపబడినది అని నిశ్చయించెను. ఈ యభిప్రాయమును నిరూపించుటకై ఆయన సాహిత్య గ్రంథములలో కావ్యసౌందర్యపోషకములుగా పేర్కొనబడిన

యలంకారములు, గుణములు, వృత్తులు, రీతులు, రసములు మొదలగు సకలవిశేషములను గ్రైకొని అవియన్నియు సుందరకాండయందు ఎట్లు పొందుపడి యున్నవో లక్ష్యలక్షణ సమన్వయముతో ప్రదర్శించెను. దీనివలన సుందర కాండము కావ్యరచనాసౌందర్యమునకు పరసీమ అనుట స్పష్టము.

కాని యీ రచనా సౌందర్యమును ఉద్దేశించి వాల్మీకి మహర్షి ఈ కాండవమునకు పేరు పెట్టియుండునా యనునది ఆలోచింపదగిన విషయము. కవి తనకావ్యములో ఒక భాగము సుందర మని తక్కిన భాగములు కావని తలంపడు. కవి కావ్యమును మొదటనుండి తుదివఱ కును అన్నిభాగములను సమానమైన శ్రద్ధతోనే రచించును. అందువలన అతనికి కావ్యములోని సకలభాగములు సుందరముగానే తోచును. అవి యన్నియు అతనికి ప్రియముగానే యుండును. కావున ఒకానొక భాగము నకు సుందరమని పెట్టి తక్కిన భాగములు సౌందర్యహీనములు అను స్ఫురణ పఠితలకు కలుగునట్లుగా కవి ఎప్పుడును చేయడు.

కొందఱు కవులు తమ కవిత్వవిశేషమును ప్రకటించుకొనుటకై కావ్యము లకు, "కవికర్ణరసాయనము", "రసికజనమనోభిరామము" మొదలుగా పేర్లను పెట్టకొనుట లేక పోలేదు. వారైనను కావ్యమునకు అంతకును అట్టి పేరులను పెట్టుకొనిరే కాని కావ్యములోని భాగములకు ఆ విధముగా పేర్లు పెట్టలేదు. అదియును గాక కాళిదాసాదిమహాకవులు కూడ కవిత్వప్రకర్ష వ్యక్తమగునట్లుగా కావ్యములకు పేర్లు పెట్టలేదు. వారు సాధారణముగా కావ్యములోని ప్రధాన విషయమును స్ఫురించునట్లే అభిజ్ఞాన శాకుంతలము, నైషధీయచరితము మొదలుగా కావ్యనామము లను ఏర్పఱచిరి.

తరువాత వచ్చిన తమ రసపోషణసామర్థ్యమును ప్రకటించుకొను కుతూహలముతో శృంగార నైషధము మొదలుగా నామములను వెలయించిరి. కావ్యములోని రసమును నామమునందు ప్రకటింప

నక్కరలేదు. అందు ఆ రసము చక్కగా పోషింపబడినచో పఠితలు ఆ రసమును ఆస్వాదించి కావ్యమును కవిని తప్పక ప్రశంసింతురు. అట్లు గాక కవి ఆత్మప్రశంసకు పాల్పడినాడని తోచినచో సహృదయులు అనేకులు కవిని గూర్చి గాంభీర్యరహితునిగా భావింతురు. కొందరు ఈ కవి యింత గొప్పవాడా! అను మాత్సర్యముతో కావ్యమునందు లోపములను కనిపెట్టుటకు పూనుకొందురు. అందువలన మహాకవులు సాధారణముగా అట్టినామకరణములను చేయరు. ఇంక ధర్మతత్త్వబోధన పరాయణులైన మహర్షుల సంగతి చెప్పవలసిన దేమున్నది? కావున కావ్య సౌందర్యమును ఉద్దేశించి వాల్మీకి మహర్షి సుందరకాండ మనుపేరును పెట్టె ననుట అసంగతము.

కాండలకు పేర్లను వాల్మీకి ఉద్దేశింప లేదని, ఎవరో ఇతరులు గ్రంథము ప్రసిద్ధమైన తరువాత ఎప్పుడో పెట్టియుందురని కొందరందురు. ఆ పక్షమున కూడ అట్లు నామములను ఏర్పఱచువారు సామాన్యులై యుండరు. సామాన్యులు పెట్టినచో అవిపైకిరావు. కాబట్టి వారు వాల్మీకి శిష్యులో లేక వారితో సమానులైన మహర్షులో అయియుండవలె. వారైనను వాల్మీకి మహర్షివలెనే ఆలోచింతురు. కాబట్టి రచనాసౌందర్యమును బట్టి ఒక కాండకు సుందరకాండ మని పేరుపెట్టరు. అట్లయినచో ఆపేరు పెట్టినవారు సుందర శబ్దము చేత ఏ విషయమును ఉద్దేశించియుందురు?

కవి గాని యితరులు గాని గ్రంథములోని వివిధ భాగములకు పేర్లు పెట్టునప్పుడు ఏదేని ఒక పద్ధతిని అవలంబింతురని గ్రహింపవచ్చును. నియతమైన యొకపద్ధతి లేకుండ మహాపురుషులు ఏ పనిని చేయరు. కాబట్టి తక్కిన కాండలకు పేర్లు ఎట్లు ఉద్దేశింపబడియున్నవో గ్రహించినచో సుందరకాండయొక్క పేరునందలి యుద్దేశమును కూడ గ్రహింపవచ్చును.

మొదటిది బాలకాండ. కాండమనగా సముదాయము. ఇందు శ్లోకముల యొక్కసముదాయమునకు కాండమనిపేరు. బాలకాండ యనగా బాలుడైన శ్రీరాముని యొక్క వృత్తాంతమునకు సంబంధించిన

శ్లోకముల సముదాయము (బాలస్య శ్రీరామస్య వృత్తాంత సంబంధి శ్లోకానాం కాండః, బాలకాండః) ఇట్లే అయోధ్యావృత్తాంత సంబంధిశ్లోకముల సముదాయము అయోధ్యాకాండము. తక్కిన వానిని ఇట్లే గ్రహింపవచ్చును.

కావున ఈ పద్ధతిలో సుందరుని యొక్క లేక సుందరమైన దాని యొక్క వృత్తాంతము నకు సంబంధించిన శ్లోకములకాండ సుందరకాండ అని గ్రహింపవలసి యుండును. సుందరమైనది అని నపుంసకలింగములో గ్రహించినచో సుందరమైనది లంకానగర మనియో అశోకవనమనియో గ్రహింపవలె. కాని వానికి అంత ప్రాముఖ్యమును కవి యుద్దేశించుననుట అసంగతము. మఱియును వాని యొక్క విధ్వంసమే అందుఎక్కువగా వర్ణింపబడినది. ఇంక పురుషులకు కూడ మోహమును గలిగించు సౌందర్యము కలవాడు శ్రీరాముడు, మఱియును ఆయన సౌందర్యమును ఆంజనేయుడే చక్కగా వర్ణించియున్నాడు. కావున సుందరుడనగా శ్రీరాముడే యనియు తలంపవచ్చును. కాని యీకాండలోని కథలో శ్రీరామునకు ప్రత్యక్షముగా నేమియు ప్రవేశము లేదు. అందువలన ఆయనను ఉద్దేశించి సుందరకాండ యనుపేరు పెట్టబడెనని తలంచుట సంభావ్యము కాదు. సుందరకాండ మొదటినుండి తుదివరకును ఆంజనేయునియొక్క పరాక్రమము, బుద్ధి చాతుర్యము, రూపవిశేషము చక్కగా వర్ణింపబడి యున్నవి. కావున ఇందు సుందరుడనగా ఆంజనేయుడనియే గ్రహించుట సమంజసము.

అట్లయినచో హనుమత్కాండ మనియో మారుతికాండ మనియో పేరుపెట్టి యుండవచ్చును. సుందరకాండ మనుపేరు ఏలపెట్టవలె? అట్లు పెట్టియున్నచో ఆ పేరు హనుమంతునకు మాత్రమే పరిమితమైన విషయ మును సూచించును. సుందర శబ్దమునందలి ధ్వనిచేత సుందరుడైన రాముని సుందరియైన సీతను కూడ స్ఫురింపజేయుటకై వారు సుందర కాండమను పేరును పెట్టియుందురు. అట్లయినను సుందరశబ్దముచేత మాటిమాటికి శరీరమును పెంచుచు భయంకరాకారుడగుచు, పిల్లియంత

చిన్న శరీరముతో నగరమున తిరుగుచు నుండిన హనుమంతుని సౌందర్యము ఉద్దేశింపబడెనా లేక దీర్ఘవిరహమున కృశించి ధూళిధూసరితాంగులై యున్న సీతారాముల సౌందర్యము ఉద్దేశింపబడినదా? వీరి భౌతిక సౌందర్యము ఉద్దేశింపఁబడెననుట సంభావ్యము కాదు.

ఈ కాండమునందు మొదటినుండి తుదివరకును అద్భుతముగా గోచరించు నఖిల సంఘటనముల పరంపర యను మణిమాలయందు. సూత్రముగ హనుమత్సీతారాముల శీలసౌందర్యమే ధ్వనిమార్గమున మహర్షిచేత అనుపమానమున కూర్చబడినది. కావున ఇందు సుందర శబ్దముచేత వారి శీలసౌందర్యమే ఉద్దేశింపబడిన దని గ్రహించుట సమంజసము.

సీతారాముల దాంపత్యమునందలి ప్రేమయొక్క గాఢత, లోకోత్తరమైన పవిత్రత యీ కాండమునందు నిరూపింపబడినట్లు ఇంతర కాండములలో కానరాదు. రాముడు లక్ష్మణునిచేత సేవింపబడు చుండియు కొంచెమైన ఊరట పొందక నిరంతరము సీతనే స్మరించుచు శరీరముపై క్రిములు ప్రాకుచున్నను గ్రహింపనేరక బదులు మరచి దుఃఖించుచుండెను. బహుసతీ పరిగ్రహమునకు అవకాశము గలపురుషులు భార్యను ఇంత గాఢముగా ప్రేమించి పరితపించుచుండుట చాల యరుదు. సతీ విషయికమైన పతి ప్రేమకు రాముని యనురాగము పరాకాష్ఠమని చెప్పవచ్చును.
ఆంజనేయుని మాటలలో మహర్షి ఈ దంపతుల మహత్త్వమును చక్కగా వర్ణించినాడు. సీతాదేవిని చూచినంతనే ఆంజనేయుడు ఇట్లు అనుకొన్నాడు. "ఎవరి కొఱకు రాముడు అంతగా పరితపించుచున్నాడో ఆ సీత యీమెయే. కాంత కన్పింపకుండెనని కారుణ్యముచేత, తన్ను ఆశ్రయించిన యీమె ఆపదపాలయ్యెనని ఆనృశంస్యముచేత, ధర్మసాధన మైన పత్ని అపహృత యయ్యెనని శోకముచేత, ప్రియురాలు దూరమయ్యెనని విరహవ్యథచేతను నాల్గువిధముల పరితపించుచున్నాడు. ఇట్టి సతికి దూరుడై ఇంతకాలము శోకముచేత నశింపక దేహమును ధరించుచున్నాడన్నచో ఆయన ఎంతో దుష్కరమైన కార్యమును చేయుచున్నాడు. ఈమెకొఱకు రాముడు

సముద్రాంతమైన మేదినినే కాదు సకల జగత్తును తలక్రిందులు చేసినను యుక్తమే యను కొందును. త్రైలోక్య సామ్రాజ్యము జనకాత్మజమైన సీత అనురెండింటిలో ఏది మేలు అని తలంచినచో త్రైలోక్యసామ్రాజ్యము సీతామహత్త్వము నందలి ఒక్క చిన్నయంశమునకు కూడ సరిపోలదు".

*శ్లో. ఇయం సా యత్కృతే రామశ్చతుర్భిః పరితప్యతే।*
*కారుణ్యే నానృశంస్యేన శోకేన మదనేన చ॥* 49

*శ్లో. స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యానృశంసతః*
*పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ॥* 50

*శ్లో. దుష్కరం కృతవాన్ రామో హీనో యదనయా ప్రభుః।*
*ధారయ త్యాత్మనో దేహం న శోకే నావసీదతి॥* 53

*(సర్గ -15) 49, 50, 53*

*శ్లో. యదిరామస్సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్।*
*అస్యాః కృతే జగచ్చాపి యుక్త మిత్యేవ మే మతిః॥* 13

*శ్లో. రాజ్యం వా త్రిషులోకేషు సీతా వా జనకాత్మజా।*
*త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయా త్కలామ్॥* 4

*(సర్గ -16) 13, 4*

ఇంతేకాదు సీతయందలి యనేక గుణములు సానబట్టిన రత్నము నందువలె ఈ కాండయందు అద్భుతముగా ప్రకాశించుచున్నవి. ఆమె వికృతాకారలైన రాక్షసస్త్రీలచే నిరంతరము భయంకరముగా తర్జింపబడుచు ఉపవాసవయుచేత, శోకవయుచేత, ధ్యానవయుచేత, భయువయుచేత, అల్పాహారయు, పరిక్షీణయు, కృశయు, దీనయునై యుండియు రామునే స్మరించు చుండెను.

*శ్లో. ఉపవాసేన శోకేన ధ్యానేన భయేన చ।*
*పరిక్షీణాం కృశాం దీనా మల్పాహారాం తపోధనామ్॥*

*(సర్గ -19) 20*

ఇంత దైన్యము నొంది యుండియు ఆమె రావణుని ఎంత దృఢముగా నిరాకరించి ధిక్కరించెనో చూడుడు. అతడు ఆమెను ప్రార్థించి పాదములపైబడి ప్రణామ మొనర్చి ఎన్నోవిధముల ప్రలోభపెట్టెను. అయినను ఆమె వానిని కడగంటితో నైన చూడలేదు. వానితో నేరుగా మాటాడుటకు ఇష్టపడక వానిముందు ఒక గడ్డిపరకును వేసి ఇట్లనెను. "నీభార్యలను ఇతరులు కోరినచో నీకెట్లుండునో ఇతరుల భార్యలను నీవు కోరుచో వారికి కూడ అట్లే కదా తాపము కల్గును. నీ భార్యవలెనే ఇతరుల భార్యలును రక్షింపదగినవారే కావున వారికి కల్గు తాపమును గ్రహించి నీవు పరులభార్యలను వీడి నీభార్యల యందే సుఖింపుము...... ఈ లంకయందు సజ్జనులే లేరా! ఉన్నచో వారి మాటలను నీవు పాటించుట లేదా ఏమి? కావుననే నీ బుద్ధి విపరీతమై ఆచారవర్జితమై యున్నది.... నీవు నిజముగా మహావీరుడ వైనచో రామలక్ష్మణులు లేని సమయమున దొంగతనముతో నన్నేల తెచ్చితివి? పెద్దపులుల వాసన తగిలినంతనే కుక్క ఎట్లు నిలువజాలదో అట్లే నీవు కూడ రామలక్ష్మణుల గాలి తగిలినచో నిలువజాలవు".

*శ్లో. యథా తవ తథాన్యేషాం రక్ష్యా దారా నిశాచర।*
*ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్॥*

*శ్లో. ఇహ సన్తో న వా సన్తి సతో వా నానువర్తసే।*
*తథా హి విపరీతా తే బుద్ధి రాచారవర్జితా॥*
*(సర్గ -21) 7, 8)*

ఆ మాటలకు వాడు కోపించి, "రెండు మాసములకు పిమ్మట నా వంటవాండ్రు నిన్ను నా ప్రాతఃకాల భోజనమునకై ముక్కలు చేయుదురు". అని బెదరించెను. (మమ త్వాం ప్రాతరాశార్థే సూదా శ్ఛేత్స్యన్తి ఖండశః) ఆమె యిట్లనెను. "కుబేరుని సోదరుడవై సేనాబలసమన్వితుడవై శూరుడ నను కొనుచు రాముని దూర మొనర్చి దారచౌర్యమునకు ఎట్లు పాల్పడితివి? ఇట్లు మాటాడుటకు నీకు సిగ్గు లేదా".

*శ్లో. శూరేణ ధనదభ్రాత్రా బలైః స్సముదితేన చ।*
*అపోహ్య రామం కస్మాద్ధి దారచౌర్య మిదం కృతమ్॥*
*(సర్గ - 22) 22*

పతివ్రత అనగా అమాయికురాలుగా కష్టముల నెల్ల సహించుచు దీనురాలై యుండు ననియే అనేకులు అనుకొనుచుందురు. కాని పాతివ్రత్యము ఒక తపస్సు. దానిచేత యమోఘమైన తేజము కలుగును. అందువలన ఎట్టి విపత్కర పరిస్థితులయందు కూడ వారు ధైర్యమును కోల్పోవరు. దుర్జనులను ధిక్కరింప వలసి వచ్చినప్పుడు ఏ మాత్రమును జంకరు. పై మాటలలో ఆమె ఎంత సూటిగా రావణుని నీచత్వమును పైకి తెచ్చి ఎంత నిర్భయముగా వానిని తృణప్రాయముగా ధిక్కరించినదో స్పష్టమగుచున్నది. ఇది మహావీర పత్నీత్వమునకు మహారాజ్ఞియొక్క శౌర్యమునకు ఎంతయు సముచితముగా నున్నది.

త్రిజటాస్వప్నవృత్తాంతమును విని రాక్షసస్త్రీలు భయపడు చుండగా ఆమె "స్వప్నము నిజమై నేను రాముని గూడినచో మీకు తప్పక శరణమగుదును". అని పలికెను. ఇందు ఆమె యుదాత్తత చక్కగా ప్రకాశించుచున్నది.

ఆంజనేయు డామెను అప్పుడే తన వీపుపై నెక్కించుకొని రాముని యొద్దకు తీసికొని పోవుదుననగా ఆమె "నేను బుద్ధిపూర్వకముగా పరుని గాత్రమును స్పృశింపజాలను. నేను నీ వీపుపై నున్నచో చూచు వారికి నీవు భార్యతో పోవుచున్నావను సందేహము కలుగును. అట్టిభావము కలుగుటకు అవకాశము ఈయరాదు. కావున నేను నీతో వచ్చుట తగదు అని పలికెను. తరువాత ఎట్లైనను రాముడు లంకపై దండెత్తి రావణుని సంహరించియే తన్ను గొనిపోవలయునని ఆయనకు చోరవృత్తి తగదని ఆమె దృఢముగా చెప్పెను. దీనిని బట్టి కార్యమును నెరవేర్చుకొనుట కాక ధర్మసమ్మతముగా సగౌరవముగా కార్యములను నిర్వహింపవలయునని ఆమె స్పష్టమొనర్చెను. ఇది ఆమె మహనీయత.

లక్ష్మణుని గూర్చి ప్రస్తావించుచు నామె "లక్ష్మణుడు రామునకు నాకన్నను ప్రియుడు ఆయన ఏపనిని చెప్పినను అతడు వెంటనే చేయుచుండును".

*శ్లో. మత్తః ప్రియతరో భ్రాతా రామస్య లక్ష్మణః।*
*నియుక్తో ధురి యస్యాం తు తా ముద్వహతి వీర్యవాన్॥*
*(సర్గ - 38) 60*

ఇందు ఆమె యొక్క మనస్తత్త్వ పరిశీలనము చక్కగా వ్యక్తమగుచున్నది.

హనుమంతుని తోకకు నిప్పుపెట్టినారని విన్నంతనే ఆమె చాల సంతాపము నొంది అగ్ని నిట్లు ప్రార్థించినది. "నేను పతి శుశ్రూష చేసి యున్నచో, తపస్సు చేసి యున్నచో, నాయందు ఏకపతిత్వము ఉన్నచో, హనుమంతునకు నీస్పర్శ చల్లగా నుండు నట్లు చేయుము". ఇది యామె తపశ్శక్తి యనుట స్పష్టము.

ఇట్లు ఎన్నో ఆమె గుణవిశేషములు ఈ కాండమున ప్రకాశించుచున్నవి. హనుమంతుని శీలసౌందర్యము ఇందు అడుగడుగున గోచరించును. ఆయన శత యోజనముల సముద్రమును ఒక యూపులో దాటినను ఆయనకు ఏవమాత్రము బడలిక కలుగలేదు. ఆయన నిట్టూర్పుకూడ విడువలేదు. "ఎన్ని వందల యోజనములైనను నేను దాటగలను. నూఱు యోజనములుగా లెక్కింపబడిన ఈ సముద్రమెంత" అని ఆయన తలంచెను.

దివ్య సౌందర్యముతో నొప్పుచున్న సుందరీమణులతో నిండియున్న రావాణాంతః పురమునందు ప్రతిఒక్కరిని ఆయన పరీక్షించి చూచెను. అయినను ఆయన మనస్సునందు కొంచెమైనను వికారము కలుగలేదు. ఇది ఇంద్రియనిగ్రహమునకు పరాకాష్ఠ. ప్రహ్లాదుడన్నట్లు "లోకము లన్నియున్ గడియలోన జయించినవాడ నింద్రియానీకము చిత్తమున్ గెలువ నేరపు" - మహాతపస్సులు చేసినవారు ఇంద్రియములను నిగ్రహింప

జాలరు. మఱి ఆంజనేయుని నిగ్రహమెట్టిదో చూడుడు. అంతే కాదు ఆయనయొక్క ధర్మసూక్ష్మపరిజ్ఞానము కూడ అనుపమానమే. నేను బ్రహ్మచారిని నిద్రించు స్త్రీల నెట్లు చూతునో అని సంశయించుచున్నచో కార్యము కొనసాగియుండదు. అందువలన సకల కార్యములందను మనస్సు ప్రధానము. అది నిశ్చలముగా నున్నప్పుడు పరస్త్రీలను చూచినను తప్పులేదని ఆయన నిశ్చయించుకొనెను.

*శ్లో. కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః/*
*నతు మే మనసా కించి ద్వైకృత్య ముప పద్యతే॥ 41*

*శ్లో. మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే/*
*శుభా శుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్॥*
*(సర్గ - 11) 42*

రామకథా గానము చేసి సీతాదేవి యొక్క హృదయమును ప్రసన్న మొనర్చగల్గుట ఆయన యొక్క బుద్ధి కౌశలమునకు నిదర్శనము. ఆ పరిస్థితికి తగినట్లుగా ఆయన రామలక్ష్మణ సుగ్రీవాదుల విశేషములను చెప్పి ఆమెయొక్క విశ్వాసమును చూరగొనుట సామాన్యము కాదు. అది ఆయన వాక్చతురతకు నిదర్శనము. ఆమె ఎంతో దైన్యముతో దుఃఖించు చుండగా ఆమె దుఃఖమును వారించుటకై ఆయన అప్పుడే ఆమెను తీసికొని పోవుదు నన్నప్పుడు ఆయన తన చిన్న యాకృతిని విస్మరించెను. అప్పుడామె. "ఇంత చిన్నవాడవు నన్ను అంతదూరమెట్లు తీసికొని పోగలవు. ఇదియే నీకపిత్వ మనుకొందును అని ఆమె పల్కెను. ఆ మాటతో ఆయనకు ఎప్పుడును ఎవ్వరివల్లను కలుగని పరిభవము కలిగినట్లయ్యెను.

*శ్లో. హనుమన్ దూరమధ్వానం కథం మాం నేతు మిచ్ఛసి/*
*తదేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూథప॥ 31*

*శ్లో. సీతాయాస్తు వచశ్శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః/*
*చింతయామాస లక్ష్మీవాన్ నవం పరిభవం కృతమ్॥ 32*
*(సర్గ - 37)*

అప్పుడాయన మేరుమందర సంకాశముగా శరీరమును పెంచి ఆమెకు ఎనలేని ధైర్యమును కలిగించెను.

ఆయన సీతవలన చూడామణిని గ్రహించినంతనే తిరిగి వచ్చి యుండవచ్చును. కాని ఆయన శత్రువుయొక్క బలమును అంచనా వేయుటకు రాక్షసుల యందు భయోత్పాతమును గలిగించి వారిని నిరుత్సాహులను గావించుటకు పూనుకొని వనమును భంజించి అక్షాది రాక్షసులను సంహరించెను. రావణుని సభలో ఆయన కావించిన ప్రసంగము రాజనీతి వైశారద్యమునకు గొప్ప తార్కాణముగా నున్నది. లంకను దహించుటవలన లంకను జయించినట్లే యయ్యెను. రాక్షసులందఱు లంకా వినాశమును నిశ్చయించుకొని నిర్వీర్యులైరి. ఇది ఆయన బుద్ధివైభవమునకు పరాక్రమమునకు తార్కాణము.

స్త్రీ భోగవమునే ఎఱుంగని యాజన్మబ్రహ్మచారి ఇతరుల దాంపత్యమున సుఖమును సిద్ధింపజేయుటకై ఇంత యుత్సాహమును పరాక్రమమును చూపుటయే ఆంజనేయుని శీలమున మహోదాత్తమైన సౌందర్యము. ఈ సౌందర్యము చేతనే దీనికి సుందరకాండయను నామము సార్థక మగుచున్నదని చెప్పవచ్చును.

# 8. రామాయణతత్త్వము వాల్మీకీయదర్శనము

అవధానం చంద్రశేఖరశర్మ

*వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।*
*వేదః ప్రాచేతసాదాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా॥*

(స్కాంద పురాణము)

వేదము లన్నియును నే పరతత్త్వమును గూర్చి తెలుపుచున్నవో ఆ పరతత్త్వము ఆ పరమపురుషుడగు విష్ణువు మనుష్యలోకమున దశరథుని కుమారుడై యవతరింపగా నా యవతారతత్త్వమును దెలుపుటకై వేదరాశియు ప్రాచేతస (వాల్మీకి) మహర్షి నుండి రామాయణ రూపమున నావిర్భవించిన దని సంప్రదాయ విదులగు పెద్దల నిర్దేశము.

రామాయణ మనగా నేమి? ‘ రామః అయ్యతే ప్రతిపాద్యతే అత్ర’ అనగా ఇందు రాముడు ప్రతిపాదింపబడును. అను నిర్వచనముచే రామునిచరిత్రమును ప్రతిపాదించు గ్రంథము రామాయణ మను నర్థము లభించును. కాని యంత మాత్రము చాలదు. ఏల యన నిందు రాముని చరిత్రమున కంటెను మిక్కిలియగు సీతాదేవి చరిత్రముగూడ ప్రధానముగా నున్నట్లు ‘సీతాయాశ్చరితం మహ త్తను’ వాల్మీకి వాక్యము వలన దెలియు చున్నది. కావున ‘రామా అయ్యతే అత్ర’ అను మఱియొక వ్యుత్పత్తిని గూడ ఈ శబ్దమునకు జెప్పవలసి యున్నది. రామా అనగా సామాన్యముగా స్త్రీ యని యర్థము. అయినను సందర్భమును బట్టి దీనికి సీతాదేవి యని యర్థము. అందువలన రామాయణ మనగా సీతా రాముల చరిత్రము. ఇది స్థూలముగా దోచు నర్థము.

సంప్రదాయ వేత్తలగు పెద్దలు దీనికి మఱియొక విశేషార్థమును గూడ జెప్పుదురు. అది యిట్లు:

రమంతే అస్మిన్ యోగినః – ఈతని యందు యోగులు ఆనంద మును బొందుదురు అను వ్యుత్పత్తిచే రామ శబ్దమునకు విష్ణువు అని యర్థమైన రామా, అను వ్యుత్పత్తిచే రామా శబ్దమునకు లక్ష్మి యనియు నర్థములు వచ్చును. అందువలన రామాయణ మనగా భూలోకమున సీతారాములుగా నవతరించిన లక్ష్మీనారాయణుల చరిత్రము.

ఇంకను కొంత ముందడుగు పైచినవారు నిరుపాధికముగు పరతత్త్వ మును, ప్రకృతి రూపిణి యగు జ్ఞానశక్తియు నట్లట్లు అవతరించిన దివ్యచరిత్ర మని వ్యాఖ్యానింతురు.

ఈ వివరణముల చేత రామాయణము కావ్యానందమునే గాక భక్తిని, ముక్తిని గూడ ప్రసాదించునది యను విశిష్టప్రయోజనము స్పష్టమగు చున్నది.

రామాయణము లౌకికసంస్కృత భాషలో తొట్టతొలిసారిగా ఛందో రూపమున వెలువడిన కావ్యము. కనుకనే అది ఆదికావ్య మన బడుచున్నది. దానిని రచించిన వాల్మీకి యాదికవి యైనాడు. పుట్టుక చేతనే గాక గుణసంపత్తి చేతను రామాయణము ప్రథమగణ్యమైనది. విశ్వసాహిత్యము ననే అగ్రపీఠమును సంపాదించుకొన్న యసాధారణ గౌరవము దానికి దక్కినది. దీనిని లక్ష్యముగా నుంచుకొని లక్షణకారులు కావ్యలక్షణములను నిరూపించిరి; కావ్యతత్త్వమును విమర్శించిరి. కాళిదాసాదులు దీనిని ఎన్నోసారులు మననము చేసికొని యానందము ననుభవించి యామార్గ మున తమరచనలు సాగించి మహాకవు లైరి. వాల్మీకి తన కావ్యమును గూర్చి యిట్లు పరిచయము చేసినాడు.

*పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితమ్।*
*జాతిభి స్సప్తభి ర్బద్ధం తంత్రీలయసమన్వితమ్॥*
*రసైః శృంగార- కరుణ – హాస్య – వీర-భయానకైః।*
*రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్య మేత దగాయతామ్॥*

*(రామా. 1-4-8,9.)*

ఇందు మొదటి శ్లోకము సంగీతమునకు సంబంధించినది. తన కావ్యము కేవలము చదువుటకే గాక గానము చేయుటకును మధురమ్మైన దనియు చతురశ్రత్ర్యశ్రమిశ్రగతులలో మంద్ర – మధ్య – తారస్థాయులలో సప్తస్వర సంయోగముతో వీణా తంత్రులపై లయాన్వితముగా గానము చేయవచ్చు ననియు కవి తెలిపినాడు. రెండవదానిలో కావ్యజీవితమగు రసమును ప్రధానముగా గొని తనకావ్యము నవరసభరిత మని యుగ్గడించినాడు. మఱియొకచోట నిందలి సమాసములును పదసంధాన మును శబ్దశాస్త్రసమ్మతము లనియు, ఇందలి వాక్యములు ఎగుడు దిగుడు లేకుండ సమర్చబడి వినుటకు నింపుగా నుండి విన్నవెంటనే యే మాత్రము క్లేశము లేకుండ అర్థము స్పష్టముగా భాసించునవియై యున్న వనియు వాకొనినాడు. ఈ మాటలు ప్రత్యక్షరసత్యములు సంస్కృతమున నేమాత్రము భాషాపరిజ్ఞాన మున్నవారైనను రామాయణమును చదివి యర్థముచేసికొని కావ్యానందము ననుభవింపవచ్చును. 'మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు'? అన్నట్లు ఇందలి మాధుర్యమును ఒక్కమాఱు చవి చూచిన పాఠకులకు మఱియొక కావ్యముపై మనసు పుట్ట దనుట సత్యదూరము కాదు. ఇది యిట్లుండ నిండు.

ఏ ప్రయోజనము నుద్దేశించి వాల్మీకి మహర్షి రామాయణమును రచించెను? అను ప్రశ్నమునకు ఆయనయే యిట్లు సమాధానము చెప్పినాడు. "వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః. (రామా -1-4-6) వేదార్థమును బలపఱచుటకై వాల్మీకి కుశలవులకు రామాయణ మును నేర్పించెనట. దీని వలన కేవలము కథ చెప్పుట యామహర్షి యుద్దేశము గాదనియు తన రచనము వలన వేదార్థము నుపబృంహణము చేయుటయే యాయన యుద్దేశించిన ప్రధాన ప్రయోజన మనియు గ్రహింతుము.

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" (భారతము -1-1-293) ఇతి హ అస ఇట్లు గదా జరిగినది అను వ్యుత్పత్తిచే ఇతిహాస మనగా చరిత్ర మని యర్థము. పూర్వరాజచరిత్ర కథనము చేతను పురాణముల చేతను వేదార్థమునకు బలము చేకూర్పవలె ననుట యార్ష దృష్టి.

"ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రేణ కథ్యతే।
ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే॥"

సాధారణముగా వేదమునందలి పూర్వభాగమునకు జెందిన త్రివర్గ రూపమగు నర్థమును ధర్మశాస్త్రము ప్రపంచించును. దాని యుత్తర భాగమగు నుపనిషత్తుల యర్థమును ఇతిహాసపురాణములు వ్యాఖ్యానించును అని మఱికొంత వివరణము. తొట్టతొలుతటి యితిహాస మగు రామాయణము ఇట్టిది. కావుననే సాక్షాత్తుగా వేదమే అని ప్రశంస నందినది.

ఈ క్రింది మంత్రమున రామాయణార్థము సూచింప బడిన దని నిరుక్తము తెలుపును.

"భద్రో భద్రయా సచమాన ఆగాత్ స్వసారం జారో అభ్యేతి పశ్చాత్।
సుప్రకేతై ర్ద్యుభి రగ్ని ర్వితిష్ఠన్ ఋషద్భి ర్వర్ణై రభిరామ మస్థాత్॥"

అని వేదమంత్రము; దీనినిరుక్తమును జూడుడు. భద్రో రామభద్రో భద్రయా మంగళరూపయా సీతయా సచమాన స్సంపద్యమానః ఆగాత్ ఆ సమంతాత్ పితుర్ని యోగా దరణ్య మగాత్. జారః పరదార హర్తా రావణః స్వసారం మాతృవ త్పూజ్యాం జగన్మాతరం సీతాం పశ్చాదభ్యేతి అరణ్యగమనా నంతరం సమీపే ఆగతవాన్. అనంతరం సేతుబంధన ద్వారా హతే రావణే సీతాయాం చాగ్నౌ ప్రవిష్టాయాం విశ్వాసార్థ మగ్ని స్తాం గృహీత్వా రామం రఘునాథం అభిముఖేన అస్థాత్ శుద్ధా ఇత్యభినివేదితవాన్ అభినివేశిత వాన్ తతః సుప్రకేతై స్సకలార్తిహారిభిః ద్యుభిః కాంతిభిః ఋషద్భిః కమనీయాభిః వర్ణై రాకార విశేషైశ్చ్ర వతిష్ఠన్ విశేషేణ స్థితవాన్. (భద్రః=రామ

భద్రుడు, భద్రయా= మంగళాత్మికయైన సీతాదేవితోడ, స చమానః= సంపన్నుడై, అనగ కూడినవాడై, ఆగాత్, ఆసమంతాత్ అగాత్=తండ్రి యానతి చొప్పున అరణ్యమున అంతటను సంచరించెను. జారః= పరదారాపహర్తయను రావణుడు, స్వసారం= తల్లివలె పూజ్యురాలను, జగన్మాతయైన సీతాదేవిని, పశ్చాత్ అభ్యేతి= అరణ్యమున చేరినతరువాత సమీపమునకు వచ్చెను. పిమ్మట సేతుబంధనము ద్వారా (లంకలో) ప్రవేశించిన తరువాత రావణుడు నిహతుడు కాగా, సీతాదేవి అగ్నిలో ప్రవేశింపగా విశ్వాసము కలిగించుటకై, అగ్నిః= అగ్ని దేవుడు, అమెను కొనివచ్చి, రామం= రఘునాథునకు అభిముఖముగా, అస్తాత్= పరిశుద్ధాత్మయని నివేదించెను; నివేశింపజేసెను. తరువాత సుప్రకేతైః= సమస్తాపదల తొలగించెడు, ద్యుభిః= కాయములతో, ఋషద్భిః। మనోహరములైన, వర్ణైః= ఆకారవిశేషముతోడ, వితిష్ఠన్= విశిష్టవిధముగా నుండెను.) "రామాయణం మహాకావ్యం సర్వవేదేషు సమ్మితమ్" అను ప్రాచీనోక్తియు రామాయణము వేదతుల్యమని తెలుపును.

వేదములు ప్రాతీతికముగా తెలియునట్టి స్తుత్యాది రూపమగు వాచ్యార్థముతో బాటు కర్మకాండమును జ్ఞానకాండమును గూడ ప్రతిపాదించుచున్నది. అట్లే తత్తుల్యమగు రామాయణము కూడ కథారూపమగు వాచ్యార్థము, పారాయణాదుల నుపయుక్తమై కామ్యాకామ్య ఫలప్రద మగుటచే నుపాసనారూప కర్మోప యోగము అంతర్వాహినియగు పరతత్త్వవిజ్ఞానము అను మూడింటికి కూడలియై త్రివేణీ సంగమమైనది.

అందువలన మధురమును మధురాక్షరమును నగు కావ్యముగా మాత్రమే గాక రామాయణమును ఈ దృష్టితో పరిశీలించినచో నది భారతీయ విజ్ఞాన దర్పణమనియు విశ్వమానవాళికిని మార్గదర్శకమగు దివ్యజ్యోతి యనియు గ్రహింపగలము. ఈ దృక్పథమును యథాశక్తిని యథావకాశముగా వివరించుట యే యీప్రసంగవ్యాసము ఉద్దేశము.

రాముని యవతారము వలె రామాయణావతారమును మహార్థగర్భితము; లోకకల్యాణైకహేతువును.

*తప స్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్*
*నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్॥*

*(రామా 1-1-1)*

అను శ్లోకముతో నది యారంభమగు చున్నది.

మహా తపస్వియును, నిరంతర వేదాధ్యయన శీలుడును, శబ్దార్థ తత్త్వములను చక్కగా నెఱింగిన వాడును నగు నారద మహాముని యొకనాడు వాల్మీకి యాశ్రమమునకు వచ్చెను. అప్పుడు తపోనిష్ఠుడగు వాల్మీకి యాతని పూజించి కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్? (రామా. 1-1-2) అని యారంభించి సమస్త సద్గుణ వంతుడగు మానవుడు ఇప్పుడు ఈ లోకమున నెవ్వడు గలడు ? అని ప్రశ్నించెను. దానికి సమాధానముగా నామహర్షి-

"ఇక్ష్వాకు వంశ ప్రభవో రామో నామ జనైః శ్రుతః॥" (రామా 1-1-8) అని మొదలుపెట్టి సంక్షేపముగా రామాయణకథను తెలిపి పోవును.

అంతట మధ్యాహ్నము కాగా వాల్మీకి మహర్షి తన శిష్యులతో గూడ స్నానార్థమై సమీపమున నున్న తమసా నదికి పోయి అచటి ప్రకృతి సౌందర్యమును జూచుచుండగా నొకచెట్టు మీద మధురముగా కూయుచు జతయై క్రీడించుచుండు రెండు క్రౌంచపక్షు లా మునికంట బడుటయేమి, అంతలో అల్లంత దూరమున పొంచియున్న యొక బోయ వానిలో మగ దానిని బాణము వైచి నేల గూల్చుటయేమి, క్షణములో జరిగిపోయెను. రక్త సిక్తమైన శరీరముతో నేల బడియున్న మగపక్షిని దానికై దీనాతిదీనముగా విలపించుచున్న యాడుపక్షిని జూడగనే యా మహర్షి హృదయము ద్రవించిపోయెను. వ్యాధునిపై కోపము వచ్చెను. అంతట నా ఋషినోట నుండి యప్రయత్నముగా-

"మా నిషాద ! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీస్సమాః।
యత్ క్రౌంచ మిథునా దేక మవధీః కామ మోహితమ్॥"
(రామా. 1-2-15)

అను శాపవాక్యము శ్లోకరూపమున వెలువడెను ఓరి నిషాదుడా ! దంపతులుగా క్రీడించుచున్న యీ క్రౌంచపక్షులలో కామపరవశమై యున్న మగపక్షిని కూల్చితివే; నీవును చిరకాలము ఉండ కుందువుగాక అని యీ శ్లోకమున కర్థము.

ఆశాపవాక్యమునే మనస్సులో తలపోసికొనుచు నా మహర్షి ఏమిది? నేను పలికిన వాక్యము వింతగా కుదిరియున్నదే ! అని యాశ్చర్యపడి శిష్యుడగు భారద్వాజుని పిలిచి ఇప్పుడు నేను పలికిన వాక్యము సమానాక్షరములు గల నాలుగు పాదములతో వీణాతంత్రాల మీద లయబద్ధముగా పాడుటకు సనువుగా కుదిరియున్నది! ఇది తప్పక శ్లోకముగా దోచును అని చెప్పగా నతడును సంతోషించి దానిని కంఠస్థము చేసికొనెను.

తరువాత నామహర్షి స్నానాదికము తీర్చికొని ఆశ్రమమునకు తిరిగివచ్చి మాధ్యాహ్నిక క్రియలు నిర్వర్తించుకొని శిష్యులతో మాటలాడు చున్నను మనసులో ముందు జరిగినవిషయమునే తలపోయుచుండగా నంతలో బ్రహ్మదేవు డాతనికి సాక్షాత్కరించెను. మునియు నాతనిపూజించి యాతని యాజ్ఞచే నాతని యెదుట గూర్చుండెను. కాని యప్పుడును తన మనస్సులో నంతకుముందు జరిగిన క్రౌంచవధమును తన వాక్యము శ్లోక రూపమున వెలువడుటను గూర్చియే యాలోచించుచుండెను. దాని నెఱింగి బ్రహ్మ ఏల యాలోచింతువు? నాసంకల్పము ననుసరించియే సరస్వతి లౌకికచ్ఛందోరూపమున నీనోటినుండి యింతకు ముందుగనే వినియుంటివే, ఆ రామచరిత్రమును పాదబద్ధములగు నిట్టి శ్లోకములతో రచింపుము. దానికి సంబంధించిన వృత్తాంతము రహస్యముగాని, ప్రకాశముగాని

సర్వమును నీమనోదృష్టికి గోచరించును. నీ వాదికవి వైతివి అని పలికి యంతర్హితు డయ్యెను.

ఆ పిమ్మట వాల్మీకి మహర్షి మహాకావ్యనిర్మాణమునకు కృత నిశ్చయుడై యోగనిష్ఠతో రామచరితమును సర్వమును మానసప్రత్యక్షము గావించుకొని ధర్మసంహితమగు రామాయణాఖ్యానమును మహాకావ్యముగా రచించెను. ఇది రామాయణావతారిక. దీనిని సూక్ష్మముగ పరిశీలించినచో రామాయణ మహాసౌధ నిర్మాణమునకు పునాది యేమో, వాల్మీకి దృక్పథ మేమో విస్పష్టముగ కానవచ్చును.

మొదటి శ్లోకమున నారదుని గూర్చియు వాల్మీకిని గూర్చియు నున్న విశేషములను గమనింపుడు, నారదుడు తపోనిష్ఠుడు, వేదాధ్యయన తత్పరుడు, వాగ్వేత్త, మననశీలుడు, వాల్మీకియు దపస్వియే. వీనిలో నారదుని కథా కథన నైపుణ్యమునకు గాని, వాల్మీకి శ్రవణ కౌతూహలము నకు గాని, యణుమాత్రము సూచనమ్మైనను నున్నదా? మఱి యిట్టివారి ప్రశ్నోత్తరములు మహార్థ గర్భితములును, లోకకల్యాణ సంధాయకములును గాక కేవల లౌకిక కథా విషయము లగునా?

'పరిప్రపచ్ఛ' అను క్రియా రూపము 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన 'సేవయా' అను గీతా వాక్యములోని 'పరిప్రశ్న' మును సూచించుట లేదా? స్పష్టముగా నీ ఘట్టము ఆచార్యుని యుత్తమార్హతలను శిష్యుని యోగ్యతను నిర్దేశించుచు గురూపసదన రూపమగు సంప్రదాయ మును నిరూపించుచున్నది. 'తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్' అన్న యుపనిషద్వాక్యమునకు నిది యనుసరణము. దీనిచే రామచరితాఖ్యానమున నలౌకికమగు నాధ్యాత్మిక తత్త్వము నిక్షేపింపబడినది యనుట విశదమగుచున్నది.

మఱియొక విధముగా జూచినను ఈ యంశమే స్పష్టముగా తెలియుచున్నది. వాల్మీకి యాశ్రమము రామపరిపాలిత మగు కోసలదేశము నానుకొనియే యున్నది. రాముని రాజ్యకాలముననే రామాయణము రచింపబడినది.

"రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః,

రామ భూతం జగ దభూద్రామే రాజ్యం ప్రశాసతి.

(రామా. 6-131-97)

అని రామాయణము తుదిని తానే పేర్కొన్నవాడు. రామో నామ జనైః శ్రుతః (రామా. 1-1-8) అని నారదుడు కీర్తించినాడు. రాముడు ఈ ప్రశ్నము కాలమునకు వాల్మీకికి తెలియడా? మఱి యీ ప్రశ్న సమాధానముల కర్థమేమి ? వాల్మీకికి రాముడు తెలియును ; రామతత్త్వ మును తెలిసికొనుటకే యీ ప్రశ్నము. ఇక్ష్వాకు వంశమున జన్మించి రాముడను పేరితో జనుల కందఱికును ప్రసిద్ధుడై యున్నాడే ఆతడే సర్వసద్గుణ సంపూర్ణుడు ; సంపూర్ణమానవతా లక్ష్యముగా నవతరించిన మహావిష్ణువు ; పరతత్త్వము అనుటయే నారదుని సమాధాన విన్యాసము లోని యంతరార్థము. ఆయన వాగ్విదాం వరుడు కదా?

ఈ దృష్టితో పరిశీలించినచో రామాయణమున మానవతాచ్ఛాదిత మగు దేవత్వమును ఆ యావరణమునకు వెనుక శుద్ధ పరతత్త్వమును గోచరించును. శ్రద్ధావిశ్వాసములతో వీనిని యథాక్రమముగా తెలిసికొనుట పాఠకుల కర్తవ్యము. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అనిగదా పెద్దల యుపదేశము.

తొట్ట తొలిసారిగా లౌకికచ్ఛందోరూపమున వాల్మీకి మహర్షి నోటి నుండి వెలువడిన 'మా నిషాద' అని మొదలగు శ్లోకము శాప వాక్యమై అమంగళ సూచకముగా నున్నదే యను సంకోచము మనవంటి వారికి గలుగుట సహజము. కాని అది యట్టిది గా దనియు, అప్రయత్నముగా వచ్చిన ఛందో బంధమువలె నప్రయత్నముగానే అందు శుభాశంసన రూపమును కావ్యార్థసూచకమునగు నర్థాంతరము ఇమిడియున్న దనియు సంప్రదాయ విదులగు పెద్దలు వివరించి యున్నారు. అది యెట్లో తెలిసి కొందము.

'మా నిషాద' అనునది యొకటే పదము ; మా నిషీదతి అస్మిన్ అని సంస్కృతమున విగ్రహవాక్యము. మా అనగా లక్ష్మి; అస్మిన్ నిషీదతి

అనగా ఇతని యందుండును అని యర్థము. కాగా 'మానిషాద' అను పిలుపునకు లక్ష్మీ నివాసుడవగు విష్ణుమూర్తీ! తదవ తార మగు శ్రీరామచంద్రా! అని యర్థము. క్రౌంచ శబ్దమునకు వ్యుత్పత్తిని బట్టి కుటిలగతి గలవా రని యర్థము; కావున 'క్రౌంచ మిథునాత్' అనగా కుటిలగతి గలవారగు రాక్షస దంపతులనుండి అనగా మండోదరీ రావణులనుండి అను నర్థము వచ్చును. అప్పుడు మొత్తము శ్లోకమునకు 'లక్ష్మీనివాసుడవగు నో శ్రీరామచంద్రా! నీవు రాక్షసదంపతులలో కామమోహితుడగు రావణుని చంపితివి. కావున చిరకాలము ప్రతిష్ఠనందుదువు గాక' అను విశేషార్థము లభించి కావ్యార్థమును సంగ్రహముగా తెలుపుచున్నది.

ఇది యొక దృష్టి. ఈ దృష్టితో జూచువారికి శ్రీరాముడు విష్ణువు నవతారము ఆతని చరిత్రమును నభివర్ణించు రామాయణము పరమపవిత్ర మైన పారాయణగ్రంథము. "ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్" అని వారి విశ్వాసము.

ఇది యిట్లుండగా ఆధునిక విమర్శకులు కొందఱు రామాయణ మును కేవలము చారిత్రక కావ్యముగా భావించువారు వాల్మీకి మహర్షి రామాయణములో శ్రీరాముని సకల సద్గుణ సంపన్నుడగు మానవునిగాను, ఆదర్శ ప్రాయుడగు ప్రజాపాలకుడుగాను మాత్రమే తీర్చినాడు. కాని యవతార పురుషునిగా తీర్పలేదు. మతావిష్టులగు తరువాతి వారు రాముని అవతారపురుషునిగా భావించి పూజింప సాగిరి. అతడవతార మనుటకు రామాయణమున ఆధారమే లేదు. అది గాక అతడు భగవంతు డగుచో మానవుల కాదర్శప్రాయుడెట్లగును? అని యొక ప్రజ్ఞావాదమును సాగించు చున్నారు. వారి యభిప్రాయములో బాలకాండములోని యవతార కథా భాగమంతయును ప్రక్షిప్తము; అనగా తరువాతి వారు చేర్చినది. రావణుని తపస్సు బ్రహ్మవరదానము ఇత్యాదు లన్నియును తరువాతి వారి కల్పనలే.

ఈ యభిప్రాయము విమర్శకు నిలుచునది కాదు. ఏలయన రాముని కథ ఒక్క రామాయణములోనే గాక భారతము, భాగవతము పద్మపురాణము, నరసింహ పురాణము మొదలగు పెక్కు ప్రామాణిక

గ్రంథములలో నున్నది. వాని యన్నింటిలోను రాముడు విష్ణుని యవతార మనియే ప్రతిపాదింపబడియున్నది. ఈ క్రింది కొన్ని యుద్ధారములను జూడుడు.

*న స దేవాసురై శ్శక్యో యుద్ధే జేతుం విభావసో!।*
*విహితం తత్ర య త్కార్య మభిత స్తస్య నిగ్రహః॥*
*తదర్థ మవతీర్ణో౽సౌ మన్నియోగా చ్చతుర్భుజః।*
*విష్ణుః ప్రహరతాం శ్రేష్ఠ స్స త త్కర్మ కరిష్యతి॥*

*(భార. వనపర్వ 276 అధ్యా)*

రావణ పీడితులై వచ్చిన యగ్నిముఖులగు దేవతలతో బ్రహ్మ పలికిన వాక్యము లివి.

*అజస్తస్య మహాభాగ! తస్మాద్దశరథో౽భవత్।*
*తస్యాపి భగవానేష సాక్షాద్బ్రహ్మమయో హరిః।*
*అంశాంశేన చతుర్ధాగా త్పుత్రత్వం ప్రార్థిత స్సురైః॥*

*(భాగ. దశమ. 10. అధ్యా)*

ఇక్ష్వాకువంశవర్ణనమున రామావతారమును దెలుపుచు పరీక్షిత్తుతో శుకమహర్షి పలికిన మాట లివి. ఇట్లే తక్కిన పురాణోపపురాణముల యందును గలదు. ఇవి యన్నియును ప్రక్షిప్తములే యనుట విమర్శ సహము గాదు.

మఱి యొక విషయము. ఆధునికుల దృష్టిలో క్రీ.శ. అయిదవ శతాబ్దము వాడును, ప్రాచీనుల దృష్టిలో క్రీ. పూ. ఒకటవ శతాబ్దమువాడును నగు కాళిదాస మహాకవి, అన్ని విధములను వాల్మీకినే అనుసరించిన వాడు. రఘువంశము దశమ సర్గములో

సో౽హం దాశరథి ర్భూత్వా రణభూమే ర్బలిక్షమమ్।
కరిష్యామి శరై స్తీక్ష్ణై స్తచ్ఛిరః కమలోచ్చయమ్॥

(రఘు 10-45)

అని విష్ణునిచే దేవతలకు జెప్పించినాడు; కావున నా మహాకవి బాలకాండ శ్లోకములను ప్రక్షిప్తములుగా భావింపలేదు. అతనికాలమునకు వైష్ణవ మతా విష్టులు లేరు గదా?

ఇతరు లేమి చెప్పినను వాల్మీకి మాత్రము రాముని మానవునిగనే తీర్చినాడు. బాలకాండలోని ప్రక్షిప్త శ్లోకములను తొలగించినచో రామాయణ ములో రాముని దివ్యత్వము ఎక్కడను కానరాదు. అను వాదమును గూడ పరిశీలింపక చెప్పిన మాటయే.

భగవంతుడు మానవుడుగా నవతరించి వేదచోదితమ్మైన ధర్మమును ఎట్లెట్లు అనుష్ఠింపవలయునో ఏయే యాదర్శములను దృష్టిలో నుంచుకొని ప్రవర్తింపవలయునో అట్లట్లు అనుష్ఠించి, అట్లట్లు ప్రవర్తించిన చరిత్రమును మహాకావ్యముగా సంతరించునప్పుడు ఆదికవియగు వాల్మీకి యాతని మానవత్వమునకు ప్రాధాన్యము నిచ్చుట వింతగాదు. అయినను శ్రీరాముని దివ్యత్వమును అనుక్షణము భావించు నామహర్షి ఆ దివ్యతాస్ఫురణమును అటనట నిక్షేపించుచు తత్త్వజ్ఞులను హెచ్చరించుచునే యున్నాడు. ఒక్కొక్క కాండము నుండియును శ్రీరాముని దివ్యత్వఖ్యాపకములగు వాక్యములను అభిజ్ఞుల పరిశీలనమునకై నివేదించుచున్నాడను. ఇందు బాలకాండములో ప్రక్షిప్తము లని యాధునిక విమర్శకులు భావించు వానిని వదలివేసి తక్కిన వానినే యుదాహరింతును.

బాలకాండమున శ్రీరామజనన ఘట్టమున "స్వోచ్చసంస్థేషు పంచసు గ్రహేషు కర్కటే లగ్నే ---- జగన్నాథం సర్వలోక నమస్కృతమ్ కౌసల్యాఽజనయ ద్రామమ్" 1-18-9, 10 అని యైదు గ్రహము లుచ్చస్థితములై యుండగా రాముడు జన్మించెనని తెలుపబడినది. ఇట్లు ఒక్కమాఱుగా నైదు గ్రహము లుచ్చస్థితిలో నుండుట యసాధారణము; అవతారమూర్తులకు మాత్రమే సంభవించునది. 'పంచోచ్చే లోకనాయకః' అని జ్యోతి శ్శాస్త్రమున ఆ స్థితికి ఫలము చెప్పబడినది. అందువలన రాముని

దివ్యాంశసంభూతికి ఇచటనే బీజము నిక్షిప్తమైనది. అట్టి సమయమున జన్మించిన వాడు జగన్నాథుడే గాని జగతీ నాథ మాత్రుడుగాడని జగన్నాథం సర్వలోక నమస్కృతమ్ అను విశేషణములు స్పష్టము చేయుచున్నవి.

విశ్వామిత్రుడు దశరథుని యొద్దకు వచ్చి యాగసంరక్షణార్థమై రాముని బంపుమని కోరినప్పుడు రాముడు బాలు డనియు రాక్షసులతో బోరుటకు నసమర్థుడనియు పుత్త్రప్రేమచే దశరథుడు పలుకగా దానికి సమాధానముగా విశ్వామిత్రు డిట్లనును.

అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్।
వశిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః॥.

(1-9-14, )

రాముని తత్త్వము నీ కేమి తెలియును? సత్యపరాక్రముడగు నా మహాత్ముని నిజస్వరూపము నాకు తెలియును. బ్రహ్మతేజోమూర్తియగు వశిష్ఠునకు తెలియును; తపస్స్థితులగు నీ వామదేవాది మహర్షులకు దెలియును. అను నీ వాక్యములను పరిశీలింపుడు. రాముడు సామాన్య మానవుడే అయినచో నాతని పరాక్రమమును దండనాథు లెటిగియుందురు. కాని వశిష్ఠ విశ్వామిత్రులును తపస్స్థితులగు మహర్షులును నెట్లెఱుగుదురు? అహం వేద్మి అను నెత్తుగడ వేదాహ మేతం పురుషం మహాంతమ్ అను శ్రుతి వాక్యమునకు అనుకరణముగా తోపదా?

అహల్యా శాపమోచన కథయును రాముని దివ్యత్వమును స్పష్టీకరించును. తారయైనాం మహాభాగామహల్యాం దేవరూపిణీమ్ 1-49-11 అను విశ్వామిత్ర వాక్యములోని తారయ అను పదమును పరిశీలింపుడు. తారక మంత్రాధి దైవమగు రాముడు సాక్షాత్కరించును. 'రమంతే అస్మిన్ యోగినః' అను వ్యుత్పత్తిచే రామశబ్దము భగవత్పరమై అతడు దశరథాత్మజుడుగా నవతరించి వచ్చినపుడు అని గౌతముని శాపమోక్షణ వాక్యమునకు నర్థమై రాముని దివ్యత్వమును విస్పష్టము చేయును.

పరశురాముడు రామునితో

*అక్షయం మధుహంతారం జానామి త్వాంసురోత్తమమ్।*

*ధనుషోఽస్య పరామర్శాత్ స్వస్తి తేఽస్తు పరంతప॥*

*(1-76-17)*

ఈ వైష్ణవ చాపమును నీవు ఎక్కువెట్టితివి. దీనివలన నేను నిన్ను తెలిసి కొంటిని. నీవు అవినాశియగు మధువైరివి అన్న వాక్యము చాలదా రాముని దివ్యత్వమును తెలుపుటకు?

ఇంత తెలిపినను ఆ యవతార పురుషుడు తన మాయచే సామాన్య జనులకు తెరవైచి తనతత్త్వమును దాచుకొన్న విధము మాత్రము ఆశ్చర్యకరము.

అయోధ్యాకాండమున :-

*తేషామపి మహాతేజా రామో రతికరః పితుః।*

*స్వయం భూ రివ భూతానాం బభూవ గుణవత్తరః॥*

*సహి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః।*

*అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుస్సనాతనః॥ (2-1-6,7)*

ఇవి కవివాక్యములు, రాముడు భగవదవ తార మని తెలుపునవి.

పుత్ర విరహ దుఃఖితయగు కౌసల్యనూరడించుచు సుమిత్ర రాముని గూర్చి యి ట్లు పలుకును.

*సూర్యస్యాపి భవే త్సూర్యో హ్య గ్నే రగ్నిః ప్రభోః ప్రభుః।*

*శ్రియః శ్రీశ్చ భవే దగ్ర్యా కీర్తిః కీర్తే: క్షమా క్షమా।*

*దైవతం దేవతానాం చ భూతానాం భూత సత్తమః॥.*

(2-44-15-16)

ఇవి మానవుని గూర్చి పలుకు మాట లేనా?

సుమిత్రకు తత్త్వము తెలియునా? తెలియును; మహాజ్ఞానియగు లక్ష్మణుని గన్న తల్లి గదా ఆమె?

అరణ్యకాండమున :-

మృతుడగు జటాయువును సంస్కరించు సందర్భమున నాతని నుద్దేశించి రాముడు పలికిన పలుకులు-

*యా గతి ర్యజ్ఞ శీలానా మాహితాగ్నేశ్చ యా గతిః।*

*అపరావర్తి! నాం యా చ యా చ భూమి ప్రదాయినామ్।*

*మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్॥*

(3-68-29, 30)

ఇందు సమనుజ్ఞాతః అను మాట గమనింపదగినది. "నేను నీకు అనుజ్ఞ యిచ్చితిని; కావున నీవు ఉత్తమోత్తమములగు లోకములకు బొమ్ము" అని పైవాక్యములోని భావము. రాముడు మానవ మాత్రుడే యయిన నిది కుదురునా? రాముడు కూడ నిజతత్త్వము తెలియని మాయావృతుడు కా డనియును దీనివలన దెలియుచున్నది.

హతుడై గంధర్వుడుగా మారిన కబంధుడు దర్శన మిచ్చి శబరి ననుగ్రహింపుమని చెప్పును.

*త్వాం తు ధర్మే స్థితా నిత్యం సర్వభూత నమస్కృతమ్।*

*దృష్ట్వా దేవోపమం రామ! స్వర్గలోకం గమిష్యతి॥*3-73-26-27

ఇది రాముని దివ్యత్వమును దెలుపదా?

శబరి రామునితో నిట్లనును.

*అద్య మే సఫలం జన్మ స్వర్గశ్చైవ భవిష్యతి।*

*త్వయి దేవవరే రామ! పూజితే పురుషర్షభ॥*

*చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన॥*

*గమిష్యా మ్యక్షయాన్ లోకాన్ త్వత్ప్రసాదా దరిందమ॥*

(3-74,12-13)

దేవతా శ్రేష్ఠుడవగు నిన్ను పూజించుటచే నా జన్మము సఫలమ్మైనది. స్వర్గమును ప్రాప్తించును. నీకటాక్షముచే నా పాపములు నశించినవి. నీ యనుగ్రహముచే నే నింక నక్షయ లోకముల నందెదను. అను నీ మాటలు మానవుని గూర్చి చెప్పదగినవి యగునా?

కిష్కింధా కాండమున:-

తార వాలితో రాముని గూర్చి యిట్లు చెప్పును.

*నివాసవృక్ష స్సాధూనా మాపన్నానాం పరాగతిః।*

*ఆర్తానాం సంశ్రయశ్చైవ యశస శ్చైక భాజనమ్॥*

(4-15-19, 20)

వాలివధానంతర మామె రాముని ఇట్లు స్తుతించును.

త్వ మ ప్రమేయశ్చ దురాసదశ్చ జితేంద్రియ శ్చోత్తమ ధార్మికశ్చ।
అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః॥

(4-24-31)

ఇందు పేర్కొనబడిన గుణములు నిస్సంశయముగా దివ్యత్వమును ప్రతిపాదించునవియే.

సుందర కాండమున:-

హనుమంతుడు రాముని గూర్చి రావణునితో బలికిన మాటలు.

*సర్వాన్ లోకాన్ సుసంహృత్య సభూతాన్ సచరాచరాన్।*
*పునరేవ తథా స్రష్టుం శక్తో రామో మహాయశాః॥*

(5-51-39, 40)

జగత్ సృష్టి సంహారములు భగవంతునకు దప్ప మానవునకు శక్యములా?

యుద్ధ కాండ మున:-

విభీషణ శరణాగతి ఘట్టమున పగవాని తమ్ముడు గావున నీతని జేర దీయరా దని పలికిన సుగ్రీవునితో రాముడిట్లు పలుకును.

*సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।*

*అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥*

(6-18-33)

ఒక్కసారి భక్తి పూర్ణుడై నేను నీవాడ నని ప్రార్థించిన జాలును. సర్వప్రాణులకును నభయము నిత్తును. ఇది నావ్రతము ఈ మాటలు భగవంతుడు కానివాడు ఎవ డనగలడు? ఇది యొక్కటి చాలును రాముని భగవత్త్వమును నిరూపించుటకు.

నాగపాశబద్ధులగు రామలక్ష్మణుల కడకు గరుత్మంతుడు వచ్చును. నాగపాశములు విడిపోవును. ఆసందర్భమున రామునితో గరుడు డిట్లనును.

*అహం సఖా తే కాకుత్ స్థ ప్రియః ప్రాణో బహిశ్చరః।*

*గరుత్మా నిహ సంప్రాప్తో యువయో స్సాహ్యకారణాత్॥*

*(6-50-46)*

*సఖే ! రాఘవ ! ధర్మజ్ఞ ! రిపూణా మపి వత్సల !।*

*అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి గమిష్యామి యథా సుఖమ్॥*

*న చ కౌతూహలం కార్యం సఖిత్వం ప్రతి రాఘవ !।*

*కృతకర్మా రణే వీర సఖిత్వం ప్రతివేత్స్యసి॥*

*(6-50-56-57)*

నేను నీకు మిత్రుడను. మీ యిరువురకును సాహాయ్యము చేయుటకు వచ్చితిని. ఇక నేను పోవుదును. అనుజ్ఞ నిమ్ము. యుద్ధమున నీవు కృతకృత్యుడ వైన తరువాత నేను నీ కెట్లు మిత్రుడ నగుదునో తెలిసికొందువు. అని పలికి రామునకు ప్రదక్షిణము చేసి అనుజ్ఞాతుడై

గరుడుడు వెడలిపోవును. ఈ సందర్భ మేమనును ? రాముని మానవత్వ మును సమర్థించునా?

రావణ వధానంతరము మండోదరి పలుకులలో రాముని తత్త్వ మెంత విస్పష్టముగా దెలియునో చూడుడు.

*వ్యక్త మేష మహా యోగీ పరమాత్మా సనాతనః।*

*అనాదిమధ్య నిధనో మహతః పరమో మహాన్।*

*తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః।*

*శ్రీవత్స వక్షా నిత్యశ్రీ రజయ్యః శాశ్వతో ధ్రువః ।*

*మానుషం రూప మాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః॥*

*(6-111-10-12)*

భావము స్పష్టము. ఈ తత్త్వము నెఱిగిన వారందఱును విశ్వామిత్రుడు 'యే చేమే తపసి స్థితాః' అన్న తెగలోని వారే.

ఇక చిట్టచివరగా ఈ తత్త్వజ్ఞులందఱికంటెను సాధికారముగా పలికిన బ్రహ్మాదుల సిద్ధాంత వాక్యములతో ఈ వాదప్రతివాదములను ఉపసంహరింతును.

సీతాదేవి యగ్నిని ప్రవేశించినది. ధర్మమూర్తి యగు రాముడు చుట్టు నున్నవారి మాటలను వినుచు శోకాకులమగు మనస్సుతో నేమేమో తలపోయుచున్నాడు. అంతలో బ్రహ్మాదులగు దేవతలు వచ్చి యాతని దివ్య విభూతులను పొగడి యిట్టి నీవు సామాన్యునివలె సీతాదేవి నేల యుపేక్షింతువు? అని పలుకరింతురు. అందులకు రాముడు

*ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్।*

*యోఽహం యస్య యత శ్చాహం భగవాన్ తద్బ్రవీతు మే॥*

*(6-117-11)*

ఏమి యిది ? మీ రిట్లు పలుకుచున్నారు! నేను నన్ను మానవుడ ననియు, రాము డను పేరివాడ ననియు, దశరథుని కుమారు డనియు

తలచుచున్నానే, అట్లు కానిచో నేనెవడను? ఎవరికి సంబంధించినవాడను? ఎక్కడనుండి వచ్చితిని? అని యడుగును. దానికి బ్రహ్మ రాముని దివ్యత్వ మును మిక్కిలి నుతించి తదకు-

*సీతా లక్ష్మీ ర్భవాన్ విష్ణుర్దేవః కృష్ణః ప్రజాపతిః।*

*వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్॥*

*(6-117-27, 28)*

*అని నిష్కర్షించును.*

స్వామి యీ నటన మంతయును సుగ్రీవాదులకు నిజతత్త్వము నెఱుక పఱచుటకు దానితో సీతాదేవి విషయమున తనవర్తనము వలన వారిలో గలిగిన మానసిక వ్యథను తొలగించుటకును.

ఈ విషయము లన్నియును పెక్కు పురాణములతో సంవదించు చున్నవి. అదిగాక రాము డవతారమూర్తి కా డన్నచో ననేక పురాణప్రసిద్ధమగు జయవిజయుల శాప వృత్తాంతము సమర్థితముకాదు.

పై బ్రహ్మయుపదేశముతో మఱియొక రహస్యము ముడివడి యున్నది. అది వాల్మీకి గురూపసదనముతో నారంభమైన రామచరితము సాక్షాచ్చతుర్ముఖుని తత్త్వోపదేశముతో పూర్ణమై మానవునకు తత్త్వజ్ఞాన మార్గమును - తత్త్వమసి జ్ఞానమార్గమును నిర్దేశించుచుండుట. అందువలన పై బ్రహ్మ వాక్యములు ప్రక్షిప్తము లనరాదు.

ఇన్ని తావుల నున్న యిన్ని శ్లోకములును ప్రక్షిప్తములే యని వాదించుట కంటె అసలు రామాయణమే ప్రక్షిప్త మనుట మెచ్చదగిన మాట.

ఈ విషయముల నెల్ల నాలోచింపగా రాముడు వాల్మీకి తీర్పులోను భగవదవతారమే గాని కేవల మానవుడు గా డనుట సిద్ధాంతము.

మఱి భగవంతు డీయవతారము నెత్తుట యెందులకు ? దుష్టశిక్షణమునకు అని సాధారణ సమాధానము. కాని దానికి అది మాత్రమే ప్రయోజనము కాదు.

*పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।*

*ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥*

అనిగదా గీతాచార్యుని వచనము. అందు ధర్మ సంస్థాపనము పరమప్రయోజనము; సాధు పరిత్రాణమును దుష్కర్ముల వినాశమును దానికి సాధనములు. రామాయణమున నీ ధర్మ సంస్థాపన ప్రకారము సర్వతోముఖముగా ప్రస్తుతమైనది.

'రామో విగ్రహవాన్ ధర్మః' అని వాల్మీకి మహర్షి నిర్వచనము. రాముడు మూర్తీ భవించిన ధర్మము. వేద బోధితమై మానవునకు కల్యాణ సాధనమైనది ధర్మము. అది రెండు విధములు; ప్రవృత్తి ధర్మము నివృత్తి ధర్మము నని. ప్రవృత్తి ధర్మము సాంసారిక జీవితమునకు సంబంధించినది. పురుషార్థములలో ధర్మము నకు భంగము లేకుండ నర్థమును, ఆ రెండింటికిని భంగము లేకుండ కామమును సేవించుమార్గ మది. దానికిని గమ్యము మోక్షమే, నివృత్తి ధర్మము ధర్మార్థ కామములను మూడింటిని వదలి తత్త్వాన్వేషణ మొనరించి సరాసరి మోక్షమునందు త్రోవ. రామావతార మున నీరెండును సమ్మిళితములై ధర్మము పూర్ణరూపము నందినది. ఆపురుషోత్తముని దివ్యత్వము నివృత్తి ధర్మమునకు ఆలంబనము కాగా మానుషత్వము ప్రవృత్తి ధర్మమునకు ఆదర్శమైనది; కావుననే రాముడు మూర్తీభవించిన ధర్మమైనాడు.

*మర్త్యావతార స్త్విహ మర్త్యశిక్షణమ్।*

*రక్షోవధాయైవ న కేవలం విభోః॥*

భగవంతుడు మానవుడై రాముడుగా నవతరించినది కేవలము రావణాదులగు రాక్షసులను జంపుటకే కాదు; మఱి యేమనగా మానవులు ఎప్పుడు ఎట్లు నడచుకొనవలయునో దానిని నేర్పుటకు అను శుక మహర్షి వాక్యము రామావతార ప్రయోజనమును నిర్దేశించుచున్నది.

మానవుని ప్రవర్తనమును రెండు విధములుగా విభజింపవచ్చును. (1) ఐహికము (2) ఆముష్మికము నని. తల్లిదండ్రులు, కుమారులు,

అన్నదమ్ములు, గురుశిష్యులు, భార్యాభర్తలు, స్వామి భృత్యులు, ధనిక నిర్ధనులు, ఆతిథేయాతిథులు, స్త్రీపురుషులు, వీరు పరస్పరము ఎట్లెట్లు నడచుకొందురో అదియును, శత్రువులు మిత్రులు నుదాసీనులు అనువారి యెడ మానవుని ప్రవర్తనము ఎట్టిదో అదియును, అర్థకామములను అనుభవించు రీతియును ఇవి యన్నియును నైహికమునకు సంబంధించినవి. ధర్మశాస్త్రనిర్దిష్టము లగు నిత్యనైమిత్తిక కర్మములను యజ్ఞయాగాదులను ఆచరించుట యాముష్మికమునకు సంబంధించినది. ఈ రెండు తెలిగుల లోను రామాయణము దివ్యజ్యోతియై సన్మార్గమును నిత్య ప్రకాశితము చేయుచున్నది. ఈ ప్రవర్తనమును కాంతాసమ్మితముగా నుపదేశించుటయే కావ్యమునకు ప్రధాన ప్రయోజన మని పెద్దల మాట.

అర్థమునకు గాని, కామమునకు గాని ధర్మముతో సంఘర్షణము వచ్చినప్పుడు ఏ మానవుడైనను వానిని వదలియైనను ధర్మమునే అనుసరింప వలయునని రామాయణ మాద్యంతమును మనకు బోధించు చున్నది. తండ్రి మాటను చెల్లించుట కుమారుని ధర్మము.

జీవతో ర్వాక్య కరణా ద్వార్షికే౽పి చ రక్షణాత్।

మృతయోః పిండదానాచ్చ త్రిభిః పుత్త్రస్య పుత్త్రతా॥

అని ధర్మశాస్త్రము నాదేశము. దానికై సమస్త భోగములకును ఆటపట్టగు రాజ్యమును తృణప్రాయముగా వదలి నిశ్చింతగా నడవులకు బోయిన స్వార్థత్యాగ పూర్ణమగు శ్రీరాముని నడవడి విశ్వమానవులకును నాదర్శ ప్రాయముగాదా?

భర్తృ పరిచార్యారూపమగు పతివ్రతాధర్మమునకు గట్టువడి పుత్త్రవాత్సల్యమును దిగమ్రింగి యింటనే నిలిచి, ధర్మమార్గ ప్రస్థితుడగు కుమారుని దీవించి పంపిన కౌసల్యయును అంతఃపుర సౌఖ్యములను తృణీకరించి యాపదలను లెక్కింపక పతివెంట నడవులకు నడచిన సీతమ్మయును, తన వనవాసము కైక వరమున లేకున్నను అన్నతోడిదే లోక మని యరణ్యమునకు తరలిన లక్ష్మణుడును, పుత్త్రస్నేహ జీవితుడయ్యును

సత్యవాక్యమునకై కుమారుని నడవులకంపి యాతని విరహమున ప్రాణము లనే వదలిన దశరథుడును మానవజీవితమున నుదాత్త ధర్మపథమును వెలిగించు దివ్యజ్యోతు లనుట కేమి సందేహము?

తల్లి సంపాదించి యిచ్చిన రాజ్యమును కాలదన్ని యన్నయే రాజ్యార్హుడు గాని, తాను గాదని చిత్రకూటముననున్న యన్నకడ కేగి ప్రార్థించి యు ఆయన ధర్మ సిద్ధాంతమును గాదనలేక యాతని పాదుకలను ప్రతినిధిగా గొని వచ్చి అన్నలేని రాజధానిలో అడుగుపెట్ట నని నందిగ్రామ మున నిలిచి రాజ్యము చేయుచునే ఏభోగములను గాని యనుభవింపక పదునాలుగేడులును అన్నవలెనే ముని వృత్తి నూని యాతని రాకను ప్రతీక్షించుచుండిన భరతునిలో సోదరప్రేమతో పోటీపడి యంతకంటె సముజ్జ్వలమ్మై మెఱయుచున్న ధర్మతత్పరతకు చేతులు జోడింపని మానవు డుండునా? సర్వస్వమును త్యజించి యాయన్న త్రోవనే యనుసరించిన శత్రుఘ్నుని ధర్మదీక్ష యెంత మహోన్నతమైనది!

రావణుడు సీతాదేవి నపహరించుకొని పోవునప్పు డామె ఋశ్య మూకమున నున్న సుగ్రీవాదుల ముందు తన సొమ్ములను మూటగట్టి పడవైచెను. వానిని వారు రామలక్ష్మణులకు జూపినప్పుడు రాముడు నీ వీ యాభరణములను గుఱుతింతువా! అని లక్ష్మణు నడుగగా నాత డిట్లు పలుకును.

*నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే।*

*నూపురే త్వభి జానామి నిత్యం పాదాభివందనాత్॥*

*(4-6-22.23)*

బాహుపురులను గాని, కుండలములను గాని నేను గుర్తింపలేను. ప్రతిదినమును వదినెగారికి పాదాభివందనము చేయునప్పుడు చూచుచున్న కాలియందెలను మాత్రము గుర్తుపట్టగలను అన్న యీ మాటలలో లక్ష్మణుని సౌశీల్యము హిమాలయ శిఖరములనంటె యాశ్చర్యమును గొలుపును.

'సీతాయా శ్చరితం మహత్' (1-4-7) అని మహాకవి తొలుతనే పేర్కొనినాడు కదా? ఆమెను వెదకుచు వచ్చి లంకలో చూచిన హనుమంతుడు తల్లీ! నిన్ను ఇప్పుడే నా వీపుపై మోసికొని పోయి రాముని యొద్ద దింపుదును; రమ్ము అని పలుకగా భర్తృభక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానర!

*న స్పృశామి శరీరం తు పుంసో వానర పుంగవ!*

(5-37-60)

*అనును ఇట్టి యామె శీలమును లంకాదహనానంతరము।*

*తపసా సత్యవాక్యేన అనన్యత్వాచ్చ భర్తరి ॥*

*అపి సా నిర్దహే దగ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి॥ (5-55-28)*

అని హనుమంతునంతవాడు జోహారు సేయును.

ఆ భవిష్యద్బ్రహ్మమాట ప్రత్యక్షర సత్యము, ఆమెను అగ్ని యప్పుడు గాదు. మఱి యెప్పుడును గాల్పను సాహసింప లేదని తరువాతి చరిత్రము తెలుపును.

మఱొక్క విషయమును జెప్పి యీ యంశమును ముగింతును. రాముడు రావణుని జంపి సీతాదేవి నాతని చెఱినుండి విముక్తను గావించెను. అది భార్య యెడల భర్తగా తనకర్తవ్యమును నిర్వర్తించుటయే గాని కేవల కామహేతుకము కాదని లోకమునకు బోధించుటకే ఆ సర్వజ్ఞ డామెనుండి శపథము గోరెను. భార్య సంరక్షణము భర్తృధర్మము.

*పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే।*

*పుత్త్రో రక్షతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి॥.*

*(మనుస్మృతి-9-3)*

*అని మనువు శాసించినాడు.*

ఈ సందర్భమున నొక చిన్న విషయమును మనవి చేయుదును. ఈ మనువు వాక్యము రక్షణవిషయమున స్త్రీకి స్వాతంత్ర్యమును

నిషేధించుచున్నది. అంతకంటె విస్పష్టముగా చెప్పవలయు నన్నచో స్త్రీసంరక్షణమున పురుషునికి బాధ్యతను విధించుచున్నది. కాని స్త్రీ ఎప్పుడును ఎల్లవిషయములను స్వతంత్రురాలుగా నుండగూడ దని దీని యర్థముగాదు. దీనిలో నున్న రక్షతి అను పదము నర్థమును గ్రహింపక దీనిని సర్వథా స్త్రీ స్వాతంత్ర్య నిషేధపరముగా వ్యాఖ్యానించి యుపన్యసించుచు సంఘసంస్కర్తల మనుకొను ఆధునికులు కొందఱు "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" అని చాటిన మనువును స్త్రీజనాభ్యుదయమునకు విరోధిగా, ద్రోహిగా చిత్రించుచుండుట శోచనీయమే కాదు. అపచారము గూడ.

ఆయా రక్షకులు సమీపమున లేనప్పుడు ఏపురుషుడైనను స్త్రీ సంరక్షణమునకు విధిగా పూనుకొనవలె ననియు అందులకై ప్రాణత్యాగమునకు సైతము వెనుదీయరాదనియు రామాయణమున జటాయువువృత్తాంతము స్పష్టము చేయుచున్నది.

మనునిర్దిష్టమగు నీ సూత్రమునకు విరుద్ధముగ రక్షకులను నిర్లక్ష్యముచేయు స్త్రీలును వారి సంరక్షణమున తమబాధ్యతను విస్మరించు పురుషులును సంఘమున నొందు మేలు గీడులను నేడు పత్రికలో మనము ప్రతిదినమును చూచుచునే యున్నాము.

స్త్రీసంరక్షణము ప్రతిపురుషకర్తవ్యముగా నిర్దేశించిన రామాయణము మార్గదర్శకమని వేఱుగా చెప్పవలయునా?

వేయేల? ఇందలి ప్రతిపాత్ర వర్తనమును ప్రతిసంఘటనమును ఏకైక లక్ష్యమగు ధర్మమువైపునకు శరవేగమున పయనించుచుండుట విస్పష్టమగ కానవచ్చును.

ఇక నిందలి యాముష్మిక ప్రవర్తనమును గూర్చి పరిశీలించినచో రామాయణప్రధానకథ దశరథుని యశ్వమేధముతో నారంభమై రాముని యశ్వమేధయాగముతో ముగియుచున్నది. రామాదుల జాతకర్మాదులగు

శ్రౌతస్మార్త సంస్కారములు రవంత పొల్లుపోకుండ వర్ణింపబడినవి. అశ్వమేధాది యాగములేగాక దశరథుని ప్రేతసంస్కారము, జటాయువును సంస్కరించుట తుదకు రావణుని సంస్కారమును గూడ తూచా తప్పకుండ శాస్త్రనిర్దిష్టమగు విధానమున దీర్పబడినవి.

పంచవటీ పర్ణశాల నిర్మాణమున వాస్తుకర్మ మున్నది. అవతార మూర్తియును అవాప్తకాముడును అయ్యును రామచంద్రుడు లోక సంగ్రహదృష్టిచే నిత్య నైమిత్తిక కర్మములను యథాశాస్త్రముగా నెఱవేర్చిన విధము వర్ణాశ్రమ ధర్మానుష్ఠాన రూపమగు నాముష్మిక వర్తనమునకు మార్గదర్శకమైనది.

రామాయణము మానవులకు దృష్టాదృష్టములగు నైహికాముష్మిక ఫలములను సమకూర్చు నుపాసనా సాధనముగాను, ఆస్తికులకు పారాయణ గ్రంథము గాను తనవేదతుల్యతను నిరూపించుకొన్నది. ఇరువది నాలుగువేల గ్రంథసంఖ్య (గ్రంథ మనగా ముప్పది రెండక్షరము లని సంకేతము) గల యి మహా గ్రంథమున ఒక్కొక్క వేయి గ్రంథములకు మొదట నొక్కొక్కటి వంతున గాయత్రీ మంత్రాక్షరములు నిక్షిప్తములై యున్న వని తత్త్వజ్ఞుల పరిశోధనము. ఇందలి ప్రత్యేక భాగములను నియమపూర్వకముగా నియమిత కాలమున నిత్యమును పఠించినచో ఆయా కోరికలు సిద్ధించుటయో, ఆపదలు తొలగుటయో ఫలము కలుగునని గ్రంథాంతరముల వివరింపబడినది. తదనుసారముగ ఆస్తికుల యాచరణమును గలదు.

ఆపన్నులు 'ఆపద తొలగుటకును' కార్యసిద్ధి గోరువారు దానికిని సుందర కాండమును నియమపూర్వకముగా పారాయణముచేసి ఆయా ఫలములను పొందుట ప్రత్యక్షసిద్ధమై యున్నది.

రామాయణము భక్తులకు కల్పవృక్షము. పరమ భక్తులగు హనుమదాదుల చరిత్రములు వారికి మార్గదర్శకములు.

మనదేశమున హైందవులలో బహుళ ప్రచారములో నున్న ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము నను మూడు మతములకు చెందిన వారికిని గూడ రామాయణము పవిత్రగ్రంథము. ద్వైతులగు మాధ్వమతమువారికి హనుమంతు డాదర్శదైవము. ఆ మహాభక్తునివలె ననన్యమగు భక్తితో భగవంతుని స్వస్వామి భావముతో సేవించుట ముక్తిమార్గమని వారి సిద్ధాంతము. విశిష్టాద్వైత మతము వారు రామాయణ మును శరణాగతి శాస్త్రముగా పరమవిశ్వాసముతో భావింతురు. రాముడు శ్రీవిష్ణుని యవతారమగుటచే రామాయణము విష్ణుపారమ్యమును ప్రతిపాదించు నని వారిసిద్ధాంతము. రూపనామ విశిష్టులగు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముప్పురును పరతత్త్వము కార్యవశమున దాల్చిన భిన్నరూపము లేగాని సర్వథా భిన్నులు కా ర నియు, స్థితి కార్యవశమున విష్ణురూపమున నున్న యా పరతత్త్వము రాముడుగా నవతరించె ననియు అందువలన రాముని విష్ణువుగా నెఱిగినట్లే విష్ణువును నామరూపాదులకు నతీతమైన సచ్చిదానందమయమగు పరతత్త్వముగా నెఱుగుట మోక్షసాధన మనియు నద్వైతులు భావింతురు. పరస్పర భావ భేదము లె ట్లున్నను ఎల్ల మతముల వారికిని ఆరాధ్యమగుట రామాయణ ప్రాశస్త్యమును తెలుపుచున్నది.

ఇట్లు రసదృష్టిని మహాకావ్యమై, ఆదర్శమానవ చరిత్రమై, వేదోప బృంహణమై, భగవల్లీలాభివర్ణనమున మోక్షప్రదమై, ఉపాసనాసాధన మగుటచే నైహికాముష్మిక ఫలదాయకమై, ప్రవర్తనానిరూపణమున జగదాచార్యకమై, ఆస్తిక మతములవారి కందఱకును ఆరాధనీయమగు పవిత్రగ్రంథమై యున్న రామాయణము మానవ జాతికి మహర్షియందించిన యక్షయ నిక్షేపము. దానిని గ్రహించి సొంతము చేసికొని యనుభవించి తదాదిష్టమగు మార్గమున నడచి తరించుట మన కర్తవ్యము.

# 9. శ్రీరాముని మహత్త్వము

పోలూరి హనుమజ్జానకీరామశర్మ

విష్ణుదేవుడు లోక రక్షణము కొఱకు ఎన్నో పర్యాయములు అవతరించెను. నృసింహస్వామి, పరశురాముడు మొదలగువారందఱును దుష్టులను శిక్షించి శిష్టులను కాపడినారు. కాని వారెవరును శ్రీరాముని వలె సర్వజనహృదయములను చూఱగొన లేదు. మన దేశమున శ్రీరామా లయము లేని యూరు ఉండునా? ఈ దేశముననే కాదు, ప్రపంచమున పెక్కుదేశములలో ఎందఱో మహనీయులు శ్రీరామ చంద్రుని పర దైవతముగా ఆరాధించి తరించుచున్నారు. ఇంత మహత్త్వము ఆయనకు ఎట్లు కలిగినది? ఆయన మానవుడుగా పుట్టి మానవుడుగా పెరిగి భయంకర ములగు నాపదలను కఠినములైన ధర్మసంకటములను ఎదుర్కొనుచు ఎప్పటికప్పుడు ధర్మమును నిర్ణయించుచు సకల దశలందు దానినే అసిధారావ్రతముగ పాటించుచు మానవుల కెల్ల ఆదర్శప్రాయుడై ఆరాధింపబడుచున్నాడు.

మహా బలశాలురైన రావణాది రాక్షసులను నిర్మూలించుట చేత శ్రీరామునకు గొప్పతనము కలిగెనని కొందఱు తలంతురు. భగవంతుడు శ్రీరాముడుగా అవతరించుటకు రాక్షస నిర్మూలనకు ప్రయోజనము కాదని ఆంజనేయస్వామి ఇట్లు స్పష్టమొనర్చెను.

"భగవంతుడు కేవలము రాక్షసులను వధించుకొఱకే గాక మర్త్య శిక్షణముకొఱకు మర్త్యుడుగా అవతరించినాఁడు"

*"మర్త్యావతారస్త్విహ మర్త్యశిక్షణం*
*రక్షోవధాయైవ న కేవలం విభోః॥"*

*(భాగవతం - స్కం 5- 19 అ - 5 శ్లో)*

మర్త్య శిక్షణ మనగా మానవులకు సద్వర్తనమును నేర్పుట. ధర్మ వర్తనము, ధర్మప్రవర్తనము, దండనము అని యీ శిక్షణము మూడు

విధములుగ నున్నది. స్థాలీ పులాక న్యాయమున జూచినను ఆయన చరిత్రమున మనము ఈ మూడు విధానములను చక్కగా గ్రహింపవచ్చును.

తాను ధర్మమున వర్తించుట ధర్మవర్తనము. ధర్మమార్గమున ఇతరులు వర్తించునట్లు చేయుట ధర్మ ప్రవర్తనము. అధర్మమునకు అలవాటు పడినవారిని, వారు చేయుచున్న తప్పిదములకు తగిన శిక్షను గావించి, ధర్మమార్గమున ప్రవేశపెట్టుట దండనము. స్వయముగా ధర్మ మార్గమున వర్తింప లేనివాడు అధార్మికులను శిక్షింపజాలడు. అందువలన ధర్మవర్తనమే తక్కిన రెండింటికిని పునాది. శ్రీరాముని యందు ధర్మవర్తన రూపమ్మైన యీ పునాది అమితదృఢముగా నున్నది. కావుననే రామునిచే దెబ్బ తిన్న మారీచుడు కూడా రావణుడు రాముని నిందించు చుండగా వారించి, ఇట్లనెను. "రాముడు సాధువు, సత్యపరా క్రముడు అతడు మూర్తీభవించిన ధర్మము. దేవతలకు ఇంద్రుని వలె లోకమున కంతకును అతడు రాజు.

*"రామో విగ్రహవాన్ ధర్మస్సాధు స్సత్యపరాక్రమః।*
*రాజా సర్వస్య లోకస్య దేవానామివ వాసవః॥"*
*(అరణ్య – సర్గ.37 – శ్లో.13)*

శత్రువుల యందు సైతము ఇట్టి యభిప్రాయమును కలిగించె నన్నచో ఆయన ధర్మమును అసిధారావ్రతముగ పాటించెనన్నమాట. ధర్మాను ష్ఠానమే ఆయన చేసిన పెద్ద తపస్సు. ఆ తపశ్శక్తికే మహర్షులు సైతము ఆయనను మెచ్చి గౌరవించిరి.

ఆయన చరిత్రమున ఎల్లరు సులభముగా నేర్చుకోగలిగిన గుణము వినయము. దశరథుడు యజ్ఞసంరక్షణము కొఱకు శ్రీరాముని లక్ష్మణునితో కూడ విశ్వామిత్రుని వెంట పంపెను. అంతకు ముందు ఎప్పుడును రాముడు విశ్వామిత్రుని చూడలేదు. అయినను "ఈయన ఎవరు? మేము ఎచ్చటికి పోవలయును? ఏమి చేయవలె? మరల ఎప్పటికి తిరిగి రాగలము?" అని ఒక్క విషయమ్మైనను రాముడు తండ్రి నడుగకయే మహర్షి

వెంట బయలు దేరి పోవుట గమనింప దగియున్నది. సాధారణముగా బాలురు ఇట్లుందురా?.

తాటకను సంహరింపవలసిన సందర్భమున విశ్వామిత్రుడు జనులను మ్రింగుచున్న స్త్రీలను వధించుట పాపహేతువు కాదని పెక్కు నిదర్శనములతో శ్రీరామునకు బోధించెను. అప్పుడు రాముడు చెప్పిన మాట ధర్మనికషోపలముగా నున్నది. "మా తండ్రి మీరు చెప్పినట్లు చేయుమనెను. ఆయన మాట ననుసరించి బ్రహ్మవాదులగు మీ శాసనమును పాటించి తాటకా వధమును ఉత్తమ కార్యముగా ఆచరించెదను. సందేహము లేదు".

*"సోఽహం పితుర్వచశ్శ్రుత్వా శాసనా ద్బ్రహ్మ వాదినః,*
*కరిష్యామి న సందేహ స్తాటకావధ ముత్తమమ్"*

*( రామా I - 26 - 4 )*

స్త్రీ వధము పాతకమా కాదా అను చర్చయే రామునకు అక్కఱ లేక పోయినది. తండ్రి యాజ్ఞ కాని గురువుల శాసనము కాని మాఱు మాటాడకుండ ఆచరింప వలయు ననుటయే రాముని నిశ్చయము. విధేయత అన ఇట్లుకదా ఉండవలె.

కొన్ని సమయములలో సామాన్యులకు ధర్మము స్ఫురించదు. కొందఱకు స్ఫురించినను పరిస్థితుల ప్రాబల్యము వలన దానిని పాటింప జాలకుందురు. రాముడు శివుని విల్లును ఎక్కుపెట్టినప్పుడు అది విఱిగెను. జనకుడు చాల సంతోషించి వెంటనే సీతను రామున కిచ్చి పెండ్లి చేయబూనుకొనెను . తండ్రిగారి యభిప్రాయము తెలియ లేదని రాముడు జనకుని ప్రయత్నమును వారించెను. ఈ విషయమును సీతయే అనసూయతో చెప్పినది.

*దీయమానాం న తు తదా ప్రతిజగ్రాహ రాఘవః।*
*అవిజ్ఞాయ పితుశ్ఛంద మయోధ్యాధిపతేః ప్రభోః॥*

*( అయోధ్య - సర్గ. 118. శ్లో.51 )*

తండ్రియొక్క అనుమతి లేకుండ కుమారుడు కన్యను పరిగ్రహింప రాదను విషయము సామాన్యముగా అందఱకును తెలిసినదే. కాని పరాక్రమమునకు మెచ్చి చక్రవర్తి కన్యను ఇచ్చెద నను చున్నప్పుడు ఎంతమందికి తండ్రిని అడుగ వలయునను తలంపు కలుగును? ఒక వేళ అట్టి తలంపు కలిగినను జనకునివంటి చక్రవర్తి సమక్షమున బ్రహ్మర్షియైన విశ్వామిత్రుని సన్నిధానమున అట్లు చెప్పగలిగిన వారు ఎంత మంది యుందురు? ఏనాడైనను యువతీ యువకులకు ఇట్టి ధీరత్వమే కదా ఆదర్శముగా నుండవలె!

దశరథుడు గావించిన పట్టాభిషేక ప్రయత్నము రాముని ధార్మికత్వమునకు పరీక్షాస్థాన మయ్యెను. నిండు సభయందు ఆయన శ్రీరాముని పిలిపించి "యౌవరాజ్యపట్టాభిషేకము చేయుదును. అందులకై నీవు వ్రత దీక్ష నొందుము" అని చెప్పెను. రాముడంగీకరించి అట్లే యొనర్చెను. మఱునాడుదయముననే కైకేయి రాముని పిలిపించి "భరతునకు పట్టాభిషేకము, నీకు పదునాలు గేండ్లు అరణ్యావాసమును మీ తండ్రి నాకు వరములుగా నొసంగెను. కావున నీవు వెంటనే వనమునకు బయలుదేరుము" అని నిస్సంకోచముగా బలికెను. అప్పుడు రాముడు చెప్పిన మాటలలో ధర్మాచరణ మన నెట్లుండునో ఉజ్జ్వలముగ వ్యక్త మగుచున్నది. "అమ్మా, నేను అర్థపరుడను కాను. లోకమున సామాన్యము గానే మన గోరుచున్నాను. కేవలము ధర్మమునే అవలంచించి యున్న నన్ను నీవు ఋషులతో సమానునిగా ఎఱుంగుము.... తండ్రి స్వయముగా నాకు చెప్పకున్నను తల్లి వగు నీ మాటనే పాటించి విజనమైన వనమునందు పదునాల్గేండ్లు ఉండెదను".

*"నాహ మర్థపరో దేవి లోకమావస్తు ముత్సహే/*
*విద్ధి మా మృషిభి స్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్//*

*అనుక్తో ప్యత్ర భవతా భవత్యా వచనా దహమ్/*
*వనే వత్స్యామి విజనే వర్షాణీహ చతుర్దశ//"*

*(అయోధ్య – సర్గ. 19– శ్లో–20,23 )*

"నేను ధర్మమును మాత్రమే అవలంబించి యున్నాను " అని రాము డనుట గమనింపదగియున్నది. లోకమున ధర్మమును అవలంబించు వారు పెక్కుమంది యుందురు. వారిలో చాలామంది ఫలమును దృష్టియం దుంచు కొని ధర్మము నాచరించు చుందురు. తండ్రి వలన ఆస్తి, ధనము మొదలగునవి లభించుచున్నపుడు పితృ శుశ్రూష చేయువారు పెక్కు రుందురు. లాభములేకపోగా కష్టములు సంభవించుచున్నప్పుడు కూడ పితృసేవ చేయుటయే తమకు కర్తవ్యమని అనుష్ఠించువారు చాల మంది యుండరు. చాల కొద్దిమంది ధర్మము నాకు కర్తవ్యము. కాబట్టి చేయు చున్నాను. ఫలముతో నాకు పనిలేదు అని ధర్మము కొఱకే ధర్మమును అనుష్ఠింతురు. అట్టివారే ఋషులు. వారే లోకమునకు మార్గదర్శకులు కాగలరు.

రాముడు ప్రేమమయుడు ఆయన తల్లి, తండ్రి, భార్య, సోదరులు, మిత్రులు మొదలుగా అందఱను గాఢముగా ప్రేమించెను. కాని ధర్మమును అనుష్ఠించునపుడు అవశ్యకమైనచో ఎట్టి త్యాగమున కైనను ఆయన జంకలేదు. దండకారణ్యమున తాపసులు వచ్చి రాక్షసుల వలన తమకు గలుగుచున్న బాధలను వర్ణించి చెప్పి శరణమును కోరిరి. ఆయన వారి నందఱను అనునయించి రాక్షసులను తప్పక సంహరింతు నని మాట యిచ్చెను. వారు వెడలి పోయిరి. సీతకు ఈ వాగ్దానము నచ్చలేదు. రాక్షసులతో విరోధమును తెచ్చుకొనుట ఆమెకు ఇష్టము లేదు. వనములో తాపసవృత్తితో జీవించుటకై వచ్చిన వారికి ఇట్టివి తగవని ఆమె రామునకు అనేక విధముల బోధించెను. ఆయన ఆమె చెప్పినదంతయు శ్రద్ధతో విని ఆమెను అభినందించుచు ఆమె చెప్పినది ఎట్లు అయుక్తముగ నున్నదో చక్కగా నిరూపించెను. ధర్మాధర్మములను గ్రహించుట సులభము కాదు. ఆమె చెప్పినది ఆత్మ రక్షణమున సామాన్యులకు అన్వయించు నీతి యే కాని ధర్మరక్షకులైన క్షత్రియులకు అన్వయించునది కాదు. రాముడు అవలంబించినది తల్లి యొక్క కోరిక మేరకు వనవాసదీక్షయే కాని వాన

ప్రస్థముకాదు. కావుననే ఆయన అస్త్ర శస్త్ర సన్న్యాసము చేయలేదు. నగరము లందు ప్రవేశింపకుండుట నాగర భోగములను అనుభవింప కుండుట అనునవియే, వనవాసవ్రతమాత్రము చేత జన్మసిద్ధమైన క్షత్రియ ధర్మము తొలగి పోదు. కావున వనవాసవ్రతము నవలంబించి యున్నను దుష్టశిక్షణము, శిష్టరక్షణము రామునకు తప్పవు. ఆపన్నులను రక్షించుటకు జంకువాడు క్షత్రియ పదమునకే అర్హుడు కాడు. కావుననే ఆయన తాపసులకు వెంటనే అభయమొసంగెను. సీత చెప్పనంత మాత్రమున ఆయన ఆపదలకు వెఱచి కర్తవ్యమును వీడునా? ఇచ్చిన మాట తప్పునా? అప్పుడాయన చెప్పిన మాటలు ఏకాలమందైనను ధర్మవీరులు శిరసా వహింప దగినవిగా ఉన్నవి. ఆయన ఇట్లనెను "ప్రాణములనైన, లక్ష్మణునితో బాటు నిన్నైనను వీడుదును గాని, ఇచ్చిన మాటను, అందును బ్రాహ్మణుల సమక్షమున గావించిన ప్రతిజ్ఞను విడువజాలను"

*"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్।*
*న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః॥"*
*(అరణ్య - సర్గ. 10 - శ్లో -19)*

ఆయనకు సీత ప్రాణమున కన్న ప్రియురాలే, సందేహము లేదు. ఆమె వియోగమున ఆయన పొందిన దుఃఖమే అందులకు నిదర్శనము. లక్ష్మణుని యందు ఆయనకు గల ప్రేమ అంతకన్నను గాఢమైన దని ఆమెయే ఆంజనేయునితో చెప్పినది. "రామునకు సోదరుడగు లక్ష్మణుడు నాకంటెను ప్రియతరుడు".

*"మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః॥".*
*(సుందర. సర్గ. 38 - శ్లో - 62)*

లక్ష్మణుడు యుద్ధమున మూర్ఛిల్లి నప్పుడు రాముని విలాపము నందు ఇది యింకను స్పష్టపడినది. అయినను ఆయనకు ధర్మమునందు గల యనురాగముతో ఇవి యేవియు సాటిగావు. ఆయన ధర్మైకరతుడు.

రాముడే క్షణమున పై మాటలను పల్కెనో కాని అవి అచిరకాలముననే యథార్థము లయ్యెను. రావణవధానంతరము సీతను స్వీకరించుటయా, మానుటయా యనునది మహా సమస్య అయ్యెను. ఆమె శీలము అకల్మషమని తానెతింగినను లోకులు నమ్ముటెట్లు? వారు తన్ను స్త్రీలోలునిగా తలంచినచో కులము యొక్క ప్రతిష్ఠ నిలుచునా? రాజ్య పాలనము చక్కగా జరుగునా? అప్పుడాయన ఎంతో బాధపడి కోపమును ప్రకటించి కఠినముగ ప్రసంగించి, ఆమెయే అగ్ని పరీక్షను కోరునట్లుగా చేసెను. పిదప దేవతల యభ్యర్థనముననే ఆయన ఆమెను స్వీకరించెను. అయినను ఆ సమస్య అంతటితో అంతమొంద లేదు. సుమారు చాల దూరమున ఎక్కడో లంకలో జరిగిన యగ్ని ప్రవేశమును అయోధ్యలో ప్రజలు నమ్మ జాలక గుసగుసలు పోవజొచ్చిరి. ఆమెను గూర్చి నిందాప్రసంగములు పల్లెలలో పట్టణములలో వేగముగా వ్యాపింపజొచ్చెను. ఈ విషయమును ఆయనకు అంతరంగికుడైన భద్రుడు స్పష్టముగ నివేదించెను. తక్కిన మిత్రులు కూడ అది నిజమే యనిరి. అప్పుడు రాముడేమి చేయవలె? ఈ యపవాద ప్రచారమును ఉపేక్షించినచో రాజ్యమున ధర్మ మెట్లు నిలుచును? కావున రాముడు గుండె రాయి చేసికొని ఆమెను పరిత్యజింప వలసి వచ్చెను. ఇందులో కూడ ఆయన కీర్తి కాంక్షకై భార్యను బలిగావించెనని తలంచువారును కొందఱు కలరు. ఇట్లనుట కేవలము అజ్ఞతయే.

రాముడు సాధారణపౌరుడు కాదు, ధర్మపాలకుడైన మహారాజు. రాజ్యపాలనము ఆయనకు ప్రథమకర్తవ్యము. ఈ బాధ్యత మహారాణిగా ధర్మపత్నిగా సీతకును కలదు. భార్యాభర్తలను సింహాసనముపై నుంచి పట్టాభిషేకము కావించుట వినోదము కొఱకు కాదు. ప్రజారంజనము, ధర్మపాలనము రాజునకు ఎంతగా కర్తవ్యములో రాణికికూడ అంతే కర్తవ్యములు. ధర్మపరిపాలనకు వారి వియోగము అవశ్యకమైనచో అది రామునకు ఎట్లు తప్పదో, అట్లే సీతకును తప్పదు. ఇది ధర్మనిర్ణయమే కాని కీర్తికాంక్ష కాదు.

లక్ష్మణపరిత్యాగ మింత కన్నను శోచనీయమ్మైనది. కాలుడు మహర్షిరూపమున రామునితో రహస్యముగా మాటాడవచ్చి మందిరద్వార మున నెవరినైన కాపుదలకై యుంచు మనెను. లోనికెవరైన వచ్చినచో శిరశ్ఛేదమే శిక్ష యనియు నియమింపు మని ఆయన రాముని కోరెను. రాముడందుల కంగీకరించి, లక్ష్మణుని పిలిచి, ఆ నియమమును తెలిపి, ద్వారమునొద్ద నుండు మని చెప్పెను. కొలది సేపటిలోనే దుర్వాసుడువచ్చి రాముని చూడ గోరెను. కొంచెము సేపు నిలువుడని లక్ష్మణుడాయ నకు ప్రార్థించెను. ప్రార్థించిన కొలది ఆయన యుగ్రుడై "నా రాక తత్క్షణమే రామునకు తెలుపకున్నచో నిన్ను నీ వంశమును దహింతు" నని పలికెను. వంశనాశముకన్న ఒక్కని మరణమే మేలని లక్ష్మణుడు లోనికి పోయెను. వెంటనే కాలు డదృశ్యుడయ్యెను. దుర్వాసుని కోర్కె తీర్చి పంపిన పిదప రామునకు నియమ నిర్వహణము కర్తవ్యమయ్యెను. కర్తవ్యము కాలహర ణము నోర్వదు. రాముని గుండెలు ప్రీలజొచ్చెను. లక్ష్మణుడు నిశ్చింతుడై నియమమును నిర్వహింపుమని అన్నను ప్రార్థింప జొచ్చెను.

రాముడు మంత్రులను బిలిపించి జరిగిన విషయమును చెప్పి కర్తవ్యమును ఉపదేశింపు డనెను. వసిష్ఠుడు ధర్మసూక్ష్మమును పరిశీలించి కుటుంబవిషయమున పరిత్యాగమే శిరశ్ఛేదముతో సమానమని నిర్ణయించెను. సకల సుఖములు వదలి తన్ను పదునాలుగేండ్లు వనము లలో సేవించిన తమ్ముని చూచి రాముడు పరిషన్మధ్యమున గద్గదస్వరముతో "ధర్మవిపర్యయము కలుగ కుండుటకై లక్ష్మణా, నిన్ను పరిత్యజించు చున్నాను" అని పలికెను. మానధనులకు మరణము కన్న నిరాకరణమే మహా వ్యథాకరము. లక్ష్మణుడు దుఃఖసంతప్తుడై వెంటనే నగరమును వీడి సరయువున ప్రవేశించెను. పిదప రాముడు కూడ ఆతనినే అనుసరించెను. ఇట్టి ధర్మైక పరత్వము ఎందరి యందుండును? ఇట్టి ధర్మపరత్వమునగాక మహత్త్వము మఱి దేనివలన గలుగును?.

ఇంత వఱకును శ్రీరాముని ధర్మ వర్తనమును పరిశీలించితిమి. ఆయన ధర్మమార్గమున ఎట్లు వర్తించెనో అట్లే ఇతరులను కూడ ఆ మార్గమున

నడపుటకు ప్రయత్నించెను. ఆయన తమ్ములు, భార్య మొదలుగా చిన్నవారినే కాక తల్లి తండ్రి మొదలుగా పెద్దవారినికూడ అధర్మమునుండి తప్పించి ధర్మ మార్గమున నడిపించెను. సీతారాములు అడవికి బయలు దేరుచున్నప్పుడు లక్ష్మణుడు కోపమును పట్టజాలక తండ్రిని బంధింపవలె నని ఆవశ్యకమైనచో వధింపవలె నని పలుక జొచ్చెను. రాముడాతనిని ఆ యపమార్గమునుండి వారించి శాంతింపజేసెను. ఆ సందర్భమున కౌసల్య కూడ పుత్రవియోగమును భరింపలేక భర్తను వీడి రామునితో బయలు దేరుటకు పూనుకొనెను. భర్తను వీడి పుత్రుని వెంట బయలుదేరుట పతి వ్రతకు లక్షణము కా దని రాముడు ఆమెను వారించి, భర్తయొద్దనే యుండు నట్లు జేసెను. దశరథుడుకూడ "నేను కైకేయి కిచ్చిన వరముల చేత మోహితుడనై యున్నాను. నన్ను నిగ్రహించి నీవే యింక అయోధ్యను పాలింపుము" అని అక్రమచర్యకే రాముని ప్రోత్సహించెను.

*"అహం రాఘవ కైకేయ్యా వరదానేన మోహితః।*
*అయోధ్యాయాం త్వ మే వాద్య భవ రాజా నిగృహ్యా మామ్॥"*
*(అయోధ్య - సర్గ. 34 - శ్లో. 28)*

రాముడు అందులకు అంగీకరింపలేదు. అప్పుడాయన రాజ్యము లోని ధనధాన్య సంపదనంతను రాముని వెంట బంపి కైకేయి కోరికను విఫలమగునట్లు చేయవలయు నని ప్రయత్నించెను. రాముడు ఆ ప్రయత్న ములను అన్నింటిని వారించి ఆయన కైకేయి కొసంగిన వరము సఫలమగు నట్లు చేసి, ఆయనకు దుర్గతులు కలుగకుండ స్వర్గము లభించునట్లు చేసెను. కైకేయి స్వార్థపరాయణయే, సందేహము లేదు. కాని ఆమె కోరిన వరములను సక్రమముగా తీర్పకున్నచో దశరథుడు ఋణగ్రస్తుడై దుర్గతి పాలైయుండెడివాడు. చిత్ర కూటమున భరతుడు రాజ్యమును స్వీకరింపు మని రాముని అనేక విధముల ప్రార్థించుచు నిర్బంధించుచున్నప్పుడు దివ్యులైన మహర్షులు అంతరిక్షము నుండి దిగి వచ్చి భరతునకు ఈ ధర్మ సూక్ష్మమును స్పష్టముగా బోధించిరి. "నీవు నీ తండ్రి యొక్క గతిని గమనింతువేని రాముని మాటను అంగీకరింపుము. రాముడు తండ్రి

యొక్క ఋణమును తీర్పవలయు నని మేము సదా కోరుచున్నాము. కైకేయియొక్క ఋణమును తీర్చియుండుట వలననే ఇప్పుడు దశరథుడు స్వర్గమును పొందియున్నాడు".

*"గ్రాహ్యం రామస్య వాక్యం తే పితరం య ద్యవేక్షసే।*
*సదాఽనృణ మిమం రామం వయ మిచ్ఛామహే పితుః॥*
*అనృణత్వా చ్చ కైకేయ్యా స్స్వర్గం దశరథో గతః॥"*
*(అయోధ్య - సర్గ. 112. శ్లో. 5,6)*

రాముని చేత బోధింప బడిన వారే కాదు. ఆయనకు దూరమందున్న వారు కూడ ఆయనకు కోపము వచ్చునేమో అని అనేకులు అధర్మమును గావింప కుండిరి. మంథర సర్వాలంకారభూషితయై అంతఃపురములో తిరుగజొచ్చెను. కొందఱు సేవకులు వచ్చి శత్రుఘ్నునకు దానిని చూపిరి. దానిని చూచి శత్రుఘ్నుడు కోపము పట్టజాలక జుట్టు పట్టుకొని ఈడ్చుకొని వచ్చి దీని నిప్పుడే సంహరింతునని పలుకజొచ్చెను. అది కైకేయిని పిలుచుచు ఆక్రోశింప జొచ్చెను. కైకేయి శత్రుఘ్నునకు అడ్డుపడబోయెను. అతడు మంథరను వదలకుండ ఆమెను కూడ బెదరింపజొచ్చెను. ఆమె భయపడి భరతుని శరణు జొచ్చెను. అప్పుడు భరతుడు శత్రుఘ్నుని వారించుచు నిట్లనెను. "మాతృ ఘాతకుడ నని ధార్మికుడైన రాముడు నన్ను ఏవగించుకొనునని వెఱచుచున్నాను. లేకున్నచో పాపాత్మురాలు దుష్టచారిణియు నైన ఈ కైకేయినే చంపియుందును"

*"హన్యా మహ మిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీమ్।*
*యది మాం ధార్మికో రామో నాసూయే న్మాతృఘాతకమ్॥"*
*(అయోధ్య - సర్గ. 78. శ్లో - 22)*

ఆ మాట విని శత్రుఘ్నుడు మంథరను విడిచి పెట్టెను. కేవలము రాముని యొక్క శీల ప్రభావమే భరత శత్రుఘ్నులను మాతృవధము, స్త్రీవధము అను మహా పాతకములనుండి హరించిన దనుట స్పష్టము. ఎవరి బోధలను లెక్కపెట్టక స్వార్థపరులై పరులకు ద్రోహము చేయువారిని

దండింపక తప్పదు. నేరము చేసిన వారిని దండించుట ప్రభువులకు కర్తవ్యము. కొన్ని నేరములకు మరణమే దండనముగా నుండును. ఆ దండనమును అనుభవించిన జీవుడు పాప పరిహారమును పొంది పరిశుద్ధుడై జన్మాంతరమున ధార్మికు డగుటకు అవకాశమును పొందు చున్నాడు వాలి, రావణుడును ఇట్టివారు.

వాలి సుగ్రీవుల యొక్క ధర్మాధర్మములనుగూర్చి విచారణ జరుపకుండ సుగ్రీవుని మాటలనే నమ్మి రాముడు వాలిని నిందితునిగా నిశ్చయించి సంహరించుట అసమంజస మని కొంద అందురు. కాని సుగ్రీవుడు సత్యసంధుడు. వినీతుడు. వాలిచే అక్రమముగా తటిమి వేయబడియున్నాడని దివ్యత్వము నొందిన కబంధుడు ముందే రామునకు చెప్పియుండెను. కబంధుడు తటస్థుడు, శాపావసానమున దివ్యత్వము నొంది తా నెఱింగిన దానిని బట్టి సుగ్రీవుడు ధార్మికుడని వానితో సఖ్యము చేయ వలసిన దని చెప్పెను. కబంధుని మాటలను రాముడు నమ్మకుండు టకు కారణము లేదు. పిదప ఆంజనేయుని మాటల వలన సుగ్రీవుని దుస్థితిని స్వయముగా చూచుట వలన వాలియొక్క దుర్వర్తనము రాము నకు స్పష్టమయ్యెను. సుగ్రీవుడు ఎట్టి వాడైనను తమ్ముని భార్యను హరించి తమ్ముని సంహరింప బూనియున్న వాలి వధార్హుడనియే రాముడు నిశ్చయించెను. సోదరుడు చనిపోయినప్పుడు వాని భార్యను స్వీకరించుట వానరులయందు ఆచారముగ నున్నది. కాని సోదరుడు బ్రతికి యుండగనే వాని భార్యను హరించి ఆమెను దక్కించుకొనుటకై వానిని చంపవలయునని ప్రయత్నించుట మహా పాపము.

అట్టి నిందితునితో యుద్ధము అనర్హము. ఆతతాయిని కన్పించినంతనే వధింప వచ్చును అను ధర్మము ననుసరించి రాముడు వృ క్షముల చాటునుండి ఒక్క బాణముతోనే కూల్చెను. ఇది కేవలము శిక్షావిధానమే. ఇందు వీర ధర్మమునకు తావు లేదు. హత్యాకారు లగు బంది పోటులను నిగ్రహించునప్పుడు ఎప్పుడైనను చాటుమాటుల నుండి పైబడి బంధింపవలె అట్లు వీలుగాకున్నచో కన్పించి నంతనే సంహరింపవలె వారిని నిగ్రహించుటకు వేఱొక మార్గము లేదు. కావున రాముడు వాలిని

అపరాధినిగానే దండించెను. ఈ విషయమును ఆయన వానరు లందఱి సమక్షమున వాలితోనే స్పష్టముగ చెప్పెను. "దండనమును విధించు శాస్త్రము యొక్క విధానము ననుసరించి దండనమును పొందుట వలన విగతకల్మషుడవై నీకు సహజము, ధర్మాచరణమునకు యోగ్యము నైన ప్రకృతిని పొందితివి" .

*"త ద్భవాన్ దండ సంయోగా దస్మా ద్విగతకల్మషః*
*గత స్స్వాం ప్రకృతిం ధర్మ్యాం దండదిష్టేన వర్త్మనా॥"*
*(కిష్కింధ - సర్గ. 18 - శ్లో-62)*

రావణుని విషయమున ఇట్టి విధానమునకు అవకాశము లేక యుద్ధము తప్పలేదు. వాలి విషయమున రావణుని విషయమున కూడ రామునకు ప్రతీకార బుద్ధికన్న వారిని దండించి పాప విముక్తులను కావింపవలయును అను దయా భావమే ఎక్కువ. సామాన్యులకు శత్రువుల విషయమున ప్రతీకారదృష్టితో చిక్కినచో వారిని చిత్రవధ గావింప వలయు నను నాపేశముండును. కాని రాముని దృష్టిలో వాలి, రావణుడు మొదలగు వారు కర్మవశమున జన్మించిన జీవులు . పాములను తేళ్లను నిందించి హింసించుట వలన ఎట్లు ప్రయోజనము లేదో దుష్టాత్ముల విషయమున కూడ హింస కావించుట అసమంజసము వారు కావించిన తప్పులకు తగిన దండనమును విధించి పాపపరిహారమును కావించి వారికి సుగతి కలుగునట్లు చేయుటకే ప్రాజ్ఞుడు ప్రయత్నించవలె. ధార్మికుడైన విభీషణుడు కూడా తన యన్న పరుల భార్యలను హరించి మహా పాపి యయ్యెనని, అతనికి పరలోక క్రియలు చేయ నక్కఱ లేదని రామునితోనే అనెను. రాముడు ఆ మాటను అభినందింపలేదు. శత్రువు ఎట్టివాడైనను మరణించిన పిమ్మట వానిపై పగను సాధించుట యుక్తము కాదు. అప్పుడు రాముడు విభీషణుని ఇట్లు మందలించెను.

"వైరములు మరణము వఱకే సాధింపదగినవి. ఇప్పుడు మన ప్రయోజనము కూడ తీఱినది. ఈతనికి సంస్కారము చేయుము. ఇతడు నీకు ఎట్టి వాడో నాకును అట్టివాడే".

*మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనమ్।*
*క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ ॥*
*(యుద్ధ -సర్గ.114-శ్లో.101,)*

విభీషణుడు రామునకు మిత్రుడు. అతని సోదరుడైన రావణుడు రామునకు సోదరుని వంటి వాడే అగును. " ఏ కారణముచే నైనను నీవు రావణునకు సంస్కారము చేయుట సంభవింప కున్నచో, నేను చేయుదును" అనియే రాముడా మాటలలో వ్యక్తమొనర్చినాడు. భార్యను అపహరించిన శత్రువు విషయమున కూడ ఇంత కారుణ్యము కలవారు ఎంద రుందురు? కావుననే అయోధ్యారాజ్యములో ఆనాటి ప్రజలు, "ఎవడు రాముని చూడ లేదో, ఎవనిని రాముడు చూడలేదో అట్టివాడు సర్వలోకములందును నిందితుడగును. ఇంతయేల , వాని యాత్మయే వాని నేవగించుకొనును" అని తలంచిరి.

*"యశ్చ రామం న పశ్యే త్తు యం చ రామో న పశ్యతి ।*
*నిందిత స్సర్వలోకేషు స్వాత్మా ప్యేనం విగర్హతే॥ "*
*( రామా II -17 - 14 )*

ఈ యభిప్రాయమే క్రమముగా ప్రజలలో వేలూని తరతరము లుగా మహావృక్షమై విస్తరించినది. తరువాత తరములలో ప్రజలు రాముని ప్రత్యక్షముగా చూడజాలకున్నను రామాయణమును భక్తితో పఠించుచు, ఆయనను మానసికముగా దర్శించుచున్నారు. రామాయణము లోని వర్ణన ములను అవలంబించి చిత్రకారులు ఆ మహాపురుషుని చిత్తరువులను, శిల్పులు విగ్రహములను, కవులు కావ్యములను, గాయకులు సంకీర్తనము లను రచించుచు తాము తరించుచు, ఇతరులు కూడ తరించుటకు సాధనములను సమకూర్చుచున్నారు. కేవలము ఆయన విగ్రహమును పూజించుటకన్నను ఆయనమహత్త్వమును గ్రహించుచు, ఆ మహత్త్వము నకు మూలమైన ధర్మమును ఆచరింపబూను కొనుటయే యథార్థముగా ఆయనను పూజించుట యగును. అట్టి యారాధనము చేతనే ఆయన కూడ సులభముగా ప్రసన్నుడగును. మనము ఇట్లు ఆయనయను గ్రహమునకు పాత్రులము అగుదుముగాక!

# 10. రామాయణ కథావైశిష్ట్యము

కలచవీడు శ్రీనివాసాచార్యులు

*శ్రీరామ శ్శరణం సమస్త జగతాం; రామంవినా కాగతిః।*
*రామేణ ప్రతి హన్యతే కలిమలం; రామాయ తస్మై నమః।*
*రామా త్త్రస్యతి కాల భీమ భుజగో; రామస్య సర్వం వశే।*
*రామే భక్తి రఖండితా భవతు నః; రామ! త్వ మేవాశ్రయః॥*

రామ చరిత్రను వర్ణించు నట్టి రామాయణ మొక విశిష్టమైన మహాకావ్యము. ఆ కావ్యమునకు ప్రశస్తిని దెచ్చినది రాముని చరిత్రమే. ఈ చరిత్ర యొక్క విశిష్టతను దెలిసికొనుటకు ముందు, దాని నెఱుగుట వలన గలుగు ప్రయోజన మేమో తెలిసికొనుట యుక్తము.

ప్రపంచము నందు మానవుని జీవితమును సార్థకముగా నొడిదుడుకులు లేకుండ సుఖశాంతులతో గడుపుట కత్తిమీదిసాము వంటిది. కత్తి యొక్క పదునైన యంచు మీద నిలబడి సాము చేయుట చాలా కష్టమైన పని యని తెలియనివా రుండరు. దానికా సాము యొక్క మెలకువలు తెలియవలెను. మంచి యభ్యాసము గావలయును. గురు శిక్షణయు నవసరము. అన్నిటి కంటెను మించి సరితూకము (Balance), నిగ్రహము నవసరములు.

మానవ జీవితమును గడుపునప్పుడుగూడ పైవిషయముల నన్నిటిని గమనింపవలెను. మంచి చెడ్డల పరిజ్ఞానము, పెద్దల యుపదేశము, స్థిరమైన మనస్సు నుండవలెను. ఇంద్రియములను విచ్చలవిడిగా విడిచిపెట్టరాదు. ఈ జ్ఞానమును బొందుటకు వేదములు, శాస్త్రములు, పురాణములు, స్మృతులు, పెద్దల యాచారములు సాధనము లగుచున్నవి. గౌతమధర్మ సూత్రములందు "వేదో ధర్మమూలం" "తద్విదాం చ స్మృతిశీలే యని" చెప్పబడినది. ధర్మముల నెఱుగుటకు వేదము లాధారములు. అట్లు గానప్పుడు వేదార్థముల నెఱిగిన పెద్దలు వ్రాసిన గ్రంథములు, వారి సదాచార పద్ధతులు మొదలగువాని వలన ధర్మము నెఱుగ వచ్చును.

ధర్మపదముయొక్క యర్థము చాల విశాలమ్మైనది. స్థూలముగా వివరించిన యెడల పరులకును దనకును హానికరములు గాక హితమును, శుభమును గలిగించునట్టి పనులన్నియును ధర్మములే యగుచున్నవి. మనుష్యులు వివిధ దశల యందు జేయదగిన పనులుకూడా ధర్మములే. ఇందుకు విరుద్ధము లైన వన్నియు నధర్మములుగా బరిగణింపబడును.

ఈ ధర్మాధర్మములు పురాణాదుల యందు కథలమూలమున సులభముగా బోధింపబడినవి. మనుష్యులు వారివారి శారీరక – మానసిక – ప్రకృతుల ననుసరించి ధర్మాధర్మముల నాశ్రయింతురు. ధర్మపరులను మంచివా రనియును, నధర్మపరులను చెడ్డవా రనియును జెప్పుదురు. కాని మంచి వా రని పేరు పొందిన వారియం దన్నియును మంచి గుణములే యుండు ననియు, జెడ్డ వారి యం దన్నియును జెడ్డగుణములే యుండు ననియు దలంపరాదు. చెడ్డగుణ మొక్కటైనను లేకుండ, యన్నియును మంచిగుణములే కలవాని నాదర్శ పురుషు డని చెప్పవచ్చును. ఇట్టి వారు చాల యరుదుగా నుందురు.

ధర్మాధర్మములను లలితముగా, నుదాహరణ పూర్వకముగా దెలుపునవి పురాణములు, ఇతిహాసములును. అవి నేరుగా నివి ధర్మములు, ఇవి యధర్మములు, ఇట్లు చేయవలెను, ఇట్లు చేయరా దని శాసింపవు. కథల యం ద ధర్మపరులైన వారు నశించినట్లును, ధర్మపరులైన వారు సుఖశాంతులతో లోకుల ప్రశంసల నందుకొన్నట్లు వివరింపబడును. వివేకవంతుడు వానిని బాగుగా నర్థము చేసికొని హానికరములైన పద్ధతుల నవలంబింపక, మంచి పద్ధతుల నవలంబించి సుఖపడును. భగవద్గీత యందు శ్రీకృష్ణుడు మంచి స్వభావమును దైవసంపదయని యును, జెడ్డ స్వభావమును అసురసంపద యనియు జెప్పి వాని ఫలితముల నిట్లు వివరించెను:

"దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా." దైవసంపద పురుషునికి బ్రపంచమునందు గలుగు నట్టి కష్టనష్టములను దొలగించి

యతనిని నిత్యసంతుష్టునిగా జేయును. అసురసంపద దీనికి వ్యతిరేకమ్మైన ఫలితమునిచ్చి మానవుని దుఃఖముల పాలు చేయును. దీనితో నతడు క్రుంగి కృశించి నశించును. కనుక లోకములోని వా రందరును సుఖ శాంతులతో జీవించుటకే యత్నింపవలెను. ఇట్టి జీవితమునకు సాధనమ్మైన ధర్మాధర్మముల జ్ఞానమును బొందుటకు రామాయణ-భారతముల వంటి గ్రంథములు ముఖ్యమ్మైన యాధారములు.

ముఖ్యముగా మానవుని ధర్మము వైపునకు లాగునట్టి ప్రబల శత్రువులు కామక్రోధములు. ఇవి రజోగుణము వలన బుట్టును. ఇవి మనుష్యుని నెంతో పతనము గావించి నాశనము చేయగలవను విషయము రామాయణ గ్రంథము నిదర్శన పూర్వకముగా దెలుపుచున్నది. బుద్ధిమంతుడు వీనికి లోబడడు. లోబడకుండుటయు నంత సులభమ్మైన పని గాదు. క్రమక్రమముగా సంపాదించుకొనిన జ్ఞానముమూలమున వీనిని దొలగించుకొనుట సాధ్యపడును. ఈ జ్ఞాన సంపాదనముకొరకే మహా పురుషుల చరిత్రలను జదువవలెను.

ఎంత జ్ఞానవంతుడైనను ఎవడు గానీ యేకాకిగా జీవింపలేడు. భిన్న భిన్న ప్రకృతులు గలిగిన పలువురితో గలిసిమెలసియే బ్రతుకవలెను. అట్టి వారితో గలిసి మెలగునపుడు వారి ప్రభావము వ్యక్తి పైన బడక తప్పదు. ప్రతి వ్యక్తియు నేదో యొక కుటుంబము నందు, సంఘము నందు సభ్యుడుగా నుండును. కుటుంబము నం దతనికి దల్లి తండ్రి, భార్య, స్త్రీ యైనచో భర్త, సోదరులు, వదినెలు, మరదులు మున్నగు రక్త బంధువు లుందురు. సంఘము నందు మిత్రులు, శత్రువులు, ఆర్తులు మొదలగు వా రుందురు. బుద్ధిమంతుడైనచో వీరందరితో నేకీభావమును బాటించి బ్రతుకును. తల్లిదండ్రుల యందు భక్తి, భార్యయందు గాఢమ్మైన ప్రేమ సోదరులపైన నమితమ్మైన యనురాగము, మిత్రులపై స్నేహము, శత్రువులపై నౌదార్యమును, ఆర్తులపైన జాలి మున్నగు గుణములతో నందరిని నలరించుచు దానును నిత్యసంతుష్టుడై తరించును. ఉపనిషత్తునందలి

"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ" యను సూక్తుల యర్థము నాచరించి లోకోత్తరుడుగా ఖ్యాతి నందగలడు.

ఈ ధర్మముల నన్నిటిని నొక్క చోట జూపింపగలిగినది రామ చరిత్ర మొక్కటే. ఇట్టి యుత్కృష్ట ధర్మము లన్నియును రాశి పోసిన ట్లొక్కచోట నుండినట్లు మరే గ్రంథమున గనబడదు. ఈ కారణము చేతనే రామ కథ విశిష్టమైనది. సంసారియగు వాని కింత కంటెను మించిన యుపదేశ గ్రంథము మరొక్కటి లే దనుట వివాద రహితమైన విషయము. కథ యన్నంత మాత్రముననే దీనిని కల్పితముగా భావింపరాదు. ఇది యితిహాసము. వాస్తవముగా జరిగినది. కాబట్టి యిది యొక ప్రామాణిక గ్రంథముగా గౌరవము నందుకొన్నది. రామాయణకావ్యము చివర "ఏవ మేతత్ పురావృత్త మాఖ్యానమ్" అని చెప్పబడినది. పురావృత్తమనగా ముందు కాలమున జరిగిన విషయ మని యర్థము.

ఒక కుటుంబమునందును, సంఘమునందును మెలగుచుండు ప్రాణులనుసరింపదగిన ధర్మము లనేకము లున్నవి. ఈ ధర్మము లన్నిటిని రామాయణమునుండి గ్రహింపవచ్చును. ఈ ధర్మముల నెఱిగి యాచరించుట వలన జనుడుత్తమ సంస్కారమును బొందగలడు. ఉత్తమ పురుషుని చరిత్రను వర్ణించుట చేతను, సనాతన ధర్మమును బోధించుట చేతను నీ గ్రంథమునకు బవిత్రతతోబాటు శాశ్వతత్వము గూడ సిద్ధించినది.

*యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే।*

*తావ ద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి॥*

అను శ్లోకము దీనికి శాశ్వతత్వమును జాటుచున్నది. ఎన్నివేల సంవత్సరములు గడచినను, ఎన్ని ధర్మ విప్లవములు సంభవించినను, నశింపక యీ కథ భారతీయుల హృదయములందు స్థిరమైన స్థానము నేర్పరుచుకొన్నది.

రామాయణముయొక్క, రామ శబ్దముయొక్క విశిష్టతను జాటునట్టి శ్లోక మొకటి గలదు. అది –

*కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్।*
*ఆరుహ్య కవితా శాఖాం వన్దే వాల్మీకికోకిలమ్॥*
*(బాలకాండ -1-1)*

దీనియందు మధురమ్మైన యక్షరములతోగూడిన రామశబ్దము మధురమ్మైన దని చెప్పబడినది. ఆమాధుర్యము, ఆ రుచి, యేదో తెలిసికొనుటకు బ్రతిహిందువుడును కాదు, ప్రతి మానవుడును యత్నింపలెను; తరింపవలెను.

హృదయములను నిష్కల్మషములుగా జేసి నిరతిశయానందమును గలిగించునట్టిదే యా మాధుర్యము.

రామాయణకావ్యావతరణ మొక పవిత్రమ్మైన, విచిత్రమ్మైన సన్నివేశములో జరిగినది. వాల్మీకిమహర్షి యొకనాడు శిష్యులతో గూడ స్నానమునకై తమసానదికి బోయెను. అచ్చట నొక చెట్టుమీద కామపరవశమ్మై యుండిన క్రౌంచ పక్షుల జంటలో మగదాని నొక కిరాతుడు బాణముతో గొట్టెను. అది నెత్తుట దోగుచు నేల గూలినప్పుడాడ పక్షి శోకించినది. ఆ శోకమునకు మనసు కరిగిన మహర్షినోటి నుండి యొక శ్లోకము వెలువడినది. ఆ శోకమే శ్లోక మ్మైనది. 'శోకః శ్లోకత్వ మాగతః'.

*మా నిషాద! ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః।*

*య త్క్రౌంచమిథునా దేక మవధీః కామ మోహితమ్॥*

*(బాలకాండ 2-15)*

ఈ శ్లోక మొకవైపు కిరాతునికి శాపము కాగా, మఱి యొక వైపు లక్ష్మీ నాయకుడైన విష్ణువుకు మంగళా శాసనమ్మైనది.

"ఓ కిరాతా! ప్రేమ వశమున మైమఱచి సంతోషించుచుండిన క్రౌంచపక్షుల జంటలో మగపక్షిని చంపిన పాపము చేత నీవు పెక్కు సంవత్సరములు భూమిపై నుండకుందువు గాక!" ఇది కిరాతునికి శాపము. "ఓ లక్ష్మీనాయకా! రావణ దంపతులలో గామాంధుడైన రావణుని జంపుట

చేత నీవు లోకము నందు శాశ్వతముగా గౌరవ ప్రతిష్ఠల నందుదువు గాక!''
ఇది విష్ణువుకు మంగళాశాసనము. తరువాత మహర్షి యింటికి వచ్చి యా విషయమునే యాలోచించుచుండగా, బ్రహ్మ సాక్షాత్కరించి రామాయణ కథను రచింపుమని యాదేశించెను. ఆ యాజ్ఞను గ్రహించి వాల్మీకి వ్రాసెను. బ్రహ్మచేత నుపదేశింపబడి సమస్త ధర్మములను బోధించుచున్నది గనుక వాల్మీకి నుండి వెడలిన యీ రామాయణము సాక్షాద్వేద మనియే భావింపబడుచున్నది.

*వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।*
*వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా॥*

పై విషయము నంతటిని బట్టి చూడగా నిట్లు బోధపడుచున్నది. ఇచ్చట రాముడవతారపురుషుడు; నాయకుడు. దివ్యజ్ఞానసంపన్నుడైన మహర్షి వాల్మీకి కావ్యకర్త. రాముని యవతరణకు ప్రేరకము దుష్టశిక్షణము. సాక్షా చ్చతుర్ముఖు డాచార్యుడు. ఇంత కంటెను గావలసిన వైశిష్ట్య మేమున్నది?

శ్రీరామచంద్రుని అవతారపురుషునిగా జెప్పికొందుము. దుష్ట శిక్షణకు, శిష్టరక్షణకు విష్ణువు ధరించిన యవతారములు పది. వానిలో రామకృష్ణావతారములు రెండు దప్ప మిగతవన్నియును స్వల్పకాలి కావతారములు. అప్పటి కప్పు డవతరించి యదృశ్యమైనవి. ఈ రెండు అవతారములలో వారు భూమిమీద దీర్ఘకాలము నిలిచి మానవులలో మానవులుగా జీవించిరి. కాని త్రేతాయుగము నందు గలిగిన రామావతార మునకును, ద్వాపరయుగమునందుండిన కృష్ణావతారమునకును చాలభేద మున్నది. మానవుడుగా రాముడు గడిపిన జీవితము నందు దివ్యత్వమును గనబరుచునట్టి యెట్టి మహిమలను జూపలేదు. కనుకనే రాముడు ప్రజలకు జాల సన్నిహితు డయ్యెను. రాము డొక చోట తానే –

''ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్'' (యుద్ధ -117-12) అన్నాడు. ''నే నెవడనో కాదు. దశరథునికి పుత్రుడైన

రాముడను. కేవలము మానవుడనే'' యని యనుకొనుచున్నా నని యన్నాడు. కనుక మనము గూడ రామ కథను జదువునప్పు డది కేవల మొక సామాన్యగృహస్థుని కథగా భావింపవలెను. రాముడు దేవు డనుకొని చదివినయెడల ఆ కథ కెట్టి వైశిష్ట్యము నుండదు.

కృష్ణావతారమునందు భగవంతుని లీలల నెన్నియో చూతుము. పూతనాసంహారము, శకటాసుర భంజనము, గోవర్ధనోద్ధరణము, కాళియ మర్దనము మొదలగు సాహస కార్యములు మానవ శక్తి కతీతములు. కనుక జనులు వాని ననుకరింపలేక యాదివ్యశక్తికి ప్రణతు లొనర్చి దూరముగా నుందురు. కాని రామచరిత్రను విన్నపుడు వివేకవంతునికి దానును అట్లాచరించి తరింపవలె నని ప్రయత్నించుట కవకాశమున్నది. ఆ రాము డంతటి యుత్తమ మానవుడు గనుకనే యాయనపేరును, చరిత్రయు నంత మధురములైనవి. రామునిజీవితము నర్థముచేసుకొని యా విధముగా నాచరించు వాడు ప్రపంచ దుఃఖములను దరించి శాశ్వతానందము నందగలడు.

పువ్వు పుట్టగనే పరిమళించునట్లు రాముడు పుట్టగనే యాయనయొక్క లోకోత్తర గుణములు గుబాళించినవి. ప్రాజాపత్య పురుషు డిచ్చిన పాయసార్థమును భక్షించిన కౌసల్యకు, విష్ణువు యొక్క యర్ధాంశముగా, రాక్షస బాధలకు గురియైన తాపసులను, దేవతలను గాపాడుటకు బుట్టినవాడు రాముడు. ఈ కారణము చేతగూడ నతని చరిత్ర పవిత్రము దివ్యమునైనది. పుట్టినప్పటి నుండియు దల్లిదండ్రులను, సోదరులను, బ్రజలను దన మంచి నడవడిచేత నలరించెను. ''ప్రీణాతి యః సుచరిత్రైః పితరం స పుత్రః'' అని గదా భర్తృహరి చెప్పెను. ఈ వాక్యమునకు జక్కని యుదాహరణము రాముడు. సత్య వచనమును నియమముతో బాటించి సత్యసంధు డన్న ఖ్యాతిని గాంచెను. మనుష్యుని సర్వనాశనము చేయునట్టి తోబుట్టువులు, శత్రువులు నైన కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యముల కాయనమనస్సు నందు

తాపులేదు. రాజపుత్రుడైనను, సమస్తభోగముల ననుభవించుట కవకాశ మున్నను నిరాడంబరముగా గర్వరహితముగా మెలగి, యెవనిని గాని చిరునవ్వుతో బలుకరించుట రాముని స్వభావము -"స్మిత పూర్వాభిభాషీ చ పూర్వభాషీ ప్రియంవద:". ప్రజల యోగక్షేమములను నిత్యవిధిగా విచారించెడివాడు. తా నెప్పుడైనను లక్ష్మణునితోగూడ బౌరుగూరికి, లేక యుద్ధార్థము పోయి తిరిగి వచ్చిన వెంటనే ప్రజల నందరిని ఆత్మీయుల వలె బలుకరించి యాదరించును.

*సంగ్రామా త్పున రాగత్య కుంజరేణ రథేన వా*
*పౌరాన్ స్వజన వ న్నిత్యం కుశలం పరిపృచ్ఛతి ॥*
*(అయోధ్య-2-39)*

ఈ మాటలను బ్రజలు రాముని గూర్చి దశరథునికి జెప్పిరి. ప్రజల కతడు ప్రాణవమువంటివాడు. ఆయన పాలన క్రింద తావు సుఖసంతోషములతో వర్ధిల్లగల మను నమ్మకము వారి కుండినది. ప్రజల ఈ నమ్మకమును రాముడు వమ్ముచేయలేదు. తాను రాజైన పిమ్మట యథాకాలమున వర్షములు కురిసి, పుష్కలముగా పంటలు పండి ప్రజలు సదాచారములతో నిత్యసంతుష్టులుగా నుండిరి. ఇట్టి రాజ్యమును శ్రేయోరాజ్యమందురు. సుఖశాంతులతో బ్రజలు జీవించు రాజ్యము నిప్పటికిని "రామరాజ్య" మని పొగడుచున్నారు. మన భారత రాజ్యము గూడ రామరాజ్యముగా రూపొందవలె నని యందరి కోరిక.

రాముడు రాజ్యము చేయుచుండగా స్త్రీలకు వైధవ్యదుఃఖము కలుగలేదు. క్రూర జంతువుల భయము లేదు. రోగ భయ మసలే లేదు. లోకమునందు దొంగ లుండలేదు. ఎవనికి ఎట్టి కీడును సంభవింపలేదు. అందరును ధర్మాచరణ తత్పరులై సంతోషముగా నుండిరి. రాముని మార్గము ననుసరించుచు నొకరి నొకరు హింసించు కొనలేదు. అందరు ఆరోగ్యవంతులుగా దుఃఖముల నెఱుగకుండిరి. వృక్షము లేపుగా బెరిగి నిరంతరము పుష్పములతో, ఫలములతో శోభిల్లుచుండినవి. కోరినప్పుడు వర్షము

కురిసెడిది. గాలి మనస్తాపమును, దేహతాపమును దీర్చునట్లు హాయిని గలిగించుచు వీచుచుండెను. రామాయణము యుద్ధకాండ చివర నుండునట్టి యీ శ్లోక భాగము లీ విషయములను స్పష్టము చేయును.

*న పర్యదేవన్ విధవాః న చ వ్యాళకృతం భయమ్।*
*న వ్యాధిజం భయం చాసీ ద్రామే రాజ్యం ప్రశాసతి॥*

*నిర్దస్యురభవ ల్లోకో నాఽనర్థం కశ్చి దస్పృశత్।*
*సర్వం ముదిత మేవాసీత్ సర్వో ధర్మపరోఽభవత్॥*

*రామ మే వాను పశ్యంతః నాభ్యహింసన్ పరస్పరమ్।*
*నిరామయా, విశోకాశ్చ రామే రాజ్యం ప్రశాసతి॥*

*నిత్య పుష్పా నిత్య ఫలాస్తరవస్స్కంధ విస్తృతాః।*
*కామ వర్షీ చ పర్జన్యః సుఖ స్పర్శశ్చ మారుతః॥*

*(యుద్ధ -128-98-99-102)*

అతి బాల్యమునందే రాముని యమేయమైన తేజస్సును విశ్వామిత్రాదులు గ్రహించిరి. అప్పటి నుండియే రాముని ధర్మసంరక్షణము, ఆర్తరక్షణము ప్రారంభమైనది. యజ్ఞములను ధ్వంసము చేయుచు, ఋషులను హింసించుచుండిన తాటక – సుబాహు – మారీ చాదుల నణచుటకు దశరథుని యనుమతితో రాముని గొని పోవుటకు వచ్చిన విశ్వామిత్రుడు దశరథునితో "రాముడు మహాత్ముడు. ఆయన సత్య పరాక్రమము గలవాడు. రాక్షసు లెవరైనను సరే! రాముని కంటబడిన తరువాత నిలువ లేరు. ఆ విషయమును, నేను, వసిష్ఠుడు, ఇతర మహర్షులు బాగుగా నెఱుగుదు"రనెను. రాముని బంపుట చేత నీకు ధర్మలాభము, స్థిరమైన కీర్తి లభించు నని పలుమారు పలికెను.

*"స్వపుత్రం రాజ శార్దూల! రామం సత్యపరాక్రమమ్।*
*కాకపక్షధరం వీరం జ్యేష్ఠం మే దాతు మర్హసి॥*

*న చ తే రామ మాసాద్య శక్తాః స్థాతుం కథంచన।*
*న చ తే రాఘవా దన్యః హన్తు ముత్సహతే పుమాన్॥"*
*బాల-19-8,11*

బ్రహ్మర్షి రాముని నింతగా గుర్తించి పలుకుట రామచరిత్రయొక్క వైభవమును చాటుచున్నది. దివ్యజ్ఞానసంపన్నులైన మహామునులకుగూడ నాశ్చర్యమును గలిగించునట్టి రాముని సత్య సంధత, పరాక్రమము, ధర్మరక్షణ సామర్థ్యమును దెలిసికొనినప్పుడు మానవుని మానసిక పరిణామ మెట్లుండగలదో యూహించుట కష్టము. కొంత సదవగాహన గలిగిన వ్యక్తి మాత్ర మా గుణముల చేత ప్రభావితుడు గాక తప్పదు. సత్యమును పాటించుటకును, దుష్టశక్తులను బయటివిగాని, లోపలివి గానీ అణచవలె నన్న యభిప్రాయమునకు వచ్చుటకు, యత్నము చేయగల డని నమ్మవచ్చును. అట్లు ప్రభావితుడైన వ్యక్తి తన పనులతో నాలోచనలతో నితరులను ప్రభావితులను జేయును. ఇట్లు పరంపరా గతముగా సామాన్య జనులు సంస్కారసంపన్ను లగుట కవకాశమేర్పడు ననుటలో సందేహము లేదు.

సీతా వివాహానంతరము సపరివారముగా నయోధ్యకు మరలి ప్రయాణము చేయునప్పుడు భార్గవ రాము డడ్డుపడి రాముని అధిక్షేపించును. అప్పుడు పరశురాముడు తండ్రి ఋణమును దీర్చుకొనుటకు జేసిన క్షత్రియ సంహారము నభినందించుచు రాముడు

*శ్రుతవా నస్మి యత్కర్మ కృతవా నసి భార్గవ।*
*అను రుంధ్యామహే బ్రహ్మన్ పితు రా నృణ్యా మాశ్రితః॥*

అనెను. తండ్రి ఋణమును దీర్చుట తనయుని ధర్మమని స్పష్టముగా వివరించెను.

నిర్ణయింపబడిన రాముని పట్టాభిషేకము కైకపరముల మూలమున నాగిపోవుట మాత్రమే గాక తనకు రానుండునట్టి రాజ్యము చేయి జారి మరియొకనికి బోవుట, తాను పదునాలుగేండ్లరణ్యము నందు నారచీరలతో, జడలతో నివసించుట మొదలగునట్టి యూహింపని పరిణామములు

గలిగినప్పుడా పరిస్థితిలో రాముని చిత్త స్థైర్యము, పితృభక్తి, సత్య సంధత గమనింపదగినవి. ఈ గుణముల చేతనే రాము డా నిర్ణయములను చిఱునవ్వుతో స్వీకరించి యాచరించుటకు సిద్ధపడెను. ఆ గాంభీర్యము, ధైర్యము, నిగ్రహము, నిరాడంబరత, సత్యదీక్ష పరుల కాదర్శములై సామాన్యులను గూడ నట్లు చేయు డని ప్రేరేపించున ట్లగపడును. ఈ రాముని ప్రవర్తన మానవుల యందద్భుతములైన పరిణామ ములను గొనిరాగలిగియున్నవి. రాముని పట్టాభిషేకసందర్భమునందు ప్రజల మనోభావమిట్లుండెను. ఎవడు రాముని చూడడో, ఎవనిని రాముడు చూడడో యట్టివాడు లోకమునందు నిందితు డగును. అంతే గాదు. అట్టివాని యాత్మగూడ వాని నేవగించుకొనునట.

*యో హి రామం న పశ్యాత్తు యం చ రామో న పశ్యతి।*
*నిందిత స్స భవే ల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే॥*

కైక యింటి యందు విషాదము చేత దనతో మాటలాడకుండిన తండ్రిని జూచి, యాయనపరితాపమునకు గారణ మూహింప లేక రాముడు తనలో దాను కుములుచుండగా కైక "రామా! నేను చెప్పబోవునట్టి విషయమును వినుటకు ముందు నాకు నీవు నీ తండ్రి యాజ్ఞను నెరవేర్చుదు నని మాట యిమ్ము" అన్నది. అప్పుడు రాముని ప్రతిజ్ఞ యిది: "నా తండ్రి యాజ్ఞ యైనచో దప్పక తీక్ష్ణమైన విషమును త్రాగుదును. అగ్నిలో నురుకుదును. సముద్రమునందు బడిపోదును. ఇది నిశ్చయము. అదేదో చెప్పుము తల్లీ! తప్పక చేయుదును. రాముడు రెండు నాల్కలవాడు గాదు" అనెను.

*"అహం హి వచనా ద్రాజ్ఞః పతేయమపి పావకే।*
*భక్షయేయం విషం తీక్ష్ణం మజ్జేయ మపి చార్ణవే॥*

*త ద్బ్రూహి వచనం దేవి! రాజ్ఞో యదభికాంక్షితమ్।*
*కరిష్యే ప్రతిజానే చ రామో ద్వి ర్నాభి భాషతే॥"*

*అయో 18-28, 30*

ఇచ్చుటి "రాజ్ఞః" అను పదము రామో ద్విర్నాభిభాషతే, అను వాక్యము గమనింపదగినవి. దశరథుడు తనకు దండ్రి మాత్రమే గాడు; రాజుకూడా. కనుక రాజాజ్ఞను ధిక్కరింపరా దను విషయమును సూచించెను. ఆయన తండ్రి కూడా కాబట్టి యాయనయాజ్ఞ యైనచో నెంతటి సాహస కార్యమునైనను, ప్రాణముల నర్పించియైనను నెరవేర్ప వలయు నన్న సందేశ మిం దిమిడి యున్నది. ఆడి తప్పరా దను విషయము. "రామో ద్వి ర్నాభిభాషతే యను వాక్యము వివరించుచున్న.

అడవులకు బోవుటకు సంతోషముగా సమ్మతించి కైకతో "నాహితమును గోరియే నా తండ్రి నా కిట్టి యాజ్ఞను చేసె" నని చెప్పుట యందు రాముని యాంతర్యము సూచింపబడినది. శ్రేయోభిలాషులకు వా రెట్టిపని నాదేశించినను దానియం దేదో హిత కాంక్ష యిమిడియుండు నని రామునిభావము. తానర్థకాంక్షినిగా దనియును, పరమ ధర్మమైన తండ్రి యాజ్ఞను పాలించుటయే తన కర్తవ్య మనియును దెలిపెను.

నాహ మర్థపరో దేవి! లోక మావస్తు ముత్సహే।
నహ్యతో ధర్మచరణం కించి దస్తి మహత్తరమ్।
యథా పితరి శు శ్రూషా తస్యవా వచన క్రియా॥

పితృవాక్య పరిపాలనము, పితృశుశ్రూష మహాధర్మము లని శ్రీరాముడు కార్యరూపమున నిరూపించెను. కౌసల్య నోదార్చునప్పుడు కూడ యీ భావమునే మరల మరల నూది చెప్పెను. వృద్ధుడైన తండ్రి, రాజు, గురువు కోపముతోగాని సంతోషముతో గాని, కామముతో గాని ఏ భావముతోనైనను నాదేశించినట్టి కార్యమును ధర్మపరుడైనవా డాచరించియే తీరవలెను. ఇదియే రాముని ధర్మనిర్ణయము.

*"గురుశ్చ రాజాచ పితా చ వృద్ధః క్రోధా త్ప్రహర్షా దథవాపి కామాత్।*
*య ద్వ్యా దిశే త్కార్య మవేక్ష్య ధర్మం కస్తం న కుర్యా దనృశంసవృత్తిః॥"*

*(అయో 21-59)*

రాముని యందు మఱియొక గొప్పతన మున్నది. తాను సత్యవాక్యమును పాలించుటయే కాక తన తండ్రికిగూడ సత్యవచనాతిక్రమణము రారాదని భావించి యట్లు చేసెను. విధి యనుల్లంఘ్యమను విషయము నాయన యనేకసందర్భములం దనేక విధములుగా నిరూపించి చెప్పెను. తనకు జరుగవలసిన పట్టాభిషేకము భంగమ్మై తా నడవులకు బోవలసి వచ్చినప్పుడు గూడ నాయన యెవ్వరిని నిందింపలేదు. విధి విధానమే యందులకు గారణమనియును, దాని నెవ్వరును బ్రతి ఘటింపలే రనియును విశదపరచి యితరులను సమాధానపరచెను.

*య ద చింత్యం తు త ద్దైవం భూతేష్వపి నహన్యతే।*
*సుఖ దుఃఖే భయక్రోధే లాభాలాభౌ భవాభవౌ॥*
*యస్య కించి త్తథా భూతం నను దైవస్య కర్మ తత్॥*
*(అయోధ్య 23-22)*

మానవునికి గలుగు సమస్త సుఖ దుఃఖములు విధి విధానములే యన్నదే పై శ్లోకముల భావము.

లక్ష్మణుడు బాల్యము నుండియు రామున కత్యంత ప్రీతి పాత్రుడైన తమ్ముడు. ఎచ్చటికి బోయినను నేమి చేసినను నొకరిని విడిచి యొక రుండరు. వారిని విడదీయుట యెవ్వరికిని సాధ్యముగాదు. వారి సోదర ప్రేమ యంత గాఢము, నిర్మలమున్నైనది.

*బాల్యా ద్ప్రభృతి సుస్నిగ్ధః లక్ష్మణో లక్ష్మివర్ధనః।*
*రామస్య లోకరామస్య భ్రాతు ర్జ్యేష్ఠస్య నిత్యశః॥*
*లక్ష్మణో లక్ష్మి సంపన్నః బహిఃప్రాణ ఇవాపరః।*
*న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః॥*
*(బాల -18-29, 30 ,31)*

లక్ష్మి సంపన్నుడైన లక్ష్మణుడు రామునికి బహిః ప్రాణము వంటివాడు. లక్ష్మణుడు లేక రాముడు నిద్రింపడు. మధురాహారమును భుజింపడు. వనవాసమునకు బయలు దేరునప్పుడు లక్ష్మణుడు గూడ

రాముని విషయమునందట్లే ప్రవర్తించెను. తన నయోధ్యయందే యుండి తల్లిదండ్రులను జాగ్రత్తగా సేవించుచుండవలసినదిగా రాముడు శాసించినప్పుడు, తనయన్న మనస్సు కఱగునట్లు "అగ్రజా! అరణ్యము నందు న న్ననుచరునిగా నుంచుకొనుము. అట్లు చేయుట యందు ధర్మ మేదియును లేదు. వనవాసమునకు మీరు న న్ననుమతించినయెడల ధన్యుడ నగుదును. మిక్కిలి సంతోషముతో మీ వెంట వత్తును. విల్లును బట్టుకొని, ఖనిత్ర పిటకలను గ్రహించి మీకు త్రోవ చూపించుచు మీ ముందు నడచి పోదును. మీకు కావలసిన ఫలమూలాదులను సమకూర్చి, మీకాయాసము కలుగకుండ సేవింతును. ప్రకృతి సుందరములైన పర్వతములను, వనములను, నదులను చూచుచు, మా వదినె జానకీ దేవితో గూడ వనవాస దుఃఖమును మరచి సుఖముగా నుండుడు. సర్వకాల సర్వావస్థల యందును మిమ్ము నేను జాగ్రత్తగా నారాధించుచుందును.

*"కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే।*
*కృతార్థో౽హం భవిష్యామి; తవ చార్థః ప్రకల్పతే॥*

*ధను రాదాయ సగుణం ఖనిత్ర పిటకాధరః।*
*అగ్రత స్తే గమిష్యామి పన్థానం తవ దర్శయన్॥*

*ఆహరిష్యామి తే నిత్యం మూలాని చ ఫలాని చ।*
*భవాంస్తు సహ వైదేహ్యా రంస్యతే గిరిసానుషు।*
*అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే॥".*

*(అయోధ్య-32, 24,25, 27)*

రాముడుకూడా నిజముగా లక్ష్మణుని విడిచిపెట్టి యుండలేడు. కాని ప్రియసోదరుడైన లక్ష్మణుడు నిష్కారణముగా దనతోగూడ నడవులలో కష్ట పడరా దనియో, లేక కష్టదశ యందు తమ్ముని మనస్తత్వమును పరీక్షించుటకో రాము డతనిని రావల దన్నాడు. సోదరులయందు రామునికుండు ప్రీతి యపారము. రావణునితో బోరుచు మూర్ఛితుడైన

లక్ష్మణుని జూచి విలపించుచు బలికిన మాట లాయన మనస్సును వెల్లడించుచున్నవి.

*దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః।*
*తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః॥*

*(యుద్ధ - 101)*

ప్రతి దేశమునందును భార్యలు లభింతురు. బాంధవులును దొరుకుదురు. కాని సహోదరుడైన తమ్ముడు లభించు ప్రదేశము కనబడదు. సోదరులపైన రామునికి గల యభిప్రాయ మిట్టిది.

ఒక్క లక్ష్మణుని విషయముననే గాదు. భరతుడును సోదర భక్తి యందు లక్ష్మణునికంటెను దక్కువవాడు గాదు. అనాయాసముగా జేజిక్కిన రాజ్యమును విడిచిపెట్టి యాదేశము లేక పోయినను అన్నవలెనే తానును వల్కలములను జడలను ధరించి, రాజ్యమును మఱల దన యన్నకే సమర్పించుట కొరకు నిస్స్వార్థపరుడై చిత్రకూటమున కేగిన త్యాగధనుడు. "అన్నా! నీవు జ్యేష్ఠుడ వుండగా నేనెట్లు రాజ్యము నేలుదును. నా గుణములు బుద్ధియు నల్పములు. సోదరుల క్రమమునందు గూడ నాస్థానము తక్కువే. నీవు లేకుండ జీవించుట నా కిష్టము గాదు. శత్రురహితమైన తండ్రి రాజ్యమును ధర్మరీతిగా బాలింపు" మని పాదములపై బడి యెంతో దీనముగా వేడుకొనెను. కాని రాముడుగూడ భరతుని లాలించుటయందు స్నిగ్ధమైన తన హృదయము నంతటిని గ్రుమ్మరించెను. "నాయనా భరతా! మన తండ్రి నీ తల్లికి బ్రీతిపూర్వకముగా నిచ్చిన వరముల ప్రకారము రాజ్యమును నీకు విడిచిపెట్టి నే నడవులకు వచ్చితిని. తండ్రిని సత్యపరునిగా జేయుటకే నేనడవికి వచ్చితిని. నీవు నదే విధముగా తండ్రి కసత్య దోషము రాకుండునట్లు రాజ్యము నేలుము. తండ్రిని ఋణ విముక్తుని చేయుట మన ధర్మము. కనుక నీవు మారు మాటాడక తిరిగి పోయి రాజ్యమును పాలింపు" మని నిబ్బరముగా, నిలకడగా ధర్మయుక్తముగా బలికి, భరతుని సమాధానపరచి, యతని కోరిక

ప్రకారము పాదుకల నిచ్చి పంపెను. ఈ సోదర ప్రేమ అపూర్వము.

*భవానపి తథైత్యేవ పితరం సత్య వాదినమ్ ।*
*కర్తు మర్హసి రాజేన్ద్ర! క్షిప్రమే వాభిషే చనాత్ ॥*
*ఋణా న్మోచయ రాజానం మత్కృతే భరత! ప్రభుమ్ ॥*

*(అయో 107,- 9, 10)*

భరతుడు గూడ స్థిర చిత్తుడే. గురు భక్తి గలవాడే. కాని యన్న యాజ్ఞను, తండ్రియాజ్ఞను బాలింపవలసినవా డగుట చేత, అన్నను విడిచి పెట్టి పోలేక పోయినను, మిక్కిలి నిగ్రహముతో పాదుకలను దీసికొని చేయునది లేక తిరిగిపోయెను. కాని లక్ష్మణుని స్థితి యట్టిది గాదు. ఎట్టి పరిస్థితి లందైనను రాముని కనుచరుడుగానే యుండుటకు నిశ్చయించు కొన్నాడు. అడవులకు బోవల దని తండ్రి చెప్ప లేదు. తల్లి సంపూర్ణ హృదయముతో రాముని సేవించుచుండు మని హితము పదేశించి పంపెను. కనుక లక్ష్మణునికి సోదరసేవా భాగ్యము నిరంత రాయముగా లభించినది. తన తల్లి తన నిట్లాదేశించినది. "నాయనా! సుఖముగా బోయి రమ్ము. అడవుల యం దున్నప్పుడు రాముని దశరథునిగా దలంచి సేవించుము. సీతను నన్నుగా (సుమిత్రగా) దలంచి యారాధింపుము. రాము డున్నచోటే యయోధ్య యనుకొనుము" అని పేమార్ద్ర హృదయముతో వీడ్కొలిచ్చెను.

*రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మ జామ్ ।*
*అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత! యథా సుఖమ్ ॥*

*(అయోధ్య. 40-9)*

"జ్యేష్ఠభ్రాతా పితృసమః" అను భావము, వదినె తల్లితో సమానము నను భావము, ఈ రెంటిని సుమిత్ర మరొక విధముగా నిరూపించెను. లోకము నం దింత యుత్తమురాలైన తల్లి లభించుట కష్టము. రాముని కీమె సవతి తల్లి. ఐనను నిజమాత కంటె నెక్కువగా రామునిపై పుత్రప్రేమను గనబరచెను. ఇది తెలిసినప్పుడు మన హృదయము లకు సుమిత్ర యొక మహోన్నత వ్యక్తిగా గోచరించును గదా!

తల్లియుపదేశమును లక్ష్మణుడు యథావిధిగా గ్రహించెను. ఉత్తమ సంస్కార శోభితుడైన లక్ష్మణునికి దల్లి చేసిన యుపదేశముయొక్క సారాంశ మింతకు ముందే తెలియును. రాత్రింబవళ్ళు డవియందున్నను, వదినెను చిత్తశుద్ధితో జాగ్రత్తగా సేవించెను. సీతను వెదకికొనుచు ఋశ్యమూక పర్వతమును చేరినప్పుడు, సుగ్రీవునితో మైత్రి గలిగిన తరువాత, సుగ్రీవుని మంత్రులు సీత జార విడిచిన యాభరణములను చూపించి గుర్తు పట్టుమని యడిగిరి. అవి చూచిన రామునికి దుఃఖమధికమ్మై కన్ను లశ్రువులతో నిండగా నాయన "నాకన్ను లశ్రుపూరితము లగుటచేత చూడలే కున్నాను. లక్ష్మణా! నీవు వానిని చూచి గుర్తు పట్టు" మనెను. వెంటనే లక్ష్మణుడు చూచి తాను భుజాభరణములను కర్ణాభరణములను గుర్తుపట్టలే ననియు, ప్రతిదినము పాదములకు నమస్కరించుచుంటిని కనుక కాలి యందెలనుమాత్రము గుర్తు పట్ట గలుగుచున్నా నని" పలికెను.

*"నాహం జానామి కేయురే నాహం జానామి కుండలే*
*నూపురే త్వభి జానామి నిత్యం పాదాభివందనాత్॥ "*
*(కిష్కింధ- 6-23)*

ఇది లక్ష్మణునికి వదినె పైగల మాతృభావము. అన్ని సంవత్సరముల కాల మొకచోట గలిసి జీవించినను సీత యొక్క పాదములను దక్క ముఖమును చూచి యెఱుగడు. లక్ష్మణుని యుత్తమ సంస్కారము, ధార్మిక బుద్ధి ప్రశంసాపాత్రములు.

అడవికి బయలుదేరు నపు డా విషయమును భార్యకు దెలుపుటకై రాముడామె యింటికి బోయి తండ్రి యాజ్ఞతో దా నడవికి బోవుచున్నట్లు తెలిపి సీతనుమాత్ర మయోధ్యయందే యుండు మనెను.

"సా త్వం వసేహ కల్యాణి రామస్య వశవర్తినీ" (అయోధ్య -26-37) ఆ మాటను విన్నంతనే ప్రణయ కుపితయైన సీత (ప్రణయాదేవ సంక్రుద్ధా) రామా! నీ విప్పు డాడిన మాట యుచితమ్మైనది గాకపోగా నపకీర్తిని గలిగించు నట్టిది. లోకము నందు దల్లి, తండ్రి, సోదరుడు,

పుత్రుడు తమతమ పుణ్యముల వలన గలుగునట్టి భాగ్యములను మాత్రమే యనుభవింతురు. కాని భర్త యొక్క భాగ్యమును భార్య యొక్క తెయే పంచుకొని యనుభవించును. వనవాసము నీ కాదేశింపబడినప్పు డది నాకుగూడ వర్తించును. మరణించిన పిమ్మటగూడ భార్యకు భర్త యొక్కడే గతి. నీ వడివిలో నడచునపుడు నీకంటెను ముందుగా నడిచి, మార్గము నందలి దర్భలను, ముండ్లను త్రొక్కుచు నీ త్రోవను సుగమముగా జేయుదును. నీవు భుజించిన తర్వాతనే భుజింతును. కనుక నన్ను గూడ నడవులకు గొనిపొమ్మని పలువిధములైన ధర్మముల నుదాహరించుచు వేడుకొనెను.

*ఆర్యపుత్ర! పితా భ్రాతా, మాతా పుత్ర స్తథా స్నుషా।*
*స్వాని పుణ్యాని భుంజానాః స్వం స్వం భాగ్య ముపాసతే॥*

*భర్తు ర్భాగ్యం తు నార్యేకా ప్రాప్నోతి పురుషర్షభ!।*
*అతశ్చై వాహ__హ మాదిష్టా వనే వస్తవ్య మిత్యపి ॥*

*న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః।*
*ఇహ ప్రేత్య చ నారీణాం పతి రేకో గతి స్సదా॥*

*యది త్వం ప్రస్థితో దుర్గం వన మద్యైవ రాఘవ!।*
*అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్॥*

*(అయోధ్య. 27-3,4,5,6)*

ఈ విధముగను, మఱి యింకెన్నో విధములుగను, దనను వనమునకు గొనిపొమ్మని సీత వేడుకొన్నను రాము డంగీకరింపక, వనవాసమునందుండు కష్టములను వివరించుచు రావలదని పలికెను. కాని యంతకంటెను లోకవృత్తముల నెఱిగిన సీత యామాటలకు భయపడలేదు. "రామా! వనమునం దెన్నియో భయకారణములను వివరించి చెప్పితివి.

నీ సన్నిధానమునం దున్నప్పు డా భయకారణములు నా వద్దకు రాక తమంతకు దామే దూరముగా దొలగి పోగలవు (భయే సర్వే హి బిభ్యతి) (2-29-4) నీ రక్షణ యం దున్నప్పు డింద్రాదులు గూడ నన్ను జెనకలేరు. మరణించిన తర్వాతగూడ నేను నీదాననే. ధారా పూర్వకముగా స్త్రీ యెవరికి దాన మీ బడునో యతని కామె మరణానంతరము కూడ భార్యయే యగును.

"అద్భి ర్దత్తా స్వధర్మేణ ప్రేత్య భావేపి తస్య సా" (అయో-29,-18)నీ వింత పిరికి వాడ వని మా తండ్రి తలంపలేదు. తన యల్లుడు పురుషరూపమున యుండు నట్టి స్త్రీ యని యాయన యనుకొనలేదు. నీవు న న్నిచ్చట విడిచిపోయినయెడల నిప్పుడే విషము ద్రాగి మరణింతునే గాని శత్రువుల యధీనము నం దుండ లేను.

*కిం త్వా ఽ మన్యత వైదేహః పితా యే మిథిలాధిపః।*
*రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుష విగ్రహమ్।*
*విష మద్యైవ పాస్యామి మా వశం ద్విషతాం గమమ్॥*

*(అయోధ్య. 30- 3, 19)*

అని మరెన్నో రీతులుగా బలుకుగా నామెపతిభక్తికి, దృఢ దీక్షకు, ధర్మజ్ఞతకు సంతసించిన రాము డామెను వనమునకు గొనిపోవుట కంగీకరించెను. ఈ సందర్భమునందు సీత రాముని నధిక్షేపించుట తిరస్కార భావముతో గాని, గర్వముతో గాని కాదు. ప్రణయముచేతను, నభిమానము చేతను న ట్లన్నది.

"*ప్రణయా చ్చాభి మానాచ్చ పరిచి క్షేప రాఘవమ్॥*"

*(అయో-30,2)*

ఈ విధముగా సీతాదేవి మొదటి నుండి చివర వరకు నుత్తమాదర్శ పత్నిగా దర్శన మిచ్చును. ఆమెపాతివ్రత్య మనన్య సాధారణ మైనది. అనసూయాది తాపస స్త్రీల చేత బ్రశంసింపబడి యంగరాగాది బహుకృతుల నందుకొన్నది. నియమ నిగ్రహములతో వనవాసము నందు గొంత కాలము సుఖముగా నివసించెను. రావణునిచే సంహరింపబడి యశోకవనమునం దుంచబడినప్పుడు శీలమునకు వచ్చురాని విధముగా మెలగెను.

మహాబలవంతుడు, క్రోధనుడు, హింసాదక్షుడు నైన రావణుని తిరస్కారముగా జూచినది. అతనితో మాట లాడవలసి వచ్చినప్పుడు గడ్డి పోచ నడ్డముగా నుంచుకొని పరపురుషదర్శనమును బరిహరించినది.

*తృణ మంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా॥*

(సుందర-29,-2)

గడ్డిపోచ నడ్డముగా నుంచుకొనుట రావణుని తృణముగా జూచుట కని కొంద రందురు. కావచ్చును. "శుచిస్మితా" అను పద మచ్చట సాభిప్రాయము. ఒక్కొక్కప్పుడు తృణీకారమును సూచించుటకు చిఱునవ్వును సాధనముగా నెంచుటయు గలదు. ఆ సమయము నం దామె ప్రదర్శించిన ధైర్యమున కడ్డుకట్టలు లేకపోయినవి. రావణునికి రామునికి గల యంతరమును నీచోపమానములతో దెలిపెను. తన పాతివ్రత్యమహిమ చేత హనుమంతుని వాలమునందలి యగ్ని (లంకాదహన సమయము నందు) యతనికి జల్లగా నగునట్లు చేసెను. ఆమెశీలసంపద, దృఢ దీక్ష, ధైర్యము, పతిపరాయణత్వము ప్రతి మహిళ యందును భాసింపవలెను. రామాయణ కథ కంతటికి నామె చరిత్రయే ప్రాణము పోసినది. కనుకనే "సీతాయా శ్చరితం మహత్" అను ప్రసిద్ధి యేర్పడెను. ఈ వాక్యమును వాల్మీకియే స్వయముగా జెప్పెను.

సీతను భార్యగా గల రాముని తేజస్సుకు పరిమితి లేదు. (అప్రమేయం హి త త్తేజః యస్య సా జనకాత్మజా) (3-37-18). తనయొక్క పాతివ్రత్య సంపద చేత భర్త కింత ఘనత తేగలిగిన మహిళామ తల్లిచరిత్ర చిరస్మరణీయము కదా. ఆమెయొక్క క్షమాగుణము నిరుపమాన మైనది. మహాపరాధ మొనర్చినవాని నైన నొక్క ప్రణామముతో క్షమించి వానికి బ్రసన్నురాలగును. (ప్రణిపాత ప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా) ( 27-39 - 58-90) ఈ శీల సంపద నలవరుచుకొన్న స్త్రీలు సుఖశాంతు లతో వర్ధిల్లి తరింపగల రనుటలో సందేహము లేదు. ఇట్టి స్త్రీలు లోకము నందు విస్తరించిన యెడల ధర్మము నాలుగు పాదముల- పైన నిలబడగలదు.

ఇంక రామాయణమునందలి మిత్రధర్మమును విచారింతము. ఈ ధర్మమునకు జటాయువు, సుగ్రీవుడు బ్రతీకలుగా నిలిచిరి. తండ్రి యాజ్ఞచేత రామలక్ష్మణు లరణ్యమునకు బోవుచు నడుమ నగస్త్యాశ్రమమున విడిది చేసి, యామహర్షిసత్కారము లంది, యాయన విశేషించి తెలిపిన మేరకు బంచవటికి బోవుచు జటాయువును గృధ్రరాజును జూచిరి. ఆ జటాయువు రామలక్ష్మణుల తండ్రియగు దశరథునికి మిత్రుడు. ఆ విషయ మును దెలిసికొని భక్తి శ్రద్ధలతో జటాయువును వీడ్కొని పంచవటిని జేరిరి.

అటు తరువాత కొంత కాలమునకే వారిచేత ముక్కుచెవులు కోయబడి పరాభవము చెందిన శూర్పణఖ (రావణుని చెల్లెలు) యొక్క ప్రేరణతో రావణుడు రామలక్ష్మణులను మోసగించి సీత నెత్తుకొని పోవుచుండగా నామె యార్తనాదములను విని జటాయు వాకాశమున కెగిరి రావణునితో బోరి, యతడు రెక్కలను ఖండింపగా నెత్తుటిలో దోగాడుచు రాముని కా వార్తను దెలుపవలయు నని యాయన వచ్చు వరకు బ్రాణముల నిలుపుకొని యుండెను. మిత్రుని పుత్రుడును, లోకపూజ్యుడునైన రామచంద్రుని యిల్లాలిని గాపాడ బోయి దెబ్బతినిన జటాయువు యొక్క స్నేహధర్మము గణనీయముకదా! ఎందరు మిత్రు లిట్లు చేయుదురు? మిత్ర కార్యమున కెవ రసువులను త్యాగమొనర్తురు?

జటాయు వూహించిన ప్రకారము రామలక్ష్మణులు సీతను వెదకుచు నా మార్గమున వచ్చి జటాయువును జూచి, మొదట నతనిని రాక్షసు డని పొరపడిరి. అంతట జటాయువు జరిగిన దంతయును దెలిపి, సీతను రావణు డెత్తుకొని దక్షిణ దిక్కుగా బోయినా డని తెలిపి ప్రాణములను విడిచెను. ఇదియే నిజమైన మైత్రి. అవసరము గలిగి నప్పు డాదుకొనువాడె మిత్రుడు. వారిమైత్రికి సాక్షిగా నగ్నిని జ్వలింపజేసి, జటాయువును బూజించి సంస్కరించిరి. లోకోత్తర గుణోత్తరుడైన రాముని చేత దహనాదులచే సంస్కరింపబడి యాపక్షి యుత్తమ లోకముల కేగెను. ఈ సందర్భము నందు రామచంద్రుడు పలికిన మాట చిరస్మరణీయము.

"ధర్మాచరణ పరాయణులు, సాధువులు, రక్షింపగల సమర్థులు, నాశ్రయ మివ్వగలవారు నన్ని ప్రదేశములం దుందురు. కాని పశు పక్ష్యాదుల యందును నిట్టివా రుండుట శ్లాఘనీయము. ఎన్నేండ్ల క్రిందటి మైత్రినో పురస్కరించుకొని, తన మిత్ర ధర్మమును నిర్వర్తించి యీ పక్షిరాజు మృతుడై నేలబడినాడు గదా" యని వాపోయెను.

*"సర్వత్ర ఖలు దృశ్యంతే సాధవో ధర్మచారిణః।*
*శూరా శ్శరణ్యా స్సౌమిత్రే! తిర్యగ్యోని గతే ష్వపి॥*
*అయం పితు ర్వయస్యో మే గృధ్రరాజో జరాన్వితః।*
*శేతే వినిహతో భూమౌ మమ భాగ్య విపర్యయాత్॥"*

*(అరణ్య. 67-24,28)*

అటనుండి వారు క్రమముగా నడిచి పంపాసరస్తీరమును చేరిరి. అన్నయగు వాలి చేత బరాభవింపబడి, భార్యను కోల్పోయి హనుమదాదులైన కొందరు మంత్రులతోగూడ సుగ్రీవుడు నివసించుచుండిన ఋశ్యమూక పర్వతమును గనుగొనిరి. అట నుండిన సుగ్రీవుడు ధనుర్ధరులైన రామలక్ష్మణులను జూచి, భయపడి, వారెవరో తెలిసికొని ర మ్మని హనుమంతుని బంపెను. హనుమంతుడు వారి వృత్తాంతమును దెలిసికొని సుగ్రీవుని యొద్దకు వారిని గొనివచ్చెను. రామ – సుగ్రీవులు పరస్పరము స్నేహ పూర్వకముగా నొకరి విషయము నొకరి కెరిగించుకొనిరి. రాముడు సుగ్రీవునికి, సుగ్రీవుడు రామునికి సహాయ మొనర్చుకొనుట కంగీకరించి యీ విధముగా బ్రతిజ్ఞలు చేసికొనిరి. వా రిరువురి దుఃఖములు సమానములు. రాజ్యభ్రంశము, భార్యా వియోగ మిరువురికి గలవు. ఆ సందర్భము నందు సుగ్రీవుని మాటలు చాల విజ్ఞతతో గూడి యున్నవి. "రామా! వానరుడనైన నాతో స్నేహమును గోరుచున్నావు. మన యీ స్నేహమర్యాద తాత్కాలికముగా గాక, శాశ్వతముగా నుండనిమ్ము. ఇదే నీ చేతిని నా చేతితో గలుపుము".

*య త్త్వ మిచ్ఛసి సౌహార్దం వానరేణ మయా సహ।*

*రోచతే యది మే సఖ్యం బాహు రేష ప్రసారితః।*
*గృహ్యతాం పాణినా పాణిః మర్యాదా బధ్యతాం ధ్రువా॥.*
*(కిష్కింధ-5-11,12)*

అని పలికి చేతులు గలుపుకొని, యగ్నికి బ్రదక్షిణ మొనర్చి పరస్పరము మిత్రు లైరి. సుగ్రీవుని యీ మాటలలో స్నేహము చేయదగిన రీతి వివరింపబడినది. ఈ విధముగా నేర్పడిన మైత్రిని బురస్కరించుకొని ప్రతిజ్ఞానుసారముగా రాముడు వాలిని వధించి సుగ్రీవుని వానరరాజ్యమునకు రాజుగా నొనర్చి తన మాటను నిలబెట్టుకొని సత్యసంధు డయ్యెను.

వర్షాకాలము గడచిన పిమ్మట సీతను వెదకునట్టి ప్రయత్నము చేయునట్లు సుగ్రీవుడు మాట నిచ్చియుండెను. అనుకొనిన విధముగా వర్షాకాలము గడచిపోయి శరత్కాలము వచ్చెను. కాని సుఖలోలుడైన సుగ్రీవునికి రాముని విషయము జ్ఞాపకము రాలేదు. సీతను వెదకు ప్రయత్నమును జేయలేదు. విరహతప్తుడైన రాము డప్పుడు లక్ష్మణునితో ననిన మాటలు లోకుల కుపదేశము వలె నుండెను.

లక్ష్మణా! సీతను వెదకుటకు సుగ్రీవుడు కాలమును నిర్దేశించి చెప్పి, యాకాలము దాటి పోయినప్పటికిని ఆ ప్రయత్నము చేయకున్నాడు. తన కార్యమును నెరవేర్చుకొని మిత్రకార్యము నాలోచించుట లేదు. సమీపించిన యతిథులకు, పూర్వ ముపకార మొనర్చినవారికిని, మాట చెప్పి, యాశపెట్టి, దానిని నెరవేర్చని మనుష్యుడు పురుషాధము డన బడును. మంచిదికాని, చెడ్డదికాని చేసిన వాగ్దానమును నెరవేర్చిన వాడే పురుషోత్తముడు. తన కార్యమును సాధించుకొని, మిత్రకార్యములను నెరవేర్పని కృతఘ్నులు మరణించిన పిమ్మట వారిమాంసమును గ్రద్దలుగూడ దినవు. ఇది కృతఘ్నునికి గలుగు దుష్ఫలితము.

*స కాలం పరిసంఖ్యాయ సీతాయాః పరిమార్గణే।*
*కృతార్థః సమయం కృత్వా దుర్మతిః నావబుధ్యతే॥*

*అర్థినా ముపపన్నానాం పూర్వం చా ప్యుపకారిణామ్।*
*ఆశాం సంశ్రుత్య యో హన్తి స లోకే పురుషాధమః॥*

*శుభం వా యది వా పాపం యో హి వాక్య ముదీరితమ్|*
*సత్యేన ప్రతిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః||*

*కృతార్థా హ్యకృతార్థానాం మిత్రాణాం తే భవన్తి యే|*
*తాన్ మృతా నపి క్రవ్యాదాః కృతఘ్నా న్నో ప భుంజతే||*
*(కిష్కింధ. 30-69,71,72,73)*

అంతకుముందే హనుమంతుడు సుగ్రీవునికి రామకార్యమును గూర్చి చెప్పిన మాటలు చాల ప్రబోధాత్మకములు. ఓ సుగ్రీవా! రాజ్యము లభించి కీర్తి వర్ధిల్లినది. సంపద లతిశయించెను. మిత్రుని కార్యమును దీర్చుట కాప్తులను సమీకరించు కార్యమొక్కటే మిగిలియున్నది. కార్యరీతిని, కాలము విలువను నెఱిగిన వాడు మిత్రుల విషయమున సముచితముగా బ్రవర్తించిన యెడల నతని రాజ్యము, కీర్తి, ప్రతాపము ఇనుమడించును. రాజ ధర్మములందును శిక్షితుడవైన నీవు సన్మార్గ వర్తివి. కనుక మిత్రుని కొసగిన వాగ్దానమును నెరవేర్పవలెను. ఎన్ని కార్యము లున్నను, అన్నిటిని ప్రక్కన బెట్టి మిత్రుని పనిని సాధించుట కుత్సాహపడునట్టివాని కెట్టి యనర్థములును రావు. నీకు మిత్రుడైన శ్రీరాముని కార్యమున కిప్పుడే యాలస్యమైనది. సీతాదేవి నన్వేషించునట్టి కార్యమున కుపక్రమింపుము.

*రాజ్యం ప్రాప్తం యశశ్చైవ కౌలీ శ్రీ రభివర్ధితా|*
*మిత్రాణాం సంగ్రహః శేషః త ద్భవాన్ కర్తు మర్హతి||*

*యో హి మిత్రేషు కాలజ్ఞః సతతం సాధు వర్తతే|*
*తస్య రాజ్యం చ కీర్తి శ్చ ప్రతాపశ్చాపి వర్ధతే||*
*(కిష్కింధ-29,-9,-10)*

*సంత్యజ్య సర్వకర్మాణి మిత్రార్థే యోఽనువర్తతే|*
*సంభ్రమాద్ధి కృతోత్సాహః సోఽనర్థై ర్నా వరుధ్యతే|*
*త దిదం మిత్రకార్యం నః కాలాతీత మరిందమ!||*
*(కిష్కింధ, -29,-13)*

ఈ మాటలతో సుగ్రీవునికి గొంత మెలకువ గలిగెను. మహా బుద్ధిమంతుడు, పరాక్రమ శాలియు నైన నీలుడను వానరవీరుని సర్వవానర సమీకరణమునకు నియోగించెను. కాని యిచ్చట రామునిగూర్చి యొక్క విషయము చెప్పవలసియున్నది. విరహతాపము సహింపలేక శ్రీరాముడు తొందరపడి సుగ్రీవుని కృతఘ్నునిగా దలచి నిందించెను. కాని యత డంతకు ముందే నీలుని వానరసమీకరణమున కాదేశించి యుండెను. ఏది యేమైనను, చివరకు సుగ్రీవుడు సీతాన్వేషణ కార్యమును విజయవంత ముగా నెరవేర్చి, రాక్షసులతో బోరాడు నప్పుడును వీరోచితముగా మెలగి, తన యనుచరులతో రావణ సంహారకార్యమునకు దోడ్పడి తాను నిజమైన మిత్రుడుగా నిరూపించుకొని కీర్తిని గడించెను.

రామచరిత్రము నందు హనుమంతుని దాసభావము రాముని ప్రశంసల నందుకొని భగవద్దాస్యమున నిట్లు మెలగవలె నని నిరూపించి చూపెను. సుగ్రీవునికి మంత్రిగా నుండె ననియే గాని యాయన మహాజ్ఞాని. సర్వవిషయము లాయనకు గరతలామలకములు. అట్టి వాడు మంత్రిగా నుండుట చేతనే సుగ్రీవుడు కృతకృత్యు డయ్యెను. మిత్రకార్యము నందు గృతకృత్యుడ నైతి నను తృప్తిని, కీర్తిని సంపాదించుకొనెను. లంకయందు సీతను జూచి, యామెతో సంభాషించి, కార్యసాధన మొనర్చి తిరిగి వచ్చిన హనుమంతుడు రాముని సన్నిధియందు సుగ్రీవుని చేత బ్రశంసింపబడెను.

"కౌసల్యాతనయా, రామచంద్రప్రభూ! నా కతి ప్రీతిపాత్రమైన మధువనమును నాశనము చేసినట్టి వానర చర్యయే మన కార్యవిజయమును దెలుపుచున్నది. కార్యమును సాధింపకుండిన యెడల నిట్టి సాహసమునకు బాల్పడలేరు. నిస్సందేహముగా సీతాదేవి గనుగొనబడినది. హనుమంతుడే యీ కార్యమును సాధించి యుండును. కార్యసిద్ధి, బుద్ధి, దృఢవ్రతము, ప్రయత్నము, పరాక్రమము మున్నగు మేలి గుణములు హనుమంతుని యందే గలవు."

*కౌసల్యా సుప్రజా రామ! సమాశ్వసి హి సువ్రత!।*
*దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనుమతా॥*

*హనూమతీహ స్సిద్ధిశ్చ మతిశ్చ మతి సత్తమ!।*
*వ్యవసాయశ్చ శౌర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్ ॥*
*(సుందర-64,-29,30)*

ఇంతమాత్రమే గాదు. హనుమంతుడు సకలశాస్త్రార్థ తత్త్వజ్ఞుడు, భాషా తత్త్వవేత్త, వ్యాకరణశాస్త్రపారంగతుడు, వేద నిష్ణాతుడు. పంపా సరస్తీరమునందు మొట్టమొదటి సారి రామలక్ష్మణులను గలిసికొని హనుమంతుడు మాటలాటిన సమయము నందు రాఘవు డాయన మాటల తీరును బ్రశంసించుచు లక్ష్మణునితో ని ట్లనెను. "లక్ష్మణా! ఈ వానరుడు సుగ్రీవుని మంత్రి యట. ఈతని మాటల తీరును చూచితివి గదా! ఋగ్యజుస్సామవేదములను క్షుణ్ణముగా నెఱుగని వా రిట్లు పలుక లేరు. ఇత డిన్ని మాటలు మాటాడినను నెక్కడగాని యపశబ్దము దొరలలేదు. వ్యాకరణ శాస్త్రమునుగూడ సంపూర్ణముగా నేర్చియుండును. అర్థవంతములు ధర్మయుక్తములునైన యీతని పలుకులు నా మనస్సు నలరించుచున్నవి. ఆ మాటలను చెప్పునప్పుడు ముఖమునందు, నేత్రములందు, లలాటము నందు, కనుబొమలందును నెచ్చటగాని, దోషము కనబడదు. మధురమ్మైన కంఠస్వరము, మాటలయందు నెమ్మది గమనింపదగియున్నవి. అన్నిటి కంటెను మించి యవి యన్నియును శుభప్రదము లైనవి. ఈ పలుకు లెవని కానందము గూర్పవు? ఇట్టి సుగుణములు గలిగిన కార్యసాధకులు వెంట నున్న వానికి సమస్త కార్యములు క్షణములో సమకూరగలవు."

*నా నృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః।*
*నాऽసామవేద విదుషః శక్య మేవం ప్రభాషితుమ్ ॥*

*నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్।*
*బహు వ్యాహరతాऽనేన నకించి దపశబ్దితమ్ ॥*

*న ముఖే నేత్రయో శ్చాపి లలాటే చ భ్రువో స్తథా।*
*అన్యేష్వపి చ సర్వేషు దోష స్సంవిదితః క్వచిత్ ॥*
*కిష్కింధ- 3,-29,30,31.*

ఉత్తమ సంస్కారము గలవాడు పెద్దలను దర్శించి నప్పుడు, వాని మాటల తీరీ విధముగా నుండవలె నని రాముని మాటలలోని యాంతర్యము. కండ్లు త్రిప్పుట, కనుబొమ లెగురవేయుట, నొసలు నూరువంకలు చేయుట మొదలగునవి పెద్దలతో పలుకునప్పుడు పనికిరావు. అట్టి పలుకులు మనస్సును లోగొనలేవు. హితముగా, మితముగా నింపుగా మాటలాడు టయే మాటకారి లక్షణము. కాని యసందర్భముగా, ననుచితముగా, పరుషస్వరము వినబడునట్లుగా పలికినయెడలనట్టి పలుకులు వ్యర్థములై గాలిలో గలిసిపోవుట తప్ప మరి యొక ప్రయోజన ముండదు. మీదు మిక్కిలి దూతలకీ లక్షణము లవశ్యముగా నుండవలెను.

హనుమంతు డింగితజ్ఞానము గలవాడు గనుక రామలక్ష్మణుల యవయవసన్నివేశములను సౌందర్యమును జూచి వారు మహాపురుషు లని గ్రహించెను. అప్పటి నుండియే శ్రీరామునికి దాస్యము చేయుట కువ్విళ్లూరెను. సుగ్రీవాజ్ఞచేత హనుమంతుడు కొంత వానర సంఘముతో సీతను వెదకుటకు దక్షిణ దిశగా బోయెను. ప్రదేశము లన్నింటిని వెదకి వెదకి విసిగిపోయిన వానరులకు జటాయువు యొక్క యగ్రజుడు సంపాతి యను పక్షి సీతాదేవి లంకయం దున్నట్లు తెలిపెను. లంకను జేరుటకు శతయోజనవిస్తీర్ణమైన సముద్రమును దాటవలెను.

జాంబవంతుని ప్రతి బోధముతో హనుమంతుడు సముద్రమును దాటుచు మధ్య నెదురైన విఘ్నములను దొలగించుకొని లంకను జేరెను. కాని మధ్యమార్గము నందు మైనాకు డను పర్వత మెదురుపడి తనపై విశ్రమించి పోవలసినదిగా హనుమంతుని వేడినను కార్యకాలముల నెఱిగిన హనుమంతుడు "పర్వతరాజా! రామకార్యము నెరవేర్చుటకు కాల మాసన్నమై నన్ను వేగిరించుచున్నది. పగలుకూడా దాటిపోవుచున్నది. మధ్య నెచ్చటను నిలువరా దని నేను ప్రతిజ్ఞనుకూడా చేసితిని" అని పలికి దానిని స్పృశించి, మధ్య నెదురైన విఘ్నముల నన్నిటి నధిగమించి లంకా పట్టణమున బ్రవేశించి గోపురము లం దంతటను సంచరించుచు, నా పట్టణమునంతటిని

వెదకి, యచట రావణుని భార్యయగు మండోదరిని చూచి సీతాదేవి యని భ్రమించెను. కాని మరల బాగుగా బరికించి లక్షణములను, ప్రవర్తనను బట్టి యామె సీతాదేవి గా దని నిశ్చయించెను. ఆతడు సీతాదేవిశీలము నెంత బాగుగా నెఱిగి యుండెనో యీ క్రింది వాక్యముల వలన దెలియనగును. "ఈమె నిజముగా సీతాదేవి కానే కాదు. ఆమె రాముని విడిచి పెట్టి యెప్పుడు నింత సుఖముగా నిద్రింపదు. భోజనము చేయదు. అలంక రించుకొనదు. దేవేంద్రు నంతటి వానినైనను బరపురుషుని గన్నెత్తియైనను జూడదు. కనుక యీమె యెవతె యో రాక్షసస్త్రీయై యుండు" ననుకొని యచ్చటినుండి దాటిపోయెను.

*న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హతి భామినీ।*
*న భోక్తుం నాప్యలంకర్తుం న పాన ముపసేవితుమ్।*
*నాన్యం నర ముపస్థాతుం సురాణామపి చేశ్వరమ్॥*

*(సుందర- 11,2)*

ఈ పలుకులలో హనుమంతునియొక్క కార్యకారణ వివేచన దక్షత, యింగిత జ్ఞానము స్పష్టపడుచున్నవి. ఈ కారణముచేత నే ప్రథమ దర్శనము నందే సీతాదేవిని పరాశక్తిగా గ్రహించెను. తుద కశోక వనము నందు జానకీదేవిని దర్శించి, సంభాషించి కార్యసిద్ధిని బొందెను. "త్వయి సిద్ధిశ్చ కీర్తిశ్చ" యని పొగడ్తను బొందినవాడు కదా మరి. ఆ తరువాత రావణుని దర్శింపగోరి యశోకవనమును ధ్వంస మొనర్చి, చైత్యప్రాసాదము నందలి రాక్షసులను వధించి, రావణ దర్శన సాధనముగా నింద్రజిత్తు ప్రయో గించిన బ్రహ్మాస్త్రమునకు బద్ధుడై, రావణదర్శనాంతరము లంకాదహన మొనర్చెను. ఇప్పటికే రావణునికి రామదూత యొక్క బలసామర్థ్యము లెఱుక పడినవి. రామలక్ష్మణ సుగ్రీవులను గూడ నతని కెఱుక పరచుటకై

*జయ త్యతి బలో రామో లక్ష్మణశ్చ మహాబలః।*
*రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః॥*

*దాసోஉ__హం కోసలేన్ద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః*
*హనుమాన్ శత్రు సైన్యానాం నిహన్తా మారుతాత్మజః ।*
యని గట్టిగా నఱచి చెప్పెను.

ఇంకా రామాయణ కథా వైశిష్ట్యమును దెలుపునపుడు విభీషణుని గూడ కొంత పరిచయము చేయుట యుక్తము. ఇతడు రాక్షసరాజైన రావణాసురుని కనుజుడు. కాని వారిరువురి గుణములలో జాల భేదము గలదు. ఒక్క వాక్యములో జెప్పవలయు ననిన రావణుడు రాజసప్రియుడు. విభీషణుడు సాత్త్విక ప్రియుడు. కుంభకర్ణుడు తామసప్రియుడు. సాత్త్విక రాజసములు పరస్పర విరుద్ధములు. ప్రియహిత వర్తనము, ధర్మాధర్మ పరిజ్ఞానము, ప్రియభాషణము, ధర్మ పక్షపాతము, అధర్మ విరోధము విభీషణుని గుణములు. ధర్మ రక్షణముకొరకు శారీరక సంబంధ మును దృణీకరించెను. తన యన్న కాపదను గ్రహించి, నివారించుటకై యతని కెన్ని విధములుగానో హితోపదేశ మొనర్చెను. కాని రావణుడు వినకపోగా, హితవాదియైన తననే చంపుదు నని బెదిరించెను. అప్పుడు విధిలేక రామునికి శరణాగతు డయ్యెనే కాని యన్నపై ద్వేషముతో మాత్రము గాదు. ఒకవేళ ద్వేషమే యనుకొన్నను నది యధర్మముపై ద్వేషమేగాని వ్యక్తిపైన గాదు. ధర్మరక్షణముకొఱకే రావణుని యొక్క కొన్ని మర్మములను రామునికి దెలిపెను. తన ధర్మప్రకృతిని విడిచి పెట్టలేక పోయెను. ఇది విభీషణుని దౌర్బల్యము. "ప్రకృతి ర్దుస్త్యజా నామ."

హనుమంతుని వధింపు మని రావణు డాజ్ఞాపించి నప్పుడుగూడ విభీషణు డడ్డుపడి ఆ దూతవధవలన గలుగు పాపమునుండి యన్నను రక్షించెను. సామ-దాన-భేదములతో గార్యమును సాధింపవలెను. అవి విఫలమైనప్పుడే దండోపాయము నాశ్రయింపవలె నని యుక్తి యుక్తముగా వివరించెను. రామలక్ష్మణుల యొక్క పరాక్రమమును విపులముగా తెలియజెప్పి జానకీదేవిని మరల రాముని కర్పించి సర్వనాశనము గాకుండ రక్షింపు మని పలుమారు వేడుకొనెను. రావణుని మంత్రు లందరు నతనికి

ముఖప్రీతిగా మాటలాడువారే కాని హితమును దెలుపువారు కారు. ఈ విషయమును గుర్తుచేసిన విభీషణుడు రావణునితో రాజా! ప్రియముగా మాటలాడువా రంతటను సుఖముగా లభింతురుగాని, ప్రియము గాని విషయమైనను హితముగా నుండునట్టి దానిని తెలుపువాడు, వినువాడును లభించుట కష్టము.

*సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః।*
*అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః॥*

*ఎంతగా జెప్పినను వినకపోయి నందుననే* "రాజా! నీకు శుభ మగుగాక! నేను పోయిన తరువాత నీవు సుఖముగా నుండు" మనెను.

"స్వస్తి తేఽస్తు!గమిష్యామి; సుఖీభవ! మయా వినా".

విడిచిపోవునప్పుడుగూడ దనయన్నకు శుభమును, సుఖమునే గోరినాడు. ఇది విభీషణుని సాత్త్వికత. తాను పోయిన తర్వాతనైనను నాతడు సత్యమును ధర్మమును గుర్తించి సుఖించి శుభములను బొంద వలయు నన్న యాకాంక్షగోచరించును. వీనిని బట్టి విభీషణుడు ద్రోహియో, రావణుని హితము గోరినవాడో విజ్ఞులకు దెలియకపోదు. అతని వెంట మహాపరాక్రమశాలురు నలుగురు వచ్చిరి. ఆకాశమునందు వచ్చు చుండగనే సుగ్రీవుడు వారిని జూచి శత్రువులుగా భావించి వారితో యుద్ధము చేయుటకు సిద్ధముగా నుండు డని వానరులను హెచ్చరించెను. కాని విభీషణుడు సహజమైన శాంతచిత్తముతో నచ్చట నున్న వానరు లందరిని దనరాకను రామచంద్రునికి దెలుపు డని కోరెను. సుగ్రీవుడు మొదలైన వానర ప్రముఖు లందరును, రామునికి విభీషణుడు గూఢచారి యని యే వివరించిరి. కాని విభీషణుడు శరణాగతు డను నభిప్రాయము రాఘవునికి గలిగెను. ఇచ్చట రామచంద్రుని యౌదార్యము గమనింపదగినది. "వానరులారా! అన్నతో భేదాభిప్రాయము గలిగి యాతడు వచ్చినాడు.

మిత్ర భావముతో వచ్చినవానిని నే నెన్నడును బరిత్యజింపను. అతనియందు దోషమున్నను సరకుసేయ'' నని చెప్పెను.

*మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన।*
*దోషో యద్యపి తస్య స్యా త్సతా మేత ద గర్హితమ్॥*

సుగ్రీవు డింకను విభీషణుని దోషములనే దెలుపుచుండగా శ్రీరాముడు సుగ్రీవా! సోదరులందరును భరతుని వంటివారు గారు. తండ్రి కందరును నావంటి పుత్రు లుండరు. మీవంటి మిత్రులు కూడా దుర్లభులు.

*న సర్వే భ్రాతర స్తాత! భవన్తి భరతోపమాః।*
*మద్విధా వా పితుః పుత్రాః సుహృదో వా భవద్విధాః॥*

ఇచ్చట శ్రీరామచంద్రుడు, భరతుని భ్రాతృధర్మమునను, సుగ్రీవాదుల మిత్ర ధర్మమును గొప్పగా బేర్కొనెను. మఱియు వానర వీరులందరును చెప్పిన మాటలను విన్నపిమ్మట రాముడు వాని నన్నిటిని త్రోసిపుచ్చి ఎవ రేమి చెప్పినను, ఈతడు శత్రువుగాని, దీనుడుగాని, గర్వితుడుగాని పాహి? యని యాచించి శరణు గోరి ప్రపన్నుడైనాడు. ఒక్కసారి ''నేను నీవాడ'' నని పలికి యాశ్రయించి శరణు బొందినట్టిన నెల్లవారికిని నే న భయమిత్తును. ఇది నా వ్రత'' మని ఖండితముగా దెలిపి, విభీషణుని దనవానినిగా జేసికొనెను.

*ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణం గతః।*
*న హన్యా దానృంశ స్యార్థ మ పి శత్రుం పరంతప!।*

*సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।*
*అభయం సర్వభూతే భ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥*

ఇట్లు విభీషణుని ననుగ్రహించుటలో శ్రీరామచంద్రునికి స్వార్థము లేదు. రాము డే పనిని గాని స్వార్థముతో జేయడు. ఆ విధముగా మహోపకార మొనరించిన రావణుడే వచ్చి శరణాగతి చేసి యుండినయెడల

తప్పక యభయ మిచ్చి కాపాడి యుండెడివాడు. విభీషణు డ ధర్మమును సహింపలేక తన నాశ్రయించి న ట్లాయన గ్రహించెను. లోకమునం దెవ్వడైనను న ధర్మమును ప్రతిఘటించుట కాయనయనుగ్రహమును గోరునెడల రాముడు తప్పక యనుగ్రహించు నని విశదమ్మైనది. భగవదను గ్రహమును సంపాదించుటకు సంపూర్ణ శరణాగతిని మించిన సాధనము లేదు.

ఇంక భక్తి భావము నందచంచలమ్మైన దీక్ష గలిగిన శబరివృత్తాంత ముతో నీ వ్యాసమును ముగింతును. శబరి యొక సిద్ధాంగన. వృద్ధతాపసి, శిథిలమ్మైన శరీరముతో పంపా సరస్తీరము నం దుండిన మునులకు బరిచర్య చేసికొనుచు స్వర్గగమనమునకు నిరీక్షించుచుండినది. ఆమెచే సేవింపబడు చుండిన మును లామెకు రాముని యాగమనమునుగూర్చి తెలిపిరి. అప్పటినుండి యామె రామదర్శనమున కువ్విళ్లూరుచు, వేయి కనులతో నిరీక్షించుచు జీవితశేషమును గడుపుచుండెను. మహాభక్తురాలుగా బేరుగన్న మహనీయురాలు శబరి. కబంధుని మాటల ననుసరించి పంపా సరస్తీర మును జేరి, రామలక్ష్మణులు శబరి పర్ణశాలకు పోయినప్పు డామె పొందిన యానందము గట్టులు త్రెంచుకొని ప్రవహించినది. భగవంతుడు వేంచేసి నప్పుడెట్లు స్వాగత మొసగి యర్చింపవలయునను విషయమును శబరి చరిత్రమున దెలిసి కొనవచ్చును. అచంచలమ్మైన భక్తి భావమున కామె ప్రతీక.

తన దైవము, రామచంద్రుడాశ్రమమునం దడుగు పెట్టిన వెంటనే యామె వినయముతో లేచి నిలబడి, సాష్టాంగ ప్రణామ మాచరించి చేతులు జోడించుకొని, భక్తితో బాద్యము, ఆచమనీయము, నర్ఘ్యము మొదలగు సపర్యలను యథావిధిగా నాచరించెను. రాము డామెను కుశలప్రశ్న లడుగుచు "నీవు కోపమును నిగ్రహించుకొంటివా? ఆహారమును నియతముగా సేవించుచున్నావా? (కోపము తాపసులకు బలమ్మైన విఘ్నకారియగు శత్రువు. కనుక రాము డా ప్రశ్నవడిగెను.) ఆ ప్రశ్నల కన్నిటికిని భక్తి వినయములతో యథార్థములైన సమాధానములు చెప్పి శబరి

"రామా! నీ సందర్శనముచేతనే నాకిప్పుడు తపస్సిద్ధి కలిగినది. నా జన్మ సఫలమ్మైనది. నీ పూజచేత నాకు స్వర్గము లభించును. నీ రాకనే నేను ప్రతీక్షించుచున్నా" నని పలికి తన యాశ్రమాభ్యంతర స్థలముల నన్నిటిని జూపించెను. రాము డంతట శబరీ! నీ పూజ నాకందినది. ఇంక నీవు స్వేచ్ఛగా బోవచ్చు" నని పలికెను.

"అర్చితోఽహం త్వయా భద్రే, గచ్ఛ కామం యథాసుఖమ్"

వెంటనే శబరి తన జీర్ణమ్మైన శరీరమును విడిచిపెట్టి, యగ్ని యందు ప్రేల్చి స్వర్గమును జేరెను.

*తస్మి న్ముహూర్తే శబరీ జీర్ణ దేహం జిహాసతీ*
*అనుజ్ఞాతా చ రామేణ హుత్వా హోత్మానం హుతాశనే।*
*జ్వలత్పావకసంకాశా స్వర్గమేవ జగామ సా॥*

మొత్తము మీద రామాయణము నంతటిని క్షుణ్ణముగా బరిశీలించినచో నిది యొక యితిహాసముగా, బురాణముగా, ధర్మశాస్త్ర ముగా, మహాకావ్యముగా గనబడగలదు. మానవుడు జీవితకాలము నందు సాధింపదగిన ధర్మ - అర్థ - కామములను (త్రివర్గమును) సంపాదించుట కనువైన మార్గమును సులభశైలిలో మనోహరముగా, నిర్దేశించి చెప్పగలిగిన దీ గ్రంథ మొక్కటే. ఇదియే రామకథ యొక్క వైశిష్ట్యము. ఈ చరిత్రను బాగుగా నర్థము చేసికొని యావిధముగా జీవించువారికీ గ్రంథము కల్పవృ క్షము వలె సమస్త ధార్మిక వాంఛలను సమకూర్పగలదు.

ఈ గ్రంథము ఏడు కాండలుగా విభజింపబడి, ప్రతి కాండ యందును విశేష ధర్మములు బోధింపబడును. ఇరువది నాలుగు వేల శ్లోకములు గల రామాయణ మహాకావ్యసార మాకల్పాంతము భారతీయుల ప్రతి రక్త బిందువు నందును మిళితమ్మై పునీత మొనర్చుగాక!

---

# 11. రామాయణము- వర్ణనాసౌష్ఠవము

ఎల్లమరాజు శ్రీనివాసరావు

రామాయణంలోని వర్ణనాసౌష్ఠవం పరిశీలిద్దాం. కవయతి - వర్ణయతి అని అసలు కవిత్వమంటేనే వర్ణనమని అర్థం చెప్పారు. వర్ణ - వర్ణ క్రియా విస్తారగుణవచనేషు అని ధాతుపాఠం. వర్ణించటమంటే చిత్రించటం, విస్తరించటం, గుణాల నేకరువు పెట్టడం. భావమనేది ఎప్పుడూ అమూర్తమైనది. దానిని మూర్తీభవింప జేయాలంటే రకరకాలుగా వర్ణించాలి. తన్మూలంగా అమూర్తమైన భావం మూర్తమై భాసిస్తుంది; బలాన్ని పుంజుకొంటుంది; మనసు నాకర్షిస్తుంది; సులువుగా అనుభవానికి వస్తుంది. ఇదీ వర్ణన మూలంగా కవియైనవాడు సాధించే సౌలభ్యం. ఇది కావ్యమంతటా పరుచుకొని ఉంటుంది. కేవల కథావస్తువు నేకరువు పెట్టటం దగ్గర నుంచీ రసపోషణ దాకా అంతా వర్ణన మీదనే ఆధారపడి ఉంది. వర్ణించే శక్తి లేకపోతే వాడు కవే కాడు. అది కావ్యమే గాదు. సమర్థుడైన కవి మామూలు కథ చెప్పినా కండ్లకు కట్టినట్టు చెబుతాడు. అలా చెప్పిందంతా వర్ణన క్రిందికే వస్తుంది. అందులో సౌందర్య మొకటీ, ఔచిత్యమొకటీ చోటు చేసుకొన్నాయంటే ఇక చెప్పనక్కరలేదు. వర్ణనాశిల్పం పరాకాష్ఠ నందు కొంటుంది. దానికే సౌష్ఠవం అని పేరు.

వాల్మీకిరచనలో ఈ వర్ణనా సౌష్ఠవం ఎంత ఉండాలో అంతా ఉంది. అసలు ఆదికవి అనే మాట సార్థకం చేసుకొన్నాడామహనీయుడు. ఆయన మాట మాటాడితేనే వర్ణన. మామూలుగా ఒక విషయాన్ని చెబుతున్నా అది మనసు నెంతో ఆకర్షిస్తుంది. దశరథుడి యజ్ఞాన్ని వర్ణిస్తున్నాడు మహాకవి.

*న చాహుత మభూ త్తత్ర స్ఖలితం వాపి కించన ।*

*న తే ష్వహస్సు శ్రాంతో వా క్షుధితో వాపి దృశ్యతే॥*

*బ్రాహ్మణా భుంజతే నిత్యం నాథవంతశ్చ భుంజతే।*

*వృద్ధాశ్చ వ్యాధితాశ్చైవ స్త్రియో బాలా స్తథైవ చ॥*

*దీయతాం దీయత మన్నం - వాసాంసి వివిధాని చ*
*ఇతి సంచోదితా స్తత్ర తథా చక్రు రనేకశః*
*అన్నకూటాశ్చ బహవో దృశ్యంతే పర్వతోపమాః॥*

*(రామా I 14-10-13)*

హోమం చేయనిదిగాని, తప్పిపోయిందిగాని, ఏదీ లేదు. అలసినవాడూ, ఆకలిగొన్నవాడూ ఎవడూ లేడు. బ్రాహ్మలూ తిన్నారు. ఉన్నవాళ్లూ తిన్నారు. లేనివాళ్లూ తిన్నారు. వృద్ధులు తిన్నారు. బాలురూ తిన్నారు. 'అన్నం పెట్టండి, బట్ట లివ్వండి' అనే మాటలే ఎప్పుడు పట్టినా. అన్నరాసులే ఎక్కడ చూచినా.

వస్తు సామగ్రిని ఊరక ఏకరువు పెడుతూ పోతాడాయన. అందులో పెద్ద మార్పుకూడా ఉండదు. అయినా ఏవేవో విశేషాలు చెబుతున్నట్టు ఎంతో బాగుంటుం దావర్ణన. రామలక్ష్మణులు అడవిలో వెళ్లుతుంటే పంపాతీరంలో చెట్లను వర్ణిస్తాడు చూడండి.

*"కేతక్య స్సిందువారాశ్చ వాసంత్యశ్చ సుపుష్పితాః।*
*మాధవ్యో గంధపూర్ణాశ్చ కుందగుల్మాశ్చ సర్వశః॥*

*చిరిబిల్వా మధూకాశ్చ వంజులా వకులా స్తథా।*
*కేచి త్పర్యాప్త కుసుమాః పాదపా మధుగంధినః।*
*కేచి న్ముకులసంవీతాః శ్యామవర్ణా ఇవాబభుః॥*

*(రామా VI 4-78-80).*

ఇలాగే రాక్షసులు పెచ్చురేగి వానర వీరులను ఎదుర్కొనే ఘట్టంలో

*ప్రాసైః ప్రమథితాః కేచి ద్వానరాః శోణితస్రవాః।*

*ముద్గరై రాహతాః కేచి త్పతితా ధరణీతలే।*
*పరిఘై ర్మథితాః కేచి ద్భిండివాలై ర్విదారితాః॥*

*(రామా VI- 52-19,20)*

అని వర్ణిస్తాడు.

అక్షర విన్యాసంలోనే వాటి కూర్పులోనే తా ననుకొన్న భావాన్ని అత్యద్భుతంగా చెప్పగలడామహాకవి. ఇది ఒక బ్రహ్మాండమైన కళ. కాళిదాసాదులు దీనికోసం ఆయన ఆశ్రమంలో కూచుని ఎంతోకాలం తపస్సు చేశారు. ఈ క్రింది వర్ణనలు చూడండి, మీకే తెలుస్తుంది –

*విశాలే విమలే నేత్రే రక్తాంతే కృష్ణతారకే*
*విశాలం జఘనం పీనం పాండర దశనా స్తవ ॥.*

*పీనోన్నత ముఖౌ కాంతౌ స్నిగ్ధౌ తాళఫలోపమౌ।,*
*మణి ప్రవేకాభరణౌ రుచిరౌ తే పయోధరౌ॥*

(*రామా III* 46-18-19-20).

ఇందులో రావణుడు సీతాదేవిసౌందర్యాన్ని వర్ణిస్తున్నాడు. నేత్రాలూ, జఘనమూ, పయోధరాలూ, వర్ణనావిషయం. 'విశాలే, విమలే' అని ఏకారం తరచుగా వినపడటంవల్ల నేత్రాల వైశాల్యమూ, జఘనమ్ పీనమ్ అని మకారం వాడటం వల్ల దానిబరువునూ, స్నిగ్ధౌ తాళఫలోపమౌ అని ఔకారప్రాచుర్యంవల్ల పయోధరవర్తులత్వాన్నీ కవి ఎంత చమత్కారంగా సూచిస్తున్నాడో చూడండి.

ఇలాగే తారాభి రభిరామాభి రుదితాభి రివాంబరమ్ అంటా డొకచోట. ఇక్కడ వరుసగా మూడు భకారాలు ప్రయోగించటం లోనే ఆ తారకల తళుకులాంటిదో కండ్లకు కట్టినట్టు చూపుతాడు.

'శక్య మంజలభిః పాతుమ్ వాతాః కేతక గంధినః' (రామా IV 28-8) మొగలి పుష్పాళ్లతో సాంద్రములైన మారుతములను దోసిళ్లతో పట్టి త్రాగవచ్చునట. ఇందులో 'పా'కు ముందొకటి, 'కా'కు ముందొకటి ఉపధ్మానీయ – జిహ్వామూలీయాలుగా విసర్గను ప్రయోగించటం మూలాన వాటి నుచ్చరించేటప్పుడు పాఠకుడు నిజంగానే ఆ మారుతాన్ని త్రాగుతున్న అనుభూతి నిస్తున్నాడు కవి.

ఒక్కొకచోట శబ్ద సంఘటనతోనే ఆ అందాన్ని చిందిస్తాడు.

*''మందమారుత నిశ్వాసం సంధ్యా చందన రంజితమ్।*
*స్నిగ్ధైరభ్రపటచ్ఛేదై ర్బద్ధవ్రణ మివాంబరమ్॥*
*జరాజర్జరితైః పద్మైః శీర్ణకేసర కర్ణికైః॥''* (రామా IV 28-6-7).

*ఒక్కొక్కచోట వాక్య విన్యాసంలో ఎంతో శోభ చూపుతాడు॥*

*''పతితైః పతమానైశ్చ పాదపస్థైశ్చ మారుతః।*
*కుసుమైః పశ్య సౌమిత్రే క్రీడన్నివ సమంతతః॥*
(రామా IV 1-13)

*''వహంతి వర్షంతి నదంతి భాంతి ధ్యాయంతి నృత్యంతి సమాశ్వసంతి,*
*నద్యో ఘనా మత్తగజా వనాంతాః ప్రియావిహీనాః శిఖినః ప్లవంగాః''*
(రామా IV 28-27).

– ఇలాంటి వెన్నో.

ఒక్కొక్కప్పుడు చందోభేదాన్ని బట్టి, దానిలో మాటల విరుపులను బట్టి భావాన్ని బ్రహ్మాండంగా ఆవిష్కరిస్తాడు.

*''రరాస భూమి ర్నతతాప భానుమాన్ వవౌ న వాయుః ప్రచచాల చాచలః।*
*కపేః కుమారస్య చ వీక్ష్య సంయుగం ననాద చ ద్యౌ రుదధిశ్చ చుక్షుభే॥''*
(రామా V 47-13).

ఇది హనుమదక్షకుమారుల యుద్ధవర్ణనం. మామూలుగా అనుష్టుప్పులో వ్రాసే వాల్మీకి ఇలాంటి చోట్ల వృత్తం మారుస్తాడు. ఇది వంశస్థ వృత్తం. అందులోనూ మొదటిదీ మూడవదీ ఈరెండు గణాలూ జగణాలుగా ఉండటం గమనించండి. ఇది యుద్ధం. అందులో వీరరౌద్ర రసాలు వర్ణించాలి. జగణం ఒక ఊపు నిచ్చే గణం. దాని నందుకొని పొడిగించేది తగణం. ఈ రెండింటి సహయోగంతో నడుస్తున్న దీ పద్యం. అందులోనూ ఎక్కడికక్కడ పదాలూ వాక్యాలూ విరగటం చూడండి. అది ఇంకా రసపోషణకు దోహదం. దానికి తగినట్టు 'రరాస తతాప' అని ఇలా క్రియా పదాలన్నీ లిడంతాలుగా ప్రయోగించాడు. లిట్టులో మొదటి అక్షరమే పునరుక్త మవుతుంది. అది రెట్టించిన వీరరసాన్ని ఎంతో అద్భుతంగా

సూచిస్తుంది. 'కపేః కుమారస్య' అనే చోట జిహ్వామూలీయ ప్రయోగం చూస్తే వారిరువురూ నీవెంత అంటే, నీవెంత అని చూచే నిర్లక్ష్యభావం ధ్వనిస్తుంది. చివర 'చక్షుభే' అని సంయుక్త పూర్వదీర్ఘ మహాప్రాణాక్షరంతో పద్యం సమాప్తం కావటం రసానికి పరాకాష్ఠ. *మరొక ఘట్టం చూడండిః*

*హిమ హత నళినీవ నష్ట శోభా వ్యసన పరంపరయా నిపీడ్యమానా।*
*సహచర రహితేవ చక్ర వాకీ జనక సుతా కృపణాం దశాం ప్రపన్నా॥*
*(రామా V 16-30).*

ఇది సీతాదేవిదీనదశను వర్ణించే పద్యం. ఇక్కడా ఉన్నట్టుండి వృత్తాన్ని మార్చాడు వాల్మీకి. ఇది కొంత త్వరత్వరగా ఆరంభమయి ఆ తరువాత సాగుతూ పోయే పద్యం. దీనికి పుష్పితాగ్ర అని పేరు. ఆమె దైన్యానికనుగుణంగా ఉంది రచన. అందులోనూ 'హిమహత' అనటంలో కొట్టినట్టుగానూ 'నళినీవ' అనటంలో సన్నబడినట్టుగానూ 'పరంపరయా నిపీడ్యమానా' అనే అక్షరవిన్యాసంలో బాధ లావెను రాచి రంపాన పెడుతున్నట్టుగానూ అలాగే 'సహ - రహి' అనే హకార ద్వయంలో శూన్యంగా ఉన్నట్టుగానూ 'కృపణాం - దశాం - ప్రపన్నా' అని మూడు విరుపులతో ముగించటంలో అంతకంతకూ దిగజారిపోయే ఆమె దయనీయమైన దశ కండ్లకు కట్టినట్టు గానూ ఎలా వర్ణిస్తున్నాడో చూడండి మహర్షి. ఇలా ఎన్నివందల శ్లోకాలైనా ఉదాహరించవచ్చు ఆ మహాకవి రచనలో.

అసలు ముక్తసరిగా వ్రాసే కొన్ని పంక్తులే ఎంతో పటిష్ఠంగానూ, పరివర్తనాసహిష్ణువులుగానూ ఉండి ఉద్దిష్టమైన భావాన్ని ఇంతకంటే బాగా ఇక సాహిత్యక్షేత్రంలో ఎవరూ చెప్పలేరా అనిపించేలాగా భాసిస్తాయి. ఇది కవివర్ణనాశక్తి కొక పెద్ద కీర్తి పతాక.

*న త దగ్నిశిఖా కుర్యా ద్యద్రామమహిషీ స్వయమ్।*
*(రామా V 59-5)*

*రామపత్ని చేయగలిగిన పని అగ్నిజ్వాల చేయలేదు।*

*న చ సంకుచితః పంథా యేన వాలీ హతోగతః॥*
*(రామా IV 30-81)*

*వాలి వెడలిపోయిన మార్గము ఇఱుకైనది గాదు।*

*ఇది రాముడు ప్రమత్తుడైన సుగ్రీవుడికి చేసిన హెచ్చరిక॥*

*'నాదదానం శరాన్ ఘోరాన్ – న ముంచంతం శిలీముఖాన్।*

*న కార్ముకం వికర్షంతం – రామం పశ్యామి సంయుగే।*

*హన్యమానంతు తత్సైన్యం – పశ్యామి శరవృష్టిభిః॥*

*(రామా III 25-39,30)*

ఇది శూర్పణఖ రాముని యుద్ధ కౌశలాన్ని వర్ణిస్తూ రావణుడికి చెప్పిన మాట. రాముడు బాణాలు పొదిలో నుంచి తీసుకొన్నదీ లేదు, వదిలిందీ లేదు. అది నాకు కనపడనే లేదసలు. కేవలం ఎదట ఉన్న మన రాక్షససైన్యం చాపకట్టుగా క్రింద పడిపోవటమే నాకు కనిపించింది. ఇలాగే మారీచుడు రాముడంటే తన కున్న భయాన్ని రావణుడికి బయట పెడుతూ ఇలా అంటాడు.

*అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ!।*

*రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే॥*

*రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ!।*

*రత్నాని చ రథాశ్చైవ విత్రాసం జనయంతి మే॥*

*(రామా III 39-16,17).*

అరణ్యమంతా రామమయంగా కనిపిస్తూ ఉంది. ఎక్కడ చూచినా రాముడే కనిపిస్తాడు. రత్నాలూ రథాలూ ఇలాంటి రకారాదిశబ్దాలు ఏవి వినిపించినా భయము పుడుతుందట. వాడి భయమెంత భయమో చూడండి!

అలంకారాల స్పర్శ లేకుండా మామూలుగా వర్ణిస్తేనే వాల్మీకిని పట్టలేము. ఇక ఆయా అలంకారాలతో సంకలితం చేసి వర్ణించసాగా డంటే అది అతిలోకమే. అది కొంతకు కొంత పయి ఉదాహరణలలోనే మనం చవిచూడవచ్చు. బాగా దాని సార మాస్వాదించాలంటే కావ్యామృత

పారావారంలో ఎక్కడ చూచినా దాని మీగడ తరకలే. వాల్మీకి సాధారణంగా ఉపమోత్ప్రేక్షల లాంటి ప్రసిద్ధమైన అలంకారాలతో తృప్తి పడతాడు. ఒక వేళ కావాలనుకుంటే రూపకం వాడతాడు. అంతకు మించి పోవాలనే అత్యాశ లే దాయనకు. అందులోనే ఎంత వైచిత్రి కావాలంటే అంతా చూపగల డా మహాకవి. అలాంటప్పు డన్నీ పయిన వేసుకోవలసిన పని ఏముంది? అస లాయన ఉపమాలంకార ప్రయోగ నైపుణ్యానికే కాళిదాసుతో సహా మొత్తం కవి లోకమంతా చేతులు జోడించ వలసిన విషయం.

*'నూనం లాలప్యతే సీతా పంజరస్థేవ శారికా'*

*(రామా V 13-13)*

*రావణాధీనంలో ఉన్న సీత పంజరంలో చిక్కిన శారికలాగా ఎంతో వాపోతున్నదట.*

'భూషణై రుత్తమై ర్హీనాం లతా మకుసుమా మివ|' (రామా V 17-21) - ఒంటిమీద ఒక్క సొమ్మైనా లేక బోసిపోయిన ఆమెకృశించిన శరీరం పూలన్నీ రాలిపోయిన సన్నని తీగలాగా ఉందట.

*కలశీ మప విధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ।*
*వసంతే పుష్పశబలా మాతేవ పరిమార్జితా॥*

*(రామా V 10-46)*

రావణాంతఃపురంలో సీతను వెతుకుతున్నాడు హనుమంతుడు. అప్పు డక్కడ చెల్లాచెదురుగా పడి నిద్రపోతున్న రాక్షస స్త్రీల నిలా వర్ణిస్తున్నాడు కవి. ఒకతె మధువును త్రాగి త్రాగి ఆ కలశాన్నే పైన వేసుకొని మెలికలు తిరిగి నేలమీద పడిపోయింది. అప్పు డామధువంతా ఒలికి దాని బట్టలు తడిసి నీరు కారుతూ ఉన్నై. అది ఎలా ఉందంటే వేసవికాలంలో పూలతో దండగట్టి నీళ్లలో ముంచి వ్రేలాడదీస్తే ఎలా ఉంటుందో అలా ఉందట. ఏమి టీ ఊహ. ఇలాంటిదే మరొకటి.

*కాచి ద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే।*
*మహానదీ ప్రకీర్ణేవ నళినీ పోత మాశ్రితా॥*

*(రామా V 10-37).*

ఒకతి వీణాదండం పట్టుకొని అలా పడిపోయింది. అది ఎలా ఉందంటే ఒక నదీవేగంలో తేలుతూ పోయే పద్మలతలా ఒకానొక పడవకు పోయి తగులు కొన్నట్టుందట. ఇలాగే ఎన్నో సుకుమారమ్మైన ఉపమ లున్నా యాఘట్టంలో.

ఒక్కొక్కప్పుడు మామూలుగా మనం దైనందిన వ్యవహారంలో చూచే వాటినే ఉపమానంగా చేసి వర్ణిస్తాడు కవి. ఒక్కసారి చెవిన బడగానే మనమాశ్చర్యచకితుల మై పోతాము. హనుమంతుడు రావణుడు పడుకొని ఉంటే దర్శించిన సందర్భాన్ని వర్ణిస్తూ 'మాషరాశి ప్రతీకాశమ్ – నిశ్వసంతం భుజంగవత్' (రామా V 10–28) మినుములు రాశిగా పోసినట్టుంది అతని విగ్రహ మని వర్ణిస్తాడు. వానరులు సముద్రం మీద సేతుబంధం చేసిన దృశ్యాన్ని వర్ణిస్తూ 'అశోభత మహాసేతు స్సీమంతఇవ సాగరే' (రామా VI 22–76).

ఈ తీరం నుంచి ఆ తీరానికి చక్కగా పొడుగ్గా నిర్మించిన ఆ వంతెన ఆడదాని సీమంతం, లేదా పాపటలాగా ఉందట. ఎలాంటి సహజ సుకుమారమ్మైన ఉపమలో చూడండి ఇవి.

ఒక్కొక్కప్పుడు ఆయన కల్పించే ఉపమలు చాలా వింతగా విచిత్రంగా ఉంటాయి. అవి కూడా భావుకుల మనసు నెంతో ఆకర్షిస్తాయి.

చంద్రోదయాన్ని వర్ణిస్తూ ఆయన రచించిన శ్లోకాలు మరవరాని మహానిధులు. ఒక్క శ్లోకం తిలకించండి.

*హంసో యథా రాజత పంజరస్థః సింహో యథా మందర కందరస్థః।*
*వీరో యథా గర్వితకుంజరస్థః చంద్రో విబభ్రాజ తథాంబరస్థః॥*

*(రామా V 5–4)*

చుట్టూ వెన్నెల ప్రవాహం మధ్యలో చంద్రబింబం ఎలాఉంది? ఒక వెండి పంజరంలో హంసలాగా ఉందట. అలాగే ఒకకొండ గుహలో పడుకొన్న సింహం లాగా ఉందట. నల్లని ఆకాశం మీద ఉన్నతంగా ప్రకాశించే ఆ చంద్రు

డొక పెద్ద ఏనుగు నెక్కి కూచున్న వీరయోధుడిలాగా ఉన్నాడట. ఇలాగే సీతాదేవి దీన స్వరూపాన్ని వర్ణిస్తూ కవి ఇలా అంటాడు.

*అవ్యక్త రేఖా మివ చంద్రరేఖామ్ పాంసు ప్రదిగ్ధా మివ హేమరేఖామ్ ।*
*క్షత ప్రరూఢా మివ బాణరేఖామ్ వాయు ప్రభిన్నా మివ మేఘరేఖామ్ ॥*
*(రామా V 5-26)*

మరుగు పడిన చంద్రబింబంమాదిరీ, దుమ్ముపడిన సువర్ణం మాదిరీ, కూరుకొని పోయిన బాణం మాదిరీ, గాలికి చెదరిన మేఘంమాదిరీ ఉందట. ఇది ఆమె శరీరస్థితిని వర్ణిస్తూ చెప్పిన ఉపమలు. వింటానికే ఎంతో అందంగా ఉన్నాయి. కొంచెం లోతుకు దిగి చూస్తే ఇంకా ఎంతో అందం కనిపిస్తుంది ఇందులో. మొదటిదామె ముఖానికి, రెండవ దామెశరీరయష్టికీ, మూడవ దామెచూపులకూ, నాలుగవ దామె కేశ పాశానికీ ఉపమలుగా కల్పించా డాకవి అని తోస్తుంది. అంతేకాదు. అవ్యక్త – ప్రదిగ్ధ – ప్రరూఢ – ప్రభిన్న – అనే మాటలుకూడా వాటికి తగినట్టే సార్థకంగా ప్రయోగించాడు. అవ్యక్తమంటే బయట పడకపోవటం. చంద్రబింబం బయటపడనిదే. ప్రదిగ్ధమంటే పూయటం. దుమ్ముచే పూయబడిందే హేమం. అలాగే గ్రుచ్చుకొన్న బాణమే కాబట్టి అది ప్రరూఢం. చెదరినదే కాబట్టి మేఘం ప్రభిన్నం. ఇలాంటి మనోహరమ్మైన శ్లోకాలెన్నో ఉన్నాయి పేర్కొనవలసినవి.

వాల్మీకిఉపమలలో ఇంకొక వైచిత్రి కూడా కనిపిస్తుంది. ఆయన అచేతనాలను చేతనాలతోనూ, చేతనాల నచేతనపదార్థాలతో పోల్చి వర్ణించగలడు. అది కూడా అతిలోకంగా చేయగలడు. ఈ విద్యలో కాళిదాసాదులు కూడా తీసికట్టే ఆయనకు. హనుమంతుడు సీతను చూచి కిష్కింధకు తిరుగు ప్రయాణం చేసే సందర్భంలో త్రికూట పర్వతాన్ని వర్ణించాడు వాల్మీకి. అలాంటి అద్భుతమ్మైన వర్ణన ఎక్కడా లేదు సాహిత్యంలో. కొన్ని శ్లోకా లుదాహరిస్తాను చూడండి.

*తుంగ పద్మక జుష్టాభి ర్నీలాభి ర్వనరాజిభిః ।*
*సోత్త రీయ మివాంభోధైః శృంగాంతర విలంబిభిః ॥*

*బోధ్యమాన మివ ప్రీత్యా దివాకరకరై శ్శుభైః*
*ఉన్మిషంత మివోద్భూతై ర్లోచనైరివ ధాతుభిః ॥*

*తోయౌఘ నిస్స్వనై ర్మంద్రైః ప్రాధీతమివ సర్వతః।*
*ప్రగీతమివ విస్పష్టై ర్నానా ప్రస్రవణ స్వనైః॥*

*దేవదారుభి రత్యుచ్చై రూర్ధ్వ బాహుమివ స్థితమ్।*
*ప్రపాతజల నిర్ఘోషైః ప్రాక్రుష్టమివ సర్వతః॥*

*వేపమాన మివ శ్యామైః కంపమానై శ్శరద్ఘనైః।*
*వేణుభి ర్మారుతోద్ధూతైః కూజంతమివ కీచకైః॥*

*మేఘపాదనిభైః పాదైః ప్రక్రాంతమివ సర్వతః।*
*జృంభమాణ మివాకాశే శిఖరై రభ్రమాలిభిః॥*

*(రామా V 56-56-10-15)*

నల్లని అడవులూ మేఘాలూ శిఖరాల మధ్య కమ్ముకొని ఉంటే పర్వతం తన పైన ఉత్తరీయం కప్పుకొన్నట్టుందట. సూర్యకిరణాలు దానిపైన పడుతుంటే దాన్ని నిద్రనుంచి మేల్కొల్పుతున్నట్టుందట. సిందూర గైరికాది ధాతువు లక్కడక్కడ వెలుగుతుంటే పర్వతం తెప్పలార్పక చూచు చున్నట్లున్నదట. గంభీరంగా వినవచ్చే ప్రవాహధ్వనులు చూస్తే పర్వతం అధ్యయనం చేస్తున్నదట. స్పష్టంగా వినవచ్చే సెలయేళ్ల నినాదాలు సంగీతం పాడుతున్నట్టుందట. నిటారుగా పెరిగిన దేవదారు వృక్షాలు చూస్తే పర్వతం చేతులు పైకెత్తినట్లుగా ఉందట. పై నుంచి పడే పెద్దపెద్ద జలపాతాల శబ్దాలు పర్వతం కేకలు పెడుతున్న మాది రుందట. పైన కదులుతూ పోయే తెల్లని కదలాడు మబ్బులు చూస్తే పర్వతం వణుకుతూ ఉందా అనిపిస్తుందట. గాలి లోపలికి పోయి శబ్దం చేసే వెదురు బొంగులతో పర్వతం కూయి

వెళుతున్నట్లుందట. చరియల మీదినుంచి మేఘాలు క్రిందికి వస్తుంటే ఆ కొండ ఎక్కడికో నడచిపోయేలాగానూ, చూపుమేర దాటిపోయిన శిఖరాలు చూస్తే అది నోరు తెరిచి అపులించేలాగానూ కనిపిస్తూ ఉందట. ఎంత బ్రహ్మాండమైన వర్ణనో చూడండి ఇది.

ఇంతకన్నా బ్రహ్మాండమైన దాయన చేతనాల నచేతనాలతో పోల్చి చెప్పటం. సీతాదేవి దీనదశ నెంత అద్భుతంగా వర్ణించి చెప్పాడో ఈ క్రింది శ్లోకాలు చూస్తే మీకే తెలుస్తుంది.

*అసంవృతాయా మాసీనాం ధరణ్యాం సంశితవ్రతామ్ ।*
*ఛిన్నాం ప్రపతితాం భూమౌ శాఖామివ వనస్పతేః ॥*
*పద్మినీ మివ విధ్వస్తామ్ హత శూరాం చమూమివ ।*
*ప్రభామివ తమోధ్వస్తా ముపక్షీణా మివాపగామ్ ॥*

*వేదీమివ పరామృష్టాం శాంతా మగ్ని శిఖామివ ।*
*పౌర్ణమాసీ మివ నిశామ్ రాహుగ్రస్తేందు మండలామ్ ।*
*పరయా మృజయా హీనాం కృష్ణపక్ష నిశా మివ ॥.*

*(రామా V 19-5,14,15,17)*

తీవ్ర వ్రతము పూని, ఆస్తరణలేని నేలపై కూర్చున్న సీత నేలమీద పడిపోయిన చెట్టుకొమ్మలాగా ఉంది. నలిగిన తామరతీగలాగా ఉంది. నాయకుణ్ణి కోల్పోయిన సైన్యంలాగా ఉంది. చీకట్లు కమ్మిన కాంతిలాగా ఉంది. వేసవిలో ఇంకిపోయిన తరంగిణి లాగా ఉంది. మలినమైన యజ్ఞవేది లాగా ఉంది. చల్లారిన అగ్నిజ్వాల లాగా ఉంది. రాహువు మ్రింగిన చంద్రబింబం గల పూర్ణిమానిశలాగా ఉంది. శరీర సంస్కారం లేక కృష్ణ పక్ష నిశలాగా ఉందట. ఎన్ని చక్కని ఉపమలో చూడండి ఇవి.

ఇవన్నీ అచేతనాలతో ఔపమ్యమే. అందులో కూడా మరొక క్రొత్త పోకడ పోతాడు వాల్మీకి. అది మరీ విలక్షణం అచేతనాలతోనేగాక అమూర్త మైన భావాలతో కూడా ఆయన ఔపమ్యం కల్పిస్తాడు.

*అభూతే నాపవాదేన కీర్తిం నిపతితామివ ।*
*ఆమ్నాయానా మయోగేన – విద్యాం ప్రశిథిలామివ ॥*

*సన్నామివ మహాకీర్తిం శ్రద్ధామివ విమానితామ్ ।*
*ప్రజ్ఞామివ పరిక్షీణా మాశాం ప్రతిహతామివ ॥*

*(రామా V 19–11,12)*

లేనిపోని అపవాదంతో ఒక మహాపురుషుడి పేరుపడిపోయిన ట్టుందట. వేద విద్యా సంస్కారం లేక శిథిలమై పోయిన లౌకిక విద్యలాగా ఉందట. మాసిపోయిన యశస్సులాగా ఉందట. నిర్లక్ష్యం చేసిన శ్రద్ధలాగా ఉందట. సడలిపోయిన మేధాశక్తి లాగా ఉందట. విఫలమైన ఆశలాగా ఉందట. ఏమి బ్రహ్మాండంగా ఉందో చూడండి ఈ వర్ణన. ఇలా ఎన్ని చిత్ర విచిత్రమైన పోకడలెన్నో చూడవచ్చు వాల్మీకిఉపమలలో.

ఉపమ తరువాత ఉత్ప్రేక్ష ఆయన కిష్టమైన అలంకారం. ఉత్ప్రేక్ష అని పేరేగాని అది కూడా ఉపమాభేదమే. అసలు ఉపమ అనేది ఒక్కటే శైలూషి (Actress) లాగా అనే కావతారా లెత్తుతూ పోయింది. అదే ఉత్ప్రేక్ష. అదే రూపకం. ఇంతకు ముందు పేర్కొన్న ఉపమలలోనే కొన్ని ఉత్ప్రేక్షలుకూడా దొర్లుతూ వచ్చాయి. సామాన్యమైనవి తలపెట్టక అతి విలక్షణమైనవి కొన్ని ఉదాహరిస్తాను. వాటిని బట్టి ఆయన ఉత్ప్రేక్షా నైపుణ్యా మెట్టిదో మన ముత్ప్రేక్షించవచ్చు.

*పిపాసురివ చాకాశమ్ దదృశే స మహాకపిః ।*

*(రామా 5–1–55)*

హనుమంతుడు తలపైకెత్తుకొని ఆకాశంలో సాగిపోతుంటే ఆకాశాన్ని మొత్తం త్రాగ బోతున్నాడా అని తోస్తుందట.

*ఊరు వేగోద్ధృతా వృక్షా ముహూర్తం కపి మన్వయుః ।*
*ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబంధుమివ బాంధవాః ॥*

*(రామా V 1–45)*

ఆయన ఊరు వేగంతో పెళ్లగిలిన వృక్షాలాయనను అనుసరించి పోతుంటే ఒక వ్యక్తిని సాగనంపటానికి కొంతదూరం వెంట వచ్చే బంధువుల లాగా ఉన్నాయట.

*సగంధస్తం మహాసత్త్వం బంధు ర్బంధు మివోత్తమమ్।*

*ఇత ఏహీ త్యువాచేవ........................ ॥ (V 9 - 20,21)*

వంటశాలలోనుంచి వచ్చే సుగంధ పూరిత మారుతం మారుతాత్మ జాడి నాసికా పుటంలో ప్రవేశించి నీకు కావలసిన పదార్థాలన్నీ ఇక్కడ ఉన్నాయి. ఈ ప్రక్కకు బయలుదేరి రమ్మని చుట్టాన్ని పిలిచినట్టుగా పిలుస్తున్నదట.

*దదర్శ చ నగా త్తస్మా న్నదీం నిపతితాం కపిః।*

*అంకాదివ సముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్॥*

*(V 14-29)*

అశోక వనంలో ఒక దృశ్యం. అది హనుమంతుడి కంట బడింది. అది ఒక కొండ. ఆ కొండపై సానువుల నుంచి క్రిందికి దూకుతున్న దొక సెలయేటు. అది ఎలా ఉందట? ప్రియుడి ఒడిలోనుంచి అతని మీది కోపంతో క్రిందికి జారిపోయే ప్రియురాలి లాగా ఉంది. ఇలాగే మరొక దృశ్యం.

*జలే నిపతితా గ్రైశ్చ పాదపై రుపశోభితామ్।*

*వార్యమాణామివ క్రుద్ధాం ప్రమదాం ప్రియబంధుభిః॥*

*(V 14-30)*

నీటి మీదికి కొమ్మలన్నీ వాలి ఉన్న ఒక చెట్టు. అది ఎలా ఉంది? ఎవతో తన మగనితో తగవులాడి వాడితో సరిపడక నీళ్లలో దూక బోతుంటే దాని చుట్టాలంతా పట్టి వెనుకకు లాగుతూ ఉన్న ట్టుందట.

ఇక లంకపై దండెత్తుసందర్భంలో సముద్రాన్ని వర్ణిస్తున్నాడు చూడండి మహర్షి

*హసంతమివ ఫేనౌఘైః నృత్యంతమివ చోర్మిభిః।*
*పినష్టీవ తరంగాగ్రైః సముద్రః ఫేనచందనమ్।*
*తదాదాయ కరై రిందు ర్లింపతీవ దిగంగనాః॥*

*(VI 4-110,111)*

తెల్లని నురుగు గుట్టగా పడి ఉంటే సముద్రం పెద్దపెట్టున నవ్వుతున్నట్టుందట. పైకీ క్రిందికీ పడుతూ లేచే తరంగాలు చూస్తే నృత్యం చేస్తున్నట్టుందట. ముందుకు దూసుకు వచ్చే తరంగాలనే చేతులతో నురువనే గంధం తీస్తున్నదట. ఆ గంధం తన కిరణ హస్తాలతో అందుకొని జాబిల్లి మరలా దిక్కులనే అంగనల ముఖాల నలదుతూ ఉన్నాడట. ఏమిటీ భావనా వైభవం. మరొక చోట అయితే అసలు దాన్నే వర్ణిస్తూ "ముక్తాహార మివోర్మిభిః" అంటాడు వాల్మీకి. అంటే పై నుంచి తరంగాలు పుంఖాను పుంఖంగా ఒడ్డుకు దూసుకొని వస్తున్నాయి. అవి ఫేనిలంగా ఉన్నాయి. అలా కనిపించే ఆ తరంగాలు వరుసగా సముద్రుడు మెడలో వేసుకొనే తెల్లనిముత్యాల పేర్లలాగా ప్రకాశిస్తున్నాయట.

ఉత్ప్రేక్ష తరువాత రూపకమనేది చాలా ఇష్టం వాల్మీకికి. ఎన్నో రూపకాలు అక్కడక్కడ ఎంతో అందంగా ప్రయోగించాడు. అయోధ్యా పట్టణాన్ని వర్ణించే సందర్భంలోనే -

"*యంత్రాగారస్తనీ మృద్ధాం కోష్ఠాగారవతంసకామ్*".

*(V 3-18)*

యంత్రాగారాలనే స్తనాలతోనూ ధాన్యాగారాలనే కర్ణాభరణాల తోనూ అందంగా ఉందంటాడు. కిష్కింధలో వర్షాది ఋతువులను వర్ణిస్తూ ఇలాంటి అలంకారా లెన్ని వాడాడో లెక్కలేదు. కొన్ని భావాలు గమనించండి.

*మేఘ కృష్ణాజినధరా ధారాయజ్ఞోపవీతినః।*
*మారుతాపూరిత గుహాః ప్రాధీతా ఇవ పర్వతాః॥*

నల్లని మేఘాలనే కృష్ణాజినాలు కప్పు కొన్నా యట. సెలయేటిధార లనే తెల్లని యజ్ఞోపవీతాలు ధరించాయట. గాలితో మాటిమాటికీ గుహా

ముఖాలు నిండుతున్నాయి. ఏమి టిదంతా? పర్వతా లనే బ్రహ్మచారులు వేదాధ్యయనం చేస్తున్నారు; మ రేమీ కాదంటాడు కవి.

*శక్య మంబర మారుహ్య మేఘసోపాన పంక్తిభిః।*

*(IV 28-4)*

మేఘాలనే మెట్ల మీదుగా ఆకాశాని కెక్కిపోవచ్చునట.

*మందమారుత నిశ్శ్వాసం సంధ్యా చందన రంజితమ్।*
*స్నిగ్ధై రభ్ర పటచ్ఛేదైః బద్ధవ్రణ మివాంబరమ్॥ (IV 28-6)*

మందమారుత మనే నిట్టూర్పు విడుస్తూ సంధ్యారాగ మనే చందనం పూసుకొని, మెత్తని మబ్బుతునక లనే గుడ్డపేలికలు కట్టుకొన్న ఒక క్షతగాత్రుడిలాగా ఉందట అంబరం.

అశోకవనంలో సీతాదేవిని వర్ణిస్తూ ఇలా అంటాడు-

*"సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః।*
*సంకల్ప హయ సంయుక్తై ర్యాంతీమివ మనోరథైః॥ (V 19-7)*

సంకల్పాలనే గుఱ్ఱాలు కట్టిన మనోరథాలతో అనుక్షణమూ రాముని దగ్గరకు ప్రయాణం చేస్తూనే ఉందట ఆవిడ. ఇక్కడ మనోరథశబ్దం ఎంత అందంగా వాడాడో చూడండి మహాకవి. రావణాంతఃపురంలో ఒకరి ప్రక్కన ఒకరు చేతులు చాచుకొని పడుకొన్న స్త్రీలను వర్ణిస్తూ -

*ఏకీకృతభుజా స్సర్వే స్సుషువు స్తత్ర యోషితః।*
*అన్యోన్య భుజ సూత్రేణ స్త్రీమాలా గ్రథితా హి సా!॥*

*(V 9-62,63)*

బాహువులనే దారాలతో కట్టిన పొడగాటి స్త్రీమాల అంటాడు. ఇలాంటి అందమైన కల్పన లెన్నో వంద లున్నాయి.

ఇక అతిశయోక్తిఅలంకారమైతే చెప్పనక్కరలేదు. చాలా మనోహ రంగా కల్పిస్తాడు వాల్మీకి. 'మహీ పాస్యతి శోణితమ్' - నేల నెత్తురు త్రాగు తుంది. ఖరదూషణాదుల నెదుర్కొంటూ రాము డనే మాట ఇది. ఇలాగే సీత రావణుణ్ణి అధిక్షేపిస్తూ ఇలా అంటుంది

*మందరం పర్వతశ్రేష్ఠం పాణినా హర్తు మిచ్ఛసి।*
*కాలకూటం విషం పీత్వా స్వస్తిమాన్ గంతు మిచ్ఛసి॥*

*అక్షి సూచ్యా ప్రమృజసి జిహ్వయా లేక్షి చ క్షురమ్।*
*రాఘవస్య ప్రియాం భార్యాం యోఽధి గంతుం త్వ మిచ్ఛసి॥*
*(III 47-40,41)*

నీవు రాముడిప్రియురాలినే అపహరించాలని చూస్తున్నావు. అంటే మందర పర్వతాన్నే చేతులతో హరించు దామని భావిస్తున్నావు. కాలకూట విషం త్రావి క్షేమంగా వెళ్లుదా మనుకొంటున్నావు. కండ్లు సూదితో పొడుచుకొంటున్నావు. మంగలి కత్తి నాలుకతో నాకుతున్నావు.

ఇందులో కొన్ని దృష్టాంతానికీ, నిదర్శనానికీ, పర్యాయోక్తానికీకూడా సరిపోవచ్చు. వాల్మీకి ఇదీ అదీ అని లేదు. ఏ అలంకారమైనా వాడగలడు. ఎంత సుందరంగానైనా చెప్పగలడు.

*సేవమానే దృఢం సూర్యే దిశ మంతకసేవితే।*
*విహీనతిలకేవ స్త్రీ నోత్తరా దిక్ప్రకాశతే॥*

సూర్యుడు దక్షిణాయనంలో దక్షిణ దిక్కునే ఆశ్రయించే సరికి తిలకం లేని స్త్రీముఖం లాగా ఉత్తరదిక్కు ప్రకాశం కోలుపోయిందట.

*"రవి సంక్రాంత సౌభాగ్య స్తుషారావృతమండలః।*
*నిశ్శ్వాసాంధ ఇవాదర్శ శ్చంద్రమా న ప్రకాశతే॥*
*(III 16-13)*

హేమంతంలో తన సౌభాగ్యమంతా సూర్యుడు హరింపగా మంచుతో మరుగుపడి నిట్టూర్పుగాలికి బూజు పట్టినట్లుగా కనిపించే అద్దంలాగా అయ్యాడట చంద్రుడు.

*దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః।*
*నవసంగమసవ్రీడా జఘనా నీవ యోషితః॥ (IV 30-58)*

శరత్కాలంలో నదులన్నీ ఇంకిపోయి లోపలి ఇసుక దిబ్బలు మెలమెల్లగా బయట పడుతుంటే క్రొత్తగా కాపురానికి వచ్చిన యువతులు నవసమాగమంలో సిగ్గుతో కొద్ది కొద్దిగా తమ జఘన సౌందర్యాన్ని కాంతులకు చూపుతున్నట్లుగా ఉందట.

*చంచచ్చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా।*
*అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరమ్॥* (IV 30-45)

సాయంకాలసౌభాగ్యలక్ష్మిని వర్ణిస్తున్నాడు కవి. అప్పుడే చంద్రోదయ మవుతున్నది. తారక లక్కడక్కడా పొడ చూపుతున్నాయి. సంధ్యారాగం మెల్లిగా ఆకాశరంగం నుంచి జారిపోతూంది. ఇదీ కవి చెప్పదల చిన భావం. ప్రస్తుతమైన ఈ భావం ద్వారా ఒక అప్రస్తుతమైన వ్యవహారాన్ని ఎలా సూచిస్తున్నాడో చూడండి మహాకవి. చంద్రుడనే వా డొక కాముకుడు. వాడు కరస్పర్శ చేశాడో లేదో, అంతకన్నా కామిని అయిన సంధ్యాదేవి తారకలు కంటిపాపలు హర్షంతో వికసించాయి. అది రాగవతి (ఎఱుపనీ - అనురాగమనీ) గనుక వెంటనే అంబరాన్ని కూడా వదలి వేసిందట. అంబరమంటే ఆకాశమనే గాక కట్టుకొన్న బట్ట అని కూడా అర్థమే. చూడండి ఈ సమాసోక్త్యలంకారం శృంగారానికి పరాకాష్ఠగా ఎలా భాసిస్తున్నదో!

*రాత్రి శ్శశాంకోదిత సౌమ్యవక్త్రా।*
*తారాగణోన్మీలిత చారునేత్రా।*
*జ్యోత్స్నాంశుక ప్రావరణా విభాతి॥* (IV 30-46)

శరద్రాత్రిని వర్ణిస్తున్నాడు కవి. చంద్రమండలమే వదన మట దానికి. నక్షత్ర గణమే నేత్రాలట. సర్వత్రా వ్యాపించిన వెన్నెలే దుకూలమట.

ఇలా ఉపమోత్ప్రేక్షలు వాడినా, సమాసోక్త్యాదులు వాడినా, దీపకాదులు వాడినా శ్లేషలు వాడినా ఎంతో చక్కగా వాడుతాడు మహర్షి.

'సుగ్రీవస్య నదీనాం చ ప్రసాదమను పాలయన్' - సుగ్రీవుడి ప్రసాదమూ, నదీ ప్రసాదమూ రెండూ ప్రతీక్షించ వలసిందేనట. ప్రసాదమంటే అనుగ్రహమని ఒకటీ, నైర్మల్యమనీ ఒకటీ - రెండర్థాలు.

ఈ అలంకారాల మాట అలా ఉంచి ఇక స్వభావోక్తిని ప్రయోగించా డంటే వాల్మీకి అది అనితర సాధారణం; అప్రయత్నసాధ్యం. దానికి కావ్యమంతా ఉదాహరణమే. కొట్టవచ్చినట్టుగా కనిపించే కొన్ని స్వభావోక్తులు దాహరిస్తాను, చూడండి. హనుమంతుడు మందోదరిని చూచి నిజంగానే సీతే ననుకొని ఎగిరి గంతులు వేస్తాడు. అప్పటి ఆయన వానర చేష్టలు చూడండి కవి ఎలా వర్ణిస్తాడో –

*ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం।*
*ననంద చిక్రీడ జగౌ జగామ ॥*
*స్తంభా నరోహ న్నిపపాత భూమౌ।*
*నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్ ॥ (V 10-54)*

తోక నేలకేసి కొట్టాడట. దాన్ని తీసి ముద్దు పెట్టుకొన్నాడట. ఆనందించాడట, ఆడాడట, పాడాడట. ప్రక్కనున్న స్తంభాలమీదికి ప్రాకి పోయాడట. వెంటనే (పెద్ద మూటలాగా ) పైనుంచి క్రింద పడ్డాడట. ఏమిటీ చేష్టలన్నీ, ఇవే వానర చేష్టలంటాడు వాల్మీకి.

మధువనంలో హనుమంతుడితో కూడా వానరులంతా కలిసి చేసిన చేష్టలు చూస్తే ఇంకా ఎంత స్వాభావికంగా వర్ణించాడో చెప్పటానికి లేదు.

*గాయంతి కేచి త్ప్రణమంతి కేచిత్।*
*నృత్యంతి కేచిత్ప్ర హసంతి కేచిత్॥*
*పతంతి కేచి ద్విచరంతి కేచిత్।*
*ప్లవంతి కేచి త్ప్రలపంతి కేచిత్॥ (V 61-14)*

కొందరు పాటలు పాడుతున్నారు. కొందరు నేల మీదికి తలక్రిందులుగా వంగిరి. కొందరాడుతున్నారు. కొందరు నవ్వుతున్నారు. కొందరు పడుచున్నారు, కొందరు తిరుగుతున్నారు. కొందరెగురుతున్నారు. కొందరు వ్యర్థాలాపము చేయుచున్నారు.

*పరస్పరం కేచి దుపాశ్రయంతే।*
*పరస్పరం కేచి దుపాక్రమంతే॥*

*పరస్పరం కేచి దుపఖ్రువంతే।*
*పరస్పరం కేచి దుపారమంతే॥* (V 61-15)

ఒకరి దగ్గరి కొకరు చేరుతున్నారు. ఒకరిచో టొకరు ఆక్రమిస్తు న్నారు. ఒకరితో ఒకరు మంతనా లాడుతున్నారు. ఒకరితో నొకరు క్రీడించుచున్నారు.

*ద్రుమా ద్ద్రుమం కేచి దభిద్రవంతే।*
*క్షితౌ నగాగ్రా న్నిపతంతి కేచిత్॥*
*మహీతలా త్కేచి దుదీర్ణ వేగా।*
*మహాద్రుమాగ్రా ణ్యభిసంపతంతి॥* (V 61-16)

ఒక చెట్టు మీదినుంచి మరొక చెట్టు మీదికి దూకుతున్నారు కొందరు. చెట్లపయి నుంచి క్రిందికి వచ్చి పడుతున్నారు కొందరు. నేల మీది నుంచి బాగా ఊపు తెచ్చుకొని ఒక్కసారిగా పెద్ద చెట్ల మీది కెగిరి పోతున్నారు కొందరు.

*గాయంత మన్యః ప్రహస న్నుపైతి।*
*హసంత మన్యః ప్రరుదన్ను పైతి॥*
*రుదంత మన్యః ప్రణద న్ను పైతి।*
*నదంత మన్యః ప్రణుదన్ను పైతి॥* (V 61-17)

ఒకడు పాడుతుంటే మరొకడు నవ్వుతూ దగ్గరి కొస్తున్నాడు. ఒకడు నవ్వుతుంటే మరొక డేడుస్తూ సమీపిస్తున్నాడు. ఒక డేడుస్తుంటే మరొక డరుస్తూ చేరుతున్నాడు. వాడ రుస్తుంటే వేరొకడు వాణ్ణి వెనుకకు తోస్తున్నాడు. ఎంత సహజంగా ఉన్నాయో చూడండీవర్ణనలు.

యుద్ధకాండలో కుంభకర్ణుని రాక్షసులు నిద్రలేపే ఘట్టం ఎంత అద్భుతంగా వర్ణించాడో చూడండి.

*తద్రక్షో బోధ యిష్యంతః చక్రు రన్యే పరాక్రమమ్।*
*అన్యే భేరీ స్సమాజఘ్ను రన్యే చక్రు ర్మహా స్వనమ్॥*

*కేశా నన్యే ప్రలులుపుః కరా వన్యే దశంతి చ।*
*ఉద కుంభ శతా న్యన్యే సమసించంత కర్ణయోః॥*

*న కుంభకర్ణః పస్పందే – మహానిద్రావశం గతః।*
*మూర్ధ్ని వక్షసి గాత్రేషు పాతయన్ కూట ముద్గరాన్॥*

*రజ్జు బంధన బద్ధాభిః శతఘ్నీభిశ్చ సర్వతః।*
*వధ్యమానో మహాకాయో న ప్రాబుధ్యత రాక్షసః।*
*వారణానాం సహస్రం తు శరీరేఽ__స్య ప్రధావితమ్॥*

(VI 60-50-56)

అతణ్ణి లేపటానికి కొందరు వచ్చి నెత్తిన పడ్డారు. కొందరు దుందుభులు ప్రయోగించారు. కొందరు పెద్ద పెద్ద కేకలు పెట్టారు. మరికొందరు అతడి తల వెంట్రుకలు పట్టి పీకారు. కొందరు కరిచారు. కొన్ని వందల కడవలతో నీళ్లు తెచ్చి దొప్పల వంటి అతడి చెవులలో పోశారు. అయినా అతడు కదలలేదు, మెదలలేదు. రాక్షసులు మరలా రెచ్చిపోయి వాడి నెత్తి మీదా రొమ్ము మీదా మిగతా అవయవాల మీదా పోత పోసిన ఇనపగుదియలు వేసి కొట్టారు. గొలుసులు కట్టిన మరఫిరంగులు తెచ్చి పేల్చారు. అయినా వాడు లేవలేదు. చివరకు కొన్నివేల ఏనుగులను అతడి శరీరం మీదికి తోలారు. ఆ స్పర్శ కిటూ అటూ పొర్లాడట వాడు. ఏమిటీ అద్భుతమైన వర్ణన. ఎంత కండ్లకు కట్టినట్టు వర్ణిస్తున్నాడో చూడండి కవి. ఏది వర్ణించినా ఇంతే. కిష్కంధలో వాలివధానంతరం ఆయనను సంస్కరించిన సందర్భాన్ని చూడండి ఎంత గంభీరంగా వర్ణిస్తాడో.

*ఆదాయ శిబికాంతారః స తు పర్యాపత త్త్వరః।*
*సునియుక్తాం విశాలాంచ సుకృతాం విశ్వకర్మణా॥*

*దారు పర్వత కోపేతాం చారు కర్మ పరిష్కృతామ్।*
*పుష్పై స్సమ భిచ్ఛన్నాం పద్మమాలాభి రేవ చ॥*

తతో వాలిన ముద్యమ్య సుగ్రీవ శ్శిబికాం తదా।
ఆరోపయత విక్రోశ న్నంగదేన సహైవతు॥

విశ్రాణయంతో రత్నాని వివిధాని బహూన్యపి।
అగ్రతః ప్లవగా యాంతి శిబికా సమనంతరమ్॥

అంగదం పరిగృహ్యాఽఽ__ఽ__శు తారప్రభృతయ స్తదా।
క్రోశంతః ప్రయయు స్సర్వే వానరా హతభాంధవాః॥

తారాప్రభృతయ స్సర్వాః వానర్యో హత యూథపాః।
అనుజగ్ము ర్హి భర్తారం క్రోశంత్యః కరుణస్వనాః॥

పులినే గిరి నద్యాస్తు వివిక్తే జలసంవృతే।
చితాం చక్రు స్సుబహవో వానరా శ్శోకకర్శితాః॥

అవరోప్య తతః స్కంధా చ్ఛిబికాం వహనోచితాః।
తస్థు రేకాంత మాశ్రిత్య సర్వే శోక సమన్వితాః॥

తత స్తారా పతిం దృష్ట్వా – శిబికాతల శాయినమ్।
ఆరోప్యాంకే శిర స్తస్య విలలాప సుదుః ఖితా॥

ఏవం విలపతీం తారాం పతిశోకపరిప్లుతామ్।
ఉత్థాపయంతి స్మ తదా వానర్యః శోకకర్శితాః॥

సుగ్రీవేణ తదా సార్థ మంగదః పితరం రుదన్।
చితా మారోప యామాస శోకేనాభి హతేంద్రియః

*తతోఽ_గ్నిం విధివ ద్దత్వా - సోపసవ్యం చకార హ।*
*సంస్కృత్య వాలినం తే తు విధి పూర్వం ప్లవంగమాః॥*
*ఆజగ్ము రుదకం కర్తుం నదీం శీతజలాం శివామ్॥*

*(IV 25-21 to 51)*

విశ్వకర్మ తయారు చేసిన మంచి శిబిక నొకటి తారుడు తెచ్చి ముందు పెట్టాడు. మంచి నగిషీ చేసిన శిబిక అది. దానినంతా పూలతో నింపారు. దండలు వ్రేల గట్టారు. అప్పుడు సుగ్రీవుడు వాలి కళేబరాన్ని ఎత్తి ఏడుస్తూ లోపల ఉంచాడు. రత్నాలూ వజ్రాలూ చల్లుకొంటూ వానరులు ముందు నడుస్తున్నారు. వారి వెనుకనే కొందరు వానరులు శిబిక మోసుకొని పోతున్నారు. తారుడు మొదలైన భృత్యులంతా అంగద కుమారుణ్ణి పొదివి పట్టుకొని శోకంతో వెళ్ళుతున్నారు. తార మొదలైన అంతః పురాంగనలంతా అతి దీనంగా విలపిస్తూ వెంటబడి పోతున్నారు. క్రమంగా అందరూ నదీతీరానికి వెళ్లి అక్కడ ఒక పెద్దచితి పేర్చారు. వాహకులు శిబిక తమ భుజము మీది నుంచి మెల్లగా క్రిందికి దించారు. వెంటనే తార పట్టలేక భర్త శిరస్సు తన ఒడిలోకి తీసుకొని బిగ్గరగా ఏడవసాగింది. ఆమె ఏడుపు మాన్పుతూ అక్కడి స్త్రీలంతా ఆమెను దూరంగా తీసుకెళ్లారు. ఇంతలో అంగదుడు పినతండ్రిసహాయంతో ఏడుస్తూ తండ్రిశరీరాన్ని చితిమీది కెక్కించాడు. నిప్పు ముట్టించి దాని కపసవ్యంగా ప్రదక్షిణం చేశాడు. అందరూ విధ్యుక్తంగా ఆ వానరోత్తముడికి సంస్కారం చేసి అనంతరం తర్పణం చేయటానికి నదీ తీరం సమీపించారు. హృదయ విదారకమైన ఈ దృశ్యాన్ని చిలువలు పలువలుగా వర్ణించటంమూలాన ఆ దృశ్యమెంత గంభీరంగా మనకండ్లయెదుట సాక్షాత్కరిస్తున్నదో చూడండి.

రావణుడు సభాభవనానికి వెళ్లటమూ, అక్కడ సభచేయటమూ, రాక్షసులంతా వచ్చి యుండడమూ, వారితో అతడు సంభాషించటమూ ఒక మరవరాని సన్నివేశం. ఇది ఈనాటి పార్లమెంటు సమావేశాల వైభవాన్ని అడుగడుగునా జ్ఞాపకానికి తెస్తుంది.

"త మాస్థాయ రథశ్రేష్ఠం మహామేఘ సమస్వనమ్(VI 11-4)

ప్రయయౌ రాక్షస శ్రేష్ఠో దశ గ్రీవ స్సభాం ప్రతి।
అసిచర్మధరా యోధా స్సర్వాయుధ ధరా స్తథా॥

రాక్షసా రాక్షసేంద్రస్య పురస్తా త్సంప్రతస్థిరే।
నానా వికృత వేషాశ్చ నానా భరణభూషితాః॥

పార్శ్వతః పృష్ఠత శ్చైనం పరివార్య యయు స్తదా।
తత స్తూర్యసహస్రాణాం సంజజ్ఞే నిస్స్వనో మహాన్॥

తుములః శంఖ శబ్దశ్చ సభాం గచ్ఛతి రావణే।
విమలం చాతపత్రాణం ప్రగృహీత మశోభత॥

పాండరం రాక్షసేంద్రస్య పూర్ణ స్తారాధిపో యథా।
హేమమంజరిగర్భే చ శుద్ధస్ఫాటికవిగ్రహే॥

చామర వ్యజనే చాస్య - రేజతు స్సవ్యదక్షిణే।
తే కృతాంజలయస్సర్వే రథస్థం పృథివీ స్థితాః॥

రాక్షసా రాక్షస శ్రేష్ఠ శిరోభిస్తం వవందిరే।
రాక్షసైః స్తూయమాన స్సన్ జయాశీర్భిరరిం దమః॥

ఆససాద మహాతేజాస్సభాం సువిహితాం శుభామ్।
తస్యాం తు వైదూర్యమయం ప్రియకాజిన సంవృతమ్॥

*మహ త్సోపాశ్రయం భేజే రావణః పరమాసనమ్।*
*తత శ్శశాసే శ్వరవత్ .....................॥*
*రాక్షసా స్తద్వచః శ్రుత్వా లంకాయాం పరిచక్రముః।*
*అను గేహ మవస్థాయ విహార శయనేషు చ॥*

*ఉద్యానేషు చ రక్షాంసి చోదయంతః .............।*
*తే రథాన్ రుచిరా నేకే దృప్తా నేకే పృథగ్గయాన్॥*

*నాగా నన్యేఽధి రురుహుః - జగ్ముశ్చైకే పదాతయః*
*తే వాహనా న్యవస్థాప్య యానాని వివిధాని చ॥*

*సభాం పద్భిః ప్రవివిశుః - సింహో గిరిగుహా మివ।*
*రాజ్ఞః పాదౌ గృహీత్వా తు రాజ్ఞా తే ప్రతిపూజితాః।*
*పీఠే ష్వన్యే బ్రుసీ ష్వన్యే భూమౌ కేచి దుపావిశన్॥*

*(VI 11-4 to 24)*

ఒక గొప్ప రథంలో కూచొని అది మేఘం మాదిరి ధ్వని చేస్తుంటే వెళ్లాడట రావణుడు. అతని ముందు ఖడ్గచర్మధరులై కొందరు రాక్షసులు బయలుదేరారు. నానా వికృతాకారాలతో మరికొంత మంది వెనకా ప్రక్కలా నడుస్తున్నారు. ఇంతలో తూర్యాలూ, కాహళాలూ, శంఖాలూ మ్రోగసాగాయి. అతని తలమీద చంద్ర మండలం లాంటి తెల్లని ఛత్రం వెలుగుతూ ఉంది. ఇరువైపులా స్ఫటిక స్వచ్ఛమైన వింజామరలు వీస్తున్నారు.

అందరూ ఎదురుగా వచ్చి రథా రూఢుడైన ప్రభువుకు నేల మీది నుంచే శిరస్సులు వంచి నమస్కరించారు. రాక్షసులంతా జయజయ ధ్వానాలు చేస్తుంటే సభాభవనం ప్రవేశించాడు రావణుడు. పెద్ద గుండ్రమైన దిండ్లతోగూడిన మృగా జినాసనం అలంకరించాడు.

వెంటనే అక్కడ ఉన్న రాక్షసులను శాసించగానే వారంతా శరవేగంతో పోయి ప్రతి ఇంటా నిలిచి ఎక్కడెక్కడ ఉండే రాక్షస వీరులను తరుముకొని తెచ్చారు. రథాలలో కొందరూ, అశ్వాలపై కొందరూ, గజాల మీద కొందరూ, పాదచారులై కొందరూ బయలుదేరారు. వాహనాలూ యానాలూ అన్నీ వెలపలనే నిలిపి సింహాలు పర్వతగుహాలో ప్రవేశించినట్లు అందరూ వరుసగా సభాగృహంలో ప్రవేశించారు. రాజుగారి పాదాల కభివందనం చేసి కొందరు పీఠముల మీద, కొందరు మడుగు ఆసనముల మీద, మరి కొందరు నేలమీద యథోచితంగా ఆసీనులయ్యారు.

సభా ప్రవేశమే చూడండి ఎంత హుందాగా వర్ణించాడో. ఇక ఆ తరువాత రావణుడు సభాసదులతో చేసిన ప్రసంగం వింటే ఈ రోజుల్లో రాష్ట్రపాలకులుకూడా కష్టపడి నేర్చుకోవలసిన మాదిరి వర్ణించాడు వాల్మీకి. ఇదంతా స్వభావోక్తి క్రిందికే వస్తుంది. ఔపమ్య కల్పన లేకుండా ఒక సన్నివేశాన్ని కండ్లకు కట్టినట్లు మనోహరంగా వర్ణించటమంతా స్వభావోక్తే గదా. ఈ విధంగా చూస్తూపోతే రామాయణంలో ఉన్నన్ని వర్ణనలు ఎక్కడా లేవు. మానవ ప్రకృతి నెంత వర్ణించాడో బాహ్య ప్రకృతినీ అంత వర్ణించాడు. పట్టణాలు వర్ణించాడు. పర్వతాలను వర్ణించాడు. సముద్రాన్ని వర్ణించాడు. అరణ్యాలను వర్ణించాడు. ఆకాశాన్ని వర్ణించాడు. సూర్యోదయం చంద్రోదయాలు వర్ణించాడు. అస్తమయం వర్ణించాడు. వసంతాదులైన షడృతువులనూ వర్ణించాడు. పగలు వర్ణించాడు. రాత్రి వర్ణించాడు. యజ్ఞాలు వర్ణించాడు. తపస్సులు వర్ణించాడు. సభలూ సమావేశాలూ వర్ణించాడు. యుద్ధాలు వర్ణించాడు. చావులు వర్ణించాడు. బ్రతుకులు వర్ణించాడు. అలాగే నరవానర యక్షరాక్షస దేవతాదుల చేష్టలన్నీ వర్ణించాడు. ఆయన వర్ణించని విషయమంటూ కానరాదు. సృష్టినంతా గాలించిన విశ్వతో ముఖమైన దృష్టి అది. భోజరాజు చెప్పినట్టు 'ప్రేక్ష్య దృష్ట్యా ప్రతీచ్యా' - ప్రత్యగ్దృష్టితో (Inner vision) దర్శించిన మహర్షి ఆయన. ఇక వర్ణనా దారిద్ర్యమేముంది? ఏది ఎలాగైనా వర్ణించగలడు. అక్షరం దగ్గరి నుంచి అఖండ భావం వరకూ అంతా సుందరమే.

అయితే ఇందులో ఒక రహస్యముంది. కేవల సౌందర్యమూ వైవిధ్యమే కాదు వర్ణనలో, ఎంత సౌందర్యమో అంతకు మించిన ఔచిత్యం కూడా పాటిస్తాడా మహర్షి. అనన్య సామాన్యమైన ఆయనసామర్థ్యాని కది కూడా ఒక గీటురాయి. రామాయణ కథ. సాగినంతదూరం వర్ణనా సాగుతూనే పోతుంది. కథ అనుకొంటే కథ వర్ణన, అనుకొంటే వర్ణన అది. అంత అవినాభావంగా పెనవేసుకొని ఉంటాయి. రెండూ అలా వేసుకోపటంలో రెండు తీర్లు కనిపిస్తాయి. ఒకటి రెండు సన్నివేశాలను కలుపుతూ వంతెనలాగా పనిచేసే వర్ణన. మరొకటి, ఆ సన్నివేశంలోనే కలిసిపోయి దానితో పాటే నడిచే వర్ణన. మొదటిది విడిగా ఉండి వర్ణన అనిపిస్తుంది. రెండవది అలా అనిపించదు. కాని రెండూ కథా భాగాని కుపకరించేవే గాని దానిని విడిచిపుచ్చి తమ పాటికి తాము వీర విహారం చేసేవి కావు. అలా చేస్తే అది అనౌచిత్యం క్రిందికి వస్తుంది.

'అనౌచిత్యా దృతే నాన్య ద్రస భంగస్య కారణ,' మన్నాడు ఆనంద వర్ధనాచార్యుడు. మరి వారు 'సిద్ధరస' మని స్తుతించారు రామాయణాన్ని. ఔచిత్య శిఖరాగ్రాన్ని అందుకొంటేనే గదా అలా అనగలిగారు. కాబట్టి రామాయణంలో ఎక్కడ ఏ వర్ణన చేసినా మహర్షి అది కేవలం వినోదార్థంగా చేసింది కాదు. ఎంతో గొప్ప ప్రయోజన ముంటుంది దానికి. అప్పుడే కథానిర్మాణ శిల్పంలో ఒక జిగిబిగి యేర్పడేది. ఈ దృష్టితో ప్రస్తుతం రామాయణ వర్ణనలు పరిశీలిద్దాము.

దశరథుడు యజ్ఞం చేసిన సందర్భాన్ని వర్ణించాడు వాల్మీకి. తరువాత అయోధ్యలో పట్టాభిషేక సన్నాహాలను వర్ణించాడు. భరతుడు వచ్చిన తరువాత ఆయన వశిష్ఠాదులతో చేసిన ప్రసంగం వర్ణించాడు. అరాజక దశను వర్ణిస్తూ భరతుడెన్నో శపథాలు చేస్తాడు. అరణ్యానికి వెళ్లుతుంటే మార్గమధ్యంలో భరద్వాజుడు విందు చేస్తాడు. ఆ మహోత్సవాన్ని ఎంతో అద్భుతంగా వర్ణించాడు వాల్మీకి. ఇదంతా ఆయా సందర్భాలకూ పాత్రలకూ ఉదాత్తతను చేకూర్చే వర్ణనలే. శూర్పణఖ రాముణ్ణి సమీపించేటపుడిలా వర్ణిస్తాడు కవి.

*సుముఖం దుర్ముఖీరామం వృత్తమధ్యం మహోదరీ।*
*విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్ర మూర్ధజా॥*

*(III 17-10)*

*ప్రీతిరూపం విరూపా సా - సుస్వరం భైరవ స్వరా।*
*తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ॥*

*న్యాయ వృత్తం సుదుర్వృత్తా ప్రియ మప్రియ దర్శనా।*
*శరీరజ సమావిష్టా రాక్షసీ వాక్య మబ్రవీత్॥*

*(III 17-10, 11, 12)*

పరస్పర విరుద్ధ లక్షణా లిద్దరిలో వర్ణించటం వల్ల వారిద్దరికీ పొత్తు కలవ దనీ, శూర్పణఖ వ్యర్థ ప్రయత్నం చేస్తున్న దనీ, చివరకు ముక్కూ చెవులూ కోయించుకొని అప్రియ దర్శనగానే తయారవుతుందనీ కథతో మేళవించి కవి ఎలా వర్ణిస్తున్నాడో చూడండి.

మరొక ఉదాహరణ ఇస్తాను. యుద్ధకాండలో రావణుడు పడిపోయిన తరువాత మండోదరి వచ్చి అతని శవం మీద పడి విలపిస్తుంది. ఆ విలాపాన్ని వర్ణించాడు వాల్మీకి. అది భంగ్యంతరంగా మండోదరీ శీలాన్నంతా స్పష్టపరుస్తుంది. ఆమె ఎంత వివేకవంతురాలో తెలుస్తుంది. రామాయణంలో ఏ ఒక్కచోటనో ఒకటి రెండు మాటల్లో తప్ప మరెక్కడా ఏ మాటా మాటాడినట్టు లేదావిడ. కడసారి ఈ ఘట్టంలోనే ఆవిడ ముక్తకంఠం మనకు వినిపిస్తుంది. ఆమె అనే ప్రతిమాటా ఎంతో గొప్ప మాట. భర్త మహత్త్వాన్ని మెచ్చుకొంటూనే అతని దౌర్బల్యానికి నొచ్చుకొంటుంది. అతని మరణానికి హేతువు లయినా సీతారాముల మాహాత్మ్యాన్ని గుర్తించి మాటాడుతుంది.

*నను నామ మహా భాగ తవ వైశ్రవణానుజ।*
*క్రుద్ధస్య ప్రముఖే స్థాతుం త్రస త్యపి పురందరః॥ (VI-III-3)*

ప్రభూ, కుపితుడవైన నీయెదుట నిలబడటానికి దేవేంద్రుడికికూడా ధైర్యం లేదు.

*"స త్వం మానుషమాత్రేణ రామేణ యుధి నిర్జితః".*

*(VI-III-5)*

అలాంటి నీవు మానవ మాత్రుడైన రామునికే నిహతుడ వయ్యావు.

*యద్త్రైవ చ జనస్థానే రాక్షసై ర్బహుభి ర్వృతః।*
*ఖర స్తవ హతో భ్రాతా తద్త్రై వాసౌ న మానుషః॥* *(VI-III-16)*

కాక పోయినా ఆయన ఏమి మానవుడు. అంతమంది రాక్షసులతో పాటు ఖరదూషణాదుల నెప్పుడు వధించాడో అప్పుడే ఆయన మానవుడని తోచలేదు నాకు.

*వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః।*
*తమసః పరమో ధాతా శంఖ చక్ర గదాధరః॥*

*మానుషం వపు రాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః।*
*సరాక్షసపరీ వారం హతవాం స్త్వాం మహాద్యుతిః॥*

*(VI-III-11 to 16)*

*సాక్షాత్తూ ఆ విష్ణువే వచ్చి నిన్ను సంహరించి ఉంటాడు.*

*ఇంద్రియాణి పురా జిత్వా – జితం త్రిభువనం త్వయా।*
*స్మరద్భి రివ త ద్వైరం ఇంద్రి య్లై రేవ నిర్జితః॥* *(VI-III-15,16)*

ఇంతకు ముందు నీ వింద్రియాలను నిగ్రహించి త్రిభువనాలనూ నిర్జించి ఉన్నావు. ఆ వైరం మనసులో పెట్టుకొని మరలా ఆ యింద్రియాలే నిన్ను జయించాయి.

*"అకస్మా చ్చాభికామో౽సి సీతామ్"* *(VI-III-19)*

*ఉన్నట్టుండి సీతను కామించావు.*

*అరుంధత్యా విశిష్టాం తాం సీతాం ధర్షయతామాన్యాం।*
*త్వయా హ్యసదృశం కృతమ్।*
*పతివ్రతాయా స్తపసా నూనం దగ్ధో౽సి మే ప్రభో॥*

*(VI-III-20,21,23)*

– అరుంధతికంటే గొప్పదైన ఆ మహాపతివ్రత తేజస్సు చేతనే నీవు దగ్ధమయ్యావు.

*తదైవ య న్నదగ్ధ స్త్వం నూనం పర్యాగతే కాలే।*
*అవశ్యమేవ లభతే ఫలం పాపస్య కర్మణః॥ (VI-III-24,25)*

అప్పుడే నీవు దగ్ధం కాలే దంటే, పాపఫలం ఎప్పుడనుభవానికి రావాలో అప్పుడే వస్తుంది.

ఇలా ఎంతగానో విలపిస్తుంది మందోదరి. ఆమెవిలాపంతో రామాయణకథ అంతా ఒక్కసారిగా సింహావలోకనంలాగా తిరిగిపోతుంది. కథలో ఉన్న గ్రంథులన్నీ ఎక్కడ పక్కడ విడిపోతాయి. ఇవన్నీ ఆయా సన్నివేశాలతో పాటు నడుస్తూ పోయే వర్ణనలు. కథ నుంచి విడదీయరానివి.

పోతే ఇక కథతో పాటు నడవకుండా రెండు కథా భాగాల మధ్య నడిచే వర్ణన లున్నాయి కుప్పతెప్పలుగా. నదీ – పట్టణ – పర్వత – ఋతు వర్ణనాదులన్నీ అలాంటివే. బాలకాండలో అయోధ్యా పట్టణాన్నీ, సుందర కాండలో లంకా పట్టణాన్నీ ఎంతో సుందరంగా వర్ణించాడు వాల్మీకి. రెండింటికీ ప్రయోజనముంది. అయోధ్యా వైభవమెంతో నాగరకమైనది. ఎంతో ఉదాత్తమైనది. అంత వైభవాన్నీ వదలుకొని వెళ్లాడు రాముడు. కట్టబెట్టినా వద్దని త్రోసి పుచ్చాడు భరతుడు. వారిద్దరి త్యాగ మెలాంటిందో మన కర్థం కావాలంటే దాని వైభవం ముందు వర్ణించాలి.

అంతే కాదు, వారిరువురూ అరణ్యవాసమే చేశారు. అరణ్యాలలో ఉండి చేశాడు రాముడు. పట్టణంలో ఉండే చేశాడుభరతుడు. భౌతికమైన ఆ నాగరికజీవనాన్ని ఆధ్యాత్మికం గానే వారెలా అనుభవించ గలిగారో తద్ద్వారా ధ్వనింపజేశాడు వాల్మీకి. అంతేగాక రాబోయేది అనిష్టమైన అరణ్యవాసం. మొదటి నుంచీ ఉన్నదిష్టమైన నగరవాసం. కైక అలాంటి అనిష్టమైన వరం కోరిం దంటే దీనికీ దానికీ ఎంత తేడా ఉందో పాఠకులు గ్రహించేలా వర్ణించాలి కవి. దీనికి తార్కాణంగా సుమిత్ర లక్ష్మణుడితో అన్నమాటలు పేర్కొనవచ్చు. "అయోధ్యా మటవీం విద్ధి" అన్న దావిడ. నాయనా, ఇంత వైభవాన్నీ వదలి

అడవులకు వెళ్లుతున్నావు . అక్కడ ఇలాంటి సౌకర్యాలు నీ కుండవు. అయినా అదే నీవు అయోధ్యగా భావించు అంటుంది.

అరణ్యాలలో చెట్లూ, చేమలూ, మృగాలూ, పక్షులూ, ఆశ్రమాలూ - ఎంతో దీర్ఘంగా వర్ణిస్తాడు వాల్మీకి. ఇదంతా సార్థకమే. ఆయా మహర్షులందరూ రాక్షస సంహారంలో రామునికి తోడ్పడవలసి ఉంది. చిత్ర విచిత్రమైన దృశ్యాలను చూస్తూ నగర వియోగ వేదన మరచి పోవలసి ఉంది వారు. అంతేగాక ప్రమాదకరమైన భావిరాక్షస యుద్ధాన్ని కూడా సూచిస్తుందది.

దీని తరువాత ఋతువర్ణన ఒకటి బాగా గమనించదగింది. అరణ్యంలో హేమంత ఋతువును వర్ణించాడు వాల్మీకి. అది ఎంతో సాభిప్రాయం. లక్ష్మణుడు రాముడితో వర్ణించి చెబుతుంటాడు. వర్ణిస్తూ వర్ణిస్తూ అయ్యో ఇలాంటి పుండువంటి చలిలో భరతు డెలా చేస్తున్నాడో గదా!

*'తపస్వీ నియతాహారః, శేతే శీతే మహీతలే'*

*(III-16-28)*

ఉపవాసాలు చేస్తూ చల్లని నేల మీద పడుకొంటూ ఎలా కాలం గడుపుతున్నాడో ;

*'కథం న్వపరరాత్రేషు సరయూ మవగాహతే?*

*(III-16-30)*

అపరరాత్రంలో వెళ్లి సరయువులో ఎలా మునుగుతున్నాడో. వాస్తవంలో భరతుడే గాదు. తమ దశ కూడా అలాగే ఉంది.

*జ్యోత్స్నా తుషారమలినా పౌర్ణమాస్యాం న రాజతే।*
*సీతేవ చాతప శ్యామా లక్ష్యతే నతు శోభతే॥ (III-16-14)*

*అని వాచ్యంగానే వర్ణిస్తాడు సీత పడే బాధను పోతే ఇక।-*

*'రవి సంక్రాంత సౌభాగ్యః తుషారావృత మండలః॥*

*(III-16-13)*

అని మాగువారిన మంకిల అయిన చంద్రమండలాన్ని వర్ణించటంలోనూ - 'బాష్పచ్ఛన్నా న్యరణ్యాని' - అని వనభూములను వర్ణించటం లోనూ తమ పూర్వ వైభవాన్నంతా కోలుపోయి ఎలా అరణ్యాలలో దీనంగా వసించవలసి వచ్చిందో వ్యంగ్యంగా సూచిత మవుతూనే ఉంది.

ఇక కిష్కింధలో రాముడు సీతా వియోగ వేదన ననుభవిస్తూ లక్ష్మణునితో కలిసి తిరిగేటప్పుడు వసంతాన్ని వర్ణించాడు కవి. అది రామవిరహోద్దీపన కొక ఆలంబనంగా పనికి వస్తుంది. అంతేగాక సమాన దుఃఖ శీలుడైన సుగ్రీవునితో వెంటనే సఖ్యం చేసుకొనే ప్రవృత్తి కెంతో దోహదం చేస్తుంది. వాలివధానంతరం ఋశ్యమూకం మీద రామలక్ష్మణు లిద్దరూ ఉండగా వర్షశరదృతువుల వైభవాన్ని ఎంతో అద్భుతంగా వర్ణించాడు వాల్మీకి. అది చాలా దీర్ఘంగా కూడ సాగుతుంది. శరత్కాలం వచ్చేవరకూ ఎక్కడికీ జైత్రయాత్ర చేయటానికి లేదు. అంతవరకూ ప్రతీక్షించ వలసిందే రాముడు.

సుగ్రీవుడి పట్టాభిషేకంతో కథ అక్కడికి నిలిచిపోయింది. మరలా సీతాన్వేషణంతో ఉత్తర కథ ఆరంభమవుతుంది. ఈ మధ్యలో వస్తుందీ ఋతువర్ణన. ఎలాంటి పట్టైనచోట సందుచేసుకొన్నదో చూడం డిది. నూతనంగా రాజ్యాభిషిక్తుడై ఇరువురు భార్యలూ వశంలో ఉన్న సుగ్రీవుడి కది ఒక గొప్పదైన దత్తమైన వరం. భార్యా వియుక్తుడై పరితపించే రాముడి కది శాపం. అతడికి ఆ నాలుగు మాసాలూ ఒక క్షణ మైతే ఇతడి కది నాలుగు యుగాలు. రాముడే అంటాడు లక్ష్మణుడితో అమాయకంగా -

*ఇమాఃస్ఫీతగుణా వర్షాః సుగ్రీవః సుఖ మశ్నుతే।*
*విజితారి స్సదారశ్చ రాజ్యే మహతి చ స్థితః॥*

*అహంతు హృత దారశ్చ రాజ్యాచ్చ మహత శ్చ్యుతః।*
*నదీకూల మివ క్లిన్న మవ సీదామి లక్ష్మణ!॥*

*(IV-28-57/059)*

సుగ్రీవుడి కేమి మన తోడ్పాటుతో శత్రువులను నిర్జించి రాజ్యం సంపాదించి ఇద్దరు భార్యలతో హాయిగా ప్రొద్దు పుచ్చుతున్నాడు. నేనే భార్యను

పోగొట్టుకొని రాజ్యాన్నికూడా కోలుపోయి నదీకూలం లాగా ఈ వర్షాడం బరానికి కూలిపోతున్నాను. లక్ష్మణా అంటాడు. రామ సుగ్రీవుల పరస్పర విరుద్ధానుభవాలకూ దర్పణం పడుతుందీ ఘట్టం. వర్ణన కూడా అలాగే సాగింది. పైగా శరత్తు వచ్చినా సుగ్రీవుడు మేలుకొనలేదు. అంతగా అతడు మైకంలో పడ్డాడంటే ఆ వర్షధాటి ఎలాంటిదో చూపాలి గదా కవి. అందుకు కూడా తోడ్పడుతుం దీ దీర్ఘమైన ఋతువర్ణన.

ఇక సుందరకాండలో మూడు వర్ణన లున్నాయి. ఒకటి సముద్ర వర్ణన. మరొకటి లంకా నగర వర్ణన. ఇంకొకటి వన పర్వత వర్ణన. ఇవన్నీ చాలా విస్తారంగా చేసిన వర్ణనలే. అస లీ కాండలో కథాభాగం కంటే వర్ణనాభాగమే అధికం. ఈ వర్ణనా సౌందర్యాన్ని బట్టే దీన్ని సుందరకాండ మన్నా రని ఒక ప్రవాదం. మొత్తాని కీ వర్ణనలన్నీ కథ కెంతో ప్రయోజనాన్ని సాధిస్తున్నాయి. హనుమంతుడు సముద్రలంఘనం చేయట మనేది ఒక గొప్ప ఉద్యమం. అంగద – జాంబ వదాదులంతా భయపడి వెనుదీసిన వ్యవహార మిది. శ్రీరాముడు కూడ తరువాత ఎంతో ప్రయత్నం చేసి గాని దాట లేదు. అలాంటి కార్య మేదో మామూలుగా చెప్పి ఊరుకోవలసింది గాదు. పైగా మార్గమధ్యంలో ఎన్నో అంతరాయా లెదుర్కొని పోయాడు హనుమంతుడు. అన్నిటినీ జయించి సముద్రాన్ని దాటి పోవటంలోనే అతని బలాతిశయం ద్యోతిత మవుతుంది. అంత బలవంతుడు గనుకనే లంకిణిని జయించ గలిగాడు. లంకిణిని జయించా డంటేనే బ్రహ్మదేవుడి శాపాన్ని బట్టి ఇక రాక్షస కులానికి చేటు మూడిం దనే చెప్పవచ్చు. పైగా అణిమాద్యష్ట సిద్ధులూ ఉన్నవాడాంజనేయుడు. లేకుంటే సాగరా న్నసలు లంఘించనే లేడు. అది లఘిమ అనే శక్తికి నిదర్శనం. పోతే మైనాకపర్వతాన్ని వక్షస్థలంతో కొట్టే సరికది చెదరిపోయింది. ఇది అతని గరిమకు నిదర్శనం. 'పృషదంశక మాత్రస్సన్' అని పిల్లి అంత పరి పరిమాణంతో లోపల ప్రవేశించ బోతాడు. ఇది అణిమకు నిదర్శనం. సీతాదేవికి నమ్మకం కలిగించటానికి

పెద్దగా పెరిగి పోతాడు. ఇది మహిమకు తార్కాణం. ఇలాంటి సిద్ధులన్నీ ఉన్నా యాయనకు. ఇన్ని పనులు చేయాలంటే శతయోజన విస్తీర్ణమైన సాగరాన్ని ముందు దాట గలగాలి. అది దాటి తన పట్టణంలో ప్రవేశించి నందుకే ఆశ్చర్యపోయాడు రావణుడు. మాటి మాటికీ ఆ విషయమే అంటాడు కూడ. అలా దాటటం కూడా శ్రీరాముని ప్రభావంతోనే నని హనుమంతు డంటాడు. చూడండి ఇంత దూర ముంది ఈ సముద్ర లంఘన వర్ణనానికి కథా గమనంతో సంబంధం.

లంకాపట్టణ వర్ణనం, అందులో పుష్పక వర్ణనం, రాక్షస స్త్రీ వర్ణనం ఎంతో మనోహరం. రావణవైభవం, అతని కామతంత్రపరాయణత్వం తద్వారా అతనికి రాబోయే వినిపాతం వీటన్నిటికీ ద్యోతకంగా వర్ణించేశా డా మహర్షి ఈ వర్ణన అంతా. ఇదంతా భావ్య నర్థాని కొక పూర్వరంగం. ఎంత భోగభాగ్యా లుంటే నేమి, దక్కించుకొనే యోగ్యత లేకపోతే అంతా చివరకు నిరర్థకమే గదా అనే భావం అంతర్లీనంగా ప్రతీయమాన మవుతుంటుం దీ ఘట్టంలో. హనుమంతుడే అనుకొంటాడు రావణుణ్ణి చూచి తన మనసులో –

*అహో రూప మహో ధైర్యమ్ అహో సత్త్వ మహో ద్యుతిః।*
*అహో రాక్షస రాజస్య సర్వలక్షణయుక్తతా॥*

*య ద్యధర్మో న బలవాన్ స్యా దయం రాక్షసేశ్వరః।*
*స్యా దయం సురలోకస్య సశక్ర స్యాపిరక్షితా॥*

*(V-49-17, 18)*

ఇతని రూపానికీ ఇతని బలానికీ ఇతని సకల లక్షణాలకూ సాటి లేదు. కానీ అధర్మ వర్తన మనేది ఒకటి బలంగా ఇతణ్ణి పట్టుకోకపోతే ఇతడే మూడు లోకాలకూ పాలకుడుగా ఉండవలసిన వాడే; సందేహం లేదు. అయితే అధర్మ వృత్తితో ఇతడెందుకూ కొఱగాకుండా పోయాడు.

మధువనంలో జరిగిన మర్కటక్రీడలన్నీ ఎంతో సుందరంగా సముచితంగా వర్ణించాడు వాల్మీకి. అదంతా ఒక ఘనకార్యం సాధించి వచ్చిన

తరువాత జరుపుకొనే మహోత్సవాన్ని మనసుకు తెస్తుంది. అలా జరిగితేనే అది సహజం. అందులో ఔచిత్యం కూడా ఉంది. అపూర్వమైన వారి ఆ ఉత్సాహం - వల్లనే సీతా దర్శన శుభవృత్తాంతాన్ని రామసుగ్రీవులు గ్రహించాలి. అలా గ్రహిస్తారు కూడా.

*"ఆగతైశ్చ ప్రమథితం యథా మధువనం హి తైః।*
*ధర్షితం చ వనం కృత్స్నం ఉపయుక్తం చ వానరైః॥*

*వనం య దభి పన్నం తైః సాధితం కర్మ వానరైః।*
*దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనూమతా॥*

*(V-63-16,17)*

మన వానరు లింత పని చేశారంటే తప్పకుండా సీతను చూచి వచ్చి ఉంటారు. ఆ చూచిందికూడా ఎవరో కాదు. హనుమంతుడే అనుకొంటా రట.

ఇక యుద్ధకాండలో అంతా చాలా వరకు యుద్ధవర్ణనలే. యుద్ధం వర్ణించట మంటే చాల కష్టం. ఒకే ఒక విషయం కావటం మూలాన కొంచెం సేపు వినే సరికే విసుగు పుడుతుంది పాఠకునికి. అయినా చిత్రమేమంటే, రామాయణంలో ఎంత వర్ణించినా విసుగు పుట్టకుండా చేయగలడు వాల్మీకి. ఆయన చేతిలో ఉన్న ప్రభావమది. ఒకే విషయమైనా అవి ఎన్నో భంగిమలలో ఎన్నో వన్నెలు చిన్నెలు పెట్టి ఎంతో నిత్యనూతనంగా భాసించేలా చేయగలడు. ఇది అందరికీ సాధ్యమయ్యే విద్యకాదు. అంతే కాక, ఈ యుద్ధంలో ఎందరో రాక్షసవీరులు మరణిస్తారు. ఎందరో వానరయోధులు అసువులు కోల్పోతారు. పైగా రావణాదులు బ్రహ్మ దత్త వరప్రసాదులు వారినీ, వారి బలగాన్ని అంతం చేయట మంత సులభమైన పని గాదు. ఒక్కొక్కటీ ఒక్కొక్క మహాయజ్ఞం. ఇదంతా అనుష్ఠించి విజయం సాధించట మంటే అది రామావతారానికే విజయం. దాని తరువాత ఇక వాంఛనీయ మేదీ లేదు. కాబట్టి అది ఒక కాండ కాండంతా సాగే వర్ణన అయింది.

*రామ రావణయో ర్యుద్ధం రామరావణ యోరివ।*
*రామ రావణుల యుద్ధం రామ రావణుల యుద్ధానికే సాటి. పైగా*
*గగనం గగనాకారం, సాగరః సాగరోపమః॥ (V-107)*

గగనానికి గగనమే సాటి. సాగరానికి సాగరమే సాటి అంటాడు వాల్మీకి. అంటే ఔన్నత్యంలో వైశాల్యంలో గాంభీర్యంలో అన్నిటిలో అది అద్వితీయం అని వాల్మీకే స్వయంగా అన్న మాటల వల్ల సూచిత మవుతున్నది. మరి దాని గాంభీర్య విస్తారాలు భావుకుడి హృదయానికి పట్టాలంటే అంత విస్తారంగా గంభీరం గానే సాగా లా వర్ణన.

ఇలా వాల్మీకి మహర్షి ఏ వర్ణన చేసినా, కథలో ఓతప్రోతంగా చేసినా, కథా సంధాయకంగా చేసినా, అంతా కథా ప్రయోజనాన్ని సాధించేదే గాని దూర దూరంగా తొలగిపోయేది కాదు. ప్రతి ఒక్క వర్ణనకూ కథా ప్రణాళికతో గాఢమైన సంబంధ మున్నది. సంబంధం లేకపోతే అసలు దాని కస్తిత్వమే లేదు రామాయణంలో. అయితే విశేష మేమంటే, మొత్తం చరాచర జీవితమంతా అక్కడ ఉంది కాబట్టి చరాచర ప్రకృతి వర్ణన మంతా చోటు చేసుకొన్న దందులో. అమూర్తమైన భావానికి కథ అనేది పోషణ మైతే దానికీ వర్ణన అనేది ఒక అమూల్యమైన భూషణం. ఈ రెండింటినీ పోషించటంలో, భూషించటంలో మహర్షి వాల్మీకిదృష్టి సర్వ ముఖీనం. ఆయన సృష్టి సర్వ పథీనం. అతిలోకమైన భావనలో ఆయన ఒక మహాముని అయితే, అతి మనోజ్ఞమైన వర్ణనలో ఆయన ఒక మహాశిల్పి. ఆ శిల్పం కూడా ఎంత సుందరమైనదో అంత ఔచిత్యబంధుర మైనది. మొత్తాని కింత సర్వాంగ సౌష్ఠవో పేతమైన రచన అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ లే దనేది నిర్వివాదం. "మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్" (రఘు 1-3) అని కాళిదాసులాంటి మహాకవి కంఠోక్తిగా చాటాడంటే అది అక్షరాలా నిజం.

# 12. రామాయణంలో భరతుని పాత్ర

డా. అప్పజోడు వేంకటసుబ్బయ్య

ధర్మశీలంలో, త్యాగగుణంలో శ్రీరాముని తరువాత శ్రీమద్రామాయణంలో అందరి దృష్టిని ఆకర్షించే పాత్ర భరతుడు. భరతుని భ్రాతృభక్తి గూడ ప్రశంసార్హం; మహోన్నతం.

ఒక వ్యక్తి స్వభావంలోని సుగుణశిఖరాలు ప్రకాశించాలన్నా, అవగుణకూపాలు బయల్పడాలన్నా అతని జీవితంలో ప్రబల సన్నివేశాలు, ప్రలోభావకాశాలు, క్లిష్టసమయాలు ఏర్పడాలి. అప్పుడు అతనిలో కలిగే ప్రతిస్పందనే అతని స్వభావాన్ని అద్దం వలె ప్రదర్శిస్తుంది. రామాయణంలో శ్రీరామవనవాసం ఆ రాముని జీవితంలోనే గాదు భరతుని జీవితంలో గూడ అదొక ప్రబల సన్నివేశం. ఆ సన్నివేశమే భరతుని శీలానికి చక్కని గీటురాయిగా పరిణమించింది. ఆ సన్నివేశం తరువాతే భరతుని పాత్ర రామకథలో ప్రాధాన్యం పుంజుకొంది. ఆ సన్నివేశం తరువాతే ఆయన వ్యక్తిత్వంలోని మహోన్నతగుణాలు వెలుగులోకి వచ్చాయి; కొందరిని ఆశ్చర్యపరిచాయి; అందరిని ఆకర్షించాయి. శ్రీరామవనవాసమే జరుగకుంటే భరతుడెక్కడో కేకయరాజ్యంలో కాలం గడుపుతూ ఉండేవాడేమొ.

ఎందుకో భరతుడు బాల్యంలోనే మేనమామయింటికి వెళ్ళాడు. అక్కడే పెరిగాడు. పెండ్లికి మిథిల వచ్చాడు. మాండవిని పెండ్లాడాడు. అందరితో పాటు తరలి అయోధ్య వచ్చాడు. మరల కేకయరాజ్యానికి వెళ్ళిపోయాడు. శ్రీరామవనవాసం సంగతి ఆయనకు తెలీదు. దశరథుని మరణం సంగతి గూడ తెలీదు. అయితే తండ్రిని గూర్చి దుస్స్వప్నం మాత్రం వచ్చింది.

దశరథుడు తలవిరియ బోసుకొని కొండకొన నుండి ఒక పేడగుంటలో పడ్డట్లు, వికారంగా నవ్వుతూ నూనె త్రావినట్లు, నువ్వులు కలిపిన అన్నం తిన్నట్లు, సముద్రం ఎండినట్లు, చంద్రుడు క్రింద పడినట్లు,

చీకట్లు క్రమ్మినట్లు, పట్టపుటేనుగు దంతాలు తునకలైనట్లు - తీవ్ర దుస్స్వప్నం. భరతుడు ఆందోళన పడుతూనే ఉన్నాడు. మిత్రులకు తన స్వప్నం సంగతి చెప్పుతూ ఉన్నాడు. అంతలోనే అయోధ్యనుండి దూతలు వచ్చారు. పురోహితులు వసిష్ఠులవారు, వివిధ మంత్రులు మిమ్మల్ని కుశలమడిగారని, అతిముఖ్యమైన పని మీద మిమ్మల్ని వెంటనే అయోధ్యకు పిలుచుకొని రమ్మన్నారని విన్నవించారు. కేకయరాజుకు, ఆయన కుమారునికి తెచ్చిన కానుకలు భరతుని చేతి మీదుగా వారి కిప్పించారు.

భరతునికి ఎందుకో భయంగానే ఉంది. రాత్రి ఆ దుస్స్వప్నం. ఉదయం అయోధ్యనుండి ఈ దూతలు. అందుకే ఆయన మొదట తండ్రికి కుశలమా అని అడిగాడు.

"కచ్చిత్సు కుశలీరాజా పితా దశరథో మమ" (2-70-7)
తరువాత రామలక్ష్మణులను గూర్చి అడిగాడు. తరువాత తల్లులను గూర్చి అడిగాడు.

కైకను గూర్చి అడుగుతూ స్వార్థపరురాలు, చండస్వభావురాలు, క్రోధగుణపూరితురాలు, స్వాతిశయపరాయణురాలు అయిన మాతల్లి ఆరోగ్యంగా ఉందా - ఆమె ఏమి చెప్పింది? అనటం గమనింపదగ్గ విశేషం.

*ఆత్మకామా సదా చణ్డీ క్రోధనా ప్రాజ్ఞమానినీ।*
*అరోగాచాపి మే మాతా కైకేయీ కిమువాచ హ॥*

*(2-70-10)*

తల్లి స్వభావం భరతునికి బాగా తెలుసు. తన స్వభావానికి ఆమె స్వభావానికి ఎప్పుడూ చుక్కెదురే. పాపం! భరతునికి ఏ అనుమానం వచ్చిందో. అందుకే ఆమెను గూర్చి అలా అడిగాడు.

ఆ దూతలు అన్నింటికి తల ఊపారు. తక్షణం అయోధ్యకు బయలుదేరమన్నారు.

ఏడు రోజులు ప్రయాణం చేసి భరతుడు ఎనిమిదవరోజు ఉదయం అయోధ్య చేరుకొన్నాడు.

అయోధ్యలో ప్రభాతమంగళవాద్యాలు మ్రోగటం లేదు. వేద ధ్వనులు వినిపించటంలేదు. అలంకారాలు అగుపించటం లేదు. ఎవరి ముఖాల్లోను కళాకాంతులు కన్పించటం లేదు. అంతా ఏదో పోగొట్టుకొన్నట్లు బాధపడుతున్నారు. భరతునికి మరీ ఆందోళనగా ఉంది. అందుకుదోడు అన్నీ ఆయనకు అపశకునాలే.

భరతుడు రథం దిగాడు. ఎకాయెకి తండ్రి అంతఃపురానికి వెళ్ళాడు. దశరథుడులేడు. వెంటనే కైక దగ్గరకు వెళ్ళాడు. ఆమె కొండంత సంతోషంతో ఉంది. అయోధ్యలో ఎక్కడాలేని సంతోషం ఆమె ముఖంలో కొట్టవచ్చినట్లు కన్పిస్తూ ఉంది. అయినా దశరథుడు అక్కడ గూడ లేడు.

కాని ఆ తల్లికొడుకుల సమావేశం మాత్రం అద్భుతం. కొడుకు తల్లి పాదాలకు ప్రణమిల్లాడు. తల్లి కొడుకును గాఢంగా కౌగిలించుకొంది. 'కొడుకు అమ్మా! నాన్న ఏడీ?' అన్నాడు. ఆమె పుట్టింటి వారిని గూర్చి అడుగసాగింది. అడిగినవేవో చెప్పి 'అమ్మా! నాన్న?' అన్నాడు ఆ కొడుకు. ఆమెఅన్ని ప్రాణుల్లాగా ఆయన గతించా'డంది ఏ మాత్రం కదలిక లేకుండా.

భరతుడు మూర్ఛపోయాడు. కైక కొడుకును లేవనెత్తింది. ఇంత మాత్రానికే ఇలా చతికిలపడ్డావెందుకంది. మానవులకు మరణం తప్పదంది.

ఆమె ధోరణి భరతునికి వింతగానే ఉంది. 'అమ్మా! నాన్నగారు రామాభిషేకం జరిపించాలనుకొన్నారా? లేదా ఏదైనా మహాయాగం చెయ్యాలనుకొన్నారా? నన్ను రమ్మని కబురు పంపారు. ఆఖరుక్షణంలో ఆయనతో మాట్లాడే అవకాశం గూడ లేకుండాపోయింది. ఎంతో దురదృష్టవంతుణ్ణి. వారు ఏం చెప్పి మరణించారమ్మా?' అన్నాడు కన్నీళ్ళు కారుస్తూ. హా రామా! హా సీతా! హా లక్ష్మణా! అని పలవరిస్తూ – తిరిగి వచ్చిన మిమ్మల్ని చూడగల మానవులే ధన్యులంటూ ప్రాణాలు వదిలా'డంది ఆ కైకమ్మతల్లి.

'అయితే అన్నగారు గూడ అయోధ్యలో లేరా?' అన్నాడు భరతుడు. ఆ కైకమ్మ తల్లి అప్పుడు చెప్పింది తాను కోరిన వరాలసంగతి.

భరతుడు అగ్నిపర్వతంలా బ్రద్దలయ్యాడు. నీవు తల్లివా రాక్షసివా అన్నాడు. కులధ్వంసిని వన్నాడు. తండ్రిని చంపావన్నాడు. అన్నను అడవులపాలు చేశావన్నాడు. అంతేగాదు. 'నీకోరిక నెరవేర్చను. నే నీ రాజ్యం స్వీకరించను. ఇది రామునిది దీన్ని ఆయనే పాలించాలి. అరణ్యం నుండి ఆయనను అయోధ్యకు మరలిస్తాను. నేను ఆయనకు దాసుణ్ణి అవుతాను' అని ఆవేశంగా అన్నాడు.

*నివర్తయిత్వా రామం చ తస్యాహం దీప్తతేజసః।*
*దాసభూతో భవిష్యామి సుస్థితే నాన్తరాత్మనా॥* (2-73-27)

ఇది భరతుని హృదయం. తల్లి తత్త్వానికి అతని తత్త్వానికి ఎప్పుడూ చుక్కెదురే.

భరతుడు వెంటనే శత్రుఘ్నునితో కలిసి కౌసల్యామందిరానికి వెళ్ళాడు. ఆమె నేల మీదబడి ఏడుస్తూ ఉంది. అన్నదమ్ములిద్దరు ఆ తల్లిని కౌగిలించుకొన్నారు. అమితంగా దుఃఖించారు.

ఆమె భరతుణ్ణి చూచి 'నాయనా నీవు కోరిన రాజ్యం నీకు లభించింది' అనే సరికి పచ్చిపుండు మీద సూదితో గ్రుచ్చినట్లు ఆయన బాధపడ్డాడు.

*వివ్యధే భరతస్తీవ్రం వ్రణే తుద్యేవసూచినా* (2-75-17)

'అమ్మా! నాకేమీ తేలీదు. కలలోగూడ నేను రాజ్యం కోరలేదు. నేనే పాపం ఎరుగను. శ్రీరామ వనవాసాన్నే నేను సంకల్పించి ఉండే గురుముఖతః నేర్చిన నా విద్య వ్యర్థమగు గాక, గోమాతను పాదానతన్నిన పాపాన పోదునుగాక. ప్రభుద్రోహానికి ఒడిగట్టిన పాపం అనుభవింతును గాక. వేదవిప్రులకు యాగదక్షిణలు ఎగవేసిన పాపం పొందుదును' గాక అని ఎన్నో ఒట్లు పెట్టుకొని భరతుడు ఆమె పాదాలపై వ్రాలాడు.

కౌసల్య భరతుని ఓదార్చింది. అయినా ఆరాత్రి భరతునికి దుఃఖంతోనే గడిచింది. నిట్టూర్పులతోనే తెల్లవారింది.

మరునాటి ఉదయం వసిష్ఠమహర్షి వచ్చాడు. భరతుని ఓదార్చాడు. దశరథునికి చేయవలసిన ఉత్తరక్రియలు గుర్తుచేశాడు.

ఉత్తరక్రియలు సశాస్త్రీయంగా జరిగాయి. ఇక భరతుని రాజ్యాభిషేకమే అటో ఇటో తేలాలి.

ఈలోగా ఒక చిత్రమైన సంఘటన మంథర భరతుని రాజ్యాభిషేకాని కని అందంగా అలంకరించుకొని ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ బయటికి వచ్చింది. శత్రుఘ్నుని కంటబడింది. ఒక్కక్షణం ఆలస్యమైతే ఆమె ముక్కచెక్కలయ్యేదే. అప్పటికే 'శత్రుఘ్నుడు ఆమెను నేలమీద పడవేసి ఈడ్చాడు. భరతుడు సత్వరుడై శత్రుఘ్నా! స్త్రీహత్య మహాపాతకం. ధర్మాత్ముడైన రాముడు అది సహించడు. అది మన చేతిమీదుగా జరిగిందని తెలిస్తే మన ముఖం గూడ చూడడు. మనతో మాట్లాడడు. అందుచేతనే నేనూ ఊరకొన్నాను. లేకుంటే ఈపాటికి కైకేయినే కడతేర్చి ఉండేవాణ్ణి' అని శత్రుఘ్నుని చల్లబరచాడు. స్త్రీ హత్య తప్పించాడు.

*అవధ్యా స్సర్వ భూతానాం ప్రమదాః క్షమ్యతా మితి ।*

*(2-78-21)*

*హన్యా మహమిమాం పాపాం కైకేయీం దుష్ట చారిణీమ్ ।*
*యది మాం ధార్మికో రామో నా సూయే న్మాతృ ఘాతకమ్ ॥*

*(2-78-22)*

*ఇమామపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః ।*
*త్వాం చ మాం చ హి ధర్మాత్మా నాభి భాషిష్యతే ధ్రువమ్ ॥*

*(2-78-23)*

అన్నగారి ధార్మికత మీద ఆతమ్మునికి అంత గౌరవం. పదునాల్గవనాడు ప్రాతఃకాలాన్నే మంత్రి పురోహిత సామంత దండనాథాది ప్రముఖులంతా భరతుని దర్శించారు. పట్టాభిషిక్తుడవు కమ్మని ప్రార్థించారు. అందుకు అవసరమైన సంభారాలన్నీ సిద్ధం చేశారు.

అందుకు భరతుడు చెప్పిన సమాధానం ఆయన చిత్తశుద్ధికి, భ్రాతృ భక్తికి, ధర్మనిరతికి మకుటాయమానం. ఆయన అభిషేకజల భాండానికి ప్రదక్షిణం చేశాడు. అందరిని ఉద్దేశించి 'ఇక్ష్వాకువంశంలో జ్యేష్ఠుడేరాజు. అందుచేత రాముడే అయోధ్యకురాజు. అభిషేకద్రవ్యాలతో, చతురంగ బలాలతో అడవికి బయలుదేరుతున్నాను. అక్కడే రాముణ్ణి అభిషిక్తుణ్ణి చేసి యాగశాలనుండి అగ్నిహోత్రుణ్ణి ఇంటికి గొనివచ్చినట్లు ఆయనను అయోధ్యకు తోడ్కొని వస్తాను. ఆయన బదులు నేనే పదునాలు గేళ్ళు అరణ్యవాసం చేస్తాను. కైక కోర్కె ఈ జన్మలో సఫలం గాదు' అని నిర్ధరించి పలికాడు.

*అభిషేచనికం భాణ్డం కృత్వా సర్వం ప్రదక్షిణమ్ ।*
*భరతస్తం జనం సర్వ మిత్యువాచ ధృతవ్రతః ॥* (2-79-6)

*జ్యేష్ఠస్య రాజతా నిత్య ముచితా హి కులస్య నః ।*
*నైవం భవన్తో మాం వక్తు మర్హన్తి, కుశలా జనాః ॥* (2-79-7)

*అభిషేచనికం చైవ సర్వమేతదుపస్కృతమ్ ।*
*పురస్కృత్య గమిష్యామి రామ హేతోర్వనం ప్రతి ॥*(2-79-10)

*తత్రైవ తం నరవ్యాఘ్ర మభిషిచ్య పురస్కృతమ్ ।*
*ఆనేష్యామి తు వై రామం హవ్యవాహ మివాధ్వరాత్ ॥*
(2-79-11)

*న సకామం కరిష్యామి స్వామి మాం మాతృగన్ధినీమ్ ।*
*వనే వత్స్యామ్యహం దుర్గే రామో రాజా భవిష్యతి ॥*(2-79-12)

వసిష్ఠమహర్షి మరునాడు సభచేసి మరల అభిషేక విషయం ప్రస్తావిస్తే భరతుడు ముందురోజు చెప్పిన తన నిర్ణయాన్ని పునరుద్ఘాటించాడు. సభ ఆనంద బాష్పాలు రాల్చింది. హర్షధ్వానాలు చేసింది. భరతుని ధర్మరక్తిని, భ్రాతృభక్తిని వేనోళ్ళ ప్రశంసించింది. వసిష్ఠుడు భరతుని

ఆశీర్వదించాడు. భరతుడు సుమంత్రుని పిలిచి 'సైన్యాన్ని సిద్ధం చెయ్యి. ఉదయాన్నే మన ప్రయాణం' అన్నాడు. మార్గాన్ని సుగమం చెయ్యటానికి ముందే కొందరు పరిచారకులను పంపాడు.

మరునాడు ఉదయం అదొకమహాజన ప్రవాహం. అయోధ్యనుండి అరణ్యం వైపుసాగే ప్రవాహం. భరతుని భ్రాతృభక్తి, ప్రజలరామభక్తి ఏకమై సాగిన మహాప్రవాహం. ముందు రథాల్లో మంత్రులు, పురోహితులు. తరువాత భరతుడు, ఆ తరువాత అరువదివేల రథికులు, లక్షమంది అశ్వికులు, మధ్యకైకేయి, సుమిత్ర, కౌసల్య.

గుట్టలు, చెట్లు నరికి, గుంటలు, మిట్టలు చదునుచేసి, వంతెనలు, విశ్రాంతి గృహాలు నిర్మించి మార్గాన్ని ప్రయాణయోగ్యంగా మలచటానికి అశేషపరిచారికాజనం ముందే వెళ్ళింది.

అంతా శృంగిబేరపురం చేరుకొన్నారు. గంగగట్టున గుడారాల్లో విడిదిచేశారు. గుహుని ఆతిథ్యం స్వీకరించారు.

గుహుడు చూపగా భరతుడు సీతారాములు ఇంగుదీవృక్షం క్రింది పవ్వళించిన శయ్యచూచాడు. ఆ దర్భశయ్యకు తగులుకొన్న సీతాదేవి ఉత్తరీయపు పోగులను చూచాడు. తన కారణంగా వారికి తటస్థించిన దుస్థితిని తలచుకొని పెద్దగా దుఃఖించాడు. అది మొదలు తానుగూడ కందమూలాలే తినాలని, నారచీరలే కట్టాలని, జటలు ధరించి నేలమీదనే పరుండాలని నిర్ణయించాడు.

*ఉత్తరీయ మిహా౭_ సక్తం సువ్యక్తం సీతయా తదా।*
*తథా హ్యేతే ప్రకాశన్తే సక్తాః కౌశేయతన్తవః॥ (2-88-13)*
*అద్యప్రభృతి భూమౌ తు శయిష్యే౭_ హం తృణేషు వా।*
*ఫలమూలాశనో నిత్యం జటా చీరాణి ధారయన్॥ (2-88-26)*

భరతుని ఆవేదనకు అంతులేదు. అన్నను చూచేదాకా ఆయన మనస్సుకు నిలకడలేదు.

గుహుని సాయంతో భరతుడు ససైన్యంగా గంగానదిని దాటాడు. భరద్వాజాశ్రమం చేరుకొన్నాడు. తల్లి మీద ఆయన కోపం తగ్గలేదు. భరద్వాజ మహర్షికి తన తల్లులందరిని పరిచయం చేస్తూ కౌసల్యాసుమిత్ర లను గూర్చి గొప్పగా పలికి కైకేయిని గూర్చి:

*క్రోధనా మకృతప్రజ్ఞాం దృప్తాం సుభగమానినీమ్ ।*
*ఐశ్వర్య కామాం కైకేయీ మనార్యా మార్యరూపిణీమ్ ॥*
*(2-92-25)*

"మమైతాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయామ్" అన్నాడు. కన్నీళ్ళతో గద్గద స్వరంతో కుపిత సర్పంలా బుసలు కొట్టాడు.

ఇత్యుక్త్వా నరశార్దూలో బాష్పగద్గదయా గిరా।
నిశశ్వాస స తామ్రాక్షః క్రుద్ధో నాగ ఇవశ్వసన్॥ (2-92-27)

భరద్వాజమహర్షి కైకేయిమీద కోపపడ వద్దని, ఆమె చేసిన దానివల్ల లోకానికే మేలు కలుగుతుందని భరతుణ్ణి ఓదార్చాడు.

ఆ రాత్రి భరద్వాజాశ్రమంలో గడిపి మరునాడు అంతా చిత్రకూటం బయలుదేరారు.

చిత్రకూటం చేరగానే సైన్యాన్నంతా చుట్టూ నిలిపి, అన్నగారి ఆశ్రమానికి ఏ అననుకూలత ఏర్పడ కుండా చేసి, భరతుడు పరమభక్తితో పాదచారి అయి శత్రుఘ్న సుమంత్రులను వెంటతీసుకొని రామాశ్రమాన్ని అన్వేషించటం ఆరంభించాడు. అక్కడక్కడ చెట్లకు కట్టి ఉన్న నారచీర పేలికలు చూచాడు. అవి లక్ష్మణుడు సాయంవేళ ఫలజలాదులు సేకరించి తెస్తూ త్రోవ తెలియటానికని కట్టిన గుర్తులుగా గ్రహించాడు.

*ఉచ్చైర్బద్ధాని చీరాణి లక్ష్మణేన భవేదయమ్ ।*
*అభిజ్ఞానకృతః పన్థా అకాలే గన్తుమిచ్ఛతా ॥ (2-99-10)*

ఆ తరువాత అగ్నిహోత్రం పొగచూచాడు. అది రామాశ్రమమే అని నిశ్చయించాడు. మరికొంత ముందుకు నడిచాడు – మనోహరమైన పర్ణశాల

చూచాడు. ఇంకకొంత ముందుకు సాగాడు - వచ్చిన వారితో ముచ్చటించటానికి ముందుభాగంలో నిర్మితమైన మంటపాన్ని చూచాడు. మరికొంత ముందుకువెళ్ళి పూజాద్రవ్యాలు చూచాడు. పర్ణశాల లోపల ఉన్న అగ్ని వేదికను, ఆ వేదిక మీద జడలు దాల్చి, నారచీరలు ధరించి, కుప్పవోసిన ధర్మంలా కూర్చున్న అన్నగారిని చూచాడు. అన్నగారి ప్రక్కనే ఆ సీతాలక్ష్మణులు.

*నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్ ।*
*ఉటజే రామ మాసీనం జటామణ్డల ధారిణమ్ ॥ (2-99-25)*

*సింహస్కంధం మహాబాహుమ్ పుండరీక నిభేక్షణమ్ ।*
*పృథివ్యా స్సాగరాన్తాయా భర్తారం ధర్మచారిణమ్ ॥ (2-99-27)*

*ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణ మివ శాశ్వతమ్ ।*
*స్థండిలే దర్భసంస్తీర్ణే సీతయా లక్ష్మణేన చ ॥ (2-99-28)*

ఆ స్థితిలో ఉన్న అన్నగారిని చూచి భరతుడు అతిశయదుఃఖావేశంతో ఆయనపాదాల మీద వ్రాలాడు. శత్రుఘ్నుడూ సాగిల పడ్డాడు. సుమంత్రుడు ప్రణమిల్లి అలా చూస్తూ నిలబడ్డాడు.

రాముడు తమ్ములిద్దరిని కౌగిలించుకొని లేవనెత్తాడు. కన్నీళ్ళు తుడిచాడు. భరతుడు మరీ కుమిలి పోతున్నాడు. రాముడు ఆప్యాయంగా ఆ తమ్ముని తొడమీద కూర్చోపెట్టుకొన్నాడు.

*అఙ్కే భరతమారోప్య పర్యపృచ్ఛత్సమాహితః ॥ (2-100-2)*

రాముడు భరతుని అనేక కుశల ప్రశ్నలు వేశాడు. తండ్రిని గూర్చి అడిగాడు. తల్లులను గూర్చి అడిగాడు. వసిష్ఠుని గూర్చి అడిగాడు. ఆయన కొడుకు సుయజ్ఞుని గూర్చి అడిగాడు. ప్రజాక్షేమాన్ని గూర్చి అడిగాడు. ప్రభుత్వ విధానాన్ని గూర్చి అడిగాడు. పాలనా పద్ధతిని గూర్చి అడిగాడు. అన్నీ ధర్మబద్ధంగా సాగుతున్నాయా అని అడిగాడు.

భరతుని కళ్ళ నీళ్ళు కారిపోతున్నాయి. అన్న అయోధ్యలో అంతా బాగున్నారనే అనుకొంటున్నాడు. అన్నీ సవ్యంగా జరిగిపోతున్నాయనే అనుకొంటున్నాడు. తమ్ముడు భరతుడు రాజ్యాధికారం స్వీకరించాడనే అనుకొంటున్నాడు. రాజ్యాన్ని ధర్మబద్ధంగా పాలిస్తున్నాడనే అనుకొంటున్నాడు.

అన్నకు చెప్పవలసింది ఎంతో ఉంది. అయినా ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? భరతునికి ఏమీ తోచలేదు. అయినా చెప్పక తప్పదు. అంతదూరం అన్నను వెతుక్కుంటూ వచ్చి చెప్పకుంటే ఎలాగు?

భరతుడు కన్నీళ్ళు తుడుచుకొన్నాడు. తండ్రి మరణవార్త చెప్పాడు. మళ్ళీ కన్నీళ్ళు తుడుచుకొన్నాడు. కన్నతల్లి దుశ్చేష్టను దూషించాడు. సిగ్గుతో తలవంచుకొన్నాడు. తన నిర్దోషిత్వాన్ని తెలుపుకొన్నాడు. భారంగా నిట్టూర్పు విడిచాడు. అయోధ్యా పరిస్థితులు వివరించాడు. పాదాలు రెండూ పట్టుకొన్నాడు. పట్టాభిషిక్తుడవై మమ్మందరిని పాలించమని ప్రార్థించాడు.

*తస్య మే దాస భూతస్య ప్రసాదం కర్తు మర్హసి ।*
*అభిశిఞ్చస్వ చాద్యైవ రాజ్యేన మఘవా నివ ॥* (2-104-8)

తండ్రి మృతికి రాముని హృదయంలో తీవ్రదుఃఖం తాండవించింది. భరతుని స్థితికి రాముని మాటల్లో పూర్తి సానుభూతి వెల్లివిరిసింది. కాని అయోధ్యకు వచ్చి అభిషిక్తుడవు కమ్మన్న అతని ప్రార్థనకు మాత్రం ముఖంలోగాని, మాటలోగాని రేఖామాత్రంగా గూడ అంగీకారం లేదు.

భరతునికి ఆ విషయంలోనే ఆయన అంగీకారం కావాలి. అందుకే అంతదూరం వచ్చాడు. అందుకే అంతులేని తపన అనుభవిస్తున్నాడు. అది లభిస్తే గాని అతనికి మనశ్శాంతి ఉండదు.

తండ్రి అనతి తలదాల్చి పదునాలుగేళ్ళు అరణ్యవాసం చేస్తానన్నాడు రాముడు. వంశాచారాన్ని, మా అభీష్టాన్ని మన్నించి అభిషిక్తుడవై అయోధ్యను పాలించమన్నాడు భరతుడు. పితృవాక్యపాలన మన కర్తవ్యమన్నాడు

రాముడు. అయితే నీ బదులు నే వనవాసం చేస్తానన్నాడు భరతుడు. రాజ్యాన్ని తండ్రి నీ కిచ్చాడన్నాడు రాముడు. రాజ్యం నీది, నాకక్కర లేదన్నాడు భరతుడు. నా వనవాస నిర్ణయం మారదన్నాడు రాముడు. నీవు అయోధ్యకు వస్తే గాని నేనిక్కడినుండి వెళ్ళనన్నాడు భరతుడు.

పాపం! భరతుడు ఎంత వరకని వాదించగలడు – అందులో శ్రీరామచంద్రునితో అటు ఇటు చూచాడు. 'సుమంత్రా! దర్భలు శీఘ్రంగా తీసుకురా, పర్ణశాల వాకిట పరువు' అన్నాడు.

*ఇహ మే స్తండిలే శీఘ్రం కుశానాస్తర సారథే।*
*ఆర్యం ప్రత్యుపవేక్ష్యామి యావన్మే న ప్రసీదతి॥ (2-111-16)*

సుమంత్రుడు తటపటాయించటము, రాముని వైపు చూడటము, చూచి తానే లేచి దర్భలు పరచుకొని పర్ణశాల వాకిట భరతుడు పడుకొన్నాడు. ప్రాయోపవేశానికి పూనుకొన్నాడు.

వచ్చిన మహర్షులు, మాతృమూర్తులు, పౌరజానపద ప్రముఖులు – అంతా చూస్తూ నిలబడ్డారు.

రాముడు సంభ్రమపడి లేచాడు. భరతుని దగ్గరకు వచ్చాడు. 'తమ్ముడూ! ఇలా వాకిటికి అడ్డంగా పడుకోవటం క్షత్రియధర్మవిరుద్ధం. ఇచ్చిన అప్పు వసూలు చేసుకోటానికి బ్రాహ్మణుడీ పద్ధతి అవలంబించవచ్చు. అంతేగాని నీ వంటి వానికిది తగదు. వెంటనే లే. నన్ను, నీళ్ళను స్పృశించు. ఆ దోషాన్ని పరిహరించు' అని గంభీరంగా అన్నాడు.

భరతుడు లేచాడు. శ్రీరాముని జలాన్ని స్పృశించాడు. చేతులు జోడించి 'రాజ్యం కావాలని నేను తండ్రిని కోరలేదు. నాకు రాజ్యం వచ్చేలా ప్రయత్నించమని తల్లిని ప్రేరేపించలేదు. పరమధర్మజ్ఞుడైన రాముడు అరణ్యవాసం చెయ్యటం నేను అంగీకరించను. పితృవాక్యం తప్పక పాటించాలంటే ఆయన బదులు నేనే అరణ్యవాసం చేస్తాను. రాముడు అయోధ్యను పాలించాలి'. అప్పుడుగాని నాకు మనశ్శాంతి లేదు అని భరతుడు కన్నీరు కారుస్తూ అందరి యెదుట పలికాడు.

రాముడు ప్రియమార తమ్ముని దగ్గరకు తీసుకొన్నాడు. కన్నీరు తుడిచాడు.

భరతా! వెన్నెల చంద్రుణ్ణి వదలితే వదలుగాక. మంచు హిమగిరిని వదలితే వదలుగాక. సముద్రం చెలియలి కట్టను దాటితే దాటుగాక. నేను మాత్రం తండ్రికి చేసిన ప్రతిజ్ఞ అతిక్రమించను. అయోధ్యకు రాను. ఈ పధ్నాలుగేళ్ళు దాటిన తరువాత వస్తాను. రాజ్యాన్ని స్వీకరిస్తాను. అంతవరకు అయోధ్యాపాలన నీకు తప్పదు అని ఖండితంగా చెప్పాడు. అంతేగాదు 'కైకమ్మ ఏ ఉద్దేశంతో చేసినా నీవు మాత్రం ఆమెను తల్లిగా గౌరవించు' అన్నాడు.

*లక్ష్మీశ్చన్ద్రా దపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్ ।*
*అతీయాత్సాగరో వేలాం న ప్రతిజ్ఞామహం పితుః ॥*
*(2-112-18)*

*కామాద్వా తాత లోభాద్వా మాత్రా తుభ్య మిదంకృతమ్ ।*
*న తన్మనసి కర్తవ్యం వర్తితవ్యం చ మాతృవత్ ॥ (2-112-19)*

భరతుని ముఖంలో మెరుపులా ఏదో భావం వెల్లివిరిసింది. 'రామా! నీ పాదుకలు నాకు' అయోధ్యకు, సమస్త ప్రపంచానికి రక్ష. నీ పాదాలతో ఈ పాదుకల నలంకరించి నాకు ప్రసాదించు. ఈ పధ్నాలుగేళ్ళూ రాజ్యాన్ని నీ పాదుకలకు అప్పగించి, జడలు దాల్చి నారచీరలు కట్టుకొని, ఫలమూలాదులు భుజిస్తూ అయోధ్యకు వెలుపల నివసిస్తూ నీ ప్రతినిధిగా రాజ్యపాలన సాగిస్తా. పధ్నాలుగేళ్ళు దాటిన మరునాడు నీవు అగుపించకుంటే అగ్నిప్రవేశం చేస్తా' అని రుద్ధకంఠంతో భరతుడు పలికాడు.

*అధిరోహాఽఽర్య! పాదాభ్యాం పాదుకే హేమభూషితే*
*ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః ॥ (2-112-21)*

*స పాదుకే సమ్ప్రణమ్య రామం వచన మబ్రవీత్ ।*
*చతుర్దశ హి వర్షాణి జటాచీర ధరోహ్యహమ్ ॥ (2-112-23)*

*ఫలమూలాశనో వీర! భవేయం రఘునన్దన!।*
*తవాగమన మాకాంక్షన్వసన్వై నగరాద్బహిః॥ (2-112-24)*

*తవపాదుకయోర్న్యస్త రాజ్యతన్త్రః పరన్తప।*
*చతుర్దశే హి సంపూర్ణే వర్షేऽహని రఘూత్తమ॥(2-112-25)*

*న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్।*
*(2-112-26)*

రాముడు అలాగే అన్నాడు. తన పాదాలతో పాదుకలను అలంకరించాడు. మరి ఈ పాదుకలు రాముని వెంటవచ్చినవో? భరతుడు వెంట తెచ్చినవో? భరతుడు రామపాదుకలు తీసుకొన్నాడు. కళ్ళకద్దుకొన్నాడు. రాముని దగ్గర సెలవు తీసుకొన్నాడు.

రాముడు భరతుని సాగనంపుతూ తమ్ముడూ! కైకమ్మ మీద ఇక కోపపడవద్దు. ఆ తల్లిమీద కోపపడితే నా మీద ఒట్టు, మీ వదిన మీద ఒట్టు అనేసరికి భరతుని కళ్ళనుండి కట్టలు త్రెంచుకొని నీళ్ళు క్రిందికి దూకాయి.

*మాతరం రక్ష కైకేయీం మా రోషం కురుతాం ప్రతి।*
*మయా చ సీతయా చైవ శప్తోऽసి రఘునన్దన!॥(2-112-27)*

అన్నగారి పాదుకలు శిరస్సున ధరించి తమ్ముడు భరతుడు చిత్రకూట శిఖరం మీది నుండి క్రిందికి దిగివస్తుంటే, ఆయనవెంట పురోహితులు, మంత్రులు, సామంతులు, పౌరజానపదప్రముఖులు నడచి వెళ్ళుతుంటే, చతురంగబలాలు ప్రయాణానికి సిద్ధమై సాగిపోతుంటే - కొండమీది సెలయేళ్ళన్నీ గలగల కదలి వచ్చి చూచాయి. అడవిలోని చెట్లన్నీ ఉత్కంఠతో ఊగిచూచాయి. చుట్టు ప్రక్కల తీవలన్నీ కొమ్మలెక్కి తొంగి చూచాయి. పక్షులన్నీ ఒకసారి పైకెగిరి చూచాయి. నేలమీది మృగాలన్నీ పరుగులు తీసి చూచాయి.

మానవ చరిత్రలో అదొక అపూర్వదృశ్యం. ధర్మరక్తికి, భ్రాతృభక్తికీ, త్యాగశక్తికి అదొక గొప్ప తార్కాణం.

అయోధ్యకు అనతిదూరంలోనే ఉంది నందిగ్రామం. ఆ గ్రామంలోనే జరిగింది రామపాదుకాపట్టాభిషేకం. అదృష్టమంటే ఆ గ్రామానిదే. అనుకోకుండా పట్టింది దానికి రాజధానీ మహాయోగం.

రామపాదుకలు పధ్నాలుగేళ్ళు రాజ్యం చేశాయి. అనాయాసంగా చేతికందిన అయోధ్యా మహారాజ్యాన్ని, అనుభవిస్తూ ఉన్న అఖండ భోగ భాగ్యాలను అలవోకగా త్రోసిపుచ్చి జడలు దాల్చి, పదునాలుగేళ్ళు ఆ పాదుకాసేవకుడుగా రాజ్యపాలనా వ్యవహారాలు చూస్తూ జీవితం గడిపాడు భరతుడు.

ఏమిత్యాగం! ఎంత మనోనిగ్రహం!

అది పధ్నాలుగేళ్ళు పూర్తి అయిన తరువాతిరోజు. రాముడు రావలసినరోజు. అరుణోదయమైంది. రాముడు ఇంకా రాలేదు. అప్పటికే మంత్రులతో, పురోహితులతో, దండనాథులతో భరతుడు కొలువు దీరాడు. అన్న రాలేదే అని దిగులు పడుతూ అందరితో అదే విషయం మాట్లాడు తున్నాడు. అంతలోనె హనుమంతుడు వచ్చాడు. రామాగమన వార్త తెచ్చాడు. చల్లగాలి వీచినట్లుంది. వెన్నెల కురిసినట్లుంది. కమ్మని పరిమళం కలయబ్రాకినట్లుంది. ఎంతో భారం తలమీది నుండి దించినట్లుంది.

భరతుని ఆనందానికి అవధి లేదు. ఆయన హనుమంతుణ్ణి కౌగిలించుకొన్నాడు. నీవు దేవతవో మనుష్యుడవో తెలియటం లేదన్నాడు. ఇంత ప్రియవార్త తెచ్చిన నీకు శతసహస్రగోవుల నిస్తానన్నాడు. వంద గ్రామాలదానం చేస్తానన్నాడు. సౌందర్య వతులు, సర్వాభరణ భూషితలు, వివాహ యోగ్యలు అయిన షోడశకన్యల నిస్తానన్నాడు.

*దేవో వా మానుషో వా త్వ మనుక్రోశా దిహాగతః।*
*ప్రియాఖ్యానస్య తే సౌమ్య దదామి బ్రువతః ప్రియమ్॥*
(6-128-42)

*గవాం శత సహస్రం చ గ్రామాణాం చ శతంపరమ్।*
*సుకుండలా శ్శుభాచారా భార్యాః కన్యాశ్చ షోడశ॥*
(6-128-43)

ఇదంతా భరతుని ఆనందంగాని - అవన్నీ ఆంజనేయస్వామి కెందుకు?

భరతుడు ఆయనచేత అరణ్యంలో జరిగిన రామకథ అంతా చెప్పించుకొని విన్నాడు. శత్రుఘ్నుని పిలిచి పెద్ద యెత్తున స్వాగత సత్కారాలకు ఏర్పాట్లు చేయించాడు. రామపాదుకలు స్వయంగా శిరస్సున ధరించి, శ్వేతఛత్రచామరాదులతో, మంత్రిపురోహిత సామంత దండనాథులతో, సమలంకృత చతురంగ బలాలతో, ఆనందోత్సాహాలతో అన్నను ఎదుర్కోటానికి బయలుదేరాడు.

రాముడు ఇంకా అగుపించలేదు. క్షణక్షణం యుగయుగంగా ఉంది. మనస్సు బాధగా ఉంది. అనుమానం అధికమౌతూ ఉంది. భరతుడు 'హనుమంతా! నీవు చాపలంతో అన్న వస్తున్నాడని చెప్పలేదుగదా - ఆయన ఇంకా అగుపించలేదే' అన్నాడు.

*కచ్చిన్న ఖలు కాపేయీ సేవ్యతే చలచిత్తతా* (6-130-22)
*నహి పశ్యామి కాకుత్స్థం రామ మార్యం పరంతపమ్।*
(6-130-23)

అంతలోనే ఆకాశంలో మెరుపులా విమానం. విమానంలో మేరుపర్వతం మీది సూర్యునిలా శ్రీరామచంద్రుడు. ఆనందపరవశుడై అన్నగారికి భరతుడు నమస్కరించాడు.

*తతో విమానాగ్రగతం భరతో భ్రాతరం తదా।*
*వవన్దే ప్రయతో రామం మేరుస్థ మివ భాస్కరమ్॥* (6-130-36)

విమానం నేల మీదికి దిగగానే మహానందంతో మరొకసారి అన్నగారికి నమస్కరించాడు.

రామ మాసాద్యముదితః పునరే వాభ్యవాదయత్।

చెంతచేరి ప్రణమిల్లిన భరతుని రాముడు గ్రుచ్చి ఎత్తి తన తొడపై కూర్చుండబెట్టుకొన్నాడు. కౌగిలించుకొన్నాడు.

*తం సముత్థాప్య కాకుత్స్థ శ్చిర స్యాక్షి పథం గతమ్।*
*అఙ్కే భరత మారోప్య ముదితః పరిషస్వజే॥*

*(6-130-39)*

భరతుడు జన్మతరించినట్లు భావించాడు. తరువాత లక్ష్మణుని సంభావించాడు. వదినెగారికి నమస్కరించాడు. తన్ను తాను పరిచయం చేసుకొన్నాడు. సుగ్రీవాంగదాదులను గాఢంగా కౌగిలించుకొన్నాడు. విభీషణుని కుశలమడిగినాడు. సుగ్రీవుని మరొకసారి గాఢంగా కౌగిలించుకొన్నాడు. నీవు మాకు అయిదవ తోబుట్టువు వన్నాడు.

*త్వ మస్మాకం చతుర్ణాంతు భ్రాతా సుగ్రీవ! పంచమః।*

*(6-130-45)*

స్వహస్తాలతో పాదుకలు రాముని పాదాలకు అలంకరించి 'అన్నా! నా జన్మ చరితార్థమైందన్నాడు. నీ ప్రతినిధిగా ప్రభుత్వకోశాన్ని, ధాన్యాగారాన్ని, పట్టణాన్ని, సైన్యాన్ని పదింతలుగా వృద్ధిపొందించాను. అంతా మీ అనుగ్రహమే. మీ రాజ్యాన్ని మీకు అప్పగిస్తున్నాను' అని నమస్కరించాడు.

భరతుని భ్రాతృభక్తికి, ధర్మప్రవృత్తికి వానరులు, విభీషణుడు ఆనందబాష్పాలు రాల్చారు.

ఆ తరువాత అయోధ్యలో శ్రీరామపట్టాభిషేకం. అది అందరికి ఆనందామృతం.

భరతుడు రామాజ్ఞ శిరసావహించి గాంధారదేశాన్ని జయించాడు. అన్న ఆజ్ఞమేరకే తనపుత్రులైన తక్ష పుష్కలులను తక్షశిలా పుష్కలావత

నగరాలకు అధిపతులగావించాడు. అయిదేళ్ళు అక్కడే ఉండి అన్ని ఏర్పాట్లు గావించి ఆవల అయోధ్యకు తిరిగి వచ్చాడు.

చివరి దశలో శ్రీరామచంద్రుడు సరయూప్రవేశాన్ని సంకల్పించి అయోధ్యకు నిన్నభిషేకిస్తానన్నప్పుడు గూడ భరతుడు సవినయంగా ఆయనమాట త్రోసిపుచ్చాడు. రాముడులేని రాజ్యం నా కక్కరలేదన్నాడు. కుశలవులను అభిషిక్తులను చేయండని కోరాడు. శత్రుఘ్నుని శీఘ్రమే పిలిపించండన్నాడు. స్వర్గారోహణకు తమకు గూడ అనుమతి నిమ్మని అర్థించాడు.

*న కామయే యథారాజ్యం త్వాం వినా రఘునన్దన (7-107-6)*
*ఇమౌ కుశలవౌ రాజ న్నభిషించ నరాధిప ॥ (7-107-7)*

*శత్రుఘ్నస్యతు గచ్ఛంతు దూతాస్త్వరిత విక్రమాః।*
*ఇదం గమన మస్మాకం స్వర్గాయాఖ్యాంతు మాచిరమ్ ॥*
*(7-107-8)*

ఆఖరు క్షణంలో గూడ భరతుడు అన్ననే అనుసరించాడు గాని, అయోధ్యను కోరలేదు. జీవితమంతా తన్ననుసరించిన శత్రుఘ్నుని విస్మరించలేదు. రామునితో పాటు భరతుడు సరయూప్రవేశం చేశాడు. స్వర్గం చేరుకొన్నాడు. రామాయణంలో భరతుడు అన్నకు తగ్గ తమ్ముడు. తల్లితో ఏకీభవించని తనయుడు . భ్రాతృభక్తి, ధర్మరక్తి, త్యాగనిరతి మూర్తీభవించిన పురుషుడు.

# 13. రామాయణ స్త్రీపాత్రలు - తారా మండోదరీ సీతలు

డా. అప్పజోడు వేంకటసుబ్బయ్య

గజరాజును గూర్చిగాని, గడ్డి పరకను గూర్చిగాని, గులకరాతిని గూర్చిగాని వ్రాసే కావ్యఖండికల్లో పాత్రప్రాధాన్యం, విశేషించి స్త్రీ పాత్ర పాధాన్యం లేక పోవచ్చుగాని మానవ జీవితాన్ని చిత్రించి జాతికి మహిత సందేశా లిచ్చే మహాకావ్యాల్లో పాత్ర ప్రాధాన్యం ప్రత్యేకించి స్త్రీపాత్ర ప్రాధాన్యం ఎంతైనా ఉంటుంది. సమాజంలో ఎంత పురుషప్రాధాన్యమున్నా స్త్రీపాత్రను పూర్తిగా విస్మరించటానికి వీలుండదు. స్త్రీపురుషుల కలయికలో సమతా సరసతలు లేకుంటే జీవితం అసంపూర్ణం; శోభావిహీనం; శూన్యం.

భారతీయసమాజం అతి ప్రాచీనకాలంలోనే స్త్రీపాత్ర ప్రాధాన్యాన్ని గుర్తించింది. సమాజముఖమైన బాధ్యతను పురుషుడు స్వీకరించినా అతని జీవితం విస్తృతి పొందటంలో, ఎత్తు ఎదగటంలో, వెలుగు వెలగటంలో, చరితార్థతను సాధించటంలో స్త్రీపాత్ర ఎంత ప్రాధాన్యం వహిస్తుందో గుర్తించటం గూడా జరిగింది. ఆమె నొకపవిత్రజీవితభాగస్వామినిగా సహధర్మచారిణిగా అర్ధాంగిగా ఆదరించటమూ, ఆరాధించటమూ జరిగింది. అందుకే ఆర్షకవులు తమకావ్యాల్లో పురుషపాత్రలతో పాటు స్త్రీపాత్రలకు గూడ అధిక ప్రాధాన్య మిచ్చారు. పురుషస్వభావంలోని శిఖరాలను, లోయలను, మలుపులను చిత్రించినట్లే స్త్రీ స్వభావంలోని శిఖరాలను, లోయలను, మలుపులను చిత్రించి చూపారు. మానవ జీవితానికి తమ కావ్యాలను పెద్దనిలువుటద్దాలుగా ఉంచారు. మానవజాతికి మహోన్నత సందేశాలిచ్చారు.

రామాయణంలో పురుషపాత్ర లెంత ప్రాధాన్యం వహించాయో స్త్రీపాత్రలు గూడ అంత ప్రాధాన్యం వహించాయి. రామాయణాన్ని మలుపు త్రిప్పిన పాత్రలు గూడ స్త్రీపాత్రలే. ఎంత చిన్న పాత్ర అయినా మంథర పాత్ర

లేకుంటే రామాయణం బహుశః అయోధ్య కాండలోని యౌవరాజ్యాభిషేకం తోనే ఆగిపోయేదేమొ. ఎంత చిన్న పాత్ర అయినా శూర్పణఖ పాత్ర లేకుంటే రామాయణం అరణ్య కాండతోనే ముగిసి ఉండేదేమో. సీత లేకుంటే రావణ సంహారమే లేదు. రావణ సంహారమే లేకుంటే రామ పాత్ర ప్రాధాన్యమేలేదు. రామాయణ మహాకావ్యమే లేదు. అందుచేతనే కొందరు రామాయణాన్ని సీతాచరిత మని గూడ ( సీతాయాశ్చరితం మహత్ 1-4-7) చెప్పటం జరిగింది.

రామాయణంలో ప్రధాన జాతులు మూడు - నరులు, వానరులు, రాక్షసులు. ప్రధాన రాజ్యాలు మూడు- అయోధ్య, కిష్కింధ, లంక ఈ మూడు జాతుల్లో ఈ మూడు రాజ్యాల్లో పాఠకుని దృష్టిని ప్రధానంగా ఆకర్షించే స్త్రీపాత్రలు గూడ మూడు - సీత, తార, మండోదరి. మూడు పాత్రలూ మహోన్నత పాత్రలు, మూడు పాత్రలూ మరపురాని పాత్రలు.

తార ఆకుచాటు పువ్వులా 'చెట్టుకు అల్లుకొన్న తీవలా' అందమైన మూగ బొమ్మలా ఎంతకాలమో కిష్కింధా రాజ్యాంతః పురంలో జీవితం గడిపింది. అయినా అటు భర్త జీవితంలో ఇటు తన జీవితంలో కొన్ని విషమ పరిస్థితు లేర్పడినపుడు ఆమె చూపిన చొరవ, ప్రదర్శించిన ప్రజ్ఞావిశేషాలు అనుపమానాలు సుగ్రీవుని మీదికి రెండవసారి యుద్ధానికి వెళ్ళే వాలికి ఆమె చేసిన హితబోధ, వాలిని వధించిన రామునితో ఆమె మాటాడిన తీరు, మహోగ్రుడై సుగ్రీవుని చంపవచ్చిన లక్ష్మణునితో ఆమె వ్యవహరించిన విధం మహోదాత్తమైన ఆ వానరకాంతవ్యక్తిత్వానికి మకుటాయమానాలు.

తార సూక్ష్మబుద్ధిగల వ్యక్తి 'దూరదృష్టిగల వ్యక్తి' పరిస్థితులను చక్కగ తూకము వేయగల వ్యక్తి 'సుగ్రీవుని సింహగర్జనలోని ఊపును' దాని వెనుక ఉన్న ప్రాపును ఆమె వెంటనే గ్రహించింది. మహావీరులైన రామలక్ష్మణులు సుగ్రీవునికి సాయంగా ఉన్నారని, రాముడు సకలసద్గుణశోభితుడని, సాధుజన సంరక్షకుడని, అరిజన భయంకరు డని అలాంటి మహానుభావునితో వైరం అనర్థదాయక మని సమర్థుడైన తమ్ముడు

సుగ్రీవుణ్ణి ప్రియమార పిలిచి యువరాజుగా చేసుకొమ్మని యుద్ధ ప్రయత్నం విరమించి తమ్మునితో కలిసి సర్వసుఖాలు అనుభవించ మని, పరిస్థితులను చక్కగ పరిశీలించి, రానున్న ప్రమాదాలను దూరదృష్టితో గ్రహించి అన్నింటిని తార్కికంగా వివేచించి, మృదుమధురంగా వాలికి హితబోధచేసింది. తార చేసిన హితబోధ వాలి సుగ్రీవులకే గాదు. లోకంలో కలహ శీలురైన ఏ అన్న దమ్ములకైనా తారక మంత్రమే.

కాని ఏం లాభం 'వినాశకాలే విపరీతబుద్ధిః'. వాలి ఆమెమాట వినలేదు. రామబాణానికి అతడు బలికాక తప్పలేదు.

తార భర్తకళేబరం మీద పడి విలపించింది, ఎంతగానో విలపిం చింది. ప్రక్కనే నిలిచి ఉన్న రాముని వైపు తల మలిపి అలా ఒక్క సారి చూచింది. ఆమె చూపులో నీటి బిందువు లున్నాయి, నిప్పురవ్వ లున్నాయి. నెత్తురు చుక్క లున్నాయి. అంతటి రామునికి ఆమెవైపు ఎలా చూడాలో తెలియలేదు. ఆ విగతభర్తృకను ఎలా ఓదార్చాలో అంతకంటె తెలియలేదు. తార గద్గద కంఠంతో రామా ! నీవు అప్రమేయుడవు. 'దుర్లభుడవు' జితేంద్రియుడవు, ధార్మికుడవు, కీర్తి సంపన్నుడవు, సర్వసమర్థుడవు గదా నీవు ఏ బాణంతో నాప్రియుని వాలిని వధించావో అదే బాణంతో నన్ను వధించి నా ప్రియునితో కలుపుమన్నది. రాముడంటే రమింపజేసే వా డని అర్థం గదా వాలితో నన్ను కలిపి ఆ పేరు సార్థకం చేసుకొమ్మన్నది. ఋశ్యమూకం మీద సీతావిరహంతో నీవెంత బాధపడుతున్నావో స్వర్గలోకంలో నావిరహంతో వాలి గూడ అంతే బాధ పడతా డన్నది. యౌవనంలో ఉన్న పురుషునికి భార్యావిరహం ఎంత బాధాకరమో నీకు వేరుగా చెప్పాలా అన్నది. అందుచేత శీఘ్రంగా నన్ను వధించి వాలికడకు పంపు మన్నది. స్త్రీ హత్య మహాపాతక మని సంకోచిస్తా వేమో? వాలి ఆత్మే తార అని భావించి వధించమన్నది.అన్ని దానాల్లోకి భార్యాదానం గొప్ప దని ఆర్యులన్నారు గదా.నన్ను వధించి స్వర్గానికి పంపి వాలికి భార్యాదానం చెయ్యమన్నది. పుణ్యాం ఆర్జించు కొమ్మన్నది. ఆపుణ్యంతో

వాలి వధ వలన గలిగిన వీరహత్యాపాపం బాపు కొమ్మన్నది.

రాముడు రాతి బొమ్మలా నిలబడ్డాడు. తార ఇతర స్త్రీలవలె ఈ ఘట్టంలో ఏడుస్తూ చతికిల బడలేదు. అట్లని నిండుదనాన్ని గోల్పోయి నోరు చేసుకొని అటు సుగ్రీవుణ్ణి గాని, ఇటు శ్రీరాముణ్ణిగాని తేలికగా తిట్టలేదు. ఆమె కెంతో అపకారం జరిగింది. ఆమె ఎంతో దుఃఖపడింది. అయినా ఆమె మాటల్లో ఆవేశం ఉంది గాని అవివేకం లేదు. ఆవేదన ఉంది గాని అల్పత్వం లేదు. తారది అంత ఉదాత్త వ్యక్తిత్వం అయితే తార మాటలు దూది మేకులు గావు. అవి వాడి ములుకులు. రామ బాణాల కవి పదునులో ఏమాత్రం తీసిపోవు. వాలికి అంత్యక్రియలు జరిగాయి. సుగ్రీవునికి యౌవరాజ్యాభిషేకం జరిగింది. అంగదుడు యువ రాజయ్యాడు. వానరసంప్రదాయం ప్రకారం కాబోలు, తార సుగ్రీవుని ప్రియురాలైంది. ఆమె జీవితంలో క్రొత్త అధ్యాయం ఆరంభమైంది. తారా సుగ్రీవులు శృంగార పరవశులై కాలం గడుప సాగారు. శరత్కాలం వచ్చినా సుగ్రీవుడు సీతాన్వేషణ ప్రారంభించ లేదు.

ఆనాడు లక్ష్మణుడు ఆగ్రహోదగ్రుడై అగ్నిహోత్రునిలా మండి పడుతూ తారా సుగ్రీవులున్న అంతః పురానికి వచ్చాడు. వాళ్ళు సంభోగ పరవశులై ఉన్నారు. లక్ష్మణుడు ధనుష్టంకారం చేశాడు. అది వినేసరికి సుగ్రీవుని గుండెలదిరాయి. గడగడ వణుకుతూ తారా! ఈ గండం నీవే గడిపించు అని బ్రతిమాలు కొన్నాడు.

తార సుగ్రీవుని భయ తీవ్రతను తెలుసుకొన్నది. లక్ష్మణుని ఆగ్రహావేశాన్ని అర్థం చేసుకొన్నది. అలాగే శయ్యదిగి జారిపోయే చీరను ఒకచేత సవరించుకొంటూ ఊడిపడే వడ్డాణాన్ని ఇంకోచేత ఒత్తి పట్టుకొంటూ చెదిరిన కురులతో సంభోగ చిహ్నాలతో స్తనభార వినమ్ర శరీరంతో ఆసమున్నతగంభీరస్త్రీమూర్తి జంకుగొంకులు లేకుండ సరాసరి నడిచి వచ్చింది. మద్యపానమదోన్మత్తతచే మూతపడే కనురెప్పలను ఒకింత పైకెత్తి సూటిగా అతని ముఖంలోకి చూస్తూ లక్ష్మణా! ఎందు కీ కోపం? ఎవరిమీద?

అని అని సమాధానం కోసం ఎదురు చూడకుండానే ఎవరైనా నీఆజ్ఞ అతిక్రమించారా? అంది. అయినా దావానలం మీద ఎవరు దూకుతా రన్నది. ఆమె వచ్చిన తీరు, మాటాడే పైఖరి చూచేసరికి లక్ష్మణుడు సగం చల్ల బడ్డాడు 'అంత కంత తగ్గి పోయాడు' గొంతు సవరించుకొని స్వరం బిగబట్టి సుగ్రీవుడు రామకార్యం మరచాడు. శరత్కాలం వచ్చినా సీతాన్వేషణ సాగించలేదు. కామ మోహితుడై కాలం గడుపు తున్నాడు. అని గ్రుక్క త్రిప్పుకోకుండా పలికాడు.

తార అల్లననవ్వి లక్ష్మణా! సుగ్రీవుడు మీ మిత్రుడు మీ పనిమీదనే ఉన్నాడు. మీరు చేసిన ఉపకారం మాకు తెలుసు. చెయ్యవలసిన ప్రత్యుపకారం గూడ తెలుసు. కాకుంటే సుగ్రీవు డిప్పుడు మన్మథాధీనుడు. అంతే గదా మన్మథాధీనుడైన సుగ్రీవుని మీద నీ ఆగ్రహం చూస్తే నీకు మన్మథ వ్యాపార పరిజ్ఞానమే లేనట్లుందే ! కామ పరవశులు దేశకాలాదులను గాని ధర్మార్థాలను గాని గుర్తించ రని తెలుసుకో. 'మన్మథ' పరవశులై మహర్షులే కాలాన్ని మరచి పోతుంటే మావానరుల సంగతి చెప్పాలా? అయినా సుగ్రీవుడు రామకార్యం మరువలేదు. అందుకొరకే సర్వసైన్యాన్ని సమీకరిస్తున్నాడు అని అతనిని నిరుత్తరుణ్ణి చేస్తుంది. లోనికి వచ్చి సుగ్రీవునితో మాట్లాడు మని పిలిచింది.

లక్ష్మణుడు లోనికి వెళ్ళి సుగ్రీవుని మీద మరల ఆగ్రహపడగా తార లక్ష్మణా! ఇది నీకు తగదని గట్టిగా చెప్పింది. నీవంటి ధర్మజ్ఞుడు, సత్త్వసంపన్నుడు, మహాపురుషుడు అంతః పురంలో ఈ విధంగా ప్రవర్తించటం ఉచితంగా లేదన్నది. కోపం ఆపుకొమ్మ న్నది. పరిస్థితులను అర్థం చేసుకొమ్మన్నది. వానరసైన్య సాహాయ్యం లేకుండా రావణుని జయించటం సాధ్యం గా దన్నది. అందుకే సుగ్రీవుడు అన్ని దిక్కుల్లో ఉండే వానరసైన్యాన్ని సమీకరిస్తున్నా డన్నది. కొంత ఆలస్యం తప్ప దన్నది. అంతః పురకాంతలంతా నీ కోపం చూచి అదరి పడుతున్నారు. ఉచితజ్ఞుడివై నీకోపాన్ని ఉపసంహరించుకొమ్మన్నది.

అగ్ని పర్వతంలా వచ్చిన లక్ష్మణుడు మంచుగడ్డలా మారిపోయాడు. తారవ్యక్తిత్వం అంత ఉన్నతం! మగువుల ధైర్యానికి, దక్షతకు, ఉదాత్తతకు, మాటనేర్పుకు మారుపేరు తార. తారను తమ్మునికి అప్పగిస్తూ వాలి చెప్పిన వాక్యాలు ఆమె వ్యక్తిత్వానికి నిలువుటద్దాలు.

*సుషేణ దుహితాచేయ మర్థసూక్ష్మ వినిశ్చయే।*
*ఔత్పాతికే చ వివిధే సర్వతః పరినిష్ఠితా॥*
*య దేషా సాధ్వితి బ్రూయా త్కార్యం త న్ముక్తసంశయమ్।*
*నహి తారామతం కించి దన్యథా పరివర్తతే॥*

రామాయణం లో తార ఒక మరపు రాని స్త్రీ పాత్ర.

X - X - X

మండోదరి మహాసౌందర్యవతి. అంతకు మించి గుణవతి మహోదాత్త వ్యక్తిత్వ శోభావతి. ఆమె తండ్రి మయుడు దానవరాజు. ఆమె తల్లి హేమ అప్సరస. ఆమె తన ఆభిజాత్యానికి, ఐశ్వర్యానికి, అందానికి, అభిరుచికి తగిన భర్తను పొందాలని కలలు గన్నది. పులస్త్యబ్రహ్మ పౌత్రుడు, విశ్రవసబ్రహ్మ పుత్రుడు, వేదవేదాంగ పారంగతుడు, వరదాన బలాన్వితుడు, త్రిజగద్విజయవిఖ్యాతుడు, లంకేశ్వరుడు అయిన రావణుని భర్తగా పొందింది. లంకామహాసామ్రాజ్యానికి పట్టమహిషి అయింది. మితిలేని భోగాలు అనుభవించింది. ఇంద్రజిత్తువంటి మహావీరుని కన్నతల్లి అయింది. అంతకంటే స్త్రీజీవితంలో ఇంకేం కావాలి.

ఆ స్థితిలో రావణుడు పెడదారి పట్టాడు. కాముకుడై వేదవతిని వేధించాడు. శాపగ్రస్తు డయ్యాడు. దేవగంధర్వ ఋషికన్యలను అపహరించాడు. శాపగ్రస్తు డయ్యాడు. రంభను మానభంగం చేశాడు. శాపగ్రస్తు డయ్యాడు. పుంజికస్థలను పట్టి బాధించాడు. శాపగ్రస్తు డయ్యాడు. ఎందరెందరో పతివ్రతలను బలాత్కరించాడు. శాపగ్రస్తు డయ్యాడు.

ఈ భర్త స్థితికి ఆ భార్య ఎంత బాధపడిందో! అయినా రావణుడు అంతతో ఆగలేదు. చివరకు శ్రీరామపత్ని సీతను అపహరించి తెచ్చాడు.

అశోకవనిలో ఉంచాడు ఎంద రెంత చెప్పినా వినకుండా ఆమెను అనుభవించా లని ఆశించాడు. సీతను అపహరించి తెచ్చింది మొదలు లంకలో అన్నీ అపశకునాల్లే అన్నీ ఉత్పాతాలే అయినా రావణుడు లెక్కపెట్టలేదు. చివరకు అనుకొన్న యుద్ధం రామునితో రానే వచ్చింది. పేరు మోసిన రాక్షస వీరులంతా రణ భూమికి బలి అయ్యారు. అయినా రావణుడు మారలేదు. కడకు అతడే పెను తుఫానుకు పెల్లగిలి పడిన మహావృక్షంలా యుద్ధభూమిలో కూలిపోయాడు.

ఇది మండోదరి జీవితంలో పెద్ద విపరీత స్థితి. అయినా ఆమె సమ తను గోల్పోలేదు. శత్రువు శ్రీరామచంద్రుని గాని మరది విభీషణుని గాని చులకనగ మాట్లాడలేదు. మండోదరి అప్పుడు అంతఃపురం నుండి వెలుపల అడుగు పెట్టింది. యుద్ధభూమికి వెళ్ళింది. భర్త కళేబరం మీద బడి ఆయన తలను చేతుల్లోకి తీసుకొంది. ఆమె మనస్సులో ఏవేవో ఆలోచనలు ఎన్నెన్నో అనుభూతులు ఒకవైపు ఆశ్చర్యం, మరోవైపు దుఃఖం, ఇంకోవైపు నైరాశ్యం.

ప్రభూ ! ముల్లోకాలను గడగడలాడించిన మీకా మరణం! అందులోనూ ఒక మానవుని చేతనా ! ఎంత వైపరీత్యం! మృత్యుదేవతే మీరంటే గడగడ లాడుతుందే అలాంటి మీకు మరణమా! అని ఆమె ఆశ్చర్యపోయింది.

రాముడు మానవమాత్రుడు గాదు. ఖరదుషణాదుల వధతో హనుమంతుని లంకా ప్రవేశంతో సేతుబంధనంతో ఆ సంగతి తేలి పోయింది. ఆయన పరమాత్ముడు. మానవరూపం ధరించిన శ్రీమహావిష్ణువు. అందు చేతనే మిమ్మల్ని వధించ గలిగాడు అని శ్రీరామచంద్రుని మహత్వాన్ని గుర్తించింది; శ్లాఘించింది.

అంతేగాక మరణానికి దారి తీసిన రావణుని బలహీనతను గూడ ఆ సమయంలో ఆమె స్మరించటం విశేషం. స్వామీ! ఇది వరలో మీరు ఇంద్రియాలను జయించారు. ముల్లోకాలను జయించగలిగారు. ఆ వైరాన్ని

గుర్తుంచుకొని ఇంద్రియా లిప్పుడు మిమ్మల్ని జయించాయి. మీరు శత్రువు చేతిలో హత మయ్యారు.

*ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా ।*
*స్మరద్భిరివ తద్వైరం ఇంద్రియైరేవ నిర్జితః ॥*

*VI – III- 15, 16*

అన్న మండోదరీదేవి తాత్త్విక దర్శనం అమోఘం.

ఆభిజాత్యంలో అందచందాల్లో సీత నాకంటే అధికురాలు గాదు. సమానురాలు గూడ గాదు. అయినా కామమోహితులైన మీరు ఈసంగతి గుర్తించలేక పోయారని భర్త నడిగింది.

*న కులేన న రూపేణ దాక్షిణ్యేన చ మైథిలీ ।*
*మయాధికా వా తుల్యావా త్వం తు మోహాన్న బుద్ధ్యసే ॥*

*VI – III- 28*

అరుంధతి మున్నగు పతి వ్రతల కంటే మిన్న యైన సీతా దేవిని చెరబట్టిన పాపఫలమే ఈ రీతిగ పరిణమించిం దని భర్త మరణానికి కారణభూతు రాలైన సీతాదేవి పాతివ్రత్యాన్ని, భర్త దుర్మార్గాన్ని తలపోయటం ఆమె వ్యక్తిత్వం లో ఒక గొప్ప విశేషం.

అయినా మీరు లోకాల నాక్రమించిన మహా శూరులే, క్షుద్రమ్మైన ఈ నారీ చౌర్యానికి ఎలా పాల్పడ్డారని ఆమె భర్త అకృత్యాన్ని విమర్శించింది.

*కథం చ నామ తే రాజ న్లోకా నాక్రమ్య తేజసా ।*
*నారీ చౌర్య మిదం క్షుద్రం కృతం శౌణ్డీర్యమానినా ॥*

*VI – III-67, 68*

విభీషణుని పల్లెత్తు మాటగూడ అనకుండ అతని ధార్మికదృష్టిని విజ్ఞతను ప్రస్తావించింది.

స్వామీ! మీరు జీవితాన్ని లెస్సగా అనుభవించారు. అనేక ఘన కార్యాలు చేశారు. వీరమరణం పొందారు. మీమార్గం మీరు చూచు కొన్నారు. న న్ననాథగా చేసి వెళ్ళారు అని భర్త కళేబరం మీద బడి పరిపరి విధాల శోకించింది.

ఈస్థితిలో సామాన్యస్త్రీలైతే శత్రువీరులను ఎంతగా నిందించేవారో! విభీషణుని విశేషించి ఎంతగా దూషించే వారో!

కాని మండోదరి పరులను నిందించ లేదు. గతాన్ని, భర్త ప్రవర్తన విధానాన్ని సమ్యగ్దృష్టితో సమీక్షించింది. పరిస్థితులను వ్యక్తుల గుణదోషాలను సవ్యంగా అర్థంచేసుకొని అంతటి దుఃఖాన్నీ ఆ సమయంలో భరించింది. రాక్షసవంశంలో జన్మించినా, రావణుని అర్ధాంగి అయినా ధర్మదృష్టి, తాత్త్విక చింతన గల మహోదాత్త స్త్రీమూర్తిగా వ్యవహరించింది.

X - X - X

భారతీయ సమాజం ప్రాచీన కాలంలోనే దాంపత్యం ఎంత ప్రధానమైందో ఎంత పవిత్రమైందో దర్శించింది. పాతివ్రత్యాన్ని ఏకపత్నీ వ్రతాన్ని దాంపత్య పరమధర్మాలుగా రూపొందించింది. వివాహాన్ని ఒక ప్రధానజీవిత యజ్ఞంగా తీర్చి దిద్దింది. రామాయణంలో సీతారాములు పాతివ్రత్యానికి ఏకపత్నీవ్రతానికి ప్రతీకలుగా నిలిచారు. భారతీయ భార్యా భర్తలకు ఆదర్శ మూర్తు లయ్యారు. ఆరాధ్య దైవా లయ్యారు.

రామాయణంలో సీతాదేవి పుట్టుకే ఒక అద్భుతం ఆమె అయోనిజ, జనక మహారాజు యజ్ఞం చెయ్యాలని భూమి దున్నితే నాగేటి కొమ్ముకు తగులుకొన్న పెట్టెలో పసిపాపగా సీత కన్పించింది. జనకుని కన్న కూతురి కన్న మిన్నగా పెరిగింది.

సీతా వివాహం గూడ సామాన్యమైన విషయం గాదు. అది ఆనాడు యావద్భారతాన్ని ఆకర్షించిన రసవత్తర సన్నివేశం. సీతావివాహంతో ఆమె జీవితం క్రొత్తమలుపు తిరిగింది. రావణ నాశానికి నాంది జరిగింది.

అయితే సీత జీవితంలో అన్నీ చిత్రమైన మలుపులే. నాటకీయ పరిణామాలే. విషమ పరీక్షలే. అత్తవారింటికి వచ్చిన సీత శ్రీరామచంద్రుని అర్ధాంగిగా, కాబోయే మహారాణిగా ఎన్నెన్నో భోగాలు అనుభవించా లని ఎంత

గానో జీవితంలో ఆనందించా లని కలలు గనటం సహజమే. కాని ఒక్కసారిగ పరిస్థితులు తారుమారయ్యాయి. అభిషిక్తుడై అయోధ్యను ఏలవలసిన రాముడు అరణ్యాలకు వెళ్ళవలసి వచ్చింది. అందులోనూ పధ్నాలుగేళ్ళు. అప్పుడు సీత అయోధ్యలో ఆగలేదు. అరణ్యాలకు వెళ్ళటం మానలేదు. రాముడు అరణ్యవాసం ఎంత భయంకరమో ఎంత బాధాకరమో వివరించి చెప్పాడు. ఆమెను వారించటానికి అనేక విధాల ప్రయత్నించాడు.

అయినా సీత ఆగలేదు. రామా! నీతో కూడి ఉండటమే నాకు స్వర్గం. నీవు లేకుండా ఉండటమే నరకం. నీపట్ల నాకున్న ప్రేమను తెలుసుకొని న న్నడవికి తీసుకొని పొ మ్మని భర్తను ప్రార్థించింది.

*య స్త్వయా సహ స స్వర్గో నిరయో య స్త్వయా వినా।*
*ఇతి జాన న్పరాం ప్రీతిం గచ్ఛ రామ మయా సహ॥* 78-30-18

అని భర్త వెంట అడవులకు వెళ్ళి అనేక కష్టాలనుభవించింది.

మాయామృగ దర్శనం సీత జీవితంలో ఒక చెడు సంఘటన. రాజాంతః పురభోగాలనే త్యజించి వచ్చిన ఆమె ఆ మాయా మృగాన్ని ఎందుకు కోరుకోవాలి? పుత్రసముడైన లక్ష్మణుని అనరాని మాటలు ఎందుకు అనాలి? రావణుని మాయాజాలంలో ఎందుకు చిక్కుకోవాలి? మహర్షుల మధ్య మగనితో కలిసి జీవితం గడుపవలసిన మానినీమణి అశోకవనంలో రాక్షసుల మధ్యకు ఎందుకు చేరాలి? అంత విధివైపరీత్యం.

రాక్షసుల మధ్య ఆ నరకయాతనను సీతాదేవి ఎంతో ఓర్పుతో అనుభవించింది. అనుక్షణం భర్తకొరకు ఎదురు చూచింది. రావణుని ప్రలోభాలను అదరింపులను బెదిరింపులను ఏదోవిధంగా భరిస్తూ ప్రతిక్షణం పతిధ్యానంలో గడిపింది. ఆ విధంగా అశోకవనంలో రాక్షసుల మధ్య ఉన్న సీత అసత్యాపవాదం చే చెడిన కీర్తిలా ఉందట. ఆ వృత్తిలేకమరచిన వేదవిద్యలా ఉందట. మంచుచే కాంతి తటిగిన పద్మం లా ఉందట. శూరులు హతులు కాగా భయపడి పరుగెత్తే సేనలాఉందట, చీకటిచే కప్పబడిన కాంతిలా

ఉందట, సన్నగిలిన నదివలె నున్నదట, అయోగ్యులు స్పృశించిన యజ్ఞ వేదికలా ఉందట, చల్లబడిన అగ్నిశిఖలా ఉందట.

*అభూతే నాప వాదేన కీర్తిం నిపతితామివ ।*
*ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ ॥*

*(V-15 -34,38)*

*పద్మినీ మివ విధ్వస్తాం హత శూరాం చమూమివ ।*
*ప్రభామివ తమోధ్వస్తా ముపక్షీణా మివాపగామ్ ॥*
*వేదీమివ పరామృష్టాం శాంతా మగ్ని శిఖామివ ॥*

*(V-19-13, 14)*

అంజనేయుని రాక ఆమె చీకటి జీవితానికి ఆశాకిరణం. అతని రాకతో ఆమె ఉనికి ఆ రామచంద్రునికి తెలిసే అవకాశం ఏర్పడింది. రావణుని సంహరించి ఏనాటికైనా భర్త తనకు విముక్తి కలిగిస్తా డన్న విశ్వాసం ఆమెహృదయంలో నెలకొనింది. ఆంజనేయుడు అమ్మా ! నావీపు నధిరోహించు. ని న్నారామచంద్రుని చెంత చేరుస్తా నన్నాడు. అయినా ఆమె ప్రలోభపడి అతని వెంటవెళ్ళలేదు. పైగా ఆ విధంగా వెళ్ళటం ఏవిధంగా ఉచితంగాదో చక్కగా వివరించి, నారాముడే రావాలి, రావణుని సంహరించాలి. నన్ను స్వీకరించాలి అని పతి రాక కొరకు ఎదురు చూచింది.

రాముడు రానే వచ్చాడు. రావణుని సంహరించాడు. సీత చెర విడిపించాడు. ఆమె కొండంత ఆశతో కోదండ రాముని చెంత కేగింది. రాముడు ప్రియమార ఆమెను చేరదీయలేదు సరిగదా! నీవు రావణుని అధీనంలో ఇంత కాలం ఉన్నావు. అందుచేత నీ చరిత్ర సందేహాస్పదం. అతని దృష్టిచేత స్పర్శచేత నీవు మలిన మయ్యావు. నిన్ను స్వీకరించటానికి నామనస్సు అంగీకరించటం లేదు. నీ పవిత్రత నిరూపించుకో అన్నాడు.

సీత జీవితంలో అదొక పిడుగుపాటు. ఆమె లక్ష్మణునడిగి అగ్నిగుండం సిద్ధం చేయించుకొన్నది. అంజలి ఘటించి అగ్ని హోత్రం ముందు నిలిచి వైశ్వానరా! రాముని తప్ప అన్య పురుషుని స్మరించకుండా

ఉన్నట్లయితే నన్ను రక్షించు. మనసా వాచా కర్మణా ఆ రామునే స్మరిస్తూ ఉన్నట్లయితే నన్ను రక్షించు. పంచ భూతాలు పతివ్రతగా భావిస్తూ ఉన్నట్లయితే నన్ను రక్షించు అని పలికి ప్రదక్షిణం చేసి అగ్నిలో ప్రవేశించింది. అది సీత పాతివ్రత్యానికి అగ్నిపరీక్ష. శ్రీరాముని ధార్మికత్వానికి అగ్నిపరీక్ష.

సీతాపాతివ్రత్యాన్ని బ్రహ్మాది దేవతలు ప్రశంసించారు. అగ్నిహోత్రుడు చెక్కుచెదరకుండా ఆమెను తెచ్చి రామునికి అప్పగించాడు. సీత పాతివ్రత్యం తనకు తెలుసు నని లోకప్రత్యయార్థమే ఆమెను అగ్నిపరీక్షకు గురిచేశానని శ్రీరాముడు చిరునవ్వుతో ఆమెను స్వీకరించాడు.

సీత పూచిన కడిమిచెట్టులా పులకరించింది. భర్త వెంట పుష్పక విమానంలో అయోధ్య వెళ్ళింది. కోసలరాజ్యపట్టమహిషి అయింది. భర్తతో కొంతకాలం అంతఃపురభోగాలనుభవించింది. అంతర్వత్ని అయింది.

మరల ఆమె జీవితంలో మరో పిడుగు పాటు. లోకాపవాదానికి తలవంచి రాము డామెను అరణ్యాల్లో వదలా లని నిశ్చయించాడు. లక్ష్మణుని పిలిచి గంగాతీర వనభూముల్లో వదలి రమ్మన్నాడు. రాముడు తన్ను పరిత్యజిస్తున్నాడని పాప మా పతివ్రతకు తెలీదు, ఆశ్రమవాసజీవితం తన కిష్టమని అన్నందుకు భర్త తనకా అవకాశం కలిగిస్తున్నా డని ఆమె భావించింది. తీరా అరణ్యంలో ఆమెను వదలి వెళ్ళేటప్పుడు లక్ష్మణుడు, అసలు సంగతి చెప్పాడు. ఆమె మూర్ఛపోయింది. ఎంతసేపటికో తెప్పరిల్లుకొని తన ఆవేదననంతా మొదట వెళ్ళబోసుకొంది. ఆ తరువాత రాముని ధార్మికతను ప్రశంసించింది. తనస్థితితో తాను సమాధాన పడింది.

అంతలో వాల్మీకి మహర్షివచ్చాడు. ఆమెను తన ఆశ్రమానికి తోడ్కొని వెళ్ళాడు. సీత అక్కడే కుశలవులను ప్రసవించింది. వాళ్ళు పెరిగి పెద్దవా రయ్యారు. వాల్మీకి దగ్గర విద్యాబుద్ధులు నేర్చుకొన్నారు. రామ చరిత చెప్పుకొన్నారు.

అశ్వమేధయాగసమయంలో కుశలవుల రామగానం విని, వారు తన పుత్రులని కనిపెట్టి, రామచంద్రుడు సీతాదేవిని పిలిపించు కొన్నాడు.

ఆమె వాల్మీకి మహర్షివెంట ఆనాటి రామసభ కరుదెంచింది. వాల్మీకి మహర్షి సాక్షాత్తు బ్రహ్మదేవునిలా ఉన్నాడు. ఆయన వెంట వేదంలా సీతాదేవి అడుగు వేసింది.

*దృష్ట్వా శ్రుతి మివాయాంతీం బ్రహ్మాణ మనుగామినీమ్।*
*వాల్మీకేః పృష్ఠత స్సీతాం సాధుకారో మహానభూత్॥*

(*VII* - 96 - 11)

రాము డామెను పాతివ్రత్యం నిరూపించు కొమ్మని మరల అడిగాడు. అది ఆమె జీవితంలో చివరి మలుపు.

ఆమె శిరస్సు వంచి చేతులు జోడించి గద్గదకంఠంతో కన్నీరు కారుస్తూ ఎలుగెత్తి అమ్మా! భూదేవీ! రాముని కంటె అన్యుని నేను మనస్సున స్మరించకుండా ఉన్నట్లయితే నీ హృదయంలో నాకు స్థాన మివ్వు. అమ్మా! భూదేవీ! మనోవాక్కాయ కర్మల నేను రాముణ్ణే పూజిస్తున్నట్లయితే నీ హృదయంలో నాకు స్థాన మివ్వు. అమ్మా! భూదేవీ! నేను చెప్పింది సత్యమే అయితే నీ హృదయంలో నాకు స్థానమివ్వు.

*యథాహం రాఘవా దన్యం మనసాపి న చింతయే।*
*తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి॥*

*మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే।*
*తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి॥*

*యథైత త్సత్య ముక్తం మే వేద్మి రామా త్పరం న చ।*
*తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి ॥*

(*VII* - 97 - 15,17)

అనగానే అందరికి ఒక భయంకర శబ్దం వినిపించింది. భూమి బ్రద్దలైంది. అందుండి ఒక దివ్యసింహాసనం పైకి వచ్చింది. భూమాత

ప్రియమార బాహువులు చాచి ప్రియసుతయగు సీతను కౌగిలించుకొనింది. కన్నీరు తుడిచింది. ముంగురులు నిమిరింది. సింహాసనం మీద కుర్చుండబెట్టుకొని అంతర్ధానమైంది.

అంతా ఆశ్చర్యంలో, ఆవేదనలో మునిగి పోయారు. రాముడు సీతా! సీతా! అంటూ దిక్కులు పిక్కటిల్లేలా రోదించాడు.

సీతజీవితం సమాప్తమైంది. మొత్తానికి సీతజీవితంలో పరీక్షలు, ఎన్నో ఎన్నో మలుపులు, ఎన్నో కష్టాలు, ఎన్నో శిక్షలు. తన తప్పేమి లేకుండానే ఆమె అన్నీ అనుభవించింది. సహధర్మచారిణిగా శ్రీరామునికి అన్నివిధాల సహకారాన్ని అందించింది. అయన ధర్మపాలనకై అగ్ని పరీక్షకూడా ఎదుర్కొంది. అయన ధర్మపాలనకై మరొక మారు అరణ్యవాసాన్ని గూడ అనుభవించింది. అభిమానవతిగా చివరకు తన జీవితాన్నే త్యాగంచేసింది.

సీత మహాపతివ్రత. ఆమె జీవితం ఉన్నతాదర్శం. భారతీయ స్త్రీ జాతికి గర్వకారణం.

---

# 14. శ్రీమద్రామాయణ పాత్రలు - విశ్వామిత్ర వాయుపుత్రులు

డా. అప్పజోడు వేంకటసుబ్బయ్య

రామాయణ - భారతాలు హైందవ సంస్కృతికి అమృత కలశాలు. భారతీయ కవితా సరస్వతికి సువర్ణశిరో భూషణాలు. రామాయణం వాల్మీకి మహర్షి అపూర్వ సృష్టి:ఆర్షకవితామధురసవృష్టి మహాభారతం వ్యాసమహర్షి అద్భుత సృష్టి; భారతీయధర్మ తత్త్వసమగ్ర దృష్టి.

యుగయుగాల భారతీయ సంస్కృతికి వేదమే మూల కందం. వేదం లోని కర్మకాండ ధర్మాన్నిగూర్చి చెపితే, జ్ఞానకాండ బ్రహ్మాన్నిగూర్చి చెపుతున్నది. బ్రహ్మం, ధర్మం రెండూ వేదానికి బొమ్మా బొరుసుల్లాంటివి. వేదవేద్యుడైన పరమాత్మయే దశరథాత్మజుడుగా అవతరించాడని, వేదమే సాక్షాత్తు రామాయణంగా రూపొందిందనీ ప్రతీతి.

*"వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।*
*వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా ॥*

*(స్కాంద పురాణము)*

రామచంద్రుడు బాహ్యంగా ధర్మరూపుడు. ఆంతరంగా బ్రహ్మ రూపుడు. ఆయన జీవిత మార్గమే శ్రీ మద్రామాయణం. బాహ్యంగా రామాయణం ధర్మప్రతి పాదకమ్మైన ఒక మహాకావ్యం. ఆంతరంగా అదొక మహోపనిషత్తు.

రామాయణం ఆత్మచరిత్రగా అభివర్ణితమ్మైంది. తత్త్వవేత్తలు రామచంద్రుని పరమాత్మగా, సీతాదేవిని జీవాత్మగా, రావణుని కామమోహిత మ్మైన మనస్సుగా, అతని పదితలలను ఇంద్రియాలుగా, లంకను శరీరంగా, సాగరాన్ని సంసారంగా వ్యాఖ్యానిస్తారు.

ఈ విధమైన ఆధ్యాత్మికసమన్వయాన్ని తెలుసుకోవటం సులభమే. కాని దాన్ని అనుభవానికి తెచ్చుకోవటం అతికష్టం. అందుకు ఎన్ని జన్మలు కావాలో! ప్రతి జన్మలో ఎంత తపస్సు చెయ్యాలో! పైగా అది ఎవరికి వారు చెయ్యవలసిన సాధన. దర్శించవలసిన సత్యం.

అలాంటప్పుడు ఆధ్యాత్మిక సమన్వయాలను, వ్యాఖ్యానాలను విని, ఏదో తెలుసుకొన్నామని తృప్తి పడి ఆ మహాగ్రంథాన్ని మూడు సార్లు కళ్ళ కద్దుకొని, తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం లాగ ఏ మార్పూ లేని వ్యక్తిత్వం తో సమాజంలో వ్యవహరించడంకంటె ఆ గ్రంథాన్ని ఒక ధర్మ ప్రతి పాదకమైన రసమయమహాకావ్యంగా దర్శించి, మహాపురుషుడైన ఆ రాముని జీవితం నుండి, ఆయన జీవిత మార్గం లో వివిధ పాత్రలు నిర్వహించిన వ్యక్తుల నుండి అనేక గుణపాఠాలు నేర్చుకొని, ఆచరణాత్మకంగా వాటిని జీవితాని కన్వయించుకొని తన ఉన్నతికి, సమాజ కల్యాణానికి ప్రయత్నించటం ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందేమో.

రూపు దాల్చిన ధర్మంగా వర్ణింపబడిన (రామో విగ్రహవాన్ ధర్మః) శ్రీ రాముని జీవిత మార్గంలో మానవులు, మహర్షులు, పక్షులు, మృగాలు, దేవతలు, రాక్షసులు చిత్ర విచిత్రమైన పెక్కు పాత్రలను నిర్వహించటం జరిగింది. కాకి మొదలు రావణాసురునిదాకా, శబరి మొదలు అగస్త్య మహర్షి దాకా అన్ని పాత్రలు రాముడు కేంద్రంగా ప్రవర్తిల్లేవే. ప్రతి పాత్రలో ఏదో ఒక విశిష్టత ఉంది.

రామాయణ పాత్రల్లో విశ్వామిత్రవాయుపుత్రు లిద్దరు ఒక విశిష్ట వ్యక్తిత్వ మున్నవారు. రాముని జీవితంలో ఒక గొప్ప పాత్ర నిర్వహించినవారు. అయోధ్యకు మిథిలకు వియ్యాన్ని కూర్చి, సీతారామకల్యాణానికి కారణ భూతుడై, రావణ సంహారానికి నాంది జరిపించిన వ్యక్తి విశ్వామిత్రుడైతే, అయోధ్యకు కిష్కింధకు నెయ్యాన్ని కూర్చి, రావణసంహారానికి సీతారామ పునస్సమాగమానికి దోహదం చేసిన వ్యక్తి వాయుపుత్రుడు. దుష్ట శిక్షణకు, శిష్ట రక్షణకు, ధర్మ సంస్థాపనకు బద్ధ కంకణుడైన శ్రీరామచంద్రు నికి సర్వ

శస్త్రాస్త్రసంపదను అందించిన గురువు విశ్వామిత్రు డైతే, సీతాన్వేషణకు, రాక్షససంహారానికి ఉపకరించిన వానరసైన్యాన్ని సుగ్రీవ సఖ్యం ద్వారా సమకూర్చిన దూత వాయుపుత్రుడు. అందుచేత ఇద్దరి వ్యక్తిత్వాలు, పాత్రలు విశ్లేషింపదగినవే, పరిశీలింపదగినవే.

విశ్వామిత్రుండుం:

విశ్వామిత్రు డొక విచిత్రవ్యక్తి. ఆయన పేరు వినేసరికి పరాకుగా ఉన్న సైనికుడు పై అధికారి కేక విని తత్తర పాటుతో, బిత్తర చూపులతో ఏ విధంగా సావధాను డౌతాడో, మామూలు వ్యక్తి మొదలు మహారాజుదాకా నిలువెల్ల కళ్ళుగా, మనసెల్ల చెవులుగా మేలు కొంటారు. దుర్వాసునిప్రక్కనే ఆయనకూ పీట వేస్తారు. కోపానికి, శాపానికి ప్రతిరూపంగా ఆయనను భావిస్తారు.

విశ్వామిత్రునిది మహా తీవ్రమైన మనస్తత్త్వం. ఈ లాంటి మనస్తత్త్వం ఉన్న వాళ్ళు హరిహరాదులనైనా ఎదిరించి, ఎన్ని ఆటంకాలనైనా అధిగమించి, ఉన్న శక్తులన్నింటిని వినియోగించి, మంచిదైనా చెడ్డదైనా, మేలు కలిగినా, కీడు మూడినా అనుకొన్న పని అయ్యేదాకా రెప్పవాల్చరు. రెండు కాళ్ళూ ఒక చోట నిలపరు.

కాగా విశ్వామిత్రునిది కేవలం అగ్నికణంలా ప్రజ్వరిల్లే హృదయం మాత్రమే కాదు. అది అప్పుడప్పుడు మంచు గడ్డలా కరిగిపోగలదు. అది పాషాణంలా కఠినమైనది మాత్రమే కాదు. వెన్న ముద్దలా మెత్తనైనది కూడ. ఆ మహర్షి స్వాభిమాన ధురంధరుడు మాత్రమే గాదు. సౌందర్య పిపాసిగూడ. అతనిది సహజంగా చిక్కనైన రజోగుణం. ఆ రజో గుణాన్ని ఆవరించి ఉంటుంది తమోగుణం. ఒక విధంగా చెప్పాలంటే పరవళ్ళు ద్రొక్కే రజోగుణ ప్రవాహం తమోగుణమనే తటద్వయాన్ని ఒరుసుకొంటూ సాత్త్వికసాగరంలో సంగమించిన స్వభావానికి ఉత్తమ ఉదాహరణ విశ్వామిత్ర మహర్షిజీవితం!,

విశ్వామిత్రుడు క్షత్రియుడు. గొప్ప పరాక్రమశాలి. భూమండ లాన్ని ధర్మబద్ధంగా బహుకాలం పరిపాలించిన మహారాజు. అక్షౌహిణీ

పూర్ణమైన సైన్యంతో ఒకసారి ఆయన దేశసంచారం ప్రారంభించాడు. అపర బ్రహ్మ లోకంగా వర్ణింపబడిన వసిష్ఠాశ్రమానికి వచ్చాడు. వసిష్ఠ డిచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించి ఆనందించాడు. అల్పవ్యవధిలో ఆశ్చర్య జనకంగా అంత మందికి ఆతిథ్యం అమర్చిన ఆశ్రమకామధేనువు మీద విశ్వామిత్రుని కన్ను పడింది. లక్ష గోవులు పుచ్చుకొని ఆ కామధేనువును తన కిమ్మని విశ్వామిత్రుడు వసిష్ఠుణ్ణి అడిగాడు. అంతే గాక కామధేనువు రత్నమని, రత్నాలు రాజుల సొమ్ములని తన అభ్యర్థనను సమర్థించాడు.

*గవాం శత సహస్రేణ దీయతాం శబలా మమ।*

*రత్నంహి భగవ న్నేత, ద్రత్నహారీ చ పార్థివః॥*

విశ్వామిత్రుని ప్రార్థనలోను, సమర్థన లోను రాజసం కొట్ట వచ్చినట్టు కన్పిస్తూ ఉంది.

కామధేనువు తన సర్వస్వమని, సర్వసత్కర్మలకు ఆ శబల మూల మని, ఏమిచ్చినా ఆ గోవు నివ్వటం సాధ్యం గాదని వసిష్ఠుడు చెప్పాడు. అంతేగాక ఆత్మ వంతునితో కీర్తిలా నాతో ఈ కామధేనువు శాశ్వతంగా ఉంటుం దన్నాడు. వసిష్ఠుని ఈ నిరాకరణతో విశ్వామిత్రునిజీవితంలో ఒక క్రొత్త అధ్యాయం ఆరంభమైంది.

అన్యుల దయినా, తాను ఆశించగూడని దయినా ఆకర్షించిన ప్రతి దానిని తనదిగా చేసుకోవాలని అనుకోవటం రజోగుణ స్వభావం. అది చేతికి అందనపుడు అభిమానం దెబ్బతిని ఆ రజోగుణం తమోగుణం తో చేతులు కలుపుతుంది. చెడు త్రోవలు త్రొక్కుతుంది.

విశ్వామిత్రుడు బలవంతంగా సైన్యసహాయంతో కామధేనువును కట్టి కదలించాడు. ఆ కామధేనువు ఘోష పెట్టింది. అయినా వసిష్ఠుడు ఊరుకొన్నాడు. కడకు ఆ కామధేనువే కట్లు త్రెంచుకొని, సైనికు లందరిని చిందర వందరగా విదిలించి పరుగు పరుగున వచ్చి వసిష్ఠునిపాదాల ముందు నిలిచింది. విశ్వామిత్రుణ్ణి వధించి తన్ను రక్షించమని అర్థించింది. అందుకు వశిష్ఠుడు 'శబలా విశ్వామిత్రుడు బలవంతుడు. అతనిని నిగ్రహించగల

శారీరక బలం నాకు లేదు. తపో బలంతో అతనిని నాశనం చేద్దా మనుకొంటే ప్రజాపాలకుడు. పాలించే రాజును చంపటం మహా పాతకం' అని సమాధానం చెప్పాడు. అయితే మీరు అనుజ్ఞ ఇవ్వండి ఆ విశ్వామిత్రుణ్ణి నేను హతం చేస్తా నన్నది శబల. అది నీయిష్టం అన్నాడు వసిష్ఠుడు. శబల వెంటనే అపరిమిత సైన్యాన్ని సృజించింది. విశ్వామిత్రుని సైన్యాన్నంతా నాశనం చేసింది. ఆగ్రహోదగ్రులైన విశ్వామిత్రుని నూర్వురు పుత్రులు వసిష్ఠునిమీదికి విజృంభించారు. ఒక్క హుంకారంతోనే వసిష్ఠుడు వాళ్ళందరిని మసిగా మాడ్చి వేశాడు. అప్పుడు నిస్సహాయుడై నిలిచిన విశ్వామిత్రుడు వేగం లేని సముద్రంలా ఉన్నాడట. కోరలు పోయిన సర్పంలా ఉన్నాడట. రాహుగ్రస్తుడైన సూర్యునిలా ఉన్నాడట. తేజోరహితుడై పుత్ర బలాన్ని గూడ కోల్పోయి, రెక్కలు తెగిన పక్షిలా గర్వోత్సాహాలు రెండూ లోపించి ప్రగాఢ నిర్వేదాన్ని పొందాడట.

*" సముద్ర ఇవ నిర్వేగో భగ్నదంష్ట్ర ఇవోరగః।*
*ఉపరక్త ఇవాదిత్య స్సద్యోనిష్ప్రభతాం గతః॥*

*హత పుత్ర బలో దీనో లూన పక్ష ఇవ ద్విజః।*
*హత దర్పో హతోత్సాహో నిర్వేదం సమపద్యత॥"*

*(1-55-9,10)*

క్షాత్రబలం తపోబలాన్ని జయించ లేకపోయింది. అయినా విశ్వామిత్రునికి క్షాత్రబలం మీద విశ్వాసం పోలేదు. తపస్సు చేసి అపారమైన అస్త్రబలాన్ని ఆర్జించి శత్రువును జయించాలని అనుకొన్నాడు. ఒక్క ఊపున హిమాలయాలకు వెళ్ళారు. పెద్ద తపస్సు చేసి పరమేశ్వరుని మెప్పించాడు. సర్వాస్త్ర బలాన్ని సంపాదించాడు. పూర్ణిమనాటి పారావారంలా విజృంభించాడు. వసిష్ఠుని తపోవనాన్ని ధ్వంసం చెయ్యటం ప్రారంభించాడు. ఆ దెబ్బకు తాపసులంతా తల్లడిల్లి పోయారు. తక్కిన ప్రాణికోటి పరుగెత్తిపోయింది. అది చూచి వసిష్ఠుడు బ్రహ్మదండాన్ని చేపట్టాడు. విశ్వామిత్రుడు

ప్రయోగించిన ఆగ్నేయ - వారుణ - రౌద్ర-పాశుపత - మోహన - బ్రహ్మ పాశ-వరుణపాశ - కాల చక్ర - విష్ణుచక్రాది అస్త్రాలన్నింటిని ఆ బ్రహ్మదండం అవలీలగా మింగివేసింది. చిట్ట చివరకు విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. దానిని గూడ బ్రహ్మదండం మింగివేసింది. విశ్వామిత్రుడు నిర్వీర్యుడయ్యాడు. అవమానంతో క్రుంగిపోయాడు. బ్రహ్మ బలమే బలమని మెచ్చుకొన్నాడు.

*"ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్।*
*ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే॥"*

సర్వ శక్తిమంతమైన బ్రహ్మబలాన్ని పొందటానికి ఎంత తపస్సయినా చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. భార్యతో కలిసి శరావతీ నదికి దక్షిణ దిక్కున తీవ్రమైన తపస్సు చేశాడు. విశ్వామిత్రుని జీవితంలో ఇది పెద్ద మలుపు.

శరావతీతీరంలో ఉండగానే విశ్వామిత్రునికి నలుగురు పుత్రులు జన్మించారు. వెయ్యిసంవత్సరాల తపస్సు పూర్తి కాగానే బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై రాజర్షిత్వాన్ని ఇచ్చాడు. అయినా విశ్వామిత్రునికి తృప్తి కలుగ లేదు. మునుపటి కంటే మిక్కుటమైన మహాతపస్సు ప్రారంభించాడు. ఆ సమయంలో త్రిశంకు మహారాజు సశరీర స్వర్గం కోరుకొని వసిష్ఠుని తి రస్కారాన్ని, అతని కొడుకుల శాపాన్ని పొంది చండాలరూపంలో వసిష్ఠ విరోధి అయిన విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించటం జరిగింది. ఆర్ద్రహృదయంతో విశ్వామిత్రుడు త్రిశంకునికి అభయమిచ్చాడు. వచ్చిన పని అడిగాడు. ఇక త్రిశంకుని చాతుర్యం సంగతి చెప్పాలా? వసిష్ఠుని గూర్చి, అతని తిరస్కారాన్ని గూర్చి ఏవేవో చెప్పి నీవే నాకు శరణ్యమన్నాడు. నీ పురుషకారంతో దైవాన్ని మరలించి నాకోరిక సఫలం చేయమన్నాడు. వసిష్ఠునికి నీ శక్తి తెలియ చెయ్యాలన్నాడు. విశ్వామిత్రునిలో త్రిశంకునిమీది దయతో పాటు, వసిష్ఠునిమీద ప్రతిభటత్వం గూడ ప్రబలింది. త్రిశంకుణ్ణి ఓదార్చాడు. సశరీర స్వర్గం నీ చేత నున్నట్లే భావించు కొమ్మన్నాడు. యజ్ఞం కొరకు అన్నీ సిద్ధం

చేసి, ఋషు లందరిని ఆహ్వానించమన్నాడు. తన ఆహ్వానాన్ని ఎవరైనా తిరస్కరిస్తే వెంటనే తెలియజేయమన్నాడు.

శిష్యులందరిని దేశం నలుమూల లకు పంపాడు. శిష్యులు తిరిగి వచ్చి 'ఒక్క మహోదయుడుమాత్రం మీ ఆహ్వానాన్ని మన్నించలేదని, వసిష్ఠుని పుత్రులు యజ్ఞం చేయించేవాడు క్షత్రియుడు, చేసేవాడు చండాలుడు, ఆ చండాలయాగంలో దేవత లెట్లా హవిస్సులు భుజిస్తారో చూస్తామని పరిహసించా'రని పలికారు. విశ్వామిత్రునికోపం మిన్ను ముట్టింది. వెంటనే వసిష్ఠునికొడుకులు నూర్వురు, ఆ మహోదయుడు మండి బూడిద కాగలరని శపించాడు. విశేషించి వసిష్ఠునికొడుకులు ముందు జన్మలో ముష్టికులంలో పుట్టి కుక్క మాంసంతో కుక్షి నింపుకొంటూ నికృష్ట జీవితం గడుపగలరని, మహోద యుడు నిషాదజాతిలో జన్మించగల డనికూడా చెప్పాడు. ఇది వరకు తన నూరుగురు కొడుకులను వసిష్ఠుడు భస్మం చేశాడు. ఇప్పు డతని నూరుగురు కొడుకులను తాను భస్మం చేశాడు.

మహర్షులంతా విశ్వామిత్రుని స్వభావాన్ని పూర్తిగా అర్థం చేసుకొన్నారు. ఆయన అగ్ని లాంటి వాడని కోపం వస్తే వారినంతా శపిస్తాడని తెలుసుకొన్నారు. యాగాన్ని యథాశాస్త్రంగా జరిపించారు. కాని హవిర్భాగానికి దేవతలు రాలేదు. విశ్వామిత్రు డెంతపిలిచినా దేవతలు వినిపించుకోలేదు. విశ్వామిత్రుడు ఉగ్రుడయ్యాడు. అనుకొన్న పనికి ఆటంకం ఏర్పడింది. అయినా అన్నమాట నిలబెట్టుకోవాలి. త్రిశంకునికి స్వర్గం ఇప్పించాలి. ఆ పరిస్థితుల్లో ఇక మిగిలిన మార్గం ఒకటే. అది తానార్జించిన తపోధనాన్ని ధారవోసి త్రిశంకుణ్ణి స్వర్గానికి పంపటం. విశ్వామిత్రుడు అదే చేశాడు.

త్రిశంకుడు సశరీరంగా స్వర్గానికివెళ్ళాడు. కాని దేవేంద్రుడు అతనికి స్వర్గంలో ప్రవేశ మివ్వలేదు. 'నీవు గురుశాప హతుడి వని, తల క్రిందుగా నేల మీద పడమనీ' అతణ్ణి త్రోసివేశాడు. త్రిశంకుడు తలక్రిందుగా పడుతూ రక్షింపు! రక్షింపు! మని విశ్వామిత్రునితో మొర పెట్టుకొన్నాడు. విశ్వామిత్రుని

ఆగ్రహానికి అంతులేదు. అతని పట్టుదలను పట్ట శక్యంగా లేదు. అప్పుడు తన శక్తినంతా ధారవోసి త్రిశంకుని పతనాన్ని ఆపాడు. దక్షిణ దిక్కుగా సప్తర్షులను, నక్షత్రాలను సృష్టించాడు.

"అన్య మింద్రం కరిష్యామి లోకో వా స్యా దనింద్రకః" అపర దేవేంద్రుణ్ణి సృజిస్తాను లేదా లోకంలో ఇంద్రుడే లేకుండా పోవును అని పలికి దేవతలనే సృష్టించటానికి పూనుకొనే సరికి దేవతలు, ఋషులు, రాక్షసులుగూడ భయపడ్డారు. విశ్వామిత్ర మహర్షిని ఊరడించారు. త్రిశంకుడు గురశాప హతుడని, అందుచేత స్వర్గార్హుడు కాదని తెలియ జెప్పారు. అయితే తా నిచ్చిన మాట తప్పటానికి వీల్లేదన్నాడు విశ్వా మిత్రుడు. దేవతలకు దిక్కు తోచలేదు. ఇక గత్యంతరం లేక విశ్వా మిత్రుడు సృష్టించిన నక్షత్రాలు ఆకాశంలో అనాది జ్యోతిశ్చక్రానికి వెలుపల శాశ్వతంగా నిలిచి ఉండేటట్లు, త్రిశంకుడు తలక్రిందుగా దేవతా సమానుడై వాటి మధ్య ఉండేటట్లు అంగీకరించారు.

త్రిశంకుడు తరించాడు. దేవతలు, మునులు వచ్చిన త్రోవన వెళ్ళిపోయారు. కాని విశ్వామిత్రుని పని మళ్ళా మొదటికి వచ్చింది. ఒక ప్రయోజనాన్ని ఆశించి చేసిన తపస్సంతా మరొక దానికి వ్యయమైపోయింది. దక్షిణ దిక్కున విఘ్నం కలిగిందని విశ్వామిత్రుడు పశ్చిమ దిక్కుకు ప్రయాణమయ్యాడు. పుష్కర తీర్థాల తీరంలో మరల మహాతపస్సు ప్రారంభించాడు. మరల ఆ మహర్షితపస్సుకు మరో విఘ్నం.

అంబరీష మహారాజు యజ్ఞపశువుగా శునశ్శేపుణ్ణి పిలుచుకొని పోతూ విశ్వామిత్రుని ఆశ్రమంలో విశ్రమించటానికి వచ్చాడు. శునశ్శేపుడు దీనుడు. దిక్కు లేని వాడు. తల్లిదండ్రులే లక్షగోవులు పుచ్చుకొని అతనిని బలిపశువుగా అంబరీషునికి అమ్మారు. ఇక దిక్కెవ్వరు? శునశ్శేపుడు దుఃఖంతో కుమిలి కుమిలి, దప్పికతో వాడిపోయి, శ్రమతో అలసిపోయి సొమ్మసిల్లి విశ్వామిత్రునిఒడిలో వ్రాలిపోయాడు. విశ్వామిత్రుని మనస్సు కరిగింది. అతని మేను నిమిరి అభయమిచ్చి అనునయించాడు. తన కొడుకుల్ని పిలిచి శునశ్శేపుని బదులు మీలో ఒకరు బలిపశువుగా వెళ్ళండని ఆదేశించాడు.

ఆ మహర్షి ఆర్ద్రత ముందు ఆ సముద్రుడైనా చేతులెత్తి నమస్కరించ వలసిందే! ఆ మహర్షి త్యాగం ముందు ఆ మేరుపర్వతమైనా శిరసు వంచి మోకరిల్ల వలసిందే!

పితృవాక్యాన్ని పుత్రులంతా తిరస్కరించారు. అందుకు విశ్వామిత్రు డాగ్రహించి వసిష్ఠునికొడుకుల వలె మీరు గూడ ముష్టికులంలో పుట్టి కుక్క మాంసం తిని బ్రతకండని శాప మిచ్చాడు. శునశ్శేపునికి రెండు దివ్యగాథ లుపదేశించాడు. యూపస్తంభానికి కట్టినపుడు గుట్టుగా గానం చేసుకొమ్మని చెప్పాడు. శునశ్శేపుడు చెప్పినట్లే చేశాడు. దేవేంద్రుడు తృప్తినొంది అతనికి దీర్ఘాయువు నిచ్చాడు. అంబరీషునికి యాగఫలాన్ని గూడ అనుగ్రహించాడు. శునశ్శేపుని గండం గడిచింది. విశ్వామిత్రునికి తపోభంగం జరిగింది.

విశ్వామిత్రుడు మరల తపస్సు మొదలు పెట్టాడు. వెయ్యి సంవత్సరాలు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "ఋషిస్త్వమసి – నీవు ఋషివయ్యావు" అని పలికి అంతర్ధాన మయ్యాడు. అయినా విశ్వామిత్రునికి తృప్తి కలుగలేదు. కోరుకొన్న దాని కంటె అది కొంచెం తక్కువే. అందుచేత మరల తపస్సు ఆరంభించాడు. కొంత కాలం కాగానే క్రొత్త విఘ్నం ఏర్పడింది.

మేనక అతి లోకసౌందర్యవతి. ఆమె పుష్కర తీర్థంలో స్నానం చేస్తున్నది. ఆ అప్సరసను విశ్వామిత్రుడు చూశాడు. మోహ పరవశు డైనాడు. ఆమెకు స్వాగతం పలికి పది సంవత్సరాలు శృంగార జీవితం గడిపాడు.

రజోగుణానికి రాసిక్యం మెండు. సౌందర్యాన్ని చూచి స్పందించ టము, మంచిచెడ్డలు ఎంచి చూడకుండా ఆకర్షించిన సౌందర్యాన్ని స్వాయత్తం చేసుకొని తృప్తిగా అనుభవించటం రజోగుణసహజలక్షణం. విశ్వామిత్రు డదే చేశాడు. పది సంవత్సరాల తరువాత తాను చేసింది తప్పని తెలుసుకొన్నాడు. తపస్సు చెడిందని చింతనొందాడు. దేవతల పన్నాగం ఫలించిం దని గ్రహించాడు. వెంటనే మేనకను విడిచి తాను హిమాలయాలకు

వెళ్ళాడు. కౌశికీనదీ తీరంలో కఠోర తపస్సు చేశాడు. ఆ తపస్సు చూచి దేవతలు చలించారు. అంతా కలిసి బ్రహ్మదేవుని ఆశ్రయించారు. బ్రహ్మ ప్రత్యక్షమై విశ్వామిత్రా! నీకు మహర్షిత్వాన్ని ఇచ్చానన్నాడు. విశ్వామిత్రుడు తృప్తి చెందలేదు. అయితే నేను జితేంద్రియుణ్ణి అయినట్లేనా అని బ్రహ్మదేవుని గ్రుచ్చి అడిగాడు. అందు కింకా ప్రయత్నం చెయ్యాలని చెప్పి బ్రహ్మదేవుడు మాయమయ్యాడు.

విశ్వామిత్రుని పట్టుదల పెరిగింది, హస్తాలు పైకెత్తి నిరాలంబంగా, వాయువే ఆహారంగా, వేసవిలో పంచాగ్ని మధ్య, వానకాలంలో ఆరుబయట, శిశిర కాలంలో చన్నీట వెయ్యి సంవత్సరాలు మహోగ్రతపం చేశాడు. విశ్వామిత్రుని మహోగ్రతపం చూచే సరికి దేవేంద్రుని గుండె లదిరాయి. రంభను ప్రయోగించి అతని తపోభంగం చెయ్యా లనుకొన్నాడు. రంభ శాప భయంతో విశ్వామిత్రుని సమీపానికే వెళ్ళలే నన్నది. దేవేంద్రుడు మన్మథునితో, వసంతునితో కలిసి తానూ కోకిల రూపంలో వెంట ఉంటా నన్నాడు, భయం లేదు పదమన్నాడు.

రంభ తన యౌవనాన్ని, సౌందర్యాన్ని ఒలక బోసి విశ్వామిత్రుని రజో గుణాన్ని రెచ్చగొట్టింది. ఆ మహర్షిమనస్సు చలించింది. ఆగ్రహించి పదివేల యేండ్లు పాషాణంగా పడి ఉండ మని రంభను శపించాడు. వెంటనే ఆమె స్థితికి జాలిపడి మహానుభావుడు, తపస్సంపన్నుడు, బ్రాహ్మణోత్త ముడు అయిన వసిష్ఠుడు ని న్నుద్ధరిస్తాడని శాప విమోచనం గూడ చెప్పి వేశాడు. ప్రత్యర్థి వసిష్ఠునిగూర్చి ప్రయోగించిన విశేషణాలు విశ్వామిత్రుని సహృదయతకు చక్కని తార్కాణాలు. కాని కోపకారణంగా విశ్వామిత్రుని తపస్సు తరిగిపోయింది.

రంభ రాయిగా మారింది. బ్రదుకు జీవుడా అని దేవేంద్రుడు పరుగెత్తాడు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షిత్వం ప్రాప్తించే దాకా కోపపడకుండా, మాట పలుక కుండా, ఆహారం లేకుండా, కడకు నిట్టూర్పయినా వదల కుండా తపస్సు చేయాలని నిశ్చయించుకొన్నాడు. ఇది అతని చరిత్రలో

చివరి నిర్ణయం. కఠోరనిర్ణయం. ఉత్తరదిశను విడిచాడు. తూర్పుదిశకు వెళ్ళాడు. తపస్సు ప్రారంభించాడు. ఎన్నో విఘ్నాలు అయినా చలించలేదు. వెయ్యి సంవత్సరాలు నిండాయి. అన్నం తినబోయాడు. అంతలోనే దేవేంద్రుడు బ్రాహ్మణ రూపంలో ప్రత్యక్షమై ఆ అన్నం తన కిమ్మని అర్థించాడు. విశ్వామిత్రుని వ్రతభంగం చేయాలని దేవేంద్రుని ఉద్దేశం. కాని ఆ మహర్షి మారు మాటాడకుండా అన్నం దేవేంద్రుని కిచ్చాడు.

మరల వెయ్యేండ్లు నిట్టూర్పయినా విడువ కుండ మహోగ్రతపం చేశాడు. ఊర్పుగూడ విడువక పోవడంతో ఆయన శిరస్సు వేడెక్కింది. పొగలు గ్రక్కింది. ఆ పొగలు ముల్లోకాలను ముంచి వేశాయి. దిక్కులు, సముద్రాలు, పర్వతాలు, భూమి, గాలి అన్నీ కలత నొందాయి. విశ్వామిత్రునికాంతి ముందు సూర్యుడు గూడ వెల వెల పోయాడు. దేవతలందరు దిక్కుతోచక భయ భ్రాంతులై బ్రహ్మదేవుని ప్రార్థించారు. బ్రహ్మదేవుడు స్వయంగా వచ్చి విశ్వామిత్రుణ్ణి 'బ్రహ్మర్షీ' అని సంబోధించాడు. నీకు బ్రాహ్మణ్యం ప్రాప్తించిందని, దీర్ఘాయువు కలుగుతుందని, ప్రశాంతుడవు కమ్మని కోరాడు. విశ్వామిత్రుడు ఇంతకాలం పట్టు పట్టి సర్వశక్తుల్నీ ధారవోసి దేనికై శ్రమించాడో దాని నిప్పుడు సాధించాడు. సంతోషించాడు. కాని ఆయన కోరిక పూర్తిగా తీరటానికి ఇంకా కొంత కొరవ ఉంది. అందుచేతనే బ్రహ్మకు ప్రణమిల్లి:

*"బ్రహ్మణ్యం యది మే ప్రాప్తం దీర్ఘ మాయు స్తథైవ చ।*
*ఓంకారశ్చ వషట్కారో వేదాశ్చ వరయంతు మామ్॥*
*క్షత్ర వేదవిదాం శ్రేష్ఠో బ్రహ్మవేదవిదా మపి।*
*బ్రహ్మపుత్రో వసిష్ఠో మామేవం వదతు దేవతాః॥"*

అని రెండు ఆంక్ష లుంచాడు. బ్రహ్మణ్యమే తనకు ప్రాప్తించి నట్లయితే దీర్ఘాయువే తనకు కలిగినట్లయితే ఓంకారవషట్కార వేదాలు తన్ను వరించా లన్నది మొదటి ఆంక్ష. ఇక రెండవది బ్రహ్మదేవుడు తన్ను 'బ్రహ్మర్షీ'

అని అంటే చాలదట. అటు క్షత్రవేద కోవిదులలో, ఇటు బ్రహ్మవేదపారగులలో శ్రేష్ఠుడై, బ్రహ్మపుత్రుడైన వసిష్ఠుడే వచ్చి తన్ను 'బ్రహ్మర్షి' అని పిలవాలట. ఏ వ్యక్తి శక్తి ముందు తన అభిమానం దెబ్బ తిందో ఆ వ్యక్తే వచ్చి ఈనాడు తన ముందు నిలిచి, తాను గడించిన గొప్పతనాన్నిగుర్తించి బ్రహ్మర్షీ! అని సంబోధిస్తేగాని విశ్వామిత్రుని గుండెగాయం మానేటట్లు లేదు. అట్టిది విశ్వామిత్రుని పట్టుదల! అట్టిది విశ్వామిత్రుని ఆత్మాభిమానం! దేవతలు సరేనని తల ఊపక తప్పలేదు. అందరు వెళ్ళి ఆ వసిష్ఠమహర్షిని అర్థించారు. ఆ బ్రహ్మర్షి గూడ సహృదయతతో సంతోషంగా –

"*బ్రహ్మర్షి రేవ మస్త్వితి – నీవు బ్రహ్మర్షివే*' అని నిర్ధరించి పలికాడు.

విశ్వామిత్రుడు ఇంతకాలం పడిన శ్రమ ఫలించింది. ఆ మాట కొరకే ఆయన అంత తపస్సు చేశాడు. ఆ మహర్షి ఆనందానికి అంతులేదు. వెనుకటి మాత్సర్యాన్ని వదలి ఆయన వసిష్ఠమహర్షిని విశేషంగా పూజించాడు.

"*విశ్వామిత్రోఽపి ధర్మాత్మా లబ్ధ్వా బ్రహ్మణ్య ముత్తమమ్।*
*పూజయామాస బ్రహ్మర్షిం వసిష్ఠం జపతాం వరమ్॥*"

వసిష్ఠవిశ్వామిత్రు లిద్దరికి స్పర్ధ పోయింది. సఖ్య మేర్పడింది.

శ్రీ మద్రామాయణంలో దుష్టశిక్షణార్థం, శిష్టరక్షణార్థం ధర్మసంస్థాపనార్థం అవతరించిన శ్రీ రామ చంద్రునికి శస్త్రాస్త్ర విద్య నేర్పింది సహజసత్త్వస్వభావుడైన వసిష్ఠుడైతే, ఆ మహా పురుషునికి శస్త్రాస్త్ర సంపదను సమకూర్చింది, ఆ శస్త్రాస్త్ర ప్రయోగంలో తగిన అనుభవం ఆర్జించుకోవటానికి అవకాశం కల్పించింది, లోక కల్యాణ కారకమ్మైన మహాకార్య సాధనకు కారణభూతురాలు కాదగిన సీతాదేవిని శ్రీరామునకు సహధర్మచారిణిగా సిద్ధింపజేసింది – ఇంత విశిష్టవ్యక్తిత్వం, ఇంత విశేష చరిత్రాగల విశ్వామిత్రుడు.

ఉత్తమగురువు తన విద్యాసంపదను ప్రసాదించటానికి సమర్థుడు, శీలసంపన్నుడు అయిన శిష్యునికోసం అన్వేషించటం సహజం. ఆలాంటి శిష్యునికి ఇచ్చిన విద్యా సంపదే సద్వినియోగమౌతుంది. సమాజకల్యాణానికి

దోహదం చేస్తుంది. పటిష్ఠమైన క్షాత్రాన్ని పునాదిగా గలిగి, పరిశ్రమించి బ్రాహ్మ్యన్ని సంపాదించిన విశ్వామిత్రుడు జీవితంలో తానార్జించిన శస్త్రాస్త్ర సంపదనంతా పొందదగిన శిష్యోత్తముడు శ్రీ రామచంద్రు డని భావించాడు. ముమ్ముందు ఆ శ్రీరామచంద్రుడు జరుపవలసిన రాక్షససంహారాన్ని, విశేషించి రావణసంహారాన్ని దర్శించాడు. అందుకు సీతారాముల వివాహం గూడ అవసరమని యెంచాడు. అందుచేతనే కాబోలు దశరథునిఆస్థానంలో శ్రీరామునివివాహం ప్రస్తావనకు వచ్చిన సమయంలో ఆ మహర్షి ప్రవేశించటం జరిగింది.

విశ్వామిత్రుడు రాక్షసులవలన తాపసులకు కలిగే బాధలు వివరించాడు. తన యాగానికి మారీచ – సుబాహులు కల్పించే విఘ్నాలు తెలియజెప్పాడు. రావణవిషయం గూడ ప్రస్తావించాడు. యాగరక్షణకు, మారీచ సుబాహు శిక్షణకు రామచంద్రుని వెంట పంపవలసిన దని దశరథుని కోరాడు.

*"స్వపుత్రం రాజశార్దూలం రామం సత్యపరాక్రమమ్।*
*కాకపక్షధరం శూరం జ్యేష్ఠం మే దాతు మర్హసి॥"*

రాముడు బాలుడని, రాక్షస సంహార సమర్థుడు గాడని, ఆ బాలునిబదులు నేనే వస్తానని దశరథు డెంత చెప్పినా ఆ మహర్షి వినిపించు కోలేదు. తాను దర్శించిన శ్రీ రాముని శక్తిసామర్థ్యాలను, భవిష్యత్పరిణామా లను సూచనగా చెప్పి, అవసరమైతే వసిష్ఠుని గూడ అడుగవలసిన దని పలికి, దశరథుని బలవంత పెట్టి రాముని, అతని ననుసరించిన లక్ష్మణుని వెంట గొని వెళ్ళాడు.

విశ్వామిత్రుని క్రాంతదర్శనం, స్థిరసంకల్పం అమోఘం. ముందు విశ్వామిత్ర మహర్షి. ఆయన వెంట పదునారేళ్ళ కోమలధీరగంభీర మూర్తి, కోదండ మండిత బాహుదండ కీర్తి, శ్రీ రామ చంద్రమూర్తి. అన్న అడుగు జాడల్లో దీప్తాగ్ని హోత్ర సమతేజస్వి తమ్ముడు లక్ష్మణుడు. అయోధ్యానగర

వీధుల్లో ఆ ముగ్గురు నడిచి వెళ్ళుతుంటే అచింత్యుడైన పరమేశ్వరుని వెంట అగ్ని సంభవులైన స్కందవిశాఖులు వెళ్ళిన ట్లుందట. ఆనాడు అదొక మనోహర దృశ్యం. అద్భుత సంఘటన. మహోజ్జ్వల మానవ ధర్మతేజః పురోగమనం.

అయోధ్య దాటగానే సరయూనది. సరయూతీరానికి చేరగానే విశ్వామిత్రుడు వెంట వచ్చే ప్రియశిష్యుణ్ణి మధురాతి మధురంగా రామా! అని పిలిచాడు. దోసిట నీరు తీసుకొమ్మన్నాడు. నిద్రాశ్రమాపనోదకాలు, క్షుత్పిపాసానివారకాలు, సమస్త మంత్ర స్వరూపాలు అయిన బల, అతిబల విద్య లుపదేశించాడు. ఆ విద్యలు గ్రహించే సరికి శ్రీ రాముడు శరత్కాల సూర్య భగవానునిలా శోభిల్లాడట.

విశ్వామిత్రుడు తన వెంట నడిచే రామలక్ష్మణులకు శ్రమ తెలియకుండా, విసుగు రాకుండా ఆయా ఆశ్రమాల చరిత్రలు, దేశాల చరిత్రలు, నదుల కథలు నవరస భరితంగా చెపుతూ నడిపించాడు. తాటక సంహారసమయంలో స్త్రీ హత్యా పాతకానికి వెరచి వెనుకంజ వేసే రామచంద్రు నికి అనేక రాజ ధర్మాలు వివరించాడు.

*"నృశంస మనృశంసం వా ప్రజారక్షణకారణాత్*
*పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా॥*
*రాజ్య భార నియుక్తానామేష ధర్మ స్సనాతనః॥"*

తాటకవధ సమయంలో రాముడు ప్రదర్శించిన వీరత్వాన్ని, వినయ విధేయతలను జూచి ఎంతో ఆనందించి, ఆ రాముని అభినందించి తన అస్త్రాలన్నింటిని ఇచ్చాడు.

*"పరితుష్టోఽస్మి భద్రం తే రాజ పుత్ర మహా యశః।*
*ప్రీత్యా పరమయా యుక్తో దదా మ్యస్త్రాణి సర్వశః॥"*

సుబాహుణ్ణి సంహరించి, మారీచుణ్ణి మహాసముద్రంలో పడగొట్టి తన యాగాన్ని రక్షించిన రాముని మెచ్చుకొన్నాడు.

నిజానికి యాగరక్షణతోనే రామలక్ష్మణుల అవసరం విశ్వామిత్రునికి తీరిపోయింది. అయినా ఆ మహర్షి వారిని అయోధ్యకు త్రిప్పి పంపలేదు. లోక కల్యాణానికి రావణ సంహారం జరగాలి. రావణ సంహారానికి సీతారాముల వివాహం జరగాలి. అందుచేతనే ఆ రామలక్ష్మణులను విశ్వామిత్రమహర్షి మిథిలకు గొని పోయాడు. అయోధ్యకు మిథిలకు వియ్యాన్ని కూర్చి, సీతారాముల వివాహం జరిపించి, ఆ వధూవరుల నాశీర్వదించి, రావణ సంహారానికి పునాది వేసి, జనకమహారాజును, దశరథమహారాజును వీడ్కోని, అనుకొన్న పని అయిందన్నట్లు, అవతారం చాలించ దలచా నన్నట్లు హిమాలయాలకు వెళ్ళాడు.

రామాయణంలో విశ్వామిత్రుడు ఒక ప్రముఖ పాత్ర. ఆయనది చిత్రవిచిత్రమ్మైన మలుపులు తిరిగిన జీవితం. జీవితంలో ఆయన ఎన్నో అపజయా లనుభవించాడు. ప్రలోభాలకు లోనై పతనాలు పొందాడు. అయినా ఆ పతనాల్లో గాని, అపజయాల్లో గాని ఆయన పట్టుదల వదల లేదు. ప్రయత్నం చెదర లేదు. పైగా ప్రతి అపజయము, ప్రతి పతనము భవిష్యదున్నతికి ఒక గుణపాఠంగా, ఒక ప్రాతిపదికగా ఆయన స్వీకరించాడు. పట్టుదలను పెంచాడు. ప్రయత్నాన్ని దృఢతరం చేశాడు. అనుకొన్నది సాధించాడు. లోక కల్యాణానికి దోహదం చేశాడు. అన్ని విధాల చరితార్థు డయ్యాడు.

వాయుపుత్రుడు:

శ్రీ రాముని జీవిత మార్గంలో విశిష్టపాత్ర నిర్వహించిన మరొక మహా వ్యక్తి వాయుపుత్రుడు. ప్రపంచంలో ప్రభువుకు ప్రశస్తి రావటం సులభం. కాని ప్రభువు దగ్గర ఒక సేవకుడుగా ఉంటూ పదిమందిలో పేరు పొందటము, విశేషించి ప్రభువుతో సమానంగా ఒక పూజ్యత సంపాదించ టము అసంభవము కాకపోవచ్చు గాని అసాధారణం అనిమాత్రం అనక తప్పదు. అందులోను ప్రభువు ప్రశస్త గుణ సంపన్నుడైతే ప్రక్కనున్న భటుని

గుణగణాలు ప్రపంచదృష్టిని ఆకర్షించటం మహాకష్టం. సూర్యుని ముందు చుక్క ప్రకాశించ గలదా! కాని సుగుణాభిరాముడైన శ్రీ రామునివంటి మహాప్రభువుకు సేవకుడై ఆయనతో పాటు తానూ ఆలయాలు నిర్మింపచేసు కొంటూ, ఆయన తో పాటు తానూ అర్చన లందుకొంటూ 'శ్రీ రామదూతం శిరసా నమామి' అనే స్తోత్రానికి పాత్రుడైన సేవకోత్తముడు ఆంజనేయుడు.

ఇంచుక సాహసమైనా ఒక మాట ముందుకు మిగిలి అంటే దేశంలో అక్క డక్కడ రామ భక్తుల కంటె ఆంజనేయ భక్తులే అధికంగా ఉన్నారేమో. అపార మైన ఇంత పూజ్యత, అసాధారణమైన ఇంత ప్రశస్తి రామదూతగా ఆంజనేయుడు ఎలా ఆర్జించ గలిగాడు? అందుకు కారణం ఆయన విశిష్ట వ్యక్తిత్వం. వాల్మీకి మహర్షి కవితా శిల్పం ఆయన వ్యక్తిత్వాన్ని మహా మనోహరంగా తీర్చి దిద్దింది. అమేయ శక్తి, అద్భుత యుక్తి, అచంచల భక్తి సంగమించిన ఒక మహా పవిత్ర త్రివేణీ తీర్థం ఆంజనేయుని వ్యక్తిత్వం. అందుకే ఆ రామదూతకు అంత ప్రశస్తి; అంత పూజ్యత. ఒక మహా పురుషజీవితానికి అంకితమై చరితార్థమైన సేవాజీవితానికి ఆంజనేయుడు ఉత్తమఉదాహరణ.

శ్రీ మద్రామాయణంలో శ్రీ రాముని జీవిత మార్గంలో ఆంజనేయుడు నిర్వహించిన పాత్రగూడ అత్యద్భుతం; ఎంతో ప్రధానం. అందు చేతనే వాల్మీకి ఆ పాత్రను ఒక ప్రముఖ సన్నివేశంలో కొలికి పూసలా ప్రవేశపెట్టాడు.

అది రమణీయ పంపాసరోవరం. నిర్మల సుగంధి శీతల జల మయం. నానావిధ తరులతా పుష్పసంశోభితం. కొలను ప్రక్కనే ఒక పర్వతం, ఋశ్యమూక మహా పర్వతం. నానావిధ ధాతు సమన్వితం. అనే కానేక ఫలభార వినమ్ర వృక్ష పరివృతం. రాజ్యాన్ని వదలి, భార్యావియోగ దుఃఖంతో ఆ కొలను గట్టున తమ్మునితో గూడ తిరుగుతున్నాడు శ్రీ రామచంద్రుడు. తన రాజ్యాన్ని, భార్య రుమను కోల్పోయి, భయంతో 'బ్రతుకు జీవుడా' అని ఆ కొండ మీద కాలం గడుపుతున్నాడు సుగ్రీవుడు.

ఇద్దరూ ఆపదల్లో చిక్కుకొన్న వారే. ఇద్దరూ సహాయం కొరకు ఎదురు చూచే వారే. ఇద్దరూ సర్వసమర్థులే. జీవితంలో ఈ లాంటి వారి మధ్య సఖ్యమే ఏర్పడితే అది ఉభయత్రా ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. లోకంలో ఎన్నో మహాకార్యాలు సాధించటానికి ఉపయోగిస్తుంది. కాని వీరిద్దరికి సఖ్యం ఏర్పడటం ఎలాగ? అటు కొలను గట్టున శ్రీ రాముడు; ఇటు కొండ కొన మీద సుగ్రీవుడు. ఈ స్థితిలో సుగ్రీవునిదూతగా శ్రీరాముని చెంత కేగి శ్రీ రామ సుగ్రీవ సఖ్యాన్ని సాధించిన వ్యక్తి ఆంజనేయుడు. ఆయన సాధించిన ఆ సఖ్యం సీతాన్వేషణ - రావణ సంహారాది - మహా కార్యాలకు మంచి సాధనంగా ఉపకరించింది. తరువాత ఆంజనేయుడు తన శక్తి యుక్తుల్ని ప్రదర్శించి రామాయణంలో ఎన్నో ఘనకార్యాలు సాధించాడు. ఉత్తమ దూతకు ఉదాహరణగా నిలిచాడు. కార్య సాధనకు మారు పేరుగా కీర్తి పొందాడు.

ప్రపంచంలో ఏ మహా కార్యాన్ని సాధించటానికైనా మొదట అవసరమైంది శక్తి. శక్తి శారీరకము, మానసికము - అని రెండు రకాలు. కేవల శారీరక శక్తి గాని మానసిక శక్తి గాని స్వయంసంపూర్ణతను పొందలేవు. ఈ రెండింటి కలయికే ఏ మహాకార్య సాధనకైనా గట్టి పునాది. ఆంజనేయునిది సాటి లేని శారీరక బలం. ఆయన మహాబలుడైన వాయుదేవుని పుత్రుడు. అందుచేత పుట్టుక తోనే హనుమంతుడు బలవంతుడు. బాల్యంలోనే సూర్యమండలందాకా ఎగిరిన శక్తిమంతుడు. ఉదయభానునే ఫలమని భక్షించటానికి ప్రయత్నించిన సాహసవంతుడు. వజ్రాయుధందెబ్బకు హతుడు కాకుండా బ్రతికిన వీర్యవంతుడు. ఇంద్రుని మెప్పుతో స్వచ్ఛంద మరణాన్ని, బ్రహ్మ అనుగ్రహంతో అవధ్యత్వాన్ని వరాలుగా పొందిన అదృష్టవంతుడు. అందుకు తోడు ఆంజనేయునిది ఆ జన్మ బ్రహ్మచర్యం. బ్రహ్మచర్యం బలసంవర్ధకం. ఇక ఆయన బలానికి అవధి ఎక్కడ?

రామాయణంలో ఆంజనేయుని దేహబలం ప్రకటమైన ఘట్టాలు అనేకాలు; ఆశ్చర్య జనకాలు. మహేంద్రపర్వతం మీది నుండి మేను పెంచి

సముద్రం దాటాలని ఆకాశాని కెగిరితే అతని ఊరు వేగానికి అక్కడున్న చెట్లన్నీ కూకటి వ్రేళ్ళతో గూడ పెల్లగిలి పైకి లేచి సాగనంపటానికి వెంట వెళ్ళే బంధువుల్లా చాల దూరం ఎగిరి పోయాయట. అశోకవనంలో అడ్డుకొన్న జంబుమాలి – విరూపాక్ష – యూపాక్ష – అక్షకుమారులంతా ఆంజనేయుని బలానికి ఆహుతి అయిపోయారు. అంతటి లంక అంతగా రాక్షస రక్షితమ్మై గూడ ఆంజనేయుని వాలాగ్నికి దగ్ధమ్మై పోయింది. అంతటి రావణుడు ఆహవ భూమిలో ఆంజనేయుని పిడికిటి పోటుకు నెత్తురు గ్రక్కుతూ నేల మీద బోరగిల బడ్డాడు. అంతటి సంజీవి పర్వతం ఆంజనేయుని చేతి వెంట లేచి వచ్చింది. ఆంజనేయుని శక్తి – సామర్థ్యాలు అలాంటివి!

కాగా ఆంజనేయుని శక్తిసామర్థ్యాలను గూర్చి యుద్ధ భూమిలో జాంబవంతు డన్న వాక్యాలు స్మరించ దగినవి. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర ప్రభావానికి సర్వవానర సైన్యమే గాక రామలక్ష్మణులు గూడ మూర్ఛితులైన నాటి రాత్రి, కన్నులు కన్పించని కటికచీకటిలో కొరివి కట్టెలు చేత పట్టుకొని విభీషణ – హనుమంతులు – చేతులు విరిగి, తలలు తెగి, తోకలు తునిగి, ఊర్పులతో, ఏడ్పులతో మూలుగులతో నెత్తుటి బురదలో తేలాడుతున్న వానర వీరులను పరామర్శిస్తూ చివరకు జాంబవంతుని చేరుకొంటారు. జాంబవంతుడు అసలే వృద్ధుడు. పైగా శస్త్రాస్త్ర పీడితుడు. అందుచేత ఆరిపోవనున్న అగ్నిలా ఉన్నాడట. జాంబవంతుడు చెంతకు వచ్చిన విభీషణుని గొంతు గుర్తు పట్టి "హనుమంతుడు బ్రదికియున్నాడా?" అని అడిగాడట. అందుకు విభీషణుడు ఆశ్చర్యపడ్డాడు. సుగ్రీవుని గూర్చిగాని, అంగదుని గూర్చిగాని. కడకు రామలక్ష్మణులను గూర్చిగాని అడుగకుండా ఆంజనేయుని గూర్చి ఎందుకు అడుగుతున్నావన్నాడు. అందుకు జాంబవంతుడు చెప్పిన సమాధానం ఇది:

*"తస్మిన్ జీవతి వీరే తు హతమ ప్యహతం బలమ్।*
*హనుమ త్యుజ్ఝిత ప్రాణే జీవన్తో౽పి వయం హతాః॥"*

హనుమంతు డొక్కడు బ్రదికి ఉంటే చాలు. సర్వ వానర సైన్యము హతమ్మైనా జీవించి నట్లే. ఒక్క హనుమంతుడు హతుడైతే చాలు సర్వ వానర

సైన్యము జీవించినా హతమైనట్లే – ఇది జాంబవంతుని అభిప్రాయం. అంతే గాదు. –

"*ధరతే మారుతి స్తాత మారుతప్రతిమో యది।*
*వైశ్వానర సమో వీర్యే జీవితాశా తతో భవేత్॥*"

విభీషణా! వాయు దేవు సంతతి వాడు, పరాక్రమంలో అగ్నిదేవు సంతతి వాడు అయిన హనుమంతుడు జీవించి ఉంటేనే గాని మాకు బ్రదుకు మీద ఆశ పుట్టదన్నాడు జాంబవంతుడు. ఆంజనేయుడు చెంత నున్నాడని వినేసరికి జాంబవంతుడు పునర్జన్మ పొంది నట్లు పొంగి పోయాడట. వయోవృద్ధుడు, జ్ఞాన వృద్ధుడు, బ్రహ్మపుత్రుడు. అయిన జాంబవంతుని వాక్యాలు ఆంజనేయుని శక్తిసామర్థ్యాలకు సరియైన తూకపురాళ్ళు.

బుద్ధిబలం లేనిదే కేవల శారీరకబలం ఎంత ఉన్నా సార్థకం గాదు. బుద్ధి బలంతో కూడిన శారీరకబలమే సర్వకార్య సాధనకు ఉత్తమఉపకరణం. బుద్ధిబలం చాల వరకు పుట్టుక తో వస్తుంది. భగవద్దత్తమైన బుద్ధి బలానికి పుష్టినిచ్చేది పాండిత్యం. బుద్ధిబలం, పాండిత్యం ఉన్నంతమాత్రాన ఒక వ్యక్తి ఉత్తమదూత కాలేడు. ఎదుటి హృదయాన్ని అట్టే ఆకర్షించ లేడు. అందుకు మృదుమధుర చతుర సంభాషణం గూడ ఉండాలి. రామాయణంలో ఉత్తమదూతగా ప్రశస్తి కెక్కిన ఆంజనేయుని బుద్ధినైశిత్యం, వేద పాండిత్యం, శాస్త్రవైదుష్యం, మృదుమధుర చతుర సంభాషణం ప్రథమ సమావేశం లోనే ఆ రామచంద్రుని ప్రశంస నందుకో గలిగాయి. హనుమ మాట్లాడుతూ ఉంటే రాముడు లక్ష్మణుని తో –

"*వాక్యజ్ఞం మధురై ర్వాక్యైః స్నేహయుక్తమరిందమ!*" – అంటాడు.

వేదత్రయవిశారదునికి గాని ఈ మాట తీరు వశం గాదన్నాడు. వ్యాకరణ శాస్త్ర సంపన్నునికి గాని అపశబ్దరహితంగా ఇలా మాట్లాడటం సాధ్యంగా దన్నాడు. ఆ వాయుపుత్రుని వాక్చాతురికి ముగ్ధుడై –

*"సంస్కారక్రమ సంపన్నా మద్రుతా మవిలంబితామ్।*
*ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయం హారిణీమ్॥"*

అని మరీ మరీ మెచ్చుకొన్నాడు అంతే గాదు. ఇంత సమర్థుడైన దూతగల ప్రభువుదే కార్యసిద్ధి అని గూడ తమ్మునికి తెలియజేశాడు.

*"ఏవం విధో యస్య దూతో న భవే త్పార్థి వస్య తు।*
*సిద్ధ్యన్తి హి కథం తస్య కార్యాణాం గతయో౽నఘ॥"*

ఆంజనేయుని బుద్ధిబలం, మాటనేర్పు ప్రకటమ్మైన మరోఘట్టం విభీషణ శరణాగతి. యుద్ధానికి ముందు శరణు వేడ వచ్చిన విభీషణునిగూర్చి సుగ్రీవాంగద జాంబవంతాదులు తలకొక తీరుగా మాట్లాడుతారు. చివరకు శ్రీ రామచంద్రుడు హనుమంతుని అభిప్రాయం అడుగుతాడు. అప్పుడు హనుమంతుడు తనకంటె పెద్దలైన అందరి అభిప్రాయాలను అతి నిపుణంగా త్రోసి పుచ్చి, వాస్తవికతను చక్కగా ఊహించి, ఎక్కడా పొల్లుపోకుండా తన అభిప్రాయం తెలియజెప్పి మీద మీ యిష్టం అన్నాడు ఆ రామునితో. రాముడు విభీషణుణ్ణి స్వీకరించింది కేవలం ఆంజనేయునిమాటవల్లనే గాదు; ఆయన శరణాగతవాత్సల్యం వల్ల. అయినా ఆంజనేయుని ఆలోచనస్థాయి, మాటతీరు ఆ రామచంద్రుని మనస్సు నాకర్షించాయి. మరొక సారి వాల్మీకి మహర్షి ఆ వాయుపుత్రుని వాక్చమత్కృతిని వివరించాడు.

*"అథ సంస్కారసంపన్నో హనుమాన్ సచివోత్తమః।*
*ఉవాచ వచనం శ్లక్ష్ణ మర్థవ న్మధురం లఘు॥"*

ఆంజనేయుని బుద్ధిబలం, వాక్చాతుర్యం వాలి వధానంతరం కిష్కింధా రాజ్యాభిషిక్తుడై కామలోలతచే రామకార్యాన్ని మరచిన సుగ్రీవునికి కర్తవ్య బోధ చేసాయి. సీతాన్వేషణ సమయంలో స్వయంప్రభబిలం లోనే స్థిరంగా ఉండి పోదా మన్న అంగదుని మందలించాయి.

సామాన్యంగా కార్యసాధన సరళ రేఖలా సాగిపోదు. ఎన్నో వంపులు, కొన్ని చోట్ల కత్తిరింపులు దానికి తప్పవు. వంపుల్లో వెనుక బడకుండ, కత్తిరింపుల్లో క్రింద బడకుండ పదును తగ్గకుండ, పాకం చెడకుండ

ముందుకు సాగాలంటే ఉపాయజ్ఞత గూడ ఉండాలి. ఈ ఉపాయజ్ఞతనే యుక్తి అనవచ్చు. యుక్తి గూడ వ్యక్తి బుద్ధి బలంలో భాగమే. యుక్తి లేనిదే శక్తి అంత ప్రయోజనకరం గాదు.

సముద్ర లంఘనసమయంలో సురసను మెప్పించి తప్పించు కోటంలో, సింహికను సంహరించటంలో, లంకాధి దేవతను జయించటంలో శత్రు నగరమైన లంకను ఏ సమయంలో, ఏ ద్వారంనుండి, ఏ రూపంలో ప్రవేశించాలో ఆలోచించి నిర్ణయించటంలో ఆంజనేయుని ఉపాయజ్ఞత అగుపిస్తుంది.

సముద్ర లంఘనం, లంకా ప్రవేశం ఆంజనేయుని ఘనకార్యాలుగా అనేకులు కొనియాడుతారు. అవి ఆయనఘనకార్యాలే అనుమానం లేదు. అంతకంటె ఘనకార్యం ఆయన మున్నెన్నడు చూడని ఒక స్త్రీమూర్తిని అంత పెద్ద శత్రునగరంలో అన్యులెవ్వరికంట బడకుండ అల్పవ్యవధిలో వెదకి కనుగొనటం, రాక్షస మాయతో విసిగి సాక్షాత్తు శ్రీ రాముడే వచ్చినా శంకించే స్థితిలో ఉన్న సీతాదేవికి తగిన సమయంలో, తగిన రూపంలో కల్పించి, తగిన విధంగా మాట్లాడి తాను రామదూత నన్న నమ్మకం కలిగించటం, తా నొక్కడై కూడ శత్రుబలం పరీక్షించటానికి, రామబలం రుచి చూపించటానికి సాహసించి అశోకవన ధ్వంసాన్ని, లంకానగర దహనాన్ని చేపట్టి విజయ వంతంగా నిర్వహించటం.

శక్తి సామర్థ్యాలతో పాటు సమయానుకూలంగా వ్యవహరించి, అవరోధాల నధిగమించ గల ఉపాయజ్ఞత ఉండ బట్టే ఆంజనేయుని ప్రయత్నాలు అపాయాల్లో విఫలం కాకుండ విజయవంతా లయ్యాయి.

శక్తి, యుక్తి ఉన్నంతమాత్రాన ఒక వ్యక్తి జీవితంలో ఉత్తమస్థాయి నందు కోలేడు. ఉత్తమదూత గూడ కాలేడు. పల్లం వైపు ప్రవహించటం నీటి కెంత సహజమో స్వార్థంవైపు మొగ్గటం శక్తియుక్తుల కంత సహజం. మితి మీరిన స్వార్థం సమాజానికి ప్రమాదకరం. వ్యక్తి పతనానికి కారణం. అందుచేత ఒక వ్యక్తి శక్తి యుక్తులు సద్వినియోగం కావటానికి, అవి

అతనిఉన్నతికి, సమాజకల్యాణానికి దోహదం చెయ్యటానికి భక్తి గూడ ఉండాలి. భక్తి అంటే కేవలం పూలు, పండ్లు పెట్టి పూజించటం గాదు; కొబ్బరి కాయలు కొట్టటం గాదు; కుంకుమ బొట్లు విభూతి రేఖలు ధరించటం గాదు. భక్తి హృదయ పవిత్రత; ఆశయ శుద్ధి; ఆత్మార్పణ.

ఆంజనేయుడు మహాభక్తుడు. రామభక్తుడు. ఆ రాముని పంపాతీరంలో చూచినది మొదలు ఆంజనేయుని అంతరంగం భక్తి భావంతో నిండిపోయింది. కాలం గడిచే కొద్దీ ఆ రామభక్తి అపారంగా పెరిగింది. ఇది కృతజ్ఞతారూపమైన కర్ణుని స్వామి భక్తి వంటిది గాదు. సుగుణాభిరాముడైన శ్రీ రాముని చూచి పులకించి అణువణువున పెంచుకొన్న అచ్చపు భక్తి; సహజ భక్తి. అందు చేతనే రామశబ్దం విన్నా, రామనామం అన్నా ఆ మహాభక్తుడు పరవశత నొందాడు. ఆ ధర్మమూర్తి జీవితానికి తన శక్తి సామర్థ్యాలను పూజాప్రసూనాలుగా అర్పించాడు. వాటిని చరితార్థం చేసుకొన్నాడు.

యుద్ధరంగంలో రావణుని ఎదుర్కోటానికి లక్ష్మణుడు సిద్ధమౌ తుంటే, సేవకు డుండగా మీ కీ శ్రమ యెందుకని ఆంజనేయునిభక్తి అతనిని వారించింది. రథస్థుడైన రావణునితో రాముడు భూస్థితుడై పోరు సలుపు తుంటే వాయుపుత్రునిభక్తి భుజం వంచి త న్నధి రోహించ మని అడిగింది. హిమవన్మందర మేరు నగాలనే గాక ముల్లోకాలను ఎత్తగలిగిన రావణుని బాహుబలం శక్తి వ్రేటుకు మూర్ఛితుడైన లక్ష్మణుని ఎత్తలేక పోతే, ఆంజనేయుని భక్తి అవలీలగా చేతులు చాచి ఆ లక్ష్మణుని శరీరాన్ని ఎత్తి తెచ్చింది. భగవంతుడు భక్తపరాధీనుడు.

రామ భక్తుడైన ఆంజనేయుడు రామాయణంలో అద్భుత విజ యాలు అనేకాలు సాధించటమే గాదు, పెక్కుమందికి ప్రాణదాతగా ఉపక రించాడు. సముద్రాన్ని లంఘించి, ప్రాయోపవేశానికి పూనుకొన్న అంగద జాంబవంతాదుల ప్రాణాలు నిలిపింది ఆంజనేయుడు. అశోకవనిలో ప్రాణత్యాగమునకు పూనుకొన్న సీతాదేవికి ఆశాకిరణంగా అగుపించి ఆమెను బ్రతికించింది ఆంజనేయుడు. విరహతాపంతో వాడిపోతున్న శ్రీ రామునికి

సీతా సందేశామృతాన్ని తెచ్చి యిచ్చింది ఆంజనేయుడు. శక్తి ప్రేటుకు మూర్ఛితుడై కొన ఊపిరితో కొట్టు కొంటున్న లక్ష్మణుని సంజీవితో సజీవుణ్ణి చేసింది ఆంజనేయుడు. ఓషధీపర్వతాన్ని తెచ్చి యుద్ధ భూమిలో హతమైన సర్వవానర సైన్యాన్ని బ్రతికించింది ఆంజనేయుడు. శృంగిబేరపురంలో శ్రీ రాముని ఆగమన శుభవార్తను గుహుని కందించింది ఆంజనేయుడు. అన్న రాక కోసం అహోరాత్రాలు ఎదురుచూచే భరతునికి శ్రీ రాముని రాక చెప్పింది ఆంజనేయుడు. వాయుపుత్రుడు ఈ విధంగా ఎంత మందికో ప్రాణదాత. ఎంత మందికో ఆనందదాత.

తత్త్వవేత్తలు వాయుపుత్రుని శబ్దస్వరూపు డంటారు. మంత్ర స్వరూపు డంటారు. పరమాత్మ సందేశాన్ని జీవాత్మ కందించే దేవదూత అంటారు. పరమాత్మ నుండి వేరైన జీవాత్మ మానవ శరీరంలో బంధింపబడి ఉందని, దాని చుట్టూ సంసార సాగరం నురువులు గ్రక్కుతూ ఉందని, మానవుని ఇంద్రియాలు పదింటిని అతని మనస్సు పరిపాలిస్తూ ఉంటుందని, ఈ స్థితిలో జీవాత్మకు పరమాత్మసందేశాన్ని అందించి సంసారసాగరాన్ని తరించటానికి, ఇంద్రియాలతో గూడిన మనస్సును జయించటానికి, జీవాత్మ పరమాత్మల సంగమానికి సాధన భూతుడైన దేవదూత ఆచార్యుడని, అదే రామాయణం లోని హనుమతత్త్వ మని అధ్యాత్మ విదులు అంటారు.

పది తలల రావణుడు పాలించే మహానగరం లంక. దాని చుట్టూ సముద్రం. శ్రీ రామునినుండి వేరైన సీత ఆ లంకలో బంధింపబడి ఉంది. ఆజన్మబ్రహ్మచారి అయిన ఆంజనేయుడు సంసారసాగరాన్ని స్పృశించకుండా ఆకాశ మార్గంలో అంటే విష్ణు పద మార్గంలో పయనించి శ్రీ రామసందేశాన్ని సీతాదేవికి అందించాడు. సముద్రం దాట డానికి, మనో రూపుడైన లంకేశ్వరుని జయించటానికి జీవాత్మ పరమాత్మలైన సీతారాముల ఏకం చేయటానికి మార్గాన్ని సిద్ధం చేశాడు.

ఇవి నిగూఢాలు, మహోన్నతాలు అయిన తాత్త్వికరహస్యాలు. జన్మ జన్మల తపస్సు చేత దర్శింపదగిన పరమ సత్యాలు.

సామాన్య మానవ దృష్టితో చూచినా ఆంజనేయునిది ఒక విశిష్ట వ్యక్తిత్వం. అది శక్తీ, యుక్తీ, భక్తీ, సంగమించిన ఒక పవిత్రత్రివేణీ సంగమ తీర్థం, వ్యక్తి ఔన్నత్యానికి, సమాజ కల్యాణానికి దోహదం చేసిన ఒకమహనీయ జీవితం మానవ జాతికి ఆదర్శ మార్గం. అందు చేతనే ఆంజనేయునికి అంత ప్రశస్తి వచ్చింది. అంత పూజ్యత లభించింది.

*"మనోజవం మారుతతుల్య వేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్*
*వాతాత్మజం వానర యూథ ముఖ్యం శ్రీ రామదూతం శిరసా నమామి.*

ఆర్షకవులు తమ మహాకావ్యాలలో మానవ స్వభావం లోని శిఖరాలను, లోతులను, మలుపులను అద్భుతంగా చిత్రించారు. మానవ జీవితతత్త్వాన్ని సమగ్రంగా తెలియజెప్పారు. ఆ మహా గ్రంథాల అధ్యయనం ద్వారా మానవుడు తన లోని పశు ప్రకృతిని క్షాళన చేసుకొని, రాక్షసప్రకృతిని రూపు మాపుకొని, మానవ ప్రకృతిని పండించుకొని మహాత్ముడుగా ఎదగాలి. సమాజ కల్యాణానికి దోహదం చేయాలి. అపుడే అతడు నేర్చిన విద్యకు సార్థకత. అతని జీవితాని కొక చరితార్థత.

# 15. శ్రీరామచంద్రుడు

డా. అప్పజోడు వేంకటసుబ్బయ్య,

ఆర్ష ధర్మానికి సాహిత్యానికి అవినాభావసంబంధం. ధర్మం వేద మూలం. వేదధర్మం ప్రభుసమ్మితం. ప్రభుసమ్మితమైన వేదధర్మం ప్రజల అవగాహనకు దూరమైనపుడు కాంతా సమ్మితమైన కావ్యపద్ధతిలో వేదధరాన్ని లోకానికి అందించిన ఆదికావ్యం శ్రీమద్రామాయణం. అందుచేతనే వాల్మీకి మహర్షి ప్రోక్తమైన ఆ రామాయణం వేదమని, వేదవేద్యుడైన ఆ పరమాత్మ దశరథాత్మజుడని పేర్కొనటం జరిగింది.

*"వేదవేద్యేపరేపుంసి జాతే దశరథాత్మజే*
*వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"*

రామాయణ కథా నాయకుడైన రాముడు రూపు దాల్చిన ధర్మమట. "రామో విగ్రహవాన్ ధర్మః" ధర్మస్వరూపుడైన ఆ మహాపురుషుని జీవిత చరిత్రమే శ్రీమద్రామయణం. పుత్రుడుగా, సోదరుడుగా, మిత్రుడుగా, భర్తగా, ప్రభువుగా ఆయన జీవితంలో ఎదుర్కొన్న ఎన్నో కష్టాలు, అనుభవించిన కొన్ని సుఖాలు, అనుసరించిన అనేక ధర్మాలు రసమయంగా, మానవజాతికి మార్గదర్శకంగా రామాయణమహాకావ్యంలో చిత్రించబడ్డాయి. ధర్మాత్ముడైన దశరథాత్మజుడు ఆర్యులకు ఆదర్శపురుషుడేగాక ఆరాధ్య దైవమయ్యాడు.

అయితే శ్రీరాముని కేవల దైవ స్వరూపునిగా స్వీకరించి రామాయణం చదివితే ప్రయోజనం తక్కువ. ఆయన నొక మానవ మాత్రుని గానే భావించి ధర్మావలంబం వల్ల మానవుడెంతటి మహాత్ముడుగా ఎదుగ గలడో దర్శించినట్లయితే ప్రయోజనం ఎక్కువ. రామాయణంలో రాముని రూపం, గుణం అన్ని మనోహరాలే, మహనీయాలే.

శ్రీరాముడు సుందర సురుచిరశుభాంగుడు. ఆజానుబాహువైన ఆయన సమున్నత విగ్రహం, నీలమేఘశ్యామలవర్ణం, ప్రసన్న వదనం,

సుందర మందహాసం, సువిశాలనేత్రాలు, సుదీర్ఘనాసిక, నుదుటి కస్తూరి బొట్టు, అందమైన ఆ ఉంగరాల జుట్టు, కోదండమండిత బాహుదండం – ఆనాటి కౌసల్యా దశరథుల మనస్సులనే గాదు, అయోధ్యా రాజ్యంలోని ఆబాలగోపాలాన్నే గాదు, ప్రతిభారతీయహృదయాన్ని అప్పటినుండి ఇప్పటి దాక ఆకర్షిస్తూనే ఉన్నాయి. ఎప్పటికీ ఆకర్షిస్తాయి.

వాల్మీకి వర్ణించిన రాముని గుణాలు మహోన్నతాలు. మానవజాతికి ఆదర్శాలు. రాముడు ధర్మజ్ఞుడు. కృతజ్ఞుడు, సత్యసంధుడు, ప్రజాహితరతుడు, యశస్వి, జ్ఞానసంపన్నుడు, శుచి, వశ్యకాముడు, స్థిరచిత్తుడు, ఆర్యుడు, సమదర్శనుడు, చంద్రుని వలె ప్రియదర్శనుడు. సముద్రుని వలె గంభీరుడు, హిమవంతుని వలె ధైర్యవంతుడు. విష్ణుమూర్తి వలె వీర్యవంతుడు. క్రోధంలో కాలాగ్ని సదృశుడు. సహనంలో పృథ్వీ సముడు.

ప్రధానంగా ధార్మికత, ప్రజాహితరతి, త్యాగనిరతి, సర్వసమత్వం, ప్రియదర్శనత్వం, శ్రీరాముని ఆదర్శ ప్రభువుగా రూపొందించాయి. ఆయన రాజ్యాన్ని ఆదర్శరాజ్యంగా లోకానికి అనుగ్రహించాయి.

విద్యాభ్యాసం ఏ వ్యక్తికైనా భావిజీవితపాథేయం. శ్రీరామచంద్రుడు క్షత్రియోచితమైన అస్త్ర విద్యను పరమసాత్త్వికుడు, బ్రహ్మర్షి అయిన వసిష్ఠుని దగ్గర అభ్యసించాడు. ఆ విద్యలో అపారసామర్థ్యం గడించాడు. అవసరమైన శస్త్రాస్త్ర సామగ్రినంతా ఒకనాటి రజస్తమో గుణాలరాశి, ఆనాటి సత్త్వగుణపేటి అయిన విశ్వామిత్రమహర్షి నుండి గ్రహించాడు. అందుకే ఆ రామచంద్రుని అస్త్రవిద్యాసామర్థ్యం, శస్త్రాస్త్రసాధనాలు ధర్మబద్ధాలయ్యాయి. మహాకార్యాలు సాధించాయి. మానవ కల్యాణానికి దోహదం చేశాయి.

విశ్వామిత్రుని వెంట యాగరక్షణకు వెళ్ళటం శ్రీరాముని జీవితంలో ఒకచిత్రమైన మలుపు. ఆమహర్షివెంట వెళ్ళటం వల్ల అనుకోకుండా అపార శక్తి సంపన్నులైన అనేక శస్త్రాస్త్రాలు సిద్ధించాయి. శస్త్రాస్త్ర ప్రయోగంలో అనుభవం సాధించటానికి తన సామర్థ్యం నిరూపించుకోవటానికి తగిన

అవకాశాలు లభించాయి. మిథిలా నగరంలో సకలరాజసమక్షంలో శివధను ర్భంగం గావించటము, సీతామహాదేవిని సహధర్మచారిణిగా స్వీకరించటము జరిగాయి.

సీతారాముల వివాహం జరిగింది. రామాయణం రసవత్తరమ్మైన మలుపు తిరిగింది. వ్యక్తి జీవితాన్ని విస్తృతపరిచేది, ఎత్తుకెదిగించేది వివాహమే. సీత లేకుంటే రావణవధే లేదు. రావణవధే లేకుంటే రాముని జీవితానికి సార్థకతే లేదు. రామాయణ మహాకావ్యమేలేదు.

ఇంత వరకు రాముని జీవితంలో ఆయన ధనుర్బలం వ్యక్తమయ్యే సంఘటనలేగాని ఆయన ధర్మబలం ప్రకటమయ్యే సన్నివేశాలులేవు. యౌవరాజ్యాభిషేక భంగం శ్రీరాముని ధర్మబలానికి మొదటి అగ్ని పరీక్ష.

దశరథుడు శ్రీరాముని గుణగణాల నొకసారి నెమరువేసుకొన్నాడు. తన వార్ధకాన్ని ఒకసారి తలచుకొన్నాడు. శ్రీరాముని యౌవరాజ్యాభిషేకం జరిపించటం అన్ని విధాల అభిలషణీయమనుకొన్నాడు. మంత్రి పురోహిత పౌర జానపద ప్రముఖులతో సంప్రతించి ముహూర్తం నిర్ణయించాడు. యౌవరాజ్యాభిషేకానికి అన్ని ప్రయత్నాలు జరుగుతున్నాయి. అయోధ్య అందంగా అలంకరించుకొని అందుకు సిద్ధంగా ఉంది. తెల్లవారితే శ్రీరామ యౌవరాజ్యాభిషేక మహోత్సవం.

శ్రీరాముడు శిరస్స్నానం చేశాడు. పూజాదికాలు పూర్తిచేసు కొన్నాడు. పిలుపు కోసం ఎదురుచూస్తున్నాడు. ఇక సుమంత్రుడు రావ టమే ఆలస్యం. అంతలోనే సుమంత్రుడు వచ్చాడు. కైకేయి అంతః పురానికి రమ్మని వర్తమానం తెచ్చాడు.

రాముడు ఆశించినదొకటి. అయినది ఇంకొకటి. పూలహారం ఆశిస్తే మెడకు సర్పహారం పడింది. అమృతాన్ని ఆశిస్తే హాలాహాలం పైకి పొంగింది. కైకేయి రామునితో 'తండ్రి మాట తప్పక పాటిస్తావా?' అంది. అది రామునికి పిడుగు పాటులా ఉంది. తనకేదో ప్రమాదం కలుగుతుందని గాదు. తల్లితన పితృభక్తినే శంకిస్తూ ఉందని. 'అమ్మా! నన్ను శంకిస్తున్నావా.

ఇక బ్రదికి ప్రయోజనమేమి? తండ్రి ఆజ్ఞాపిస్తే అగ్నిలో దూకుతాను. విషాన్ని భక్షిస్తాను. మహాసముద్రంలో మునుగుతాను. రాముడు రెండు మాటల వాడుకాదు. నన్ను నమ్ము' అన్నాడు.

కైకేయి దశరథుని కోరిన క్రూరవరాలు రెండూ వినిపించింది. అవి రాముని జీవితాన్నే తలక్రిందులు చేసేవి. ఆయన భోగానుభవాన్ని ముక్కలు ముక్కలుగా కత్తిరించేవి.

అయినా రాముడు అణుమాత్రంగూడ కలవరపాటు నొందలేదు. పైగా కైకేయితో 'తల్లీ! నీ వన్నట్లు భరతుడే రాజవుతాడు. నేను రాజాజ్ఞ మేరకు జడలు దాల్చి ముని వృత్తిని స్వీకరిస్తాను. అడవులకు వెళ్ళుతాను. అయితే తండ్రి తనంతతాను నాకీ సంగతి ఎందుకు చెప్పలేదన్నదే నా బాధ' అన్నాడు. అందుకు కైకేయి మనస్సు కరుగలేదు సరిగదా అడవులకు వెళ్ళమని ఆమె రాముని త్వర పెట్టింది. అయినా రాముడు తన సమతను గోల్పోలేదు. పైగా కైకతో 'అమ్మా! నాకు ధనం మీద ఆశలేదు. రాజ్యం మీద కాంక్షలేదు. నన్ను ఋషితుల్యునిగా భావించు. కేవలంధర్మాన్ని ఆశ్రయిస్తాను.

*"నా హమర్థపరోదేవి! లోకమావస్తుముత్సహే।*
*విద్ధి మామృషిభిస్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్॥"*

అంతేగాదు. అందరికన్న నీవు నన్నెక్కువగా ఆజ్ఞాపించగల దానవే. ఇవి దశరథుని ఆజ్ఞలని నాతో చెప్పాలా? నీవు చెపితే నేను కాదంటానా! ఆ మాత్రం నామనస్సును అర్థం చేసుకోలేకపోయావా!' అన్నాడు.

*"న నూనం మయి కైకేయీ! కిఞ్చిదాశంససే గుణమ్।*
*య ద్రాజాన మవోచస్త్వం మమేశ్వరతరాసతీ॥"*

రాముడు దశరథునికి, కైకేయికి ప్రదక్షిణం చేశాడు. సభామంటపానికి వెళ్ళి అభిషేకజలపూర్ణకుంభాలకు, తదితర ద్రవ్యాలకు ప్రదక్షిణంచేశాడు. ఆత్మీయులందరి దగ్గర సెలవు తీసుకొన్నాడు. అరణ్యాలకు బయలుదేరాడు.

ఇది ఒక వ్యక్తి జీవితంలో సామాన్యమైన మలుపుగాదు. సాధారణ మైన దెబ్బగాదు. పట్టాభిషేకానికి కట్టుకొన్న పట్టుబట్టలు వదలి అరణ్యా వాసానికి నారచీరలు ధరించటం. అభిషేకార్థం తెచ్చిన తీర్థ జలాలతో అరణ్యావాసానికి స్నానం చెయ్యటం. మహారాజుగా సాగించవలసిన జీవితం మునివృత్తి నవలంబించటం. అయినా రాముడు కలత పడలేదు. ఎవ్వరిని నిందించలేదు. అయోధ్యా మహారాజ్యాన్ని వదలి అడవులకు వెళ్ళే ఆయన మనస్సు ప్రాపంచిక సుఖాలను, అన్ని లోకాలను అధిగమించి బ్రహ్మ పదార్థంలో లీనమైన పరమయోగీంద్రుని మనస్సులా ఉందట.

*"న వనం గన్తు కామస్య త్యజతశ్చ వసుంధరామ్*
*సర్వ లోకాతిగస్యేవ లక్ష్యతే చిత్త విక్రియా॥"*

రాముని సమతాస్వభావం, త్యాగ భావం అనుపమానాలు. తండ్రి కొరకు ఆయన జీవితంలో అంతటి త్యాగం చేశాడు. తమ్ముడు భరతుడు అరణ్యంలో తన ఆశ్రమందాకా వచ్చి, వాకిటికి అడ్డంగా పడుకొని, అయోధ్యా రాజ్యాన్ని స్వీకరింప వలసినదని ఎంత అర్థించినా తండ్రి కిచ్చిన మాట తప్పనన్నాడు. భరతుడు మరీ బలవంతం చేస్తే 'కాంతి చంద్రుణ్ణి విడిచిన విడుచుగాక, మంచు హిమవత్పర్వతాన్ని వదలిన వదలుగాక, సముద్రం చెలియలికట్ట దాటిన దాటుగాక – తమ్ముడూ! నేను మాత్రం తండ్రి కిచ్చిన మాట తప్ప' నన్నాడు.

*"లక్ష్మీశ్చన్ద్రా దపేయాద్వా హిమవాన్ వా హిమం త్యజేత్*
*అతీయాత్సాగరో వేలాం నప్రతిజ్ఞా మహం పితుః॥"*

రాముని దండకారణ్య ప్రవేశం ఆయన అరణ్య వాసంలో ఎంతో ప్రాధాన్యమున్న ఘట్టం. రాముడు దుష్ట సంహారం గావించి మహర్షులకు రక్షణ కల్పిస్తానని మాట యిచ్చింది దండకారణ్యంలోనే. శూర్పణఖ తారసిల్లింది, ఖరదూషణాదుల వధించింది, సీతాపహరణం జరిగింది దండకారణ్యంలోనే. దండకారణ్య ప్రవేశమే లేకుంటే రాముని జీవితంలో

ఇవి జరిగేవి కాదేమో. ఆయన జీవితాని కొక చరితార్థత లభించేది కాదేమో. అయోధ్యలో పట్టాభిషేక భంగం రాముని ధార్మిక ప్రకృతిని ఆవిష్కరిస్తే, అరణ్యా వాసంలో దండకారణ్య ప్రవేశం ఆయన దుష్టశిక్షణ, శిష్టరక్షణ సామర్థ్యాన్ని లోకానికి చాటాయి. అనుకూల దాంపత్యం ఎన్ని కష్టాల నైనా భరించ గలదేమో గాని ఎడబాటును మాత్రం సహించ లేదు. అందులోను ఒక దుర్మార్గునిచేత భార్య అపహరింప బడినపుడు భర్త మానవస్వభావసహజంగా ఎంత ఆవేదనకు గురి అవుతాడో ఎంత ఆవేశాన్ని పొందుతాడో, ఎంత అన్వేషణ సాగిస్తాడో, ద్రోహిని దండించాలని ఎంత ప్రయత్నిస్తాడో వాల్మీకి మహర్షి పాఠకుని మనస్సు ద్రవించేలా శ్రీరాముని పాత్రలో చిత్రించాడు.

సుగ్రీవసఖ్యంతో శ్రీరాముని అంగబలం విపరీతంగా పెరిగింది. హనుమసముద్ర లంఘనంతో సీతాదేవి ఉనికి తెలిసింది. ద్రోహిదశగ్రీవుని తుద ముట్టించటానికి దండయాత్ర ప్రారంభమైంది. శ్రీరాముడు సర్వ వానరసైన్యంతో లంకను ముట్టడించటానికి, రావణుని సంహరించటానికి సన్నద్ధుడై సముద్రం ఒడ్డున దండు విడిశాడు. ఆ సమయంలో శరణంటూ వచ్చాడు రావణసోదరుడు విభీషణుడు. వానరప్రముఖులు అతనికి ఆశ్రయమివ్వకూడదన్నారు . అది ఎంతో ప్రమాదకరమన్నారు. పైగా అతనిని పట్టి వధించాలన్నారు. రాముడు అప్పుడుగూడా వారి మాటలు ఆలకించాడే గాని ఆవేశపడలేదు. తన ఆదర్శాలు విడనాడలేదు. శత్రువైనా శరణాగతుడనని అంటే చాలు, అతడు ఎలాంటి వాడైనా ఆశ్రయ మిస్తానన్నాడు. ఒకసారి శరణాగతుడను నీ వాడను అని యాచిస్తే చాలు అతనికి సర్వభూతాల వల్ల ప్రమాదా లేర్పడినా అభయహస్త మిస్తానన్నాడు. శరణాగత రక్షణ తన జీవిత వ్రతమన్నాడు.

*"అరో వా యది వా దృప్తః పరేషాం శరణాగతః।*
*అరిః ప్రాణాన్పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా॥*
*సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।*
*అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ॥ "*

అంతేగాదు. ఒక అడుగు ముందుకు వేసి సాక్షాత్తు రావణుడే వచ్చి శరణన్నా అతనికి అభయం ఇస్తానన్నాడు.

''*ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా।*
*విభీషణో వా సుగ్రీవా! యది వా రావణస్స్వయమ్॥* ''

రావణుని చారుల పట్ల గూడ శ్రీరాముడు గొప్ప ఔదార్యాన్ని ప్రదర్శించాడు. వానర సేనా రహస్యాలు గ్రహించటానికి వానర రూపంలో వానరసేనను ప్రవేశించిన శుక సారణులను విభీషణుల కనిపెట్టి శిక్షించవలసి నదని శ్రీరాముని యెదుట నిలిపి నపుడు ఆయన చిరునవ్వు నవ్వాడు. శుక సారణులను చూచి మీరు సావధానంగా మా సైన్యాన్నంతా పరిశీలిం చండి. స్వేచ్ఛగా లంకకు వెళ్ళండి. అవసరమైతే ఈ విభీషణుడే మీకు సైన్యాన్నంతా చూపుతాడు. ఏ మాత్రం మీరు ప్రాణభయం పొందనక్కరలేదు. నిరాయుధులను, దూతలను మేము వధించం. లంకకు వెళ్ళి రావణునితో రేపు ప్రాతఃకాలన్నే మేము లంకా ప్రాకారాలను, బహిర్ద్వారాలను ముట్టడిస్తా మని చెప్పండి. తన బలాన్ని ప్రదర్శించమని సలహా యివ్వండి. అని చెప్పి పంపాడు. శ్రీరాముని ఆత్మవిశ్వాసం, ఔదార్యం, ఆదర్శపరత - అద్వితీయాలు, అవి మానవ జాతికి శాశ్వతాదర్శాలు.

యుద్ధరంగంలో సాక్షాత్తు రావణునితో పోరేటప్పుడు గూడ ఆయన ఆవేశపడి పై గుణాలను విస్మరించలేదు. జీవితంలో తనకు తీరని ద్రోహం చేసిన దశగ్రీవుడు యుద్ధరంగంలో తొలిసారి తనకు కన్పించినపుడు, అతని తేజస్సుచూచి

''*అహో దీప్తో మహారాజా రావణో రాక్షసేశ్వరః।*
*ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యో రశ్మి భిర్భాతి రావణః।*
*దేవదానవ వీరాణాం వపుర్నైవం విధం భవేత్॥* ''

అని మనసార మెచ్చుకొన్నాడు. అతని మీదికి ఆవేశంతో పరుగెత్తే లక్ష్మణుని ఆపి 'తమ్ముడూ! జాగ్రత్త. రావణుడు మహా పరాక్రమశాలి,

అతడు మహోగ్రుడైతే ముల్లోకాలుగూడ అతని యెదుట నిలువ లేవు' - అని శత్రుపరాక్రమాన్ని ప్రశంసించి, తమ్ముని హెచ్చరించి పంపాడు.

అది రామరావణ ద్వంద్వయుద్ధం, రాముడు రావణుని రథసారథిని, అశ్వాలను, రథాన్ని ముక్కలు చేశాడు. రావణుని చేత ధనుస్సును గూడ త్రుంచాడు. అతని కిరీటాన్ని గూడ అవల పడగొట్టాడు. నిస్సహాయుడై, నిలువెల్ల చెమటలు గ్రక్కుతూ, నిడుపైన నిశ్శ్వాసాలు వదలుతూ నేల మీద చతికిల బడిన ఆ లంకేశ్వరుని చెంత చేరి, చేతికి చిక్కినాడు గదా అని సంహరించకుండా "రాక్షసేశ్వరా! నీవు యుద్ధంలో బాగా అలసిపోయి నట్లున్నావు. లంకకు వెళ్ళు, విశ్రాంతి తీసుకో మరోరథాన్ని అధిరోహించు. ధనుస్సును ధరించు. మరల యుద్ధానికి రా. అప్పుడు నా బలాన్ని చూతువు గాని" అని చెప్పి పంపాడు.

*"గచ్ఛాను జానామి రణార్ది తస్త్వం ప్రవిశ్య రాత్రిం చర రాజ లఙ్కామ్।*
*ఆశ్వాస్య నిర్వాహి రథీ చ ధన్వీ తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః॥"*

రావణమరణానంతరం అన్నకు అంత్యక్రియలు జరిపించటానికి అనుమతి నిమ్మని విభీషణుడు అర్థిస్తే "వైరం మరణం వరకే. ఇప్పుడతడు నీకెట్లో నాకు అట్లే. సంస్కారం జరిపించు" అన్నాడు.

*"మరణాన్తాని వైరాణి నివృత్తం నః ప్రయోజనమ్।*
*క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ॥"*

రావణుని అంత్యక్రియలైన తరువాత విభీషణుని లంకారాజ్యాభిషిక్తుని గావించాడు.

ప్రభుజీవితం ఎంత పరిశుద్ధంగా ఉండాలో, అది లోకానికెంత ఆదర్శం కావాలో, ప్రజావిమర్శకు ప్రభువెంత విలువివ్వాలో - రావణ సంహారానంతరం సీతాదేవిని అగ్నిప్రవేశం చేయించి, అభిషేకానంతరం ఆమెను అపవాదకారణంగా పరిత్యజించి శ్రీరాముడు ప్రపంచానికి చాటాడు. సీతావియోగంతో అంతబాధపడి, వానరవీరులందరిని అన్ని దిక్కులకు పంపి వెదికించి, రావణుణ్ణి, రాక్షసకులాన్ని ఉగ్రరణంలో వధించి, చివరకు చెరనుండి సీతాదేవిని విడిపించి, ప్రియమూర ఆమెను కౌగిలించి కుశల ప్రశ్నలు వేయ

లేదుసరిగదా పై పెచ్చు ఆమె శీలస్వచ్ఛతను ప్రశ్నించాడు. శుద్ధ చరిత్రను నిరూపించుకోమన్నాడు. అగ్ని ప్రవేశాన్ని ఆమోదించాడు.

సీత స్వచ్ఛశీల అని ఆ రామునికి తెలియకపోలేదు. సముద్రుడు చెలియలి కట్టను దాటలేనట్లే రావణుడు సీత నతిక్రమించలేడని గూడ ఆయనకు తెలుసు. అగ్ని జ్వాలను అంట సాధ్యం గానట్లే రావణుడు మానసికంగా గూడ సీతను స్పృశించటం సాధ్యంగాదని శ్రీరామునికి తెలుసు.

*"అవశ్యం త్రిషులోకేషు న సీతా పాపమర్హతి।*
*ఇమామపి విశాలాక్షీం రక్షితాం స్వేన తేజసా॥*
*రావణో నాతి వర్తేత వేలామివ మహోదధిః।*
*నహిశక్తస్సదుష్టాత్మా మనసాపి హి మైథిలీమ్।*
*ప్రధర్షయితు మప్రాప్తాం దీప్తా మగ్ని శిఖామివ॥"*

అని అగ్నిహోత్రునితో రాముడన్న వాక్యాలే అందుకు నిదర్శనాలు. పరపురుషుని యింట్లో బహుకాల మున్న భార్యను పరిశోధింపకుండ గ్రహిస్తే పెద్దలు తన్ను మూర్ఖుడని, ఖలుడని, కామాత్ముడని అంటారని రాముడు భావించాడు. ముల్లోకాలకు సత్యం మీద విశ్వాసం కలిగించటానికే ఆమె అగ్నిప్రవేశాన్ని ఉపేక్షించానన్నాడు.

*"ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః।*
*ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశంతీం హుతాశనమ్॥"*

అగ్నిశుద్ధ అయిన సీతను, అఖండ సామ్రాజ్యాన్ని పొంది సర్వ సుఖాలను అనుభవించే సమయంలో ఒక్క జనాపవాదానికి తల వంచి అర్ధాంగిని మరల అడవుల్లో వదలి రమ్మని తమ్ముని ఆజ్ఞాపించాడు. సీతను పరిత్యజించ వద్దని ప్రార్థించిన తమ్ములతో అపకీర్తిని దేవతలు నిందిస్తారని, కీర్తి త్రిలోకారాధ్యామని, మహాత్ములు కీర్తకొరకు కృషి చేస్తారని, జనాపవాద భయానికి తాను ప్రాణాలనైనా, తమ్ముల నైనా వదలుతానని, సీతను వదలటం ఒక విశేషం గాదని శ్రీరాముడన్నాడు.

*"అపకీర్తి ర్నింద్యతే దేవైః కీర్తి ర్లోకేషు పూజ్యతే।
కీర్త్యర్థంచ సమారంభ సర్వేషాం సుమహాత్మనామ్॥
అప్యహం జీవితం జహ్యాం యుష్మాన్వా పురుషర్షభాః।
అపవాద భయాద్భీతః కిం పునర్జనకాత్మజామ్॥"*.

ఆజ్ఞ నతిక్రమించిన అందరిపట్ల శిక్షను సమానంగా అమలు జరపటం విశుద్ధప్రభుధర్మం. ఆత్మీయతలు, అనురాగాలు అందు ప్రవేశింపగూడదు. రాముడు ముని రూపంలో వచ్చిన యమధర్మరాజుతో ఏకాంత మందిరంలో మాట్లాడుతూ ఎవ్వరూ తమ సంభాషణకు అంతరాయం కలిగించకూడదని, అలా కలిగిస్తే అతనికి మరణదండన తప్పదని ఆ ముని కోరిక మేరకే ప్రతిజ్ఞ చేశాడు. మందిర ద్వారం దగ్గర తమ్ముడు లక్ష్మణుని కాపలా ఉంచాడు. అంతలోనే పిడుగు పడ్డట్లు ఎక్కటినుండో దూర్వాస మహర్షిరావటం, వెంటనే శ్రీరామచంద్రుని చూడాలనటం, లక్ష్మణుడు వీలుగాదనటం, అయితే అందరిని శపిస్తానని ఆ మహర్షి ఆగ్రహోదగ్రుడు కావటం, ఆ మహర్షి శాపం నుండి అన్నగారిని, అయోధ్యను రక్షించటానికి లక్ష్మణుడు లోపలికి వెళ్ళటం, ఆ మహర్షిరాకను అన్నగారికి విన్నవించటం అనుకోకుండా జరిగిపోయాయి.

కారణం ఏదయినా లక్ష్మణుడు అన్నగారి ఆజ్ఞను అతిక్రమించటం జరిగింది. మరి తమ్మునికి ప్రతిజ్ఞప్రకారం శిక్ష విధించటమా? మానటమా? ఇది సమస్య. లక్ష్మణుడు జీవితంలో సర్వ సుఖాలు త్యాగం చేసి తనకు, తన భార్యకు సేవలు చేశాడు. ఇప్పుడు గూడ తన క్షేమం, తన రాజ్యక్షేమం గోరితన ఆజ్ఞ నుల్లంఘించాడు. అలాంటి తమ్ముని ఏంచేయాలి? భ్రాతృ ప్రేమను ఆదరించి క్షమించటమా? ప్రభువుగా చేసిన ప్రతిజ్ఞను పాలించి శిక్షించటమా? పెద్ద ధర్మ సమస్య. రాముడు మానసికంగా నలిగి పోయాడు. మరునాడు సభచేశాడు. మంత్రి పురోహితులందరి ముందు తన సమస్య నుంచాడు. ఎట్టకేలకు వసిష్ఠ మహర్షి వాక్యానుసారం వైయక్తికమ్మైన సోదర ప్రేమకు స్వస్తి చెప్పి, సామాజికమ్మైన ప్రభు ధర్మానికే ప్రాధాన్యమిచ్చి ప్రభువుగా తాను చేసిన ప్రతిజ్ఞనే పాలించాలని నిర్ణయించాడు. సాధుజనుల పట

